# రాజూ - పేదా

**(The Prince and the Pauper)**

★

మూలం:

మార్క్ ట్వేన్

అనువాదం:

నండూరి రామమోహనరావు

ఆంధ్ర గ్రంథమాల,

మదరాసు-1.

# రాజూ - పేదా

అతిపురాతనమైన లండన్ నగరం 1537–వ సంవత్సరం, ఆకురాలు కాలం—కాంటీ అనే బీద కుటుంబంలో ఒక రోజున ఒక మగశిశువు పుట్టాడు; కాని అతను పుట్టడం ఎవరికీ ఇష్టం లేదు.

అదేరోజున, అదే నగరంలో ట్యూడర్ అనే ధనికవంశంలో మరో ఇంగ్లీషు శిశువుకూడా జన్మించాడు. అతడు పుట్టాలని తలితండ్రులు, కుటుంబం వాళ్లే కాదు, ఇంగ్లండు దేశం యావత్తూకోరింది. అతడు పుడతాడని ఎన్నోఏళ్లు ఎదురు చూశారు, ఎన్నో ఆశలు పెట్టుకున్నారు, దేవుణ్ణి ఎంతో ప్రార్థించారు. ఇంతకాలానికి అతడు నిజంగా భూమిమీద పడేటప్పటికి ప్రజలు ఆనందంతో దాదాపు వెర్రెత్తిపోయారు. స్నేహితులే కాదు, ఏమాత్రం పరిచయమున్న మనుషులైనా, కలుసుకోగానే ఒకళ్లనొకళ్లు కావిలించుకున్నారు; సంతోషం పట్టలేక భోరున ఏడ్చారు. ప్రభువులు, ప్రజలు, ధనికులు, దరిద్రులు అనే భేదం లేకుండా, యావన్మందీ ఆరోజున వేడుకలు జరుపుకున్నారు; విందులు చేసుకున్నారు;

నాట్యాలు చేశారు; పాటలు పాడారు. ఈ ఉత్సవాలు చాలా పగళ్లు, రాత్రులు వరసన జరిగాయి.

పగటిపూట లండన్ నగర దృశ్యాన్ని చూసి తీరవలసిందే. ఏ ఇంటిమీద చూసినా రంగు జెండాలే. ఏ వీధిలో చూసినా ఊరేగింపులే. రాత్రిపూట కూడా నగర దృశ్యాన్ని మళ్ళీ చూసి తీరవలిసిందే. ఏ వీధి మొగలో చూసినా భోగిమంటల్లాంటి మంటలు; వాటిచుట్టూ పారవశ్యంతో పరవళ్లు తొక్కే జనం. ఎవళ్లు మాట్లాడినా వేల్సుయువరాజు, ఇంగ్లండుకు కాబోయే రాజాధిరాజు, ఎడ్వర్డు ట్యూడర్ని గురించే. కాని రాచ నగరులో మఖమల్ పాన్పులమీద, సిల్కువస్త్రాల చాటున సుఖంగా నిద్రించే ఎడ్వర్డు ట్యూడర్కు ఈ గొడవంతా ఏమీ తెలియదు; తన చుట్టూ గొప్ప గొప్ప సామంతులు, వారి భార్యలు ఉండి జాగ్రత్తగా పరిరక్షిస్తున్నారనిఅతనెరగడు.

కాని అదేరోజున జన్మించిన ఆ రెండో శిశువు టామ్ కాంటీని ఎవ్వరూ తలచుకోనైనా తలుచుకో లేదు. తను పుట్టి ఎవర్ని ఇబ్బంది పెట్టడానికి వచ్చాడో ఆ నిరుపేద కుటుంబీకులకు తప్ప అతని గొడవ ఎవ రికీ పట్టలేదు.

# 2

ఇక్కడ కొన్ని సంవత్సరాలు ముందుకు దాటేద్దాం.

లండన్ నగరపు వయస్సు అప్పటికే పదిహేను వందల ఏళ్లున్నది. అప్పటికే దాని ప్రఖ్యాతి దేశ దేశాల వ్యాపించింది. నగరంలో ఓ లక్షమంది - కొందరి అంచనా ప్రకారం రెండు లక్షలమంది— దాకా జనం నివసిస్తున్నారు. వీధులు ఇరుకుగా, మురికిగా వంకరటింకరగా ముఖ్యంగా టామ్ కాంటీ ఇంటి ప్రాంతాల్లో మరీ దుర్భరంగా ఉండేవి. టామ్ కాంటీ నివాసం లండను వంతెనకు సమీపంగానే ఉండేది. ఇళ్లన్నీ కొయ్యతో కట్టినవే. రెండో అంతస్తు ముందుకు తోసుకొచ్చినట్టుండేది. మూడో అంతస్తు పక్కకి తోసుకొచ్చినట్టు ఉండేది. ఈవిధంగా అంతస్తు లెక్కువైన కొద్దీ ఇళ్లు వెడల్పయ్యేవి. ఇళ్ళకి ఎరుపో, నీలమో, నలుపో యజమానికి ఏ రంగు ఇష్టమైతే ఆ రంగు వేసేవారు. చూట్టానికి ఆ ఇళ్లు చాలా అందంగా కనిపించేవి. కిటికీలకు అద్దాలుండి చిన్నవిగా ఉండేవి. అవి తలుపులమాదిరిగానే బయటికి తెరుచుకొనేవి.

టామ్ తండ్రి నివసించే ఇంటిని ఇల్లనటానికి వీల్లేదు; దాని పేరు ఆఫల్ కోర్టు; ఆ వీధిపేరు పుడ్డింగ్ వీధి. ఎలకబిలంలాంటి ఆ చిన్న ఇంట్లో, బిల

బిలలాడుతూ ఎన్ని బీదకుటుంబాలున్నాయో చెప్ప
లేము. ఏ నిమిషాన నైనా కూలిపోతుం దనిపించేటంత
పాతకొంప అది. కాంటీ తెగవాళ్లు మూడో అంత
స్తులో ఓ గదిలో ఉండేవాళ్లు. తల్లికీ, తండ్రికీ ఓమూల
ఓ మంచంలాంటి పదార్థం ఏదో పడుకోటాని కుంద.
కాని టామ్‌కీ, అతని బామ్మకీ, బెట్, నాన్ అనబడే
అతని ఇద్దరు అక్కలకీ అలాంటి పదార్థం ఏమీ
లేదు. నేలంతా యథేచ్ఛగా వాడుకోవచ్చు; ఎక్క
డైనా పడుకోవచ్చు. శతాబ్దాలకిందట బాగానే వుండే,
ప్రస్తుతం చిరుగుల కంబళ్లీలుగాను, కంపుకొట్టే గడ్డి
గానూ మాత్రం మిగిలిన పరుపులుకూడా ఉన్నాయి.
అయితే వాటిని పరుపు లనటానికి వీల్లేకుండా, గడ్డికి
గడ్డీ, కంబళ్లీలకు కంబళ్లీలు విడి విడిగా వచ్చేశాయి.
పొద్దునపూట ఈ చెత్త పరుపుల్ని ఓమూల కుప్పగా
పడేసేవారు. రాత్రిళ్లు పడుకోబోయేటప్పుడు ఎవరికి
కావలసినంత వారు ఆ కుప్పలో కాస్త కాస్త తెచ్చు
కునేవారు.

జెట్, నాన్ కవలపిల్లలు. ఇద్దరికీ చెరో పది
హేనేళ్లు ఉంటాయి. వాళ్ళ శరీరాలు నిత్యం మడ్డి
ఓడుతూ, చిరుగు గుడ్డలతో ఉండేవి. వాళ్లవి చాలా
మెత్తటి హృదయాలు; మెదళ్లు మాత్రం మేకులు
కూడా దిగనంతటి గట్టి మట్టితో చేసినవి. వాళ్ల తల్లి
కూడా అలాంటిదే; అంత మంచిదే; తండ్రీ, బామ్మ

మాత్రం తాచుపాముల జంట. వీలైనప్పుడల్లా తాగేసే వాళ్లు. తరువాత కాట్ల కుక్కల్లా పోట్లాడుకునేవాళ్లు ; తమలో తామే కాకుండా, ఎవరు దారి కడ్డం వస్తే వాళ్లతో పోట్లాడేవారు. మత్తులో వున్నా లేకపోయినా నోటివెంట బూతులు తప్ప ఇంకేమీ వచ్చేవి కావు. టామ్ తండ్రి జాక్ కాంటీ గజదొంగ. బామ్మ ఉద్యోగం బిచ్చమెత్తడం. పిల్లల్ని కూడా బిచ్చగాళ్లని చేశారు గాని, దొంగల్ని చెయ్యలేకపోయారు. ఆ కొంపలో ఉండే అలగా జనంలో ఒక వృద్ధ మతగురువుకూడా ఉన్నాడు. ఆయన చాలా మంచివాడు. రాజుగారు అతని ఉద్యోగం ఊడలాగేసి, కొద్దిగా పింఛనుమాత్రం ఇస్తున్నారు. ఆయన పిల్లల్ని చాటుకు పిలిచి రహస్యంగా చదువు చెబుతుండేవాడు. ఆయన్ని అంతా ఫాదర్ ఆండ్రూ అంటారు. ఆయన టామ్‌కి రాయటం, చదవటమే కాకుండా, లాటిన్ భాష కూడా కొద్దిగా నేర్పాడు. అతని అక్కలకి కూడా నేర్పేవాడే, గాని వాళ్ళకి చదువుకోవటానికి భయం వేసింది, స్నేహితులు అసూయకొద్దీ ఏడిపిస్తారేమోనని.

ఆఫల్ కోర్టులో జీవితమంతా కాంటీఇంట్లో మోస్తరుగానే నడుస్తూవుంటుంది. తాగి తందనాలు తొక్కటం, కొట్లాడుకోవడం, మొదలైన గందరగోళం ప్రతిరాత్రీ, రాత్రి అంతా సాగుతూవుంటుంది. ఆ

ప్రదేశంలో ఆకలి ఎంత ఎక్కువగా కనిపిస్తుందో, పగిలిన తలకాయలుకూడా అంత ఎక్కువగానూ కనిపిస్తాయి.

ఇంత దారుణమైన ప్రదేశంలో ఉంటున్నప్పటికీ టామ్ ఖుషీగానే గడిపేవాడు. కష్టాలు, ఇబ్బందులు లేవని కాదు. ఆ మాటకొస్తే అఫల్ కోర్టులో కష్టా లెరగని కుర్రాడెవడు? కనుక కష్టాలు పడుతుండడమే నిజమైన, సుఖమైన జీవితమనే నిశ్చయానికి వచ్చాడు టామ్. రాత్రిళ్లు వట్టిచేతుల్తో ఇంటికి వచ్చే టప్పటికి తండ్రి బండబూతులు తిడుతూ చితకబాదేవాడు. తండ్రి అలిసిపోయి విశ్రాంతి తీసుకొంటున్న సమయంలో బామ్మ వచ్చి యథావిధిగా కార్యక్రమం జరిపేది. తండ్రి వదిలిపెట్టిన అవయవాలని కుళ్ళ బొడిచేది. అర్థరాత్రిఅంతా నిద్రపోయే సమయంలో తల్లి తన కడుపు మాడ్చుకుని దాచిన రొట్టె ముక్కని రహస్యంగా టామ్ కందించేది. ఈ నేరం చేస్తుంటే తండ్రి చూడటం, తల్లిని చర్మం వొలిచెయ్యటం కూడా చాలాసార్లు జరిగింది.

మొత్తంమీద టామ్ పని బాగానే ఉండేది— ముఖ్యంగా వేసాకాలంలో బిచ్చమెత్తేవాడు; కాని ఎంత తెస్తే తండ్రి దెబ్బలు కొట్టకుండా ఉంటాడో అంతే బిచ్చమెత్తేవాడు. ఎందుకంటే ఆ రోజుల్లో బిచ్చ మెత్తడం న్యాయశాసన ప్రకారం గొప్ప నేరం; దానికి శిక్ష కూడా మహాకఠినంగా ఉండేది. టామ్ ఎక్కువ

కాలం ఫాదర్ ఆండ్రూ దగ్గరే గడిపేవాడు. రాక్షసులు, దేవకన్యలు, మరుగుజ్జులు, భూతాలు, మాయాకోటలు, రాజులు, రాజకుమార్తెలు—ఇల్లాంటి వాళ్ల కథలు ఆముసలాయన అందంగా వర్ణిస్తుంటే నోరు తెరుచుకొని వినేవాడు. అతని చిన్న బుర్రనిండా ఈతమాషా కథలు క్రిక్కిరిసిపోయాయి. చీకట్లో తన చెత్తపరుపుమీద పడి దొర్లుతూ ఆకలి, అలసట, తండ్రి కొట్టిన దెబ్బలు అన్నిటినీ మరిచిపోయి ఊహాప్రపంచాలలోకి పారిపోయేవాడు. గొప్ప గొప్ప రాజభవనాలలో తనో రాజకుమారుడై విహరిస్తున్నట్టు భావించుకునేవాడు.

కాని అతనికి ఒకటే దిగులు; ఎప్పటికైనా నిజమైన రాజకుమారుణ్ణి కళ్లారా చూడాలని. ఒకసారి ఈ కోరికను తన ఆఫల్ కోర్టు స్నేహితులకు తెలిపాడు. కాని వాళ్లు అతన్ని నిర్దాక్షిణ్యంగా వెక్కిరించటం, ఏడిపించటం మొదలెట్టే సరికి ఇక ఆ ప్రస్తావన నలుగురిలో తీసుకురావటం మానుకున్నాడు.

మతగురువు దగ్గర పుస్తకాలు తీసుకుని అప్పుడప్పుడు చదివేవాడు; అర్థంకానిచోట చెప్పించుకునేవాడు. వీటన్నిటివల్లా క్రమంగా అతనిలో ఒక మార్పు కలిగింది. తన ఊహాప్రపంచంలో మనుషులు అంత దర్జాగా, అందంగా బతుకుతుంటే తను నీచమైన

పరిసరాల్లో మురికిబట్టలు కట్టుకుని బతుకుతున్నాడు! ఛా, అదేం బాగా లేదను కొని అప్పటినుంచీ కాస్త శుభ్రంగా ఉండటం మొదలెట్టాడు. అయితే బురదలో దొర్లడం పూర్తిగా మానేశాడనిగాని, అల్లా దొర్లడం అతనికి హాయిగా లేదనికాని, అనుకోకండి. తేమ్సు నది బురదలో చాలాసేపు నానేవాడు; అయినా ఇంటికి వచ్చేటప్పుడు దేహం పరిశుభ్రంచేసుకుని మరీ వచ్చేవాడు.

అంతే కాదు; చీప్ సైడ్ బజారులో వసంతోత్సవాలు జరిగేటప్పుడు, సంతలు జరిగేటప్పుడు బలే హుషారుగా ఉండేది టామ్‌కి. ఒక్కొక్కసారి ఖైదీల్ని లండన్ గోపురానికి నడిపించుకు తీసుకు పోయేటప్పుడు రాజు సైనికుల్ని, వాళ్ల 'మార్చింగ్'ని చూసే అదృష్టం కలిగేది టామ్‌కి. నేరస్థుల్ని మంటల్లో పడేసి కాల్చివెయ్యటం కూడా కొన్నిసార్లు చూశాడు. మొత్తానికి, టామ్ జీవితంలో విసుగుపుట్టించే సంఘటనలకన్నా, సరదాగా ఉండేవే చాలా జరుగుతూ వచ్చాయి.

రాజుల జీవితాన్ని గూర్చి ఇరవైనాలుగు గంటలూ అదేపనిగా ఊహించుకోవటం, చదవటం మూలంగా, టామ్‌కి తెలియకుండానే అతడు రాజకుమారుడిలాగా ప్రవర్తించటం మొదలెట్టాడు. అతని మాటలు, చేతలు అన్నీ తమాషాగా మారిపోయాయి.

అచ్చు రాజదర్బారులలో ఎల్లా ఉంటారో అల్లా ఉండటం మొదలెట్టాడు. ఈ మార్పుచూసి అతని మిత్రులందరికీ ఆశ్చర్యం, గౌరవంకూడా కలగటం మొదలైంది. అతని పలుకుబడి క్రమంగా హెచ్చింది. కొంత కాలానికి తోటివాళ్లంతా అతన్ని తమకంటే గొప్పవాడుగా భావించి గౌరవించటం సాగించారు. అతనికి తెలిసినన్ని విషయాలు ఇంకెవరికీ తెలియవని అంత అద్భుతంగా ఉపన్యాసా లివ్వటంగాని, అంత అద్భుతమైనపనులు చెయ్యటంగాని చేసైన మానవుడింకోడు లేడని వాళ్లనుకునేవారు. టామ్ మాటలు, పనులు పెద్దవాళ్ళదాకా పాకాయి. వాళ్లు కూడా టామ్ కాంటీ తెలివితేటలు చూసి ఆశ్చర్యపడి, తమలో అతడు తప్ప బుట్టాడని భావించారు. పెద్ద పెద్ద వాళ్లుకూడా అర్థంకాని సమస్యల్ని అతని దగ్గరకు తీసుకువచ్చి పరిష్కారం చేసుకుపోయేవారు. అతన్నెరిగినవాళ్ళంతా అతన్ని గొప్ప నాయకుణ్ణి చేసేశారు—కాని టామ్ కాంటీ ఇంట్లో వాళ్లకి మాత్రం అతనిలో ఎలాంటి గొప్ప తనం కనిపించలేదు.

ఒకసారి టామ్ రహస్యంగా రాజదర్బారు నేర్పాటు చేశాడు. అతడు రాజకుమారుడు; దగ్గర స్నేహితులకు రాజబంధువులుగానూ, అంగరక్షకులు, స్వంత సేవకులుగానూ పెద్ద హోదాలిచ్చాడు. పుస్తకాల్లో చదివినదాని ప్రకారంగా, తను రాగానే ఎవ

రెవరు ఏవిధంగా ప్రవర్తించవలసిందీ వాళ్ళకి నేర్పాడు. ప్రతిరోజూ రాజదర్బారు మహావైభోగంగా జరిగేది. టామ్ తన ఊహాసామ్రాజ్యాన్ని అతి సమర్థతతో పరిపాలించేవాడు; ఊహాసైన్యాలకి, నౌకాదళాలకి, వైస్రాయిలకి, ఎవళ్ళ కివ్వవలసిన ఉత్తరువులు వాళ్ళ కిచ్చేవాడు.

దర్బారు ముగియగానే చిరుగు లాగూ, చొక్కా ఎగలాక్కుని, రోడ్డుమీద బిచ్చమెత్తుకునేవాడు; దొరికితే కాస్త రొట్టెముక్క ఎంగిలిపడి, లాంఛనప్రకారం తిట్లు, తన్నులు కూడా ఎంగిలిపడి చెత్తపరుపుమీద ఒళ్ళుమరిచి నిద్రపోయేవాడు. నెమ్మదిగా స్వప్న ప్రపంచాల్లోకి జారి, స్వప్నరాజ్యా లేలుతూ స్వప్న వైభవా లనుభవిస్తూ సంతోషించేవాడు.

ఇంత అనుభవిస్తున్నప్పటికీ అతని దిగులు పోలేదు; నిజంగా బతికివున్న రాజకుమారుణ్ణి చూడా లని అతని కోరికేు తహతహ. రోజులు, వారాలూ, నెలలు గడుస్తున్నకొద్దీ అతని మిగతా కోరికలన్నీ సన్నగిల్లి ఈ ఒక్క కోరికే ప్రబలమై మనస్సంతటా ఆక్రమించుకుంది.

జనవరిలో ఒకరోజున టామ్ మామూలు ప్రకారం భిక్షాటనం చేస్తున్నాడు. మిన్సింగ్ వీథి ప్రాంతాల్లో గంటల తరబడి కాళ్ళకి చెప్పులు లేకుండా

చలికి గజగజ వణుకుతూ తిరిగాడు. ఆ వీధిలో భోజన పదార్థాల షాపు లనేకం ఉన్నాయి. అద్దాల కిటికీల వెనకాల ప్రదర్శింపబడిన రకరకాల రుచ్య పదార్థాలు చూస్తుంటే అతనికి పిచ్చెత్తిపోయింది. వాటి గుబాళింపును బట్టి అవి దేవతలు తినదగిన పదార్థాలుకాని మానవమాత్రుల కోసం కాదని అనుకున్నాడు. ఆ రోజు నిజంగా దుర్దినం; చల్లటివాన జల్లు పడుతోంది; మబ్బు పట్టి మసక చీకటిగా వుంది. ఆ రాత్రి టామ్ ఇంటికి తడిసి ముద్దయి, అలిసి, ఆకలికి ఆవురావురు మంటూ వచ్చాడు. అతని అవతారం చూసి తండ్రి, బామ్మ పాపం చాలా జాలిపడ్డారు-అంటే-వాళ్ల పద్ధతి ప్రకారం. వెంటనే టామ్ వీపుమీద రెండు మూడు బడితెలు విరిగాయి. కిక్కురుమనకుండా పడుకున్నాడేగాని లోపల ఆకలిబాధ, దెబ్బలబాధ, బైట బూతులు, పోట్లాటలు —, ఈ గొడవలో అతనికి చాలాసేపుదాకా నిద్రపట్టలేదు.

చివరకి మెట్లు మెట్లుగా స్వప్న సామ్రాజ్యం లోకి దిగాడు. వజ్ర వైఢూర్యాలతో ధగధగ మెరసి పోయే రాజులు, రాజకుమారులు, అడుగడుగునా సలాములుచేసే సేవకులు, అంతఃపురాల్లోని రాజ కుమార్తెలు అతని కలలనిండా కిక్కిరిసి పోయారు. క్రమంగా అతనుకూడా ఓ రాజకుమారుడుగా మారిపోయాడు.

ఆరాత్రంతా అతడు రాజభోగా లనుభవించాడు; గొప్పగొప్ప సామంతుల దగ్గిర్నించి మామూలు ప్రజలదాకా అందరినమస్కారాలు చిరునవ్వుతో, క్రీగంటి చూపుతో స్వీకరిస్తూ, మఖమల్ పరుపులమీాద కూచ్చుని, గుబాళించే సుగంధ ద్రవ్యాల మత్తువాసనలు పీలుస్తూ, తియ్యని సంగీతం వింటూ—ఎంతైనా స్వర్గసౌఖ్యం అనుభవించాడు.

తెల్లవారి లేచి చుట్టూ కలయ చూడగా, సూర్యకాంతికి అతని స్వప్నాల మంచు కరిగిపోయింది. దాంతో అతని పరిసరాలు అదివరకు కంటె వెయ్యిరెట్లు ఛండాలంగా కనిపించాయి; టామ్ గుండె బరువెక్కి బద్దలవుతుం దనిపించింది, కాని మనసారా ఏడ్చి ఆ బరువు తీర్చుకున్నాడు.

# 3

టామ్ కణ కణలాడే ఆకలితో లేచాడు; రాత్రి వచ్చిన కలల్నే మళ్లీ మననం చేసుకుంటూ, వాటి నీడల జాడల్లోనే నడిచిపోతూండు. నగరంలో ఏ నేపుకు పోతున్నదీ, తన చుట్టూ ఏం జరుగుతున్నదీ కూడా గమనించకుండా చాలా దూరం తిరిగాడు. దోవన నడిచేవాళ్లు అతన్ని అటు తోశారు, ఇటు తోశారు, కొందరు తిట్టారు; కాని ఊహాల నీడల్లో నడుస్తున్న టామ్ ఇవేమీా పట్టించుకోలేదు. చివరికి 'టెంపుల్

బార్' అనే చోటికి వచ్చాకగాని అతనికి తెలియలేదు, ఇంటినుంచి చాలదూరం వచ్చానని. కాస్సేపు ఆగి, ఆలోచించాడు. మళ్ళీ ఆలోచనల్లో పడి ముందుకు పోయాడు.

లండన్ నగర ప్రాకారాలు కూడా దాటాడు. అంతవరకూ పల్లెటూరిరోడ్డుగా ఉన్న 'స్ట్రాండు' అక్కడినించి చక్కని రాజ వీధి లాగా సాగింది. వీధికి ఒకవేపు వరసన దగ్గరదగ్గరగా ఇళ్లున్నాయి. రెండోవేపున ప్రభువులకు చెందిన పెద్దపెద్ద భవనాలు దూర దూరంగా అక్కడోటి, అక్కడోటి ఉన్నాయి. ఆ భవనాలచుట్టూ విశాలమైన తోటలు, ఆవరణలు నదీతీరందాకా విస్తరించుకుని ఉన్నాయి.

టామ్ నడిచి నడిచి 'చేరింగ్ విలేజ్' అనే ప్రదేశానికి వచ్చాడు. అక్కడ అందమైన శిలువ ఒకటి పాతివుంది. దానిదగ్గర కాసేపు విశ్రమించాడు. మళ్ళీ లేచి చక్కని రాజబాటగుండా పోయి కార్డినల్ (చర్చి ఉన్నతాధికారి) భవనం సమీపించాడు. దానికి అల్లంత దూరంలో టామ్ జన్మలో ఎప్పుడూ కని విని ఎరగనంతటి గొప్ప భవనం కనుగొన్నాడు. అది ఇంగ్లండు రాజులు నివసించే 'వెస్ట్ మిన్‌స్టర్' భవనం. టామ్ దానికేసి నడిచాడు. అద్భుతమైన శిల్పనైపుణ్యం ప్రదర్శించే ఆ కట్టడాలు, బురుజులు, గోపురాలు, తాటిచెట్టుప్రమాణంలో వున్న రాతిగేటు, ఆ గేటుకు

అటూ ఇటూ తీర్చి దిద్దినట్టు వరసగా ఉన్న సింహ ప్రతిమలు—ఇదంతా చూసి టామ్ దిగ్భ్రాంతుడై నోరు తెరుచుకుని చూస్తూ నిలబడిపోయాడు. అతని కోరిక చివరి కిన్నాళ్లకి నెరవేర బోతున్నదా? ఇదే గదా రాచనగరు! అతని అదృష్టం బాగుంటే నిజమైన రాజకుమారుడు, నిజంగా, తన కవుపించకూడదూ!

బంగారపు పూతపూసిన చువ్వల గేటుకు అటూ ఇటూ బతికివున్న విగ్రహాలు నిలబడి ఉన్నాయి —అంటే మరేం లేదు—కను రెప్పలైనా ఆర్పకుండా, పైనుంచి కిందదాకా తళతళ మెరిసే ఉక్కు కవచాలు తొడుక్కుని నిటారుగా నిలబడివున్న ద్వారపాలకులు. గేటుకు దూరంగా పల్లెటూరి జనం, నగరంలోని అలగా జనం గుంపులు గుంపులుగా తచ్చాడు తున్నారు. వాళ్లు కూడా టామ్ వచ్చిన పనిమీదే వచ్చారు—పొరబాటుగానైనా రాజో, రాజకుమారుడో కనిపించకపోతారా అని. ప్రాకారానికి చాలా చోట్ల గేట్లున్నాయి. వాటిగుండా, అద్భుతమైన అశ్వ శకటాలు వస్తున్నాయి, పోతున్నాయి. వాటిలో గొప్ప వాళ్లు, వాళ్ల గొప్పనౌకర్లు వస్తున్నారు, పోతున్నారు.

చిరుగుపేలికలు తప్ప వంటి మీద మరేమీ లేని మన టామ్ కాంటీ నిద్రలో నడుస్తున్న వాడి మాదిరిగా, మెల్లిగా ఊగుతూ ద్వారపాలకుల్ని కూడా దాటి ముందుకు పోయాడు. ఇంతలో హఠా

త్తుగా అతని హృదయం ఓ సెకండు సేపు స్తంభించి పోయింది. దేనికోసం ఇన్నాళ్లూ తపించిపోయాడో ఆ దృశ్యం కళ్లెదటగా కనిపించింది. లోపల అతిసుందరుడైన రాజకుమారుడు నుంచుని వున్నాడు; బాగా వ్యాయామం, కత్తిసాము చేసినందు వల్ల గట్టిపడి నిగనిగలాడుతున్న దతని శరీరం; ముద్దొచ్చే సిల్కు బట్టలు కట్టుకున్నాడు; వంటినిండా వెలలేని రత్నాభరణాలు తళతళ మంటున్నాయి; నడుముకు వజ్రాలు పొదిగిన ఖడ్గం, చిన్న బాకు వేలాడు తున్నాయి; ఎర్రటి మఖమలుగల చిన్ని పాదరక్షలు అతని సుకుమార పాదాలను అలంకరించాయి. తలమీద ఎర్రటి కుచ్చుల టోపీ, దానిమీద పెద్ద వజ్రం ఉన్నాయి. రాజకుమారుడి పక్కన ఖరీదైన దుస్తులు ధరించిన కొందరు పెద్దమనుషులు నుంచున్నారు; బహుశా వాళ్ళు అతని సేవకులు కావచ్చును. అతడు నిజంగా రాజకుమారుడే! సందేహం లేదు, నిజమైన రాజకుమారుడే !

ఈ దృశ్యంతో టామ్‌కళ్లు చెదిరి పోయాయి. సంతోష, సంభ్రమాలతో అతని కళ్లు గుండ్రంగా విప్పారుకుని రెప్ప వాల్చటంలేదు. ఊపిరి అందటం కూడా కష్టమైంది. రాజకుమారుణ్ణి వీలైనంత దగ్గరగా చూడాలని, చూసి కళ్లతో తాగెయ్యాలని ఒక వెర్రికోర్కె పుట్టింది. తనేం చేస్తున్నాడో తనకే

తెలియకుండా ముందుకు నడిచాడు. గేటు కటకటాలు రంగున మొహానికి కొట్టుకునేదాకా అతనికి తెలివి రాలేదు. తక్షణమే ద్వారపాలకుల్లో వొకడు టామ్ జబ్బలు పట్టుకుని ఇవతలకి లాగివేశాడు. ఆ వూపుకి టామ్ బొంగరంలా గిరగిరతిరుగుతూ పోయి పల్లెటూరి గుంపులో పడ్డాడు.

"అరేయ్, కుర్రాడా! నీ కిక్కడేం పనిరా!" అని ద్వారపాలకుడు వెక్కిరించాడు. జనం ఈ వెక్కిరింపు నందుకుని ఇంకా వేళాకోళం చేశారు.

కాని ఆ క్షణంలోనే యువరాజు మెరుపులా గేటు దగ్గరికి దూసుకుని వచ్చి, కోపంతో మండుతున్న కళ్లతో ఇలా అన్నాడు:

"ఎంత సాహసం! పాప మా కుర్రాణ్ణి అలా గేనా విసిరి వెయ్యటం? నాతండ్రి ప్రజల్ని ఇలా గేనా అవమానించడం? గేటు తెరు. అతన్ని లోపలికి తీసుకురా."

బైట జనం అప్రయత్నంగా టోపీలు తీసేసి యువరాజుకు గౌరవం చూపించారు. యువరాజును చూడగలిగినందుకు వారి సంతోషం వర్ణించడానికి తరంగాదు. ఒక్కగొంతుకతో "వేల్సు యువరాజుకూ జై," అని అరిచారు.

సైనికులు టామ్‌ని లోపలికి ప్రవేశపెట్టారు. టామ్ చెయ్యి ఎడ్వర్డు ట్యూడర్ పట్టుకుని నడుస్తూ అన్నాడు:

"పాపం చాలా ఆకలిగా, అలసటగా వున్నట్టున్నావు. పాపం నీకు అవమానం కూడా జరిగింది. నాతో రా.

యువరాజుపక్కనున్న సేవకులు "అదేమి యువరాజా! బిచ్చగాణ్ణే రాజభవనంలోకి రానిస్తారా?" అన్నట్టు ముందుకు వచ్చి వారించబోయారు. కాని రాజఠీవితో వాళ్ళని గదమాయించేటప్పటికి వాళ్ళెక్కడివాళ్ళక్కడ స్తబ్ధులైపోయారు. ఎడ్వర్డు టామ్‌ని రాచనగరులో తన మందిరానికి తీసుకుపోయాడు. అతడు కనుసైగ చేసేటప్పటికల్లా సేవకులు రకరకాల పిండివంటలు, పళ్లు, ఇతర భోజన సామగ్రి తీసుకువచ్చి బల్లపై అమర్చారు. ఆ పదార్థాలు టామ్ పుస్తకాలలోనూ, కలలలోనూ తప్ప ఎన్నడూ చూసి ఎరగడు.

టామ్‌కాంటీ భోజనానికి ఉపక్రమించాడు. చుట్టూ ఖరీదైన దుస్తులు ధరించిన రాజసేవకులు నుంచుని వున్నారు. వాళ్ళలా గుడ్లు పెట్టుకుని చూస్తూ నుంచు నుంటే తన పేద అతిథి తినటానికి ఇబ్బంది పడతాడేమోనని యువరాజు వాళ్లని పంపించేశాడు. టామ్ మాంచి ఆకలిమీద వున్నాడేమో ఫులుస్టాపూ,

కామాలూ లేకుండా పట్టెయ్యడం మొదలెట్టాడు. కాని యువరాజు టామ్ పక్కనే కూచ్చుని ప్రసంగం ప్రారంభించాడు.

"నీ పేరేమి టబ్బాయ్?"

"టామ్‌కాంటీ అంటారండి."

"తమాషా పేరే. మీ యిల్లెక్కడ?"

"పట్నంలోనండి. పుడ్డింగ్ వీథిలో ఆఫల్ కోర్టు అనేచోట."

"ఆఫల్ కోర్ట్! ఇదింకో తమాషా పేరు. తల్లీ, తండ్రీ వున్నారా?"

"ఉన్నారు ప్రభూ! ఒక బామ్మ, బెట్, నాన్ లనే కవల అక్కలు కూడా ఉన్నారండి. మా బామ్మకీ నాకూ పడదండి."

"ఏం? నిన్ను ప్రేమతో చూడదా?"

"లేదు ప్రభూ! అసలు మా బామ్మకి ఎవరన్నా ప్రేమ లేదు. దాని గుండె విషపుగుండె. ఎప్పుడూ దుష్టమైన పనులే చేస్తూవుంటుంది."

"ఏం చేస్తుంది?"

"నిద్రపోయేటప్పుడో, తాగి మత్తుమీదున్నప్పుడో తప్ప, దానికి చెయ్యూరుకోదండి. వంటిమీదకి స్పృహ వచ్చిరాగానే, ఒక్క నిమిషం కూడా వృథా చెయ్యకుండా నన్ను పట్టుకుని—బాదుతూంటుంది."

యువరాజు కళ్లు తీవ్ర కోపంతో ప్రకాశించాయి.

"ఏమిటీ—నిన్ను కొడుతుందా?"

"అవును ప్రభూ!"

"నువ్వింత చిన్నవాడవని జాలి కూడా లేకుండా కొడుతుందా? ఇదుగో విను: ఈ రోజు సూర్యాస్తమయం కాకముందు మీ బామ్మని లండన్ గోపురంలో ఖైదు చేస్తాను. నా తండ్రియైన మహారాజు—"

"ప్రభూ! తమరు మరచి పోయారు. మా బామ్మ కేవలం బిచ్చగత్తె. లండన్ గోపురం గొప్ప గొప్ప వాళ్ళకు మాత్రమే తగినది."

"ఆ, అవును. మరిచిపోయా. ఆమెకి తగిన శిక్ష ఆలోచించి చెబుతా. నీతండ్రి నిన్ను ప్రేమతో చూస్తాడా?"

"ప్రేమవిషయంలో మా బామ్మకి తీసిపోడండి."

"తండ్రులంతా అంతేనేమోలే. నాతండ్రిగారు చాలా కోపస్వభావం గలవారు. ఆయన కోపానికి ఎందరో భస్మమైపోయారు. కాని నన్నెప్పుడూ కొట్టరు; ఊరికే ఎప్పుడన్నా కేక లేస్తారంతే. మీ అమ్మ ఎలాంటిదీ?"

"మాఅమ్మ చాలా మంచిదండి. నన్నెమీ కష పెట్టదు. బెట్, నాన్ కూడా మాఅమ్మలాంటి వాళ్ళే."

"నీ అక్కలు పెద్దవాళ్ళేనా?
"చెరో పదహేనేళ్లు ఉంటాయండి."

"మా అక్కగారు ఎలిజబెత్‌కు పద్నాలుగేళ్లుంటాయి. మా మేనమామగారి కూతురు జేన్ గ్రే సరిగ్గా నాయీడుదే; చాలా మంచిది, అందమైనది కూడా. కాని నా ఇంకో అక్కగారు మేరీ మాత్రం ఎప్పుడూ చిరచిరలాడుతూ వుంటుంది. చూడూ, నీ అక్కలు సేవకుల్ని నవ్వవద్దనీ, నవ్వితే పాపం చుట్టుకుంటుందనీ ఎప్పుడైనా కోపం చేస్తారా?"

"ప్రభూ! నా అక్కలకి సేవకు లెక్కడ నుంచి వస్తారు?"

యువరాజు బిచ్చగాణ్ణి కొంచెంసేపు తెల్లబోయి చూశాడు. ఆశ్చర్యపోతూ అడిగాడు:

"సేవకు లేరూ? మరి రాత్రిపూట వాళ్ల బట్ట లెవరు మారుస్తారు? పొద్దున లేవగానే కొత్తబట్ట లెవరు తొడుగుతారు?"

"నాకొక్క దుప్పటిమాత్రం, గోనువిప్పేసి మృగాల్లాగా బట్ట లేకుండా పడుకుంటారా, యువరాజా?"

యువరాజు ఆశ్చర్యం పట్టలేకపోయాడు.

"గోను విప్పేస్తే వాళ్ళకిక బట్ట లుండవా? ఒక్కటేనా?"

"ఒకటికంటె ఎక్కువెందుకు ప్రభూ! వాళ్ళకి నారో రెండేసి శరీరాలు లేవుగదా."

యువరాజు నవ్వు ఆపుకోలేకపోయాడు.

"నీ మాటలు బలే వింతగా వున్నాయి. క్షమించు, నిన్ను చూసి వెక్కిరించటం లేదు. కాని నీ అక్కలు మంచివాళ్లన్నావు గదూ! వాళ్లకి సిల్కు బట్టలు, పనులు చేసేందుకు నౌకర్లని ఇప్పుడే పంపిస్తాను; నా వస్త్రశాఖా సేవకుడితో చెప్పానంటే వెంటనే చేసేస్తాడు. ఫరవాలేదు, అహా, మొహమాట పడకు. నువ్వు బాగా మాట్లాడుతున్నావు. ఎందాకా చదువుకున్నావు?"

"ఎందాకా చదువుకున్నానో, నాకే తెలియదు. ఫాదర్ ఆండ్రూ అనే మతగురువు నాకు కాస్త చదువు నేర్పాడు. ఆయనదగ్గిర్నించి పుస్తకాలు తెచ్చి చదివాను."

"లాటిన్ భాష వచ్చా?"

"కొంచెం వచ్చు."

"బాగా నేర్చుకో అబ్బాయ్! మొదట్లో కొంచెం కష్టంగా వుంటుంది గాని తరవాత బలే తేలిక. గ్రీకు భాష ఇంతకంటే కష్టం. కాని లాటిన్, గ్రీకు లేమిటి ఏ భాష పడితే ఆ భాషని మా ఎలిజబెత్, జేన్ గ్రే అవలీలగా మాట్లాడేస్తారు. వాళ్లు మాట్లాడుతుంటే

నువ్వు వినీతీరాలి. సరేగాని ఆఫల్‌కోర్టునుగురించి చెప్పు. అక్కడ జీవితం సరదాగా ఉంటుందా?"

"ఆకలిగా ఉన్నప్పుడు తప్ప మిగతాఅప్పుడు సరదాగానే వుంటుందండి. బొమ్మలాటలు, కోతు లాటలు—ఓ! ఏం కోతులండి! రంగురంగుల బట్టలు తొడుక్కుని తైతక్క లాడతై. అప్పుడప్పుడు వీధి నాటకాలు కూడా వేస్తారు. వాళ్లు మైలుదూరందాకా వినిపించేట్టు అరచిఅరచి, చివ్వరికి అంతా పొడుచుకుని చచ్చిపోతారు. చాలా బావుంటాయండి ఆ నాటకాలు. ఫార్తింగు (దాదాపుకానీ) పెడితే టికెట్టు వస్తుంది. —ఆ ఫార్తింగు దొరకటం కూడా కష్టమే ననుకోండి."

"ఇంకా చెప్పు. ఇంకేం చేస్తారు?"

"ఆఫల్‌కోర్టులో ఉండే జతగాళ్లమంతా కలిసి అప్పుడప్పుడు కర్రయుద్ధాలు చేస్తాము, వీరుల్లాగా."

యువరాజుకళ్లు ఉత్సాహంతో మెరిశాయి: "ఊ చెప్పు, చెప్పు. బలేగా వుంది."

"ఎవరు బాగా పరిగెత్తుతారో పందాలువేస్తూ వుంటాము."

"ఇది కూడా బాగానే వుంది. ఊ, చెప్పు."

"వేసాకాలంలో కాలవల్లోనూ, నదిలోనూ ఈతలు కొడతాము. ఒకళ్ల నొకళ్లు ముంచుకుంటూ

నీళ్లు చల్లుకుంటూ, అరుస్తూ, మునిగీత కొడుతూ, ఉక్కిరిబిక్కిరౌతూ—"

"అల్లా సరదాగా ఒక్కసారి గడపటానికి నా తండ్రిరాజ్యమంతా ఖర్చయినా లెక్కచెయ్యను. ఊఁ, ఇంకా."

"చీప్ సైడుబజార్లో వసంతోత్సవాలు జరిగే టప్పుడు నాట్యం చేస్తూ, పదాలు పాడతాము. ఇసకలో ఆడుతూ దొర్లుతాము. బురదలో ఆడుకుంటాము— అబ్బ, ఏం బురద, ప్రభూ! ప్రపంచంలో అంత మంచి పదార్థం ఇంకో టుందా! బురదలో నానుతుంటే బలే మజాగా వుంటుంది—"

"చాల్చాలు. ఇంకేం చెప్పకు. అద్భుతం, పరమాద్భుతం! నీ బట్టల్లాంటివి తొడుక్కుని, ఒక్కసారంటే ఒక్కసారి, ఎవ్వరూ వద్దనేవాళ్లు లేకుండా బురదలో పొర్లాడితే—ఈ రాజ్యం పోయినా ఫరవా లేదు."

"నేను కూడా. ఒక్కసారంటే ఒక్కసారి, మీ బట్టల్లాంటివి తొడుక్కుని—"

"ఓహోఁహోఁహోఁ! నీకూ అల్లాగే అనిపిస్తోందా? అయితే నీ చిరుగుబట్టలు తీసేసి ఇవి వేసుకో. ఈ ఆనందం అట్టేసే పుండదనుకో; అయినా బలేగా వుంటుంది. ఇష్టం వచ్చినంతసేపు నువ్వా బట్టల్లోనూ

నే నీబట్టల్లోనూ వుందాం. ఎవరూ కనిపెట్టకముందే మళ్ళీ మార్చేసుకుందాం.''

మరి కొద్ది నిమిషాల్లో వేల్సుయువరాజు చిరుగుల గుడ్డల్లో తయారయ్యాడు. భిక్షాసామ్రాజ్య చక్రవర్తి టామ్ రాజవేషంలో తయారయ్యాడు. నిలువు టద్దం ముందు ఇద్దరూ పక్కపక్కన నుంచుని చూసుకున్నారు — ఏమాశ్చర్యం! అసలు వాళ్లు దుస్తులు మార్చుకున్నట్టే లేదు; ఒకళ్ళనొకళ్లు తేరిపార చూసుకున్నారు; మళ్ళీ అద్దంలో తమకేసి చూసుకున్నారు; చివరికి యువరాజిలాగన్నాడు:

''ఏమిటంటావు దీనికి కారణం?"

"ప్రభూ! నేను జవాబు చెప్పలేను. మీ దాసానుదాసుడు అంతమాట అనటానికి సాహసించడు—"

"అయితే నే చెబుతా విను: నీకూ నాకూ ఒకే మోస్తరు జుట్టు, కళ్లు ఉన్నాయి. మనం మాట్లాడే తీరు, నడిచే నడక, మన మొహాలు, వంటిరంగు, ఎత్తు, లావూ అన్నీ ఒకటే. మనం దుస్తులు తీసేసి నుంచుంటే ఎవరు బిచ్చగాడో, ఎవరు వేల్సుయువరాజో కనిపెట్ట లేరు...... అదేమిటీ, నీ చేతిమీద దెబ్బ?"

''ఆ, ఏమీ లేదు, ప్రభూ! ఇందాక పాపం మా సిపాయి, నన్ను తోసినప్పుడు తగిలింది. పెద్ద దెబ్బేమీ కాదండి."

"ఠట్! మాట్లాడకు. ఎంత అవమానం, ఎంత క్రూరం! ఆ వెధవకి బుద్ధిచెప్పి వస్తా నాగు. నేను వచ్చే దాకా ఒక్క అడుగు కదలకు—ఇది నా ఆజ్ఞ."

బల్లమీద రాజ్యానికంతటికీ ముఖ్యమైన ఒక వస్తువుంది. దాన్ని యువరాజు ఒకమూల దాచేశాడు. మరుక్షణంలో, ఇందాకటి సిపాయిని శిక్షించే ఉద్దేశంతో యువరాజు తలుపు తెరుచుకుని పరిగెత్తాడు. పేలికలు నేల జీరాడుతుండగా, ఉద్యానవనమంతా దాటి గేటు సమీపించాడు. కటకటాలు పట్టుకుని ఊపుతూ,

"తెరు. గేట్లు తెరు," అని అరిచాడు.

టామ్ కాంటీ నిందాక అవమానించిన సిపాయి ఈ ఆజ్ఞ శిరసా వహించాడు. యువరాజు రాజులకు తగిన తీవ్రకోపంతో చిందులు తొక్కుతూ గేటు ఇవతలకి వచ్చాడు; వెంటనే గేటు తీసిన ద్వారపాలకుడు ఊచి పుచ్చుకుని దవడమీద కొట్టాడు; ఆ దెబ్బకి యువ రాజు గిరగిర బొంగరంలా తిరుగుతూ రోడ్డుమీదికి పోయి పడ్డాడు!

"ఇందాక యువరాజుచేత తిట్టించినందుకు ఇదుగో బహుమానం పందివెధవా!" అన్నాడు సిపాయి.



బిచ్చగాని వేషంలో ఉన్న యువరాజును ద్వారపాలకులు అవమానిస్తున్న దృశ్యం.

సముద్రపు ఘోషని మించేటట్టు నవ్వారు రోడ్డు మీద జనం. యువరాజు మట్టి దులుపుకుంటూ లేచి, సిపాయికేసి పరిగెత్తి వస్తూ,

“నేను వేల్సుయువరాజుని. నా పవిత్రమైన శరీరాన్ని అవమానిస్తావా, మూర్ఖుడా! నామీద చెయివేసినందుకు నిన్ను ఉరితీయిస్తాను.”

సిపాయి నిటారుగా నుంచుని సెల్యూట్ చేస్తూ, "క్షమించండి మహాప్రభూ!" అని వెక్కిరించాడు. వెంటనే తీవ్రంగా, "ఒరే, చెత్తకుంకా! కదుల్తావా, కదలవా?" అన్నాడు.

ఈలోగా జనం యువరాజుని చుట్టుముట్టారు. అతన్ని ఎత్తి పడేస్తూ, రోడ్డుదాకా తోసుకుపోయారు; "వేల్సుయువరాజుకు దారివ్వండి — మహాప్రభువులు వేంచేస్తున్నారు — తొలగండి," అని కేకలేస్తూ లాక్కుపోయారు.

# 4

చాలా గంటలసేపు జనం యువరాజుని హింసించి, బాధించి, వేధించి, వినోదించారు. ఇహ విసుగు పుట్టి అతని మానాన అతన్ని వదిలేసి పోయారు. ఓపికున్నంతవరకూ యువరాజు జనాన్ని రాజఠీవితో బెదిరించాడు; రాజఠీవితో ఆజ్ఞాపించాడు; తిట్టాడు, తన్నాడు. అంతవరకూ జనానికి సరదాగానే వుంది. కాని కొంతసేపటికి యువరాజు అలసిపోయాడు; ఇహ ఏం చేయటానికీ ఓపిక లేకపోయింది; కనుక అతనితో అవసరం తీరిపోయి, జనులు ఎవళ్లదారిన వాళ్లు వెళ్లిపోయారు.

యువరాజు చుట్టూ కలయచూశాడు. ఎక్కడున్నాడో తెలియలేదు. లండన్ నగరంలో ఉన్నట్టు

మాత్రం గ్రహించాడు. ఏ దారి కనిపిస్తే ఆ దారిన నడవ సాగాడు. కొంతదూరం పోయేసరికి ఇళ్ళు పల్చబడ్డాయి; రోడ్డుమీద జనంకూడా పల్చబడ్డారు.

ఇప్పుడు ఫారింగ్టన్ వీధి ఉన్నచోట ఆ రోజుల్లో ఒక కాలవ ప్రవహిస్తూండేది. అందులో దిగి నెత్తురు కారుతున్న పాదాలు కడుక్కున్నాడు. కాస్సేపు గట్టున విశ్రమించాడు. మళ్ళీ నడిచి ఒక పెద్దమైదానస్థలం లోకి వచ్చాడు. అక్కడ అట్టే ఇళ్లు లేవు; ఒక పెద్ద చర్చి వున్నది. ఆ చర్చి నతడు గుర్తుపట్టాడు. ఆ చర్చి మరమ్మతులో ఉండటంవల్ల పనివాళ్లు చాలామంది నిచ్చెనలు వేసుకుని పని చేస్తున్నారు.

చర్చి చూడగానే యువరాజుకు ప్రాణం లేచి వచ్చింది; తన కష్టాలు గట్టెక్కా యనుకున్నాడు: "గ్రేఫ్రయర్స్ చర్చి ఇదే. దీన్నే నాన్నగారు కాథలిక్ సన్యాసులనుంచి లాక్కుని అనాథశిశువుల రక్షణ కోసం దానంచేశారు. దీని కొత్త పేరు క్రైస్టుచర్చి. మా తండ్రిగారు చేసిన మేలును గుర్తుంచుకొని వీళ్లు నన్ను ఆదరించకపోరు. అందులో ముఖ్యంగా తమ అన్నదాతకొడుకు ఇంత నిరుపేద స్థితిలో ఉన్నప్పుడు తప్పకుండా సహాయ పడతారు," అని అతనికి ఆలోచనలు పోయినై. ఈ ఆలోచనల్లో పడి అతడు కొందరు పిల్లల సమూహంలోకి వచ్చాడు. వాళ్లు దాగుడు

మూతలు, బంతాట ఆడుతూ, ఆ సందర్భంలో పరి గెత్తుతున్నారు, ఎగురుతున్నారు, దూకుతున్నారు. వాళ్ళందరూ ఒకటే మోస్తరు దుస్తుల్లో వున్నారు; తలకి ఎటూ సరిపోని నల్లటి టోపీ, మెడకి ఓ చిన్న రుమాలలాంటిది, బిగుతుగా వుండి మోకాళ్ళ కిందికి వచ్చే నీలంచొక్కా, పొడుగు చేతులు, నడుముకు వెడల్పాటి ఎర్రని బెల్టు, పసుప్పచ్చ మేజోళ్లు, బెల్టుచెప్పులు ఇవీ వాళ్ల దుస్తులు. అవి ఎంత అసహ్యంగా వుండాలో అంత అసహ్యంగా వున్నాయి.

పిల్లలు ఆట లాపి యువరాజుచుట్టూ మూగారు. అతను తన సహజ రాజఠీవితో ఇలాగన్నాడు.

"మీరు మంచి పిల్లల్లా కనిపిస్తున్నారు. వేల్సు యువరాజు, ఎక్కడ్డు మాట్లాడగోరుతున్నాడని మీ అధికారులతో చెప్పండి."

ఈ మాటకి పిల్లలగుంపు వేళాకోళపు అరుపులతో సమాధాన మిచ్చింది. ఒక పెంకిఘటం ఇలాగన్నాడు :

"ఏయ్ బిచ్చగాడా! యువరాజుగారి రాయబారివా నువ్వు?"

యువరాజు మొహంలో కోపంవల్ల రక్తం పెల్లుబికి వచ్చింది. అప్రయత్నంగా నడుముమీద చెయ్యి

వేశాడు; కాని అక్కడేమీ లేదు. మళ్లీ ఉప్పెనగా నవ్వు మొదలైంది. ఓ రౌడీకుర్రా డన్నాడు:

"చూశారా, అది? నడుముకు కత్తి ఉన్నట్లు నటించాడు - అచ్చు యువరాజుమల్లేనే." మళ్లీ ఓ నవ్వు ఉప్పెన.

"నేను నిజంగా యువరాజుని. మా తండ్రి గారైన మహారాజు ఉప్పు తిని బతుకుతూ, ఆయన కుమారుడి కిచ్చే గౌరవ మిదేనా?" అన్నాడు.

ఈమాటలు విని పిల్లలు చాలా ఆనందించా రన టానికి నిదర్శనంగా సముద్రపుహోరులాంటి మహో నవ్వు కెరటాలుగా పొర్లివచ్చింది. మొదట్లో మాట్లా డిన పెంకి ఘటం తోటివాళ్లతో ఇలా అన్నాడు.

"ఒరేయ్, పందుల్లారా! బానిసల్లారా! మహా రాజు ఉప్పు తిని బతుకుతూ, మీకా మాత్రం గౌరవ మర్యాదలు తెలియకర్లే దట్రా. పడండి, సాష్టాంగ పడి నమస్కారాలు పెట్టండి. ఎదురుగా చిరుగుల మహా రాజు నుంచునుంటే, సాష్టాంగపడకుండా చూస్తారే మర్రా."

పిల్లలందరూ ఒక్కసారిగా సాష్టాంగపడి, తమ చేతిలో చిక్కిన పిట్టకి నమస్కారం చేశారు. పెంకి ఘటంగాణ్ణి యువరాజు చాచి కాలితొద్దీ తన్ని భయం కరంగా ఉరిమాడు.

"ఇదుగో దెబ్బ. రేపొద్దునే నిన్ను ఉరికంబ మెక్కిస్తాను."

ఓ, ఇదేదో వేళాకోళ మనుకుంటే, వ్యవహారం ముదిరిందే...వెంటనే నవ్వు శాంతించింది. దాని స్థానాన్ని కోపం ఆక్రమించుకుంది. ఓ డజనుమంది అరిచారు:

"తోలండి వాణ్ణి, గుర్రాల గొయ్యికి. కుక్క లెక్కడ? హాం, జాకీ, బ్లాకీ ఉస్కో."

అప్పుడు ఇంగ్లీషుచరిత్రలో ఎవ్వరూ కని విని ఎరగని సంఘటన జరిగింది. ఇంగ్లీషు సింహాసనానికి వారసుడైన వేల్సుయువరాజు పవిత్రశరీరాన్ని డజన్ల కొద్దీ కుక్కలు కొరకడం, పీకడం, రక్కడం ప్రారంభించాయి. వాటికి మనుష్యులు శక్తివంచన లేకుండా తోడ్పడ్డారు.

సూర్యాస్తమయమైంది. చీకటి నలుదిశలా కమ్ముకుంటోంది. యువరాజు నడిచి, నడిచి నగరంలో అలగాజనం కాపుర ముండే ప్రాంతం చేరుకున్నాడు. శరీర మంతా పచ్చి పుళ్లయింది; చేతులకీ, కాళ్లకీ నెత్తురు కారుతోంది; వంటికీ, బట్టలకీ మట్టి పేరుకుంది. ఎటు పోయేదీ తెలియక, ఎటు పోవాలో తెలియక విభ్రాంతుడై, అలిసి, నీరసంగా తిరుగాడాడు. అడుగు తీసి అడుగు వెయ్యడం కూడా కష్టమైపోతోంది. మొదట్లోమాదిరిగా ఇప్పు డెవరినీ ప్రశ్నలడగటం

లేదు; ఎందుకంటే సమాధానాలకు బదులు అవమానం ఎదురవుతోంది.

"ఆఫల్ కోర్టు-అనీ దాని పేరు. నా కాళ్లలో బలం పూర్తిగా చచ్చిపోకముందు అక్కడికి చేరుకోగలిగానంటే, బతికానన్నమాటే. టామ్ తలిదండ్రులు నన్ను కోటకి తీసుకుపోతారు; నేను బిచ్చగాణ్ణి కాదనీ, నిజమైన యువరాజుననీ ఋజువు చేస్తారు." అనుకున్నాడు. క్రైస్తు చర్చిలోని పిల్లలు తన్ను అవమానించిన విధానమంతా కళ్లకు కట్టింది.

"నేను రాజునయ్యాక ఆ పిల్లలకి తిండీ, బట్ట ఇవ్వడమే కాకుండా చదువుకూడా నేర్పిస్తాను. మనస్సు, హృదయం సరిగ్గా లేకపోయింతర్వాత కడుపునిండా తిండీవుండి మాత్రం లాభమేమిటి? ఇది జాగ్రత్తగా జ్ఞాపకముంచుకోవాలి. చదువువల్ల హృదయం మృదువౌతుంది," అనికూడా అనుకున్నాడు.

వీధుల్లో దీపాలు వెలిగాయి. వానతుప్పర ప్రారంభమైంది. హోరుగాలి సాగింది. తల దాచుకొనటానికైనా దిక్కులేని వేల్సుయువరాజు దారిద్ర్యం, మాలిన్యం గడ్డకట్టిన సందులగుండా తిరుగాడుతున్నాడు. ఇంతలో ఓ తాగుబోతు మెడ పట్టుకున్నాడు.

"ఇంత రాత్రిదాకా ఇంటికి రాకుండా ఏం చేస్తున్నావురా? ఏమన్నా డబ్బులు సంపాదించావా లేదా?

చెప్పు. ఇవ్వాళ నీ బొమికలన్నీ విరిచి పొయ్యిలో పెట్టకపోతే నా పేరు జాన్ కాంటీ కాదు."

యువరాజు పట్టు విడిపించుకుని, అప్రయత్నంగా బుజాలు దులుపుకున్నాడు, పవిత్రమైన తన శరీరం మలిన మైందనే చింతతో.

"నువ్వు అతని తండ్రివా? అయితే బతికిపోయాం నన్నమాట. నన్ను అక్కడికి తీసుకపోయి, అత న్నిక్కడకు తీసుకరా," అని ఆదుర్దాగా అన్నాడు.

"అతని తండ్రినా? అత నెవరో నాకు తెలియదు. నేను నీ అబ్బనని మాత్రం తెలుసు. నీ కా సంగతి ఇంకా తెలియకపోతే రెండు నిమిషాల్లో తెలుస్తుంది; ఇంటికి పద."

"ఇదుగో, ఇది వేళాకోళానికి సమయం కాదు. ఆలస్యం చెయ్యకు. నే నిప్పటికే చాలా బాధ అనుభ వించాను, చాలా గాయాలు తగిలాయి. నా తండ్రి గారైన మహారాజుదగ్గిరికి తీసుకుపో. ఆయన నిన్ను ఐశ్వర్యాలలో ముంచెత్తుతాడు. నా మాటనమ్ము. నే నబద్ధమాడటం లేదు; ఇది ముమ్మాటికి నిజం. నీ చెయ్యి జాచు; నన్ను ఈ కష్టదశనుండి రక్షించు. నేను వేల్సుయువరాజుని."

జాన్ కాంటీ మంచులో ఇరుక్కుపోయినవాడిలా ఆశ్చర్యంతో కొరడు కట్టి, నుంచుండిపోయాడు. ఎడ్వర్డు

3

కేసి కొంతసేపు తేరిచూశాడు; తల అటూ ఇటూ ఊగించి ఇలా గొణిగాడు:

"పిచ్చెక్కిందీ, వెధవకి?" మళ్ళీ మెడ బట్టుకుని, బూతులవాన కురిపించాడు. "నీకు పిచ్చెక్కితే ఎవడి క్కావాలి; పిచ్చెక్కకపోతే ఎవడి క్కావాలి. నీ బొమికల్లో ఏది గట్టిదో, ఏది మెత్తదో ఇవ్వాళ పరీక్ష చెయ్యాలి. పద మీ బామ్మదగ్గిరికి, అదికూడా పరీక్ష చేస్తుంది," అంటూ ఆ తాగుబోతు తప్పించుకోవాలని పెనగులాడుతున్న యు వ రా జు ని బరబర లాక్కుపోయాడు. వెనక తాచుపాముల్లాగా విషపు నవ్వులు కక్కుతూ బిచ్చగాళ్ల గుంపు అనుసరించింది.

## 5

యువరాజు మందిరంలో టామ్ కాంటీ ఒంటరిగా మిగిలిపోయాడు. ఈ అవకాశాన్ని అతడు బాగా ఉపయోగించుకున్నాడు. నిలువుటద్దంముందు నుంచుని మెడ ఇటు తిప్పీ, అటు తిప్పీ చూసుకున్నాడు. తన అందమైన దుస్తుల్ని పదే పదే చూసి మురిసిపోయాడు. యువరాజు మోస్తరుగా రాజఠీవితో అటూ ఇటూ పచార్లు చేసి, ఫలితాలెలా వున్నాయో అద్దంలో పరిశీలించాడు.

యువరాజు ఉపయోగించే అందమైన ఖడ్గం తీసి దాంతో కొంత సేపు తిప్పలు పడ్డాడు. అయిదారు వారాల కిందట రత్నద్రోహులైన నార్ఫోక్, సర్రే

ప్రభువులను ఖైదీలుగా తీసుకువచ్చిన ఒక సైనికో ద్యోగి లండన్ గోపురాధి కారికి ఏవిధంగా నమస్కారం చేసిందీ టామ్ చూసివున్నాడు; అదేవిధంగా టామ్ కూడా ఖడ్గాన్ని రెండు చేతులా అడ్డంగా పట్టుకుని, వంగి, అంచులు ముద్దుపెట్టుకున్నాడు. మణులు పొదిగిన యువరాజు బాకుతో కాసేపు సాధకం చేశాడు.

గదిలోని అమూల్యము, అపురూపము అయిన అలంకార సామగ్రిని దూరదూరంనుంచి బెదురుతూ, బెదురుతూ పరీక్షచేశాడు. తన పరిమాణానికి కనీసం రెట్టింపైనా వుంది అక్కడి ప్రతికుర్చీని; ప్రతిదాని మీాద రాజఠీవితో కూర్చోడం అలవాటు చేసుకు న్నాడు. తనకు పట్టిన అదృష్టాన్ని ఈ నిమిషంలో ఆఫల్ కోర్టు మంద గనక చూస్తే "ఇంకేమైనా వుందా, ఆశ్చర్యంతో గుండెలు పగిలి చావరూ?" అను కున్నాడు. ఇంటికి వెళ్లాక "ఇల్లా ఇల్లా జరిగిందన్రా" అని చెప్పినా వాళ్లు నమ్మరేమో ననీ, అస్తమానమూ రాజుల్ని గూర్చే ఆలోచిస్తూండటంవల్ల తనకు మతి చెడిందని నిర్ణయిస్తా రేమోననీ చాలా బాధపడ్డాడు.

ఒక అరగంట ఇలా గడిచేసరికి టామ్‌కు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది-యువరాజు అవతలకు వెళ్లి చాలా సేపైందని. ఇంతసేపు బాగానే వున్న ఆ ఒంటరితనం ఈ జ్ఞాపకంతో బరువెక్కింది. యువ రాజు త్వరగా వస్తే బావుండుననిపించింది; అడుగుల

చప్పుడౌతుందేమోనని చెవిఒగ్గి విన్నాడు; చుట్టూ వున్న అలంకార వస్తువులమీద మోజు తగ్గిపోయింది. అటు చూశాడు, ఇటు చూశాడు; ఇటు తిరిగాడు, అటు తిరిగాడు; ఏం చెయ్యడానికీ పాలుపోలేదు. ఇప్పుడెవరన్నా వచ్చి తనని యువరాజు దుస్తుల్లో చూసి పట్టుకుంటే!—ఇదంతా తన పనేనని చెప్పేందుకు యువరాజుకూడా దగ్గర్లో లేడు. రాజభటులు పట్టుకుంటే ముందు ఉరితీసేస్తారు; తరవాత తన కేసుని సావధానంగా దర్యాప్తు, విచారణ చేస్తారు. వాళ్ళపద్ధతి అంతే. ఇలాంటి చిన్న నేరాలు జరిగినప్పుడు అధికారులు ఖచ్చితంగా ప్రవర్తిస్తారని అతనికి తెలుసు.

క్రమంగా అతని మనస్సులో భయం పేరుకుంది; ఆపాదమస్తకం గజగజ వణికాడు; మెల్లిగా లేచి తలుపు ఒత్తిగించాడు. గబాలున పారిపోయి యువరాజును వెతికి పట్టుకోవాలనీ, ఆయనద్వారా ఈ అపాయం తప్పించుకోవాలనీ అతని ఉద్దేశ్యం. అతడు తలుపు తెరిచాడో, లేదో, ఖరీదు దుస్తులు ధరించి పెద్ద మనుషుల్లా కనిపించే ఆరుగురు సేవకులు, సీతాకోక చిలకలా రంగురంగుల దుస్తులు వేసుకున్న ఇద్దరు నౌకరు యువకులు అతివినయంగా వంగి నమస్కరించారు. అదిరిపడి టామ్ టప్పున తలుపేసి దాక్కున్నాడు.

"వీళ్లు నన్ను చూసి వేళాకోళం చేస్తున్నారు. తప్పకుండా సైనికులు వచ్చి నన్ను లాక్కుపోతారు.

వృథాంగా ప్రాణం పోగొట్టుకునేందుకు కాకపోతే నే నిక్కడి కెందుకు రావాలి," అని చింతించాడు.

గదిలో కాసేపు పచార్లుచేశాడు. అర్థంకాని భయాలు వేటకుక్కల మల్లే బౌబౌమంటూ అతన్ని ముట్టడించాయి; చీమ చిటుకుమంటే ప్రాణా లెగిరి పోతున్నాయి. ఇంతలో తలుపు తెరుచుకుంది. సిల్కు దుస్తుల్లో వున్న నౌకరు యువకుడు వచ్చి సెల్యూట్ చేసి,

"జేన్ గ్రే దొరసానమ్మగారు," అని ప్రకటించాడు. షోకైన బట్టలుధరించి, నాజుగ్గావున్న ఓ రామ్ములక్కాయలాంటి పిల్ల గదిలో ప్రవేశించింది. ఆమె విసవిస నడుస్తూ టామ్ని సమీపించి, ఆగిపోయింది; విచారకంఠంతో అడిగింది.

"ఏమిటిది ప్రభూ! వంట్లోకులాసాగా లేదా?"

టామ్ గుండెలు దిగజారిపోయాయి. భయం వల్లా, కంగారువల్లా కాసేపటిదాకా నోటమాట రాలేదు. ఎలాగో కష్టపడి యీ మాటలు నన్నాడు :

"నన్ను రక్షించండి అమ్మా! నేను ప్రభువును కాను. ఆఫల్ కోర్టులో బిచ్చమెత్తుకునే టామ్ కాంటీని. యువరాజును కలుసుకో నివ్వండి. ఆయన నా పేలికలు నా కిచ్చేసి పంపిస్తారు. కనికరించండి అమ్మగారూ! కాపాడండి యీదిక్కుమాలిన వాణ్ణి."

టామ్ మోకాళ్లమీద పడి చేతులు పిసుక్కుంటూ దీనంగా ఆ బాలికని ప్రార్థించాడు. ఆమె నెత్తిమీద పిడుగుపడిన దానివలె గుడ్లప్పగించి చూస్తోంది. చివరి కన్నది:

"ప్రభూ! ఏమిటిది? నాకు నమస్కరిస్తున్నారు? ఏమిటీ మాటలు? లేవండి."

ఇలా అంటూనే ఆమె ముచ్చెమటలు కారుతుండగా పారిపోయింది అవతలకి. టామ్‌కి భయం పూర్తిగా తగ్గిపోయి, దానిస్థానంలో నిరాశ ఏర్పడింది. నేలమీద కూలబడ్డాడు.

"ఉరిశిక్ష తప్పదు. నన్నెవరూ రక్షించరు. ఇక వాళ్లొస్తారు; టామ్ కాంటీ రేపటి సూర్యోదయాన్ని చూడడు." అని గొణుక్కుంటున్నాడు తనలో తాను.

ఈలోగా కోట అంతటా భూకంపన తరంగాల మాదిరిగా వ్యాపిస్తోం దొక భయంకర వార్త. ఈ రహస్యవార్త (ఇలాంటి వాటి నెవరూ గట్టిగా ఉచ్చరించరు) నౌకరు నుంచి నౌకరుకు, ప్రభువునుంచి ప్రభ్వికి, మందిరంనుంచి మందిరానికి, అంతస్తునుంచి అంతస్తుకి చావుకబురు లా పాకిపోయింది. ఏనోట చూచినా ఇదేమాట. "అబ్బాయిగారికి పిచ్చెక్కింది యువరాజు గారికి పిచ్చెక్కింది." ప్రతిహారులులోను, గదిలోను, నడవాలోను ప్రభువులు, వారిస్త్రీజనం,

సేవకులు వేరువేరుగా సమావేశం కావటం ఈ విష యాన్నే, చర్చిస్తూ గుసగుస లాడటం సాగించారు. అందరికీ బిక్క మొహాలు పడ్డాయి రాజకుటుంబానికి కలిగిన ఆపదవల్ల.

ఇంతలో కవచధారియైన ఓ అధికారి మెరిసి పోతూ అక్కడికి వచ్చాడు. ప్రతి సమావేశం దగ్గరా ఆగి గంభీరమైన ప్రకటన చేశాడు.

"(శ్రీ) (శ్రీ) (శ్రీ) మహారాజాధిరాజులుంగారి ఆజ్ఞా ప్రకారం, ఈ అబద్ధపు వార్తను నమ్మినవారికీ, దాన్ని గూర్చి తెలివితక్కువగా మాట్లాడినవారికీ, కోటబైట ఎవరికైనాసరే తెలియజేసిన వారికి మరణ శిక్ష విధించబడుతుంది—(శ్రీ) (శ్రీ) (శ్రీ) మహారాజాధి రాజులుంగారి ఆజ్ఞాప్రకారం—"

ఉన్నట్టుండి మూగతనం వచ్చినట్టు అందరికీ నోళ్లు కట్టుబడ్డాయి; గుసగుస లణిగిపోయాయి.

ఇంతలో అటూ యిటూ ఎత్తైన స్తంభాలు బార్లు తీర్చిన పొడుగాటి నడవాల్లో మళ్ళీ గుసగుసలు బయలు దేరాయి: "యువరాజు. వస్తున్నారు యువరాజు గారు—"

పాపం టామ్ నీరసంగా నడిచి వస్తున్నాడు. అతడు సమీపిస్తుండటం చూసి అందరూ వంగి మర్యాద ప్రకటించారు. టామ్‌కూడా అదే విధంగా వంగుతూ, తన అద్భుత పరిసరాలను బెరుకు బెరుకుగా

చూసి తెల్లపోతూ వస్తున్నాడు. గొప్పగొప్ప సామంతు లతని కిరుప్రక్కలా నడుస్తూ, దాదాపు మోసు కెడు తున్నంతపని చేస్తున్నారు. వెనక రాజవైద్యులు, సేవ కులు వస్తున్నారు.

టామ్ ఒక విశాలమైన మందిరంలోకి ప్రవేశ పెట్టబడ్డాడు. కూడా వచ్చినవాళ్ళు చుట్టూ చేతులు కట్టుకు నిలబడ్డారు.

ఎదురుగా కొంత దూరాన ఒక మంచంవుంది. దాని మీద ఒకాయన పడుకుని వున్నాడు; చాలా పెద్ద విగ్రహం; లావుగా వున్నాడు; బంగ మొహం; గంభీరమైన చూపులు; తల బాగా నెరిసింది; గడ్డం కూడా నెరిసింది; ఖరీదైనబట్టలే, కాని, కొంచెం పాతవి లాగా, పొప్పర్లు లేచినట్టు కనిపిస్తున్నాయి; కాళ్లు రెండూ ఉబ్బి వున్నాయి; ఒకదానికింద మెత్తటి దిండువుంది. ఆ నిశ్శబ్దమైన మందిరంలో ఈ ఒక్క మనిషితలకాయ తప్ప అందరి తలలూ వినయంతో వంచబడి వున్నాయి. ఆయనెవరో కాదు; ఎవరిపేరు చెబితే ఆబాలగోపాలం భయంతో కంపించిపోతారో ఆ ఎనిమిదవ హెన్రీయే. ఆయన మాట్లాడడం ప్రారం భించాడు-మొహంలో తీవ్రత్వం తగ్గి మెత్తదనం కన బడింది.

"ఏమిటిది ఎడ్వర్డు ప్రభూ, నాయువరాజా! ఈ ముసలి తనంలో నీ పిచ్చితండ్రితో వేళాకోళం

ఆమతున్నావా? మహారాజునైన నేను నిన్నెంత ప్రేమి స్తున్నానో తెలియదా?''

టామ్ మనస్సీలోకంలో వుంటేగా ఈ మాటలు వింటానికి? 'మహా రాజునైన నేను' అనే మాటలు మాత్రం విన్నాడు. వినీ వినగానే తుపాకిదెబ్బతిన్న పక్షి వలె కీమని మోకాళ్ళమీద పడ్డాడు; చేతులెత్తి ఇలా గన్నాడు.

''తమరు మహారాజులా? ఇక నా ప్రాణాలు దక్కవు.''

ఈ మాటలుకూడా తుపాకిదెబ్బలా పని చేశాయి రాజుమీద. అందరివంకాచూసి తల పంకించాడు; మళ్లీ టామ్‌కేసి చూశాడు; నిరాశా సూచకమైన స్వరంతో ఇలా గన్నాడు.

''వట్టి పుకా రేమో నని ఆశ పడ్డాను. ఇది పుకారుకాదన్న మాట.'' ఓ పెద్ద నిట్టూర్పువిడిచి మృదు స్వరంతో పిలిచాడు: ''రా నాయనా! నీ తండ్రి వద్దకురా. నీకు ఆరోగ్యం చెడింది.''

టామ్‌ను లేవదీశారు. వణుకుతూ వినయంగా సమీపించాడు ఇంగ్లండు రాజును. భయం ముప్పిరి గొన్న ఆ చిన్న ముఖాన్ని ఆయన తన రెండు చేతుల మధ్య తీసుకుని ప్రేమతో కళ్ళలోకి చూశాడు; పాడై పోయిన మనస్సు బాగుపడుతున్న సూచన లేమైనా కనిపిస్తాయేమోనని చాలాసేపు అలాగే చూశాడు.

టామ్ తలని తన రొమ్ముపై ఆనించి ఉంగరాల జుట్టును నిమురుతూ అన్నాడు:

"నీ తండ్రినే గుర్తించ లేవా; నాయనా! ఈ వృద్ధాప్యంలో నా గుండె బద్దలు చెయ్యకు. నన్ను గుర్తించానని చెప్పు. ఒక్కసారి తియ్యగా పలుకు, నన్నెరుగుదునని."

"తమ నెరుగుదును మహాప్రభూ! మీరు నాకు మహారాజులు."

"నిజమే, నిజమే. బాగానే వుంది కాని అలా వణికిపోకు శాంతించు. స్థిమితపడు. నిన్ను బాధపెట్టే వారెవరూ లే రిక్కడ. నిన్ను ప్రేమించే వారు తప్ప ఇంకెవరూ లేరు...ఆ! ఇప్పుడు బావుందా? నీదుస్వప్నం చెరిగి పోతోందా ? పోతోందికదూ ? నువ్వెవరివో జ్ఞాపకం వస్తోందికదూ ? ఇందాక నువ్వు మరెవరివో అని అనుకున్నావట, ఇక అను కోవుగదూ?"

"మహారాజా ! నన్ను నమ్మండి నేను నిజమే చెప్పాను. నేను తమ దాసానుదాస ప్రజల్లో ఒకణ్ణి. నాది బిచ్చగాళ్ళ కుటుంబం. తలవని తలంపుగా జరిగిన దురదృష్టంవల్ల నే నిక్కడికి వచ్చాను; అందులో నా తప్పేమీ లేదు ప్రభూ! నేనింకా పసిబాలుణ్ణి. నా ప్రాణం కాపాడండి; ఒక్కమాటతో మీరు నా ప్రాణం రక్షింప సమర్థులు. నన్ను క్షమించి వది లేయండి.''

"నీకు ప్రాణభయమా, యువరాజా? అలా మాట్లాడకు. నీకు వచ్చిన ప్రాణాపాయ మేమీ లేదు."

టామ్ సంతోషంతో చేతులు, జోడించి,

"మహారాజా! మిమ్మ భగవంతుడు సర్వదా కాపాడుగాక!" అన్నాడు. వెంటనే తన వెనక నిల బడిన ఇద్దరు ప్రభువులకేసి తిరిగి "మీరు మహారాజు వాగ్దానం విన్నారు. నా ప్రాణం రక్షించబడుతుంది. నేను స్వేచ్ఛగా పోవచ్చును," అన్నాడు.

ఈ మాటలు విని ఎవరూ కదల్లేదు, మెదల్లేదు, నోరెత్తలేదు, చేతులు కట్టుకుని తలలు వంచుకునే వున్నారు. దీంతో టామ్‌కి మళ్లీ అనుమానం కలిగింది; జంకుతూ రాజుకేసి తిరిగాడు: "నేను పోవచ్చా, మహారాజా?"

"వెడతావా? వెళ్లాలని కోరితే నిన్నెవరూ అడ్డగించరు. కాని కానేపాగు. ఎక్కడికి పోతావు?"

"వెళ్లవచ్చునను కున్నాను, క్షమించండి. నేను పుట్టి పెరిగిన దొంక పాత కొంపలో; అక్కడే నా తల్లి, అక్కలు వున్నారు; కనుక అదే నా ఇల్లు. అక్కడికే పోదామనుకున్నాను. ఈ మహాభవనాలు, వైభవాలు నాకు కొత్త. నే నిక్కడ ఉండలేను. నన్ను పోనివ్వండి."

రాజు నిశ్శబ్దంగా ఆలోచిస్తున్నాడు; ఆయన ముఖంలో విచారం స్పష్టంగా కనిపిస్తోంది. తరవాత ఇలా అన్నాడు :

"బహుశా ఈ ఒక్క విషయంలోనే యువ రాజు మనస్సు చెడినట్టు తోస్తుంది. మిగతా విష యాల్లో బాగానే వున్నాడు. అయినా పరీక్ష చేద్దాం," అంటూ రాజుగారు టామ్‌ని లాటిన్ భాషలో ఒక ప్రశ్న అడిగారు.

టామ్ నట్టుతూ, నట్టుతూ లాటిన్‌లోనే జవా బిచ్చాడు. రాజుకు పరమానందమైంది. ప్రభువులు, రాజవైద్యులు కూడా సంతోషంగా కనిపించారు.

"మామూలుగా మాట్లాడినట్లు లేకపోయినా, లాటిన్ భాష పూర్తిగా మరిచిపోలేదు. మనస్సు ఎక్కడో కొంచెమే దెబ్బతిన్నట్టుంది కాని, పూర్తిగా దెబ్బతినలేదు. ఏమంటారు మీరు ?

రాజుగారి ప్రశ్నకు రాజవైద్యుడిలాగ సమా ధాన మిచ్చాడు.

"నా అభిప్రాయంకూడా అదే మహారాజా!"

అనుభవజ్ఞుడైన రాజవైద్యుడు ఈ విధంగా ప్రోత్సాహకరంగా మాట్లాడేసరికి రాజు బాగా సంతృప్తిపడ్డాడు. ఇంకొకసారి టామ్‌ని పరీక్షించాలని ఈ మాటు ఫ్రెంచి భాషలో ప్రశ్న వేశాడు. టామ్

క్షణం సేపు బిత్తరపోతూ నోరు మెదపలేదు. అందరూ అతన్నే చూస్తున్నారు. టామ్ మరీ కంగారుపడి,

"ప్రభూ! ఆ భాష ఏదో నాకు రాదు," అన్నాడు.

ఈ సమాధానం విని తిరిగి నిరాశతో రాజు వెనక్కి వాలి పోయాడు. సేవకులు ఆయన్ని పట్టుకుని లేవదీయ బోయారు. వాళ్ళని వారించి ఆయ నిలా గన్నాడు :

"నన్నేం చేయకండి...బలహీనత మాత్రమే—మరేం లేదు—నాయనా, ఇల్లా రా. నీ తల నా రొమ్ము మీద ఆనించు; ఆ, అలా...త్వరలో నీ ఆరోగ్యం బాగుపడుతుంది; భయపడకు—ఇదేమీ పెద్ద జబ్బు కాదు—త్వరలో బాగవుతావు,''అంటూ చుట్టూ వేచి వున్న ప్రభువులకేసి తిరిగాడు. ఆయన మృదుస్వరం కఠినమైంది; కళ్లలో మెరుపులు మెరిశాయి; ఇలా గన్నాడు :

"అందరూ సావధానంగా వినండి; నా కుమారుడు తాత్కాలికంగా పిచ్చివాడయ్యాడు. అతి చదువు మూలాన, ఎప్పుడూ కదలక మెదలక కూర్చోడంవల్ల ఇల్లా జరిగింది. అంతేగాని మరేం లేదు. ఇకనుంచీ పుస్తకాలు గిరాటెయ్యండి; మేష్టర్లని తరిమెయ్యండి. ఆటపాటలతో, విలాసాలతో అతన్ని సంతోషపెట్టండి. అతని ఆరోగ్యం త్వరలో బాగు

పడుతుంది." గొంతుక ఇంకా హెచ్చించాడు; మాటలుతీవ్రంగా, బలంగా వస్తున్నాయి : "అతడు పిచ్చివాడయ్యాడు. అయినా అతడు నా కుమారుడు; ఇంగ్లండుసింహాసనానికి వారసుడు; పిచ్చెక్కినా, లేక పోయినా, అతడే రాజ్యంచేస్తాడు; చేసి తీర్తాడు. వినండి జాగ్రత్తగా; ఈ విషయాన్నందరికీ తెలియ జెయ్యండి—యువరాజు అనారోగ్యాన్నిగూర్చి ఎవడు నోరెత్తినా రాజద్రోహ నేరం చేసిన వాడవుతాడు; మరణశిక్షకు గురవుతాడు......కాసిని మంచి నీళ్లు... అబ్బా! కాలిపోతున్నా... ఈకొత్త విచారంతో నాబలం ఉడిగిపోతోంద... చాలు, ఈకప్పతీసెయ్. కాస్తచెయ్యి ఆసరా ఇయ్యి... పిచ్చెక్కిందా? ఇంతకి వెయ్యి రెట్లు పిచ్చెక్కినా సరే అతడే వేల్సు యువరాజు. సార్వభౌముడి నైన నేను ఆజ్ఞాపిస్తున్నాను. ఈ రోజునే అతన్ని శాస్త్రప్రకారంగా యువరాజుని చెయ్యండి. తక్షణమే ఈ ఆజ్ఞ జరగాలి. విన్నావా, హెర్ట్ఫర్డ్ ప్రభూ!"

ప్రభువుల్లో ఒకడు రాజశయ్య పక్కన మోకరించి,

"వంశపారంపర్యా ఇంగ్లండుకు మహాసేనాధిపతి యైనమనిషి లండన్ గోపురంలో ఖైదీగా ఉన్నాడని మహారాజుకు తెలుసు. రాజద్రోహియైన వానిచేత..."

"మాట్లాడకు. ఆ ద్రోహి పేరు నా చెవుల పడ నివ్వకు. వాడింకా బతికున్నాడా? రాజభక్తుడైన మహా సేనాధిపతి లేనందు మూలంగా నా కుమారునికి యువరాజ పదవి లేకుండా పోవాలా! లేదు. ఇదెంత మాత్రం జరగటానికి వీల్లేదు. నార్ఫోక్ ప్రభువుకు రేపు సూర్యోదయం చేలోగా ఉరిశిక్ష విధించి తీరాలని నామాటగా పార్లమెంటు వాళ్లతో చెప్పు; పార్లమెంటు నామాట పాటించకపోతే నాశక్తిని రుచి చూస్తారు."

హెర్ట్‌ఫర్డు ప్రభువు, "రాజవాక్కు శాసనంగా శిరసావహిస్తాను," అంటూ లేచి తను మొదటనుంచున్న చోటికి వెళ్లి నుంచున్నాడు.

క్రమంగా రాజు మొహంలో కోపం తగ్గింది.

"యువరాజా' ఇలా రా, ఒక్క ముద్దియ్. ఆ. . . ఏం, ఎందుకల్లా జంకుతావ్? నేను నీ తండ్రిని గానా?

"మహా రాజా! నాలాంటి నీచుణ్ణి ఇంత ప్రేమతో ఆదరిస్తున్నారు . . . కాని ఉరిశిక్షకు గురి కాబోయే ఆ ప్రభువును కూడా కనికరించండి.''

"ఆ, ఆ, నీ హృదయం నాకు తెలుసును. నీ మనస్సు కొంచెం దెబ్బతిన్నా నీహృదయం బాగానే వుంది. నీది జాలిగుండె, నాకు తెలుసు. కాని ఈనార్ఫోక్ ప్రభువున్నాడే, అతడు నీకూ, సింహాస

నానికీ మధ్య అడ్డంవచ్చాడు. మహా సేనాధిపతిగా మరొకరిని రాజభక్తుడైన వానిని చూసి నియమిస్తాను. శాంతించు యువరాజా! ఈవిషయంమీద అట్టే మథనపడి మనస్సు చెడగొట్టుకోకు."

"కాని ఆయనను ఉరికింబానికి పంపించేది నేనే గదా! నామూలానే గదా ఆయన అకాలంగా చచ్చిపోతున్నారు?"

"అతన్ని గూర్చి ఇంక అట్టే ఆలోచించకు. అందు కతడు తగడు. నన్ను మరొక్కసారి ముద్దుపెట్టుకో. ఇక నువ్వు పోయి ఆడుకోనాయనా! నాకు శరీర బాధ ఎక్కువగావుంది; నీరసంగావుంది; కాస్సేపు విశ్రాంతి తీసుకుంటాను. నీమేనమామ హెర్ట్‌ఫర్డ్ ప్రభువుతోపోయి, నీ యీడు వాళ్ళతో ఆడుకో నేను కాస్త కుదటపడ్డ తర్వాత వద్దువుగాని."

ఈ ఆఖరి మాట విన్నాక టామ్ కిప్పటివాకా వున్న కొంచెం ఆశా అంతరించింది. తన్నిక వదిలేస్తారు, హాయిగా ఆఫల్ కోర్టుకు పోవచ్చను కున్నాడు. కాని 'మళ్ళీ వద్దువుగాని' అంటున్నాడురాజు. బరువెక్కిన గుండెతో టామ్ అవతలికి నడిచాడు. మళ్ళీ ఆ పొడుగాటి నడవాల్లో ప్రభువుల, సేవకుల బారుల మధ్యగా పోవల్సి వచ్చింది. "యువరాజుగారు— అబ్బాయిగరు— వస్తున్నారు..." అని గుసగుసలు వినిపించాయి తిరిగి.

సంతోషమనేది ఏ కోశానా లేదు ఈ బిచ్చ గాళ్ల కుర్రాడికి. జరిగిన అనుభవం అతన్ని కుంగదీ సేసింది. ఈ మహారాజ భవనంలో, వైభవాలలో, విలాసాలలో, గౌరవాలలో, ఈ బంగారు పంజరంలో తనని ఓ దౌర్భాగ్యపు చిలకని చేసి పారేసి ఖైదు చేశారని తెలుసుకున్నాడు. అతని మాట కనుక్కునే వారు, వినేవారు, జాలిపడేవారు లేరు. దేవుడు దయతలిస్తే తప్ప ఈ పంజరంనుంచి అతన్నెవరూ రక్షించలేరు.

అయిదారు వారాలకిందట చూసిన నార్ఫోక్ ప్రభువుముఖం ఇంకా టామ్‌కి జ్ఞాపకముంది. ఇప్పు డెక్కడ చూసినా ఆ ముఖమే, ఆకళ్లే తన్ని నిందిస్తూ కనిపిస్తున్నాయి. ఎటు చూసినా ఆ ప్రభువు తలకాయ మొండెంనుంచి వేరైనట్టు కనపడి భయపెడుతోంది.

పూర్వం అతను కన్న కలలు ఎంత అందంగా, హాయిగా ఉండేవి! ఇప్పుడు జరుగుతున్న ఈ నిజమైన అనుభవం ఎంత దరిద్రంగా, దారుణంగా వుంది!

## 6

కోటలో యువరాజుకు చెందిన గదుల్లో ఒక విశాలమైన గదికి టామ్‌ని తీసుకుపోయారు. అక్కడ అతడు ఒక సుఖమైన ఆసనంమీద కూర్చోపెట్ట బడ్డాడు. ఇది అతనికి ఇష్టంలేదు. ఎందుకంటే వయస్సు లోనే కాకుండా, అధికారంలో కూడా తనకంటే

గొప్పవాళ్లైన ప్రభువులు అంతమంది నుంచుని వుండగా తను కూర్చోవడం ఏమి బాగుంటుంది, వాళ్లనికూడా కూర్చోమని ప్రార్థించాడు. వాళ్లు 'చిత్తం. చిత్తం, ఫరవాలేదండి' అంటారేగాని కూర్చోరే! కూర్చోమని టామ్ ఇంకా బలవంతంచేసే వాడేగాని, కాని అతని "మేనమామ" హెర్ట్‌ఫర్డ్ ప్రభువు చెవులో వూదాడు:

"ప్రభూ! వాళ్లని బలవంతపెట్టకండి. తమ సన్నిధిలో వాళ్లు కూర్చోడం భావ్యంకాదు."

సెంట్‌జాన్ ప్రభువు వచ్చాడు. టామ్‌కు మోకరించి లేచి ఇలా అన్నాడు:

"మహారాజు నన్ను పంపించారు. తమతో రహస్యంగా ఒక విషయం మనవిచెయ్యాలి. దయచేసి హెర్ట్‌ఫర్డ్ ప్రభువును తప్ప అందరినీ పంపించి వేస్తారా?"

టామ్‌కు ఏంచెయ్యాలో తోచలేదు. తను పొమ్మంటేమాత్రం అంత గొప్పగొప్పవాళ్లు వెడతారో లేదో నని అనుమానం వేసింది. ఇంతలో హెర్ట్‌ఫర్డ్ ప్రభువు వంగి చెవిలో మళ్ళీ చెప్పాడు: చేతితో సైగ చేసినంత మాత్రాన అందరూ వెళ్లిపోతారనీ, నోరు తెరవనుకూడా అక్కర్లేదనీ చెప్పాడు. పెద్ద మనుషులంతా నమస్కారాలు చేసి వెళ్లిపోగానే, సెంట్‌జాన్ ప్రభువు ఇలా ప్రకటన చేశాడు:

"శ్రీ శ్రీ శ్రీ మహారాజులుంగారిలా ఆజ్ఞాపిస్తున్నారు: రాజ్యక్షేమానికి అవసరమైన కారణాల వల్ల, యువరాజుగారు తమ అనారోగ్యాన్ని సాధ్యమైనంతవరకూ దాచవలసిందని; తాము యువరాజు కాదనిగాని, సింహాసనానికి వారసుడు కాదనిగాని ఎవరితోనూ అనవద్దని; యువరాజహోదాకు భంగం రాకుండా ఉంటూ, ఆనవాయితీగా వస్తున్న గౌరవ మర్యాదలను ఇతరులు చూపించే టప్పుడు తిరగ గొట్టవద్దని; మనోవ్యాధిమూలంగా, తను పేదవాడినని భావిస్తున్నప్పటికీ ఆమాట ఎవ్వరితోనూ అనొద్దనీ; ఇదివరకు రోజూ చూస్తూవుండీ కూడా ఇప్పుడు మరచిపోయిన మనుషుల్ని జాగ్రత్తగా జ్ఞాపకం చేసుకోవలిసిందనీ; జ్ఞాపకం రాకపోయినప్పటికీ వచ్చినట్టే నటించాలిగాని దొరికిపోగూడదనీ; బహిరంగ సభల్లోనూ అక్కడా, ఏం చెయ్యాలో, ఏమనాలో తోచని సందర్భంలో కంగారుపడకుండా హెర్ట్ఫర్డ్ ప్రభువును గాని, నన్నుగాని సంప్రదించాలనీ; ఈ ఆజ్ఞ రద్దయ్యేవరకూ హెర్ట్ఫర్డ్ ప్రభువూ, నేనూ తమకు సలహాదార్లుగా ఎప్పుడూ దగ్గర్లోనే వుంటూ వుండాలనీ —— ఈవిధంగా మహారాజు ఆజ్ఞచేశారు. మీకు భగవంతుడు త్వరగా ఆరోగ్యం ప్రసాదిస్తాడని కోరుతున్నారు."

ప్రకటన కాగానే సెంట్ జాన్ ప్రభువు మళ్ళీ మోకరించి ఓపక్క కెళ్లి నిలబడ్డాడు. టామ్ గుండె రాయిచేసుకుని అన్నాడు:

"ఇది మహారాజు ఆజ్ఞ. దాని నెవ్వరు జవ దాటరాదు. శాయశక్తులా నేను దాన్ని నెరవేరుస్తాను."

హెర్ట్‌ఫర్డ్ ప్రభు వన్నాడు:

"మహారాజు వాంఛ ప్రకారం తమరు పుస్త కాల్లాంటి తలనొప్పి పదార్థాలు వదిలిపెట్టి, ఆటపాటల్లో గడపటం మంచిదని నామనవి. లేకపోతే ఆనక తమరు విందులో అవస్థపడవచ్చు."

టామ్ తెల్లమొహం వేశాడు; ఆ విందేమిటో అతనికి అంతుపట్టలేదు; సెంట్ జాన్ ప్రభువు విచా రంగా తనవంకే చూస్తూండటం గమనించి, టామ్ సిగ్గుపడ్డాడు. సెంట్ జాన్ అన్నాడు.

"తమ జ్ఞాపకశక్తి ఇంకా ద్రోహంచేస్తూనే వుంది. కాని మీారు చింతించకండి, అదే పోతుంది. నగ రంలో జరిగే ఒక విందుకు తమరు హాజరవుతారని రెండునెలల క్రింద మహారాజు వాగ్దాన మిచ్చివున్నారు. ఆ విందు విషయమే హెర్ట్‌ఫర్డ్ ప్రభు విప్పుడు విన్న వించారు. తమ కిప్పుడు గుర్తువచ్చిందా?"

"జ్ఞాపకం రాలేదని చెప్పటానికి విచారిస్తు న్నాను," అని సందేహిస్తూ చెప్పి మళ్లీ సిగ్గుపడ్డాడు.

ఇంతలో సేవకుడొకడు వచ్చి ఎలిజబెత్, జేన్ గ్రే వస్తున్నారని ప్రకటించాడు. ప్రభువులిద్దరూ తొందర తొందరగా చూపుల్తో ఏదో మాటాడుకున్నారు. హెర్ట్ ఫర్డు ద్వారం కేసి వెళ్లి బాలిక లిద్దర్నీ ఎదుర్కొని రహస్యంగా చెప్పాడు:

"యువరాజుకు వంట్లో సరిగా లేదు. ఆయన ఏదైనా మరిచిపోయినప్పుడు తమరు దాన్ని గమనించనట్లు నటించాలి, ఆశ్చర్యపడినట్టు కనపడద్దు."

అదే సమయంలో సెంట్ జాన్ ప్రభువు టామ్ చెవిలో చెబుతున్నాడు:

"మహారాజు ఆజ్ఞను మరిచిపోకండి. మీకు చేతైనంతవరకు జ్ఞాపకం చేసుకోండి; మిగతా విషయాలు జ్ఞాపకమున్నట్టే నటించండి. మీరు మనో వ్యాధితో బాధపడుతున్నట్టు వాళ్లు గ్రహించగూడదు; మీకు తెలుసుగదా, ఆ బాలికలు మిమల్ని ఎంత ప్రేమిస్తున్నారో. మీలో మార్పుచూసి వాళ్లు దుఃఖిస్తారు. కనుక జాగ్రత్తగా మసులుకోండి. నన్నూ, మీ మేనమామగార్నీ ఇక్కడే ఉండమంటారా ?"

టామ్ తలవూపాడు. పాపం, ఎలాగైనా రాజాజ్ఞ ప్రకారం మసులుకోడానికి శాయశక్తులా ప్రయత్నించాలని అనుకున్నాడు.

ఉభయపక్షాలు ఎంత జాగ్రత్తగా వున్నా, సంభాషణ అప్పు డప్పుడు కాస్త ఇబ్బందిగానే తయా

రైంది. ముఖ్యంగా టామ్‌కి నరాలు బిగిసి 'నే నింత గొప్ప పాత్రని నటించడానికి తగను,' అని ఒప్పేసు కోవాలనిపించింది చాలా సార్లు. కాని యువరాణి ఎలిజబెత్ తెలివి తేటలవల్లా, పక్కనున్న ఇద్దరు ప్రభువుల చాకచక్యంవల్లా అంతా సద్దుకుపోయింది. జేన్‌గ్రే పాపం తెలివితక్కువగా ఒక ప్రశ్న వేసి టామ్‌ని కంగారుపెట్టింది:

"యువరాజు మహారాణిని ఇవాళ దర్శించారని తలుస్తాను."

టామ్ సందేహించాడు; బిక్క మొహం పెట్టాడు. నోటి కొచ్చిం దేదో అనేసేవాడే, గాని సెంటుజాన్ప్రభు విద గ్రహించాడు. మంచి సమయ స్ఫూర్తి గలవాడవటంచేత టామ్‌బదులు అతనే సమాధానం చెప్పాడు.

"అవునమ్మా! యువరాజు మహారాణిదర్శనం చేసుకున్నారు. ఆమె ఆయనకు ధైర్యం చెప్పారు కూడా, తండ్రిగారి కేం ఫరవాలేదని. అవునా ప్రభూ."

అవునన్నట్టు టామ్ ఏదో గొణిగాడు. కాని ప్రమాదకరమైన చోట కాలు పెడుతున్నట్టు అనిపించింది. తరవాత ఏదో మాటలమీద యువరాజు ఇక చదువు ఆపేస్తాడన్నమాట వచ్చింది. జేన్‌గ్రే చాలా విచారం చూపిస్తూ

"అయ్యో పాపం! చదువు మానేస్తారా? కాని అట్టే రోజులు కాదనుకొంటా. మీ తండ్రిగారిలాగానే మీరుకూడా అనేక భాషలు నేర్చుకుని గొప్ప విద్వాంసు లౌతారు."

"నా తండ్రా?" అని అరిచాడు టామ్, తను యువరాజ హోదాలోవున్నట్టు మరిచిపోయి.

"నా తండ్రికి తన భాష మాట్లాడటమే చేత గాదు. అతనికంటే వీధుల్లో పొర్లాడే పందులు బాగా మాట్లాడ—"

టామ్ తల ఎత్తేటప్పటికి సెంటుజాన్ ప్రభువు కళ్లలో తీవ్రమైన హెచ్చరిక కనబడింది.

టామ్ మాట సగంలో ఆపేసి, సిగ్గుపడ్డాడు. "నా జబ్బు నన్ను చాలాఅవస్థలు పెడుతోంది. మహా రాజును అగౌరవపరచాలని నా వుద్దేశం కాదు," అని దీనంగా అన్నాడు.

ఎలిజబెత్ తన "సోదరుని" చేతులు తన చేతుల్లోకి మృదువుగా తీసుకుని, "మే మెరుగుదుము యువరాజా! తమ ఆరోగ్యం బాగు లేక ఆ మాట లన్నారే కాని మరేంకాదు. అది మీ తప్పుకాదు, మీ మనస్సుది," అన్నది.

"మీ దయకి కృతజ్ఞుణ్ణి," అని మాత్రం అని వూరుకున్నాడు టామ్.

మరొకసారి జేన్‌గ్రే ఊరుకున్నది పూరుకోక గ్రీక్ మాట నొకదాన్ని టామ్‌మీద రివాల్వర్‌లా పేల్చింది. టామ్ ముఖాన్ని చూడగానే అతని కా మాట ఏమీ అంతుబట్టనట్టు తెలిసిపోతోంది. యువ రాణి ఎలిజబెత్ ఇది గ్రహించి టామ్ తరఫున తనే జేన్‌గ్రేకు గ్రీకుమాటలవర్షంతో సమాధాన మిచ్చింది; వెంటనే సంభాషణని మరో విషయంమీదికి మరల్చింది-

మొత్తానికి కాలం సరదాగానే గడిచింది. సంభాషణలో ఇప్పు డాట్టే చిక్కులు రావటంలేదు. అందరూ తన్ని ప్రేమిస్తున్నారనీ, సరిగా ప్రవర్తించేం దుకు సహాయపడుతున్నారనీ, తన తప్పుల్ని చూసీ చూడనట్టు ఊరుకుంటున్నారనీ టామ్ గ్రహించాడు; దాంతో మొదట్లో ఉన్న బెరుకు తగ్గిపోయింది. సాయంత్రం లండన్ మేయరుగారు చెయ్యబోతున్న విందుకు ఈ ఇద్దరు బాలికలుకూడా వస్తారని తెలిసింది. "అమ్మయ్య, వీళ్లొస్తే మన కేం ఫర్వాలేదు. అంత మంది కొత్తవాళ్లమధ్య ఒంటరిగాణ్ణయిపోను," అని సంతోషించాడు టామ్. ఒక గంటకిందనైతే, ఎలిజ బెత్, జేన్‌గ్రేలు తనతో వస్తారని తెలిస్తే చాలా భయ పడేవాడే; కాని ఇప్పుడు వాళ్లమీద మంచి అభి ప్రాయం ఏర్పడింది.

టామ్‌ను కంటికి రెప్పలా కాపాడుకొస్తున్న ఇద్దరు ప్రభువులకి ఈ సంభాషణధోరణి ఏమీ సర

దాగా లేదు. తుపాను పట్టి భీకరంగా ఉన్న సము ద్రంలో పడవని కాపాడినట్టు కాపాడాల్సివచ్చింది టామ్‌ని. ఈ బాధ్యత చాలా బరువుగానే వుంది వాళ్లకి. అందుచేత బాలికలు ఇంకా కదలరేం అన్నట్టు చాలాసేపు ఎదురు చూశారు. ఇవ్వాళ్టి కిది చాల దన్నట్టు గ్వేల్‌ఫర్డు డడ్లీ ప్రభువు రాగోరుతున్నాడని ఓ సేవకుడు కబురు తెచ్చాడు. తమ పడవని ఇంకో తుపానులోకి ప్రవేశపెట్టడం ఏమీ క్షేమంగా తోచ లేదు వాళ్లకి. అందుచేత డడ్లీప్రభువు నిప్పుడు రావద్దని చెప్పమని టామ్‌కు సలహా యిచ్చారు చెవిలో. టామ్ అలాగే చేశాడు.

జేన్‌గ్రే, ఎలిజబెత్ గదిలోంచి ఇంకా కద ల్లేదు. మౌనంగా కూర్చుని దిక్కులుచూస్తూ తికమక పడుతున్నారు. టామ్ కేమీ అర్థంకాలేదు ఈ మౌనానికి కారణం. హెర్ట్‌ఫర్డుప్రభువు కేసి చూశాడు. ఆయ నేదో కంటితో సైగచేశాడు. కాని అదేమిటో తెలియలేదు టామ్‌కి. కాని ఎలిజబెత్ చురుకైనదికనుక ఇదంతా చిటికెలో గ్రహించేసింది.

"ఇక నా సోదరుడు సెలవిస్తే వెళ్లిపోతాం మేము," అని గౌరవం ఉట్టిపడేట్టు అన్నది.

"మీకు సెలవిచ్చేందుకు నే నెంతవాణ్ణి? మీరు ఏదైనాసరే కోరడం తరవాయి, నెరవేర్చేం దుకు నే నెప్పుడూ సిద్ధంగా ఉంటాను. అయినా మీరు

వెళ్లా లనుకుంటున్నారు గనుక వెళ్లండి," అని టామ్ అంతకంటే మర్యాద ఉట్టిపడేట్టు పలికాడు. తరవాత మనసులో ఇలా గనుకున్నాడు: "నేను రాజుల కథలు వృథాగా చదవలే దన్నమాట. నాకు తెలియకుండానే రాజ మర్యాదలు, మాటలధోరణి అలవాటై పోయాయి. అదంతా ఇప్పుడు అక్కరకు వస్తోంది."

బాలిక లిద్దరూ నిష్క్రమించాక టామ్ తన రక్షకు లిద్దరి కేసి తిరిగాడు. వాళ్లు కూడా అలిసిపోయి నట్టు వాళ్ల మొహాలే చెబుతున్నాయి.

"నేను బాగా అలిసిపోయాను. ఏదన్నా మూలకి పోయి కాస్సేపు పడుకోటానికి మీరు అనుజ్ఞ ఇస్తారా?" అని అడిగాడు. హెర్ట్ఫర్డు ప్రభు వన్నాడు:

"అనుజ్ఞ ఇవ్వవలసింది మీరు, ఆచరించవలసింది మేము. తమరు విశ్రాంతి కోరేటట్లయితే, వెంటనే ఏర్పాట్లు చేస్తాము. ఆనక విందుకు వెళ్లాలి కూడాను. విశ్రాంతి తీసుకోవటం మంచిది."

హెర్ట్ఫర్డు ఒక గంట మోగించాడు; ఒక నౌకరు వచ్చి నిలబడ్డాడు; సర్ విలియం హెర్బర్టును రమ్మనవలసిందిగా చెప్పాడు. ఆ పెద్దమనిషి రెండు నిమిషాల్లో చక్కా వచ్చి టామ్‌ను ఒక అంతఃపురం లోకి తోడ్కొనిపోయాడు. అక్కడ టామ్ మొదట చెయ్యబోయిన పని ఏమిటంటే, కప్పుతో మంచినీళ్లు తీసుకుని తాగబోయాడు; కాని అత నందుకు కదిలే



యువరాజు మేనమామ
హెర్ట్‌ఫర్డ్ ప్రభువు

కదలగానే ఒక సిల్కు సేవకుడు అడ్డంవచ్చి మోకరించి, ఒక బంగారు పళ్లెంలో కప్పుఉంచి అందించాడు.

తరవాత 'మన ఖైదీ చతికిలబడి కాలిజోడు విప్పుకోబోయాడు. కాని మరో సిల్కు సేవకుడు అడ్డంపడి అతిభక్తి చూపిస్తూ, మృదువుగా కాలిజోడు విప్పేశాడు. ఇదేవిధంగా ఇంకా రెండు మూడు పనులు తనంతట తాను చేసుకోబోయాడు కాని ప్రతిసారీ ఆ పనికి చెందిన సిల్కు సేవకుడు అడ్డం రావటం, ఆ పని చేయటం జరిగింది. ఈ తతంగమంతా చూసి టామ్‌కు బలే విచిత్రమయింది. "వీళ్ల తరహా చూడగా నా బదులు వీళ్లే ఊపిరి పీల్చి పెట్టేటట్టున్నారు." అనుకున్నాడు.

అతని దుస్తులు మార్చబడ్డాయి; వెచ్చని కొత్త దుస్తులు తొడగబడ్డాయి; జాగ్రత్తగా మంచంమీ

పడుకోపెట్టబడ్డాడు. పడుకున్నాడేగాని నిద్రపట్టటం లేదు. ఎందుకంటే అతని బుర్రనిండా అనేక ఆలోచనలు లుకలుక లాడుతుండటమే కాకుండా, గది నిండా అతని పనులు చేసిపెట్టిన సేవకులు బిలబిలలాడుతున్నారు. వాళ్లని పొమ్మని ఎలా చెప్పాలో తెలియక టామ్ వూరుకున్నాడు; ఆయన పొమ్మని ఆజ్ఞాపించకుండా ఎలా పోవాలో తెలియక వాళ్లూరుకున్నారు. మొత్తానికి ఇద్దరికీ ఇబ్బందిగానే వుంది.

టామ్ అంతఃపురానికి వెళ్లగానే అక్కడ అతని రక్షకులైన సెంటుజాన్, హెర్ట్ఫర్డు ప్రభువులు ఒంటరిగా మిగిలిపోయారు. కాస్సేపు మౌనంగా ఆలోచించారు. నిస్పృహగా "ప్చ్. ప్చ్." అంటూ, తలలు వూగిస్తూ పచార్లు చేశారు. చివరికి ఉండబట్టలేక సెంటుజాన్ అడిగాడు.

"మీరేమనుకుంటున్నారు?"

"ఏముందీ. మహారాజు అవసానదశలో ఉన్నారు. నామేనల్లుడు పిచ్చివాడై ఉన్నాడు. పిచ్చితోనే సింహాసన మెక్కుతాడు. పిచ్చితోనే రాజ్యం చేస్తాడు. ఇంగ్లండును భగవంతుడే రక్షించాలి ఇక."

"అవును అలాగే మరి. కాని మీకు అనుమానాలు రావటం లేదా? యువరాజు..." అని సెంటుజాన్ సంకోచిస్తూ మధ్యలోనే మాట ఆపేశాడు. అనదలచిన మాట అనేస్తే ఏం కొంప మునుగుతుందో అని

జంకాడు. హెర్ట్ ఫర్డ్ ప్రభువు అతని ఎదట నిలిచి అడిగాడు:

"చెప్పండి. ఇక్కడ నేనుతప్ప ఎవరూ లేరు."

"నా మనస్సుని ఒక అనుమానం పీడిస్తున్నది. కాని మీరు యువరాజుకు రక్తబంధువులు, మీ రేమన్నా అనుకుంటా రేమో నని భయపడుతున్నాను. మీరు క్షమిస్తే చెబుతాను. ఎంత పిచ్చివాడైపోయినా యువరాజు అంత ఇదిగా ఎలా మారిపోయారా అని ఆశ్చర్యం కలుగుతున్నది. రాజలక్షణాలు పూర్తిగా పోయాయని కాదు; కాని ఇదివరకు ఆయన ప్రవర్తనకీ ఇప్పటి ప్రవర్తనకీ చాలా తేడా లొస్తున్నాయి. తన తండ్రి గుణగణాలనే మరచిపోయేటంతగా ఎవరికైనా పిచ్చెక్కుతుందా? తనకు ఎవరు సేవకులో, ఎవరు సమానులో గుర్తు రానంతగా పిచ్చెక్కుతుందా? ఎంత పిచ్చెక్కినా లాటిన్ జ్ఞాపకం వుంచుకొని, గ్రీక్ మర్చిపోతారా. మీరు కోపం తెచ్చుకోకండి; నా సందేహాలు తీర్చండి; తను యువరాజు కాదని ఆయన అన్న మాటలు చెవుల్లో రింగు మంటున్నాయి—"

"ఇక ఆపండి. మీరు రాజద్రోహకరంగా మాట్లాడుతున్నారు. మహారాజు ఆజ్ఞ మరచి పోయారా? మీ మాటలు నేను వినగూడదు; నాకూడా రాజద్రోహ నేరం చుట్టుకుంటుంది."

సెంట్ జాన్ భయంతో పాలిపోయాడు; తొందరగా తన తప్పు కప్పుకోవాలని ఇలా అన్నాడు:

"క్షమించండి ప్రభూ! నేను తప్పు ఒప్పుకుంటున్నాను. ఈసంగతి ఎవరికీ చెప్పనని వాగ్దానం చెయ్యండి. నే నిక ఆ మాట మళ్ళీ ఎత్తను. మీరు నన్ను కాపాడాలి; లేకపోతే చచ్చిపోతాను."

"సరే, మీ కోరికను మన్నిస్తాను. మళ్ళీ అలాంటి మాట ఇక్కడగాని, ఎక్కడగాని ఎత్తకండి. యువరాజువిషయంలో మీ కెలాంటి అనుమానాలూ అనవసరం. అతడు నాచెల్లెలి పుత్రుడు. అతడు ఉయ్యాలలో ఊగేరోజుల్నించి చూస్తున్నవాడిని నాకు, అతని ముఖం, గొంతుక, ఆకృతి ఆమాత్రం జ్ఞాపకం వుండవా? ఉన్మాదంవల్ల మనిషిలో ఎంతెంతలైనా విచిత్రమైన మార్పులు వస్తాయి. మార్లీప్రభువుకు పిచ్చెత్తినవిషయం మీకు తెలుసుగా. ఆయ నేం చేశాడు! ఆరవైఏళ్లనుంచీ చూస్తున్న తన ముఖం తనది కాదు, ఇంకెవరిదో ననేవాడు; పైగా తన తల కాయ గాజుతో చేసిందనేవాడు; ముట్టుకుంటే కింద పడి పగిలిపోతుందని ఎవర్నీ ముట్టుకోనిచ్చేవాడు కాదు. ప్రభూ! మీ అనుమానాలు తీసెయ్యండి. అతడే యువరాజు. త్వరలో మీకు రా జవుతాడు."

ఈ విధంగా మరికొంతసేపు సంభాషణ జరిగింది. సెంట్ జాన్ ప్రభువు తన నేరాన్ని కప్పుకోటానికి, కుర్రవాడు పాఠం వల్లించినట్టు, "అతడే యువరాజు, అతడే యువరాజు," అని చాలాసార్లు చిలక

పలుకులు పలికాడు. తన కిప్పుడు అనుమానం ఏ కోశానా, లవలేశ మైనా లేదన్నాడు; అతడు యువ రాజు కాదని సాక్షాత్తు దేవుడు వచ్చి చెప్పినా తను నమ్మనన్నాడు.

సెంట్ జాన్ ప్రభువు సెలవు పుచ్చుకుని వెళ్లి పోయాడు. హెర్ట్ ఫర్డు ప్రభువు మిగిలాడు. ఒక కుర్చీలో కూర్చుని గాఢంగా ఏదో ఆలోచించాడు. ఆలోచించినకొద్దీ ఆతని బుర్రలో రకరకాల భావాలు అంతర్యుద్ధం చెయ్యటం ప్రారంభించాయి. ఏమీ తోచక అటూ యిటూ పెద్దపెద్ద అంగలేస్తూ, పచార్లు చేస్తూ ఇలా గొణగసాగాడు:

"టష్. అతడు యువరాజు కాకపోతే ఇం కెవడు? ఒక పేగుకు చెందకుండా, ఒక తల్లికి, తండ్రికి పుట్టకుండా అంత అద్భుతంగా పోలికలు సరిపోయే పిల్ల లిద్దరుండటం అసంభవంకాదా? ఒకవేళ ఉంటా రనుకో. ఒకళ్ల స్థానంలోకి మరొకళ్లు, రావటం ఎలా జరుగుతుంది? ఆఁ ఇదంతా వట్టిది, వట్టిది.

ఒకవేళ అతడు నిజంగా యువరాజు కాదనుకో. ఎవడో దొంగే అనుకో. అయితే తను యువరాజు నే నని చెప్పి మోసగిస్తాడు గాని, కాదని ఎందు కంటాడు? ఏమిటో అంతా గొడవగా వుంది. ఏమైనా ఇతడే యువరాజు; పిచ్చెక్కింది అంతే."

# 7

మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. టామ్ చాలా అవస్థపడుతూ బట్టలు తొడిగించుకున్నాడు. ఇదివరకటివాటికంటె ఈ బట్టలు మరీ ముద్దొస్తున్నాయి. ఈ బట్టల కార్యక్రమం ముగిశాక టామ్‌ని ఒక విశాలమైన హాలులోకి తీసుకుపోయారు. అది మాంచి డాబుగా అలంకరించబడి వుంది. అక్కడ యువరాజుకోసం భోజనపు ఏర్పాట్లన్నీ సిద్ధంగా జరిగి వున్నాయి. ఒక బల్లమీద రకరకాల తినుబండారాలమర్చబడి వున్నాయి. పాత్రసామానులన్నీ బంగారంతో చేయబడినవే. వాటిమీద అందమైన డిజైన్లు చెక్కబడి వున్నాయి. హాలులో చాలమంది సేవక ప్రభువులు చేతులు కట్టుకు నుంచున్నారు.

చర్చి అధికారి ఒకడు మామూలుగా భోజనానికి పూర్వం చేసే ప్రార్థన చేశాడు. వెంటనే టామ్ భోజనపళ్లెంమీద దాడిచేశాడు. అతనికి ఓ పెద్ద అలవాటు ఏమిటంటే ఎదురుగా తినదగిన దేదన్నా కనిపిస్తే వెనకా ముందూ ఆలోచించడు. ఎప్పుడూ ఆకలితో వుండే ప్రాణి అయ్యె; ఏం చేస్తాడు మరి ?

అతడు పళ్లెంమీద తొందరపడి చేసిన దురాక్రమణను బర్కిలే ప్రభువు వారించి టామ్ మెడచుట్టూ మఖమల్ రుమాలు వెడల్పుగా చుట్టాడు. (బట్టలు అంటుకాకుండా ఇంగ్లీషు వాళ్లలాగే చుట్టు

కుంటారు) వేల్సు యువరాజులకు అలా రుమాలుచుట్టే ఉద్యోగం బర్కిలే ప్రభువులకు వంశపారంపర్యా వస్తోంది.

టామ్ ద్రాక్షరసం తనంతట తాను వంచుకు తాగాలని చాలాసార్లు ప్రయత్నించాడు. కాని యము లాడిలా ఓ సిల్కు నౌకరు మాట మాట్లాడితే అడ్డపడే వాడు.

వేల్సు యువరాజుకు సంబంధించిన 'ఆస్వాదక ప్రభువు' కూడా అక్కడే వున్నాడు. యువరాజు భోజనం చేసే ముందు ఈ ప్రభువు అన్నీ రుచిచూడాలి. పూర్వకాలంలో రాజులు తమ విరోధు లెవరైనా భోజనపదార్థాల్లో విషంకలు పుతా రేమో న నే భయంతో ముందు రుచి చూసేందుకని కొందరిని నియమించేవారు. ఆ రుచి చూసినవాడికి అపాయం జరక్క పోతే అది మంచి ఆహార మేనన్న మాట. అంటే వాడి ఉద్యోగం చాలా ప్రమాదంతో కూడుకున్న దే నన్న మాట. కాని మన కథాకాలం నాటికి ఈ ఉద్యోగ మంత సుఖమైన దింకోటిలేదు. ఎప్పుడో కాని రుచి చూడవలసిన అగత్యం ఉండేదికాదు. ఈ ఉద్యోగా నికి మనిషినే ఎందుకు నియమించేవారో, కుక్కనో పిల్లినో ఎందుకు వుంచేవారు కాదో మనకి తెలియదు. అయితే రాజులు చేసే చాలా పనులకి అర్థం కనిపించ దనుకోండి.

వీళ్లుగాక అంతఃపుర ముఖ్యసేవకుడు ఆర్సీ ప్రభువుకూడా అక్కడ నుంచున్నాడు. ఎందుకు నుంచున్నాడో దేవుడికి తెలియాలి. ప్రధాన బట్లర్ ప్రభువు, మహాసేవక ప్రభువు, ప్రధానవంట ప్రభువు కూడా చేతులు కట్టుకుని టామ్ కుర్చీ వెనకాల విన యంగా నుంచున్నారు. వీళ్లుగాక టామ్‌కి ప్రత్యేకంగా 384 గురు సేవకులున్నారు. వాళ్లంతా ఆ హాల్లో లేరు; అసలు అంతమంది ఉన్నట్టుకూడా టామ్‌కి తెలియదు.

ఇక్కడున్న అందరికీ, యువరాజు మతిచెడిందనీ అతని పిచ్చిచేష్టలకి ఆశ్చర్యం చూపించొద్దనీ ముందే హెచ్చరిక ఇవ్వబడింది.

ఆ పిచ్చిచేష్టలు చూసి వాళ్లు కళ్ల నీళ్లు పెట్టు కున్నారేగాని నవ్వలేదు. తమకెంతో ఇష్టుడైన యువ రాజు ఇలా అయిపోవటం చూసి వాళ్లెంతో విచా రించారు.

టామ్ చాలా ఆసక్తితో తన మెడ రుమాలని పరీక్షించాడు. ఎంత ముద్దొస్తోందో అది! అది పాడై పోతుందేమో, తీసెయ్యమన్నాడు; బర్కిలే ప్రభువు మారుమాట్లాడకుండా రుమాలవిప్పేశాడు. ఇక తినటం ప్రారంభించాడు. అతను జన్మలో ఎప్పుడూ రొట్టె వగైరా తినేందుకు చాకులు, ఫోర్కులు ఉపయోగించ లేదు. అందుచేత బంగారుచాకు, ఫోర్కు చేతులో పట్టుకున్నా ఎక్కువ భాగం వేళ్లతోనే కానిచ్చాడు. ఇది చూసీచూడ నట్టు వూరుకున్నారు అంతా.

టామ్ ప్రతి ఆధరువునీ జాగ్రత్తగా పరీక్షిం చాడు. వాటి నెప్పుడూ అతను ముట్టుకు నెరగడు. అంచేత "ఇది తినచ్చా, అది తినచ్చా" అని ప్రతిసారీ అడిగాడు. అతని ప్రశ్నలకు చాలా వినయంతో జవాబిచ్చి ఊరుకున్నారు ప్రభువులు.

భోజనం ఎలాగైతేనేం పూర్తయింది. టామ్ పళ్లెంలో సీమబాదం కాయలుంటే గుప్పిళ్ళనిండా తీసుకుని జేబులు నింపుకున్నాడు. అంతా చూసీ చూడనట్టూరుకున్నారు. కాని మరు నిముసంలో అతని కనుమానం వేసింది, తనేదో తప్పు చేసినట్టు. తన్నింత వరకూ తనచేతుల్తో ఏపనీ చేయనివ్వలేదు వాళ్లు. మరి బాదంకాయలు జేబులో పోసుకుంటే ఏమీ అనలేదేం వాళ్లు? కనక ఇందులో ఏదో చెయ్యకూడనిది, 'అరాజకమైనది' వుండి ఉండాలి. పెద్ద సమస్యే వచ్చిపడింది.

కాని ఇంకో క్షణంలో అంతకంటే పెద్దసమస్య వచ్చింది. టామ్ ముక్కు చివర దురద ప్రారంభమైంది. దాని దుంప తెగ, ఆ అవయవం ఊరికే గింజుకోవటం మొదలెట్టింది. ఏంచెయ్యాలో తెలియలేదు. తనంతట తను గోక్కోవచ్చా, గోక్కోకూడదా? బాధ ఎక్కువైపోతోంది. దీనంగా అందరివంకా చూశాడు. కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. సేవక ప్రభువులు గబగబా ముందుకొచ్చారు, ఏమి టేమిటని వినయంగా అడుగుతూ. ఏడుపు దిగమింగుతూ టామ్ చెప్పాడు:

"నాముక్కు చాలా క్రూరంగా దురదపెడు తోంది. ఇటువంటి అసాధారణ పరిస్థితిలో సాంప్ర దాయికంగా ఏంచెయ్యాలి? త్వరగా చెప్పండి. భరించ లేకుండావున్నాను."

ఎవరూ కుయ్ కయ్ మనలేదు. తెల్లబోయి ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూస్తూ నుంచుండి పోయారు. ఈ ఘోర, దారుణ, బీభత్స పరిస్థితినెలా ఎదుర్కో వాలో తోచలేదు. ఓ పెద్దగోడలా ఈసమస్య అడ్డప డింది. ఈగోడని దూకేందుకు మార్గం పూర్వపు ఇంగ్లీషు చరిత్రనంతా వెతికినా కనిపించలేదు. ఈ సమస్య మానవ మాత్రుడెవరూ తొక్కి ఎరగని ఎడారిలాంటిది; అందులో అడుగువేస్తే ఏంప్రమాదం వాటిల్లుతుందో! కటకటా! ఇంగ్లీషు రాజవంశానికి ముక్కుగోకే ప్రభువు లేకపోయాడు గదా!

ఈలోగా కన్నీళ్లు ముత్యాలలాగా జొటజొట టామ్ చెక్కిళ్లపై కారటం ప్రారంభించాయి. చివరికి శరీరబాధ ముందు రాజమర్యాదల, ఆచారాల గోడ తునాతునకలై కూలి పడిపోయింది. టామ్ రెండు చేతులా ముక్కుతీవ్రంగా గోకి గోకి, దాన్ని నానా హింస పెట్టి అది పెట్టే బాధ తీర్చుకున్నాడు. దాంతో అతని బాధేకాదు, చుట్టూ ఆందోళన పడుతున్న ప్రభువుల బాధకూడా తీరిపోయింది.

భోజనం కాగానే మూతి, చేతులు కడుక్కునేం దుకు, ఒక ప్రభువు బంగారుపళ్లెంలో పన్నీరు తీసు

కొచ్చి ఇచ్చాడు. తుడుచుకునే రుమాల పట్టు కుని బర్కిలే ప్రభువు ఆ పక్కనే నుంచున్నాడు. బంగరు పళ్లెం కేసి టామ్ చాలాసేపు మెచ్చుకుంటూ చూశాడు. ఆ నీళ్లతో ఏం చెయ్యాలో తోచలేదు. చివరికి పళ్లెం ఎత్తి గడగడ రెండు మూడు గుక్కలు తాగేశాడు. అది పన్నీరని, చేతులు కడుక్కునేందుకని అతని కేం తెలుసు?

"నీళ్లేం బాగులేవు ప్రభూ! వాసన బాావుందిగాని, రుచి అదోమాదిరిగా వుంది," అని పళ్లెం పట్టుకున్న ప్రభువుతో అన్నాడు.

యువరాజుగారి ఈ కొత్త పిచ్చిచేష్ట అందరినీ విచారసముద్రంలో ముంచింది. దీనితర్వాత టామ్ మరో తప్పు చేశాడు. చర్చిఅధికారి భోజనానంతరం తిరిగి ప్రార్థన చెయ్యాలి. అదయిందాకా యువరాజు కుర్చీలోంచి లేవగూడదు. చర్చిఅధికారి చేతులు ముకుళించి టామ్ కుర్చీ వెనక నిలబడి ప్రార్థించటానికి నోరు తెరిచాడు, కాని టామ్ ఇదేమీ గమనించక కుర్చీ వెనక్కి తోసి లేచాడు.

టామ్ మళ్లీ విశ్రాంతి కోరాడు. అతన్ని శయనాగారానికి తీసుకుపోయి వదిలేశారు. అక్కడ అసలు యువరాజుకు చెందిన ఉక్కు కవచం వంకె మీద కనిపించింది. దానిమీద బంగారునగిషీ చాలా వుంది. దాన్ని ఇటీవలే మహారాణి పార్ అమ్మగారు యువరాజు ఎడ్వర్డుకు బహుమతి చేశారు. టామ్ దాన్ని

ఎవరిసహాయం లేకుండా తనంతట తనే తొడుక్కు న్నాడు. ఇంకా ఉక్కుశిరస్త్రాణం మొదలైనవికూడా ధరించాడు. ఇంతలోకే తను భోజనశాలనుండి తీసుకు వచ్చిన సీమ బాదంకాయలు జ్ఞాపకం వచ్చాయి. మూడో కంటివాడు చూడకుండా తన్నేపనీ చేసుకో నివ్వక అడ్డపడే నౌకర్లమూక లేకుండా, తనంత తను సొంత చేతుల్తో సీమబాదంకాయలు పగల కొట్టుకు తింటం ఎంత మజాగా, వుషారుగా వుంటుంది! వెంటనే కవచం శిరస్త్రాణం విప్పి దేని స్థానంలో దాన్ని పెట్టేశాడు.

బాదం కాయలు కొట్టుకు తిన మొదలెట్టాడు; టామ్ చేసిన పాపాలకు శిక్షగా దేవుడతన్ని యువరాజు చేసిన తర్వాత మొదటిసారిగా అతడు నిజమైన ఆనందం అనుభవించాడు.

బాదం కాయలన్నీ అయిపోయ్యాక ఓ మూల అలమారలో ఏవో పుస్తకాలు కనిపించాయి. వాటిలో ఇంగ్లీషు రాజదర్బారుకు చెందిన మర్యాదలు, ఆచా రాలు తెలిపే పుస్తకం ఒకటి కనిపించింది. టామ్ అది చూసి సంతోషంతో గంతులేశాడు. మెత్తటి పరుపు మీద కాలుమీద కాలేసుకు పండుకుని, పుస్తకం దీక్షగా చదవ సాగాడు. ప్రస్తుతానికి కతణ్ణి అలా ఒంట రిగా చదువుకోనిద్దాం.

# 8

దాదాపు 5 గంటలవేళ మహారాజు హెన్రీ నిద్ర లేచాడు. నిద్రవలన అత డేమీ తేరుకోకపోగా మరింత కలత చెందినట్టు తోచాడు. తనలో తను ఇలా గొణుక్కున్నాడు: "దుస్వప్నాలు—దుస్వప్నాలు—నా ఆఖరి గడియ సమీపించినట్టుంది. ఈ పీడకలల కదే అర్థం; నాడి కూడా అంతకంతకు బలహీనమైపోతున్నది." ఇంతలో ఆయన కళ్లలో క్రౌర్యం మెరసింది. "కాని 'అతడు' చనిపోకముందు మాత్రం నేను కళ్లు మూయను," అనుకున్నాడు.

సేవకులు మహారాజు మేల్కొంచివుండటం కని పెట్టి, బయట ఖజానాశాఖమంత్రి వేచివున్నాడని తెలి పారు.

"లోపలికి రమ్మనండి," అని రాజు ఆదుర్దాగా ఆజ్ఞాపించాడు.

ఖజానామంత్రి ప్రవేశించి మహారాజు శయ్య పక్కన మోకరించాడు.

"మహారాజు ఆజ్ఞ ప్రకారం రాజ్యంలోని ప్రభువు లందరూ యథోచిత వేషాలలో శాసనసభలో సమావేశ మయ్యారు. నార్ఫోక్ ప్రభువుకు మరణశిక్ష విధించారు. ఇక మీ ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నారు."

రాజుముఖంలో వికృత సంతోషం ప్రతిఫలిం చింది.

"నన్ను లేవనెత్తండి. నేనుస్వయంగా పార్ల మెంటుకు వస్తున్నాను. నా చేతుల్తో స్వయంగా ఆజ్ఞా పత్రంపై ముద్రవేస్తాను..."

రాజు ఇక మాట్లాడలేక ఆపేశాడు. సంతోషంతో ఎర్రపడిన అతని ముఖం మళ్ళీ పాలిపోయింది. సేవకులు ఆయన్ను శయ్యమీద పడుకోబెట్టారు. ఆయన విచారం సూచించే కంఠంతో అన్నాడు:

"ఈ మధురక్షణంకోసం ఎన్నాళ్లనుంచీ ఎదురు చూస్తున్నాను! చివరి కది రానే వచ్చింది; కాని దానిని కళ్లారా చూస్తే అదృష్టంలేదు నాకు. త్వరగా వెళ్లాలి నువ్వు, త్వరగా. రాజముద్ర నీ అధీనంలో వుంచుతున్నాను. ఆజ్ఞాపత్రం నమ్మకస్థులైనవాళ్ల చేత తయారు చేయించి రాజముద్ర వేయించు. సూర్యాస్తమయం కాకముందే నార్ఫోక్ ప్రభువు శిరస్సు నాకు చూపించాలి. త్వరగా," అని రాజు ఖజానామంత్రికి ఆజ్ఞాపించాడు.

"మహారాజు ఆజ్ఞ శిరసా వహింపబడుతుంది. రాజముద్రను తమరునాకు అప్పగింపిస్తే నేను కార్యము నెరవేర్చగలను."

"రాజముద్రా! అది నీదగ్గిరే వుందిగదా?"

"మహారాజు క్షమించాలి. నార్ఫోక్ ప్రభువు మరణ శిక్షాపత్రంమీద దానిని ముద్రించేవరకూ ఇంక

ఏ పనికీ దాని నుపయోగించమని తమరే రెండురోజుల క్రితం నాదగ్గరనుండి తీసుకున్నారు."

"ఆ, అవును. జ్ఞాపకం వచ్చింది. తీసుకున్నాను ...అయితే ఏమిచేశాను...ఎక్కడ పెట్టాను? నాకు మతిపోతోంది...జ్ఞాపకం రావటంలేదు... తమాషాగా వుందే..."అంటూ లోపల్లోపల రాజు ఏదో అనుకో సాగాడు.

చివరికి హెర్ట్ ఫర్డు ప్రభువు మోకరించి ఇలా విన్న వించాడు:

"మహారాజు క్షమిస్తే నాకు జ్ఞాపకమున్నంత వరకూ చెప్పగలను.

ఆ రోజున వేల్సుయువరాజుగారికి తమరు రాజ ముద్రను ఇచ్చారు దాచమని—"

"నిజం. గుర్తువచ్చింది. త్వరగాతీసుకురా. ఆట్టే వ్యవధి లేదు."

హెర్ట్ ఫర్డు ప్రభువు టామ్ వద్దకుపరుగు పరుగున వెళ్లాడు. కాని వెంటనే తిరిగివచ్చాడు, వట్టి చేతుల్తో.

"చెడ్డ వార్తను వినిపించవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను ప్రభూ! యువరాజుగారికి మతి చాంచ ల్యం ఇంకా తగ్గలేదు. రాజముద్రను పుచ్చుకున్నట్టే ఆయనకు జ్ఞాపకం లేదు. అందుచేత యువరాజుగారి విశాలమైన గదులు, మందిరాలు వెతుకుతూ కూర్చుంటే కాలయాపన కాగలదని—"

మహారాజు "హూ" అని మూలగడంతో హెర్ట్‌ఫర్డ్ ప్రభువు మాటమధ్యలో ఆగిపోయాడు. గద్గద కంఠంతో రాజు ఇలాగన్నాడు:

"పాపం, యువరాజును శ్రమపెట్టకండి. ఆయనను భగవంతు డింకాకరుణించ లేదు; ఇంకా అలాగే వున్నందుకు నా విచారం ఆపుకోలేకుండా వున్నాను-"

అంటూనే మహారాజు కళ్లుమూసి ఏదో గొణుక్కోసాగాడు. తరవాతగొణుగుడుకూడా మానేసి నిశ్శబ్దంగా పడుకున్నాడు. మళ్ళీ కాసేపటికి కళ్లు తెరిచి చుట్టూ శూన్యంగా కలయజూశాడు. శయ్యపక్కన మోకరించి వున్న ఖజానామంత్రి కనబడ్డాడు. వెంటనే కోపంతో కంపిస్తూ—

"ఇంకా ఇక్కడే వున్నావా? ఆ రాజద్రోహిగతే నీకూ పట్టాలని కోరుతున్నావా? వెంటనే నా ఆజ్ఞ నెరవేర్చకపోతే రేపు నీతల కూడా ఎగిరిపోతుంది," అని చాడు.

ఖజానామంత్రి భయంతో కొయ్యబారిపోయాడు. రాజముద్రకోసం మాత్రమే ఆగానని చెప్పాడు.

"నీకేం మతిపోయిందా? నేనువిదేశాలకు వెళ్లేటప్పుడు వెంటతీసుకుపోయే చిన్న ముద్ర లేదూ? పెద్ద రాజముద్ర పోయినప్పుడు చిన్నది ఉపయోగించాలని తెలియదూ? ఊఁ, వెంటనే పో. రాజద్రోహి శిరస్సు తీసుకురాకుండా ఇక నాకంట పడకు పో."

అపాయకరమైన రాజు సన్నిధినుండి ఖజానా మంత్రి కన్ను మూసి తెరిచేలోగా నిష్క్రమించాడు. నామమాత్రంగా ప్రజల ప్రతినిధిమైన పార్లమెంటు అది వరకే నార్ఫోక్ ప్రభువుకు మరణశిక్ష విధించి వుంది. శిక్షాపత్రంమీద రాజముద్రకూడా త్వరగా వెయ్య బడింది. దురదృష్టవంతుడైన నార్ఫోక్ ప్రభువు శిరచ్ఛేదానికి ముహూర్తం నిర్ణయించారు.

# 9

రాత్రి 9 గంటలకల్లా రాచనగరును ఆనుకునివున్న థేమ్సునదరేవు యావత్తూ దేదీప్యమానంగా ప్రకాశించింది. నదీతీరాన దీపాలతోరణాలు ఆ ప్రాంతాన్ని పట్టపగటిలా చేసేశాయి. నదిలో పొడుగునా కనిపించే మేరవరకూ వినోదనౌకలు సోమరిగా ఊగుతూ, తూగుతూ తేలియాడుతున్నాయి. ప్రతి నౌకలోనూ జనం కిక్కిరిసివున్నారు; ప్రతినౌకలోనూ రంగురంగుల దీపాలు శోభాయమానంగా వెలుగుతున్నాయి. వసంత వాయువుల్లో మెల్లిగా ఉయ్యాలలూగే పువ్వుల తోటలాగుంది ఆదృశ్యం.

రేవుకు విశాలమైన మెట్లున్నాయి. అక్కడి దృశ్యంచూసి తీరవలసిందే. తళ తళ మెరిసే ఉక్కు కవచాలు, ఖడ్గాలు, శిరస్త్రాణాలు ధరించి బారులుతీర్చి నిలబడ్డారు సైనికులు. రాజ సేవకులు ఉత్సవ ప్రయత్నాలు పూర్తిచేస్తూ హడావుడిగా తిరుగుతున్నారు.

ఇంతలో అక్కడచేరిన మామూలు జనాన్ని రాజసైనికులు చెల్లాచెదరుగా తరిమేశారు. అంతా దేని కోసమో ఎదురు చూస్తున్నారు. నౌకల్లోని జనం నిలబడి, రాచనగరుకేసి మెడలు నిక్కించి చూస్తున్నారు. దాదాపు నలభై, యాభై రాజనౌకలు మెట్ల దగ్గిరికి వచ్చి వరసన ఆగాయి. వాటి అందం చెప్పతరంగాదు. బంగారపు పూత పూయబడి, జెండాలతో, తోరణాలతో ధగధగలాడుతున్నాయి. జెండాకర్రలకి వెండి మువ్వలు కట్టబడివున్నాయి. గాలి వీచినప్పుడల్లా అవి కదిలి కిణకిణ సంగీతం ధ్వనిస్తున్నాయి. వీటిలో కొన్ని మరీ ముఖ్యమైన నౌక లున్నాయి. అవి వేల్సు యువ రాజుకు సన్నిహితులైన ప్రభువులవి. అవి మరీ డాబుగా వుండి కళ్లుచెదర గొడుతున్నాయి. కొన్ని నౌకల్లో ఖడ్గాలు, డాలులు ధరించిన సైనికులున్నారు. వీరుగాక బోలెడుమంది భజంత్రీలుకూడా వున్నారు.

ఈ లోగా కోటగేటు దగ్గర అంతా ఎదురు చూస్తున్న ఊరేగింపు తాలూకు ముందరి జనం కనిపించారు. వీరు సైనికులు. గేటుదాటి ఇవతలకు రాగానే వారంతా రెండు వరసలుగా చీలిపోయి గేటుదగ్గిరనుండి మెట్లుదాటి నీటి అంచువరకూ రెండుబారులుగా నిలబడ్డారు. తరవాత సేవకులు వచ్చారు. మృదువైన తివాసీని గేటునుండి నీటిదాకా పరిచారు వాళ్లు. వెంటనే కోటలోనుండి బాకాలు మోగాయి. నౌకల్లోని భజం

స్త్రీలు వెంటనే అందుకుని ఉత్సవ సంగీతం మొదలు పెట్టారు.

తరవాత గేటులోనుండి లండన్ నగరంలోని ఉద్యోగులు ఎవళ్లదుస్తుల్లో వాళ్లు ఒకళ్ల తరవాత ఒకళ్లుగా వచ్చారు. జడ్జీలు, మంత్రులు, సైన్యాధికారులు వచ్చారు. తరవాత ఫ్రెంచిరాయబార కార్యాలయపు ఉద్యోగస్థులు, వాళ్ల వెనక స్పెయిన్ రాయబార ఉద్యోగస్థులూ వచ్చారు. ఇంకా వెనక మరీ గొప్ప గొప్ప ఇంగ్లీషు సామంతులు, వాళ్ల సేవకులు వచ్చారు.

కోటలో మళ్లీ బాకాలు మారుమోగాయి. యువరాజు మేనమామ, కాబోయే సోమర్సెట్ రాష్ట్రాధిపతి అయిన హెర్ట్ ఫర్డ్ ప్రభువు వచ్చాడు. ఆయన కోటకేసి తిరిగి వంగి వంగి సలాములు చేస్తూ వెనక్కి నడవటం మొదలెట్టాడు.

"వేల్సుయువరాజు ఎడ్వర్డు ప్రభువుకు దారి ఇవ్వండి," అనే నినాదాలు మిన్నుముట్టాయి. కోట బురుజులమీద బోలెడన్ని ఫిరంగు లొక్కసారి భూనభోంతరాళాలు దద్దరిల్లేట్టు మోగాయి. నదిమీద నౌకల్లోని జనం యువరాజుకు స్వాగత నినాదాలు చేశారు. ఈ మహోత్సవాని కంతటికీ కారణపురుషుడైన మన బిచ్చగాడు టామ్ కాంటీ గేటువద్ద ప్రత్యక్షమయ్యాడు. ఓ అతనిసౌందర్యం వర్ణించ తరంకాదు. తెల్లటి 'శాటిన్' వస్త్రాలు, నడుముకు ఎర్రటి జరీ

బెల్టు ధరించాడు. బుజాల మీాదినుంచి వెనక్కి జరీ వస్త్రం ఒకటి నేలవరకూ జీరాడు తున్నది. రొమ్ము మీాద, మోచేతులవద్దా, మణికట్లవద్ద వేల్సుయువరాజు లకు ఆచారప్రకారంగా అలంకరించబడే రత్న పతకా లున్నాయి. అతనిమీాద కాంతి పడినచోట నల్లా ధగ ద్ధగాయమానంగా మెరిసిపోతున్నది. ఓ! టామ్‌కాంటీ! ఏంపుణ్యం చేసుకుని పుట్టావు? నువ్వు పుట్టిన ఆ మురికి గుంటకీ, ధరించిన చిరుగ్గుడ్డలకీ, అనుభవించిన బాధ లకీ, ఇప్పుడు నువ్వు అనుభవించే ఈ వైభవాలకీ, ఎక్క డన్నా పోలిక వుందా? ఏమదృష్టం నీది!

## 10

అసలు యువరాజును జాన్ కాంటీ ఆఫల్ కోర్టుకు లాక్కుపోవటం, వారి వెనక బిచ్చగాళ్ల గుంపు ఇకిలిస్తూ, సకిలిస్తూ అనుసరించటం మనం చూశాం.

యువరాజు పక్షాన మాట్లాడినవ్యక్తి ఒక్కడే. కాని, అతని మాటను జాన్ కాంటీ లెక్కచెయ్యక పోగా, మిగతా జనంఅంతా వేళాకోళం చేశారు. యువ రాజు స్వేచ్ఛకోసం పెనగులాడటం మానలేదు. తనకు జరుగుతున్న అవమానాన్ని ప్రతిఘటించటంకూడా మానలేదు. చివరికి జాన్ కాంటీ ఇక సహించలేక చేతు లోబడితె ఎత్తాడు యువరాజును మొత్తటానికి. యువ రాజు పక్షాన ఇందాక మాట్లాడిన ఆ వృద్ధవ్యక్తి ఒక్క ఉదుటున అడ్డపడ్డాడు జాన్ కాంటీకి. యువరాజు తల

మీాద పడవలసిన బడితె ఆ వృద్ధుడి మణికట్టుమీాద పడింది. కాంటీ గర్జించాడు :

"అడ్డం వస్తావంట్రా, ముసలికుక్కా. ఇదిగో నీకు బహుమతి," అంటూ కర్రతో వృద్ధుడి తలమీాద బలంగా కొట్టాడు. ఒక పెద్ద మూలుగు వినబడింది; వృద్ధుడి బడుగు దేహం జనుల కాళ్లవద్ద వాలిపోయింది; మరుక్షణంలో అది చీకటిముసుగులో దాక్కున్నది. జనం ఈ ఘోర సంఘటనకు ఏమాత్రం చలించక ముందుకు సాగిపోయారు.

మరికొద్ది సేపటిలో యువరాజు జాన్ కాంటీ కొంపలో బంధించబడి వున్నాడు. ఇతరు లెవ్వరూ లోనికి రాకుండా కాంటీ తలుపులు బంధు చేశాడు. మినుకు మినుకు మంటున్న కొవ్వొత్తి వెలుగులో యువ రాజు చుట్టూ పరిశీలనగా చూశాడు. బూజు, చెత్త చెదారంతో నానా భ్రష్టుగావున్న ఆ కొంపని, అందు లోని జనాభాని చూసేటప్పటికి యువరాజుకు రోత పుట్టింది. ఇద్దరు బాలికలు, ఒక మధ్యవయస్కురాలు గోడకు కరుచుకు నుంచున్నారు. యజమాని చేతుల్లో నిత్యమూ బడితెపూజకు అలవాటుపడిన పశువులు యజమానిని చూడగానే ఎలా బెదురుతూ, వణుకుతూ దొంగచూపులు చూస్తాయో అలాచూస్తున్నారు వాళ్లు. ఓ మూలనుంచి ఒళ్లంతా ముడతలు పడి, నెరిసిన జుట్టంతా చిందరవందరగా రేగివున్న ముసలి దొకతె

వచ్చింది. ఆమె కళ్లువికృతంగా నవ్వుతున్నట్టున్నాయి. జాన్ కాంటీ ఆమెతో అన్నాడు!

"ఒసేయ్ ముసిల్దానా! నీకివ్వాళ బలే తమాషా చూపిస్తాను. కాస్సేపు నువ్వు మాట్టాడకుండా నోర్మూసుకో. ఆతరవాత నీ ఓపిక, నీ చేతుల ఓపిక. అరేయ్ కుంకా ఏదీ ఇందాకటి వాగుడు మళ్లీ వాగు. నీ పేరేమిటో, నువ్వెవరివో చెప్పు."

ఈ అవమానకర వాక్యాలతో యువరాజు మొహంలోకి నెత్తురుబికివచ్చింది. కోపంతో వూగుతూ,

"మాట్లాడమని నన్నాజ్ఞాపించటానికి నీ కధికారం లేదు. మళ్లీ చెబుతున్నాను విను! నేను వేల్సు యువరాజు ఎడ్వర్డుని."

ఈ సమాధానం విని ముసల్దానికి నోటమాట రానంత పనయింది. మేకుతో దిగేసినట్టు నుంచున్న చోటనే పాతుకుపోయి, నోరు తెరుచుకుని యువరాజును చూసింది. ముసల్ది అలా తెల్లబోయి శూన్యంగా చూట్టం చూసి ఆమెకొడుకు పగలబడి నవ్వాడు.

కాని యువరాజు సమాధానంవిని టామ్ తల్లి, అక్కలు నవ్వలేదు. దీని కంతటికీ పర్యవసానం ఏమిటో వాళ్లకు తెలుసు. వాళ్లు ముందుకువచ్చి యువరాజును కౌగిలించుకుని,

"అయ్యో టామ్! అయ్యో టామ్!" అని దుఃఖించ సాగారు. టామ్ తల్లి యువరాజు కాళ్లకడ

కూలబడి చేతులు అతని బుజాలమీదవేసి అతని కళ్ల లోకి దీనంగాచూస్తూ,

"అయ్యో నా కొడకా! ఆ వెధవపుస్తకాలు చదవద్దురాఅంటే విన్నావు కాదు. అవి చదివి చదివి నీకు మతి పోయింది. అయ్యోనాయనా నామాట ఎందుకు విన్నావుకావు? నా గుండెలు చీల్చుకోకు నాయనా!" అని ఏడ్చింది.

యువరాజు ఆమె చేతులు తీసివేసి, మెల్లిగా అన్నాడు:

"అమ్మా! నీ కొడుకు సుఖంగానే వున్నాడు; అతనికి మతీ పోలేదు, ఏం పోలేదు. నువ్వు బెంగపడకు. నన్ను కోటకి చేర్చండి. నా తండ్రియైన మహారాజు వెంటనే మీ అబ్బాయిని మీకు పంపిస్తాడు."

"నీ తండ్రి మహారాజా? ఏమి టీ మాటలు చిట్టి తండ్రీ? అలాగనకు; ఈ మాటలు ఎవరన్నా వింటే మనకొంప మునుగుతుంది; రాజభటులు వచ్చి మనను కొట్లో తోస్తారు. ఇదుగో నా కేసి చూడు నాయనా! నేను గుర్తులేనూ? నేను నీ తల్లిని కాదూ?"

యువరాజు తల అడ్డంగా వూపాడు:

"నీ మనస్సుని కష్టపెట్టడం నాకేమీ ఇష్టంలేదు. కాని ఇది ముమ్మాటికీ నిజం. ఇంతకుముందు నీ ముఖాన్నెప్పుడూ చూసి ఎరుగను."

టామ్‌తల్లి నిట్టూర్పువిడిచి కళ్ళు చేతుల్తో మూసుకుంది. గుండెలు బద్దలయ్యేట్టు రోదించనాగింది.

"ఊఁ, ఇంతేనా తమాషా? ఇంకాస్సేపు జరగ నివ్వండి నాటకం," అని అరిచాడు కాంటీ. "ఏం బెట్ ! నోరు మూసుకునుంచున్నావ్? ఒసే నాన్! మీకు మర్యాద లేదుటే? యువరాజు ఎదురుగా నుంచుంటే మీరలాం నుంచోవచ్చా. మోకాళ్లమీదపడి నమస్క-రించండి. ఊఁ", అని మళ్ళీ, గుర్రంలా సకిలించాడు.

బాలిక లిద్దరూ తండ్రిని బతిమాలుకో సాగారు, తమ "తమ్ముణ్ణి" విడిచిపెట్టమని నాన్ అన్నది.

"నాన్నా! తమ్ముణ్ణి పడుకోనియ్యి. నిద్రపోతే మతి మళ్లీవస్తుంది; పిచ్చిపోతుంది. నాన్నా! ఈమాత్రం కనికరం చూపు."

"నిజం నాన్నా! పాపం వాడుబాగా అలిసిపోయి నీరసంగా వున్నాడు. తెల్లారితే మళ్లీ మామూలు మనిషవుతాడు. మామూలుగా బిచ్చమెత్తి తెస్తాడు," అని బెట్ కూడా తండ్రిని ప్రార్థించింది.

కుమార్తె లిద్దరూ ఇలా ప్రార్థించేసరికి అంత వరకూ సకిలిస్తూనేవున్న జాన్ కాంటీ శాంతించాడు; ఇక అసలుపనికి ఉపక్రమించాడు. యువరాజుకేసి తిరిగి కోపంగా అన్నాడు,

"ఈ కొంప యజమానికి రేపు రెండు పెన్నీలు అద్దె ఇవ్వాలి. ఏయ్—రెండు పెన్నీలు, తెలిసిందా? ఆరునెలల అద్దె రెండు పెన్నీలు - కాస్తా కూస్తా అను కున్నావేమో? రేపు గనక అది ఇవ్వకపోతే ఇక్కడి నించి తరిమేస్తాడు. నువ్వు తెచ్చిందేదో చూపించు."

యువరాజు ఇల్లా జవాబిచ్చాడు:

"నీ వ్యవహారాలతో నన్ను బాధపెట్టకు. మళ్లీ చెబుతున్నాను-నేను మహారాజు కుమారుణ్ణి."

చేటంత వెడల్పున్న జాన్ కాంటీ అరచెయ్యి యువరాజు తలమీద పిడుగులా పడింది. ఆ దెబ్బతో అతడు తూల్తూ పోయి టామ్‌తల్లిఒళ్లో పడ్డాడు. ఆమె అతన్ని గుండెకు ప్రేమగా అదుముకున్నది; భర్త కొట్టే దెబ్బలకు తనడ్డంవచ్చి యువరాజును రక్షించింది. బాలిక లిద్దరూ భయంతో వొణుకుతూ ఒకమూల నక్కారు. ఈ లోగా తన ఆశ్చర్యంనుంచి తెప్పరిల్లుకుంది బామ్మ. ఆమె కాలం వృధా అయిపోతోందని ఆదరాబాదరాగా ముందుకొచ్చింది కొడుక్కి సహాయపడటానికి. యువరాజు టామ్ తల్లిఒళ్లోనుంచి విదిలించుకుని లేచి,

"అమ్మా! నువ్వు నాకోసం బాధపడకు. ఈ పందుల కడ్డంరాకు నాకోసం. నేనే వాళ్ల నెదుర్కొంటాను," అన్నాడు.

ఈ మాటలతో మరింత ఉషారొచ్చిందా పందులకి. యువరాజు శరీరంమీద తీవ్రంగా మోదటం ప్రారంభించారు. అటునుంచి జాన్ కాంటీ గుద్దులు వెయ్యటం, ఇటునుంచి బామ్మ గిల్లటం, కొరకటం సాగించారు. ఈపని అయింతర్వాత ఖైదీమీద సానుభూతి చూపించినందుకు టామ్‌తల్లినీ, నాన్, బెట్‌లని హింసించారు.

"ఇక పడుకోండి అంతా. ఈ నాటకం చాలు ఇవ్వాల్టికి," అని ఆజ్ఞాపించాడు కాంటీ.

దీపం ఆర్పేశారు. ఎవళ్ళస్థానాల్లో వాళ్లు చేరుకుని పడుకున్నారు.

కుటుంబయజమాని, అతని తల్లి పందుల్లా గుర్రుపెడుతూ నిద్రపోయారు. వెంటనే బాలికలు లేచి యువరాజుకు చలివెయ్యకుండా గడ్డి, పాతగుడ్డలు కప్పారు. తల్లికూడా అతనివద్దకు పాకివచ్చి జుట్టు నిమురుతూ ఏడ్చింది, అతన్ని ఓదార్చింది. అతనికోసం దాచివుంచిన రొట్టెముక్కని చేతికిచ్చింది. కాని పొద్దుటినుంచి దెబ్బలు తిని తిని వున్నాడేమో, అతనికి రొట్టెముక్క ఏమీ వూరట ఇవ్వలేకపోయింది. టామ్ తల్లి తనను రక్షించటానికి దెబ్బలుతినటం, తనను ఓదార్చటానికి ప్రయత్నించటం చూసి అత నెంతో ఇదయ్యాడు. తన సహజ ధోరణిలో, అంటే రాజులకు తగినమాటల్లో ఆమెకు తన కృతజ్ఞత తెలిపాడు. ఇక పడుకోమని, తన బాధల్ని గూర్చి విచారించవద్దని కోరాడు. ఆమె తనపై చూపిన ప్రేమకు తగిన ప్రతిఫలం తన తండ్రియైన మహారాజు ఇవ్వకపోడనికూడా అన్నాడు.

తన "కుమారుడు" మళ్ళీ ఇలా "పిచ్చి" ధోరణిలోకి దిగేటప్పటికి ఆమె తిరిగి నిరాశతో నిట్టూర్చటం, లోపల్లోపలే కుమిలిపోవటం ప్రారంభించింది. అతన్ని మళ్ళీమళ్ళీ తన గుండెకు అదుముకున్నది. చివ

రికి అతనికి కునుకుపట్టిందని తోచగానే మళ్ళీ పాకుతూ పోయి తన పక్కలో పడుకుంది.

## 11

రామ్ తల్లి పడుకుని ఆలోచించసాగింది. ఆలోచించిన కొద్దీ ఆమెకు కొడుకును గూర్చి దుఃఖం ఎక్కువైంది. నెమ్మదిగా ఆమె మనస్సులోకి అర్థం కాని అనుమానమేదో ప్రవేశించింది. పిచ్చి సంగతి అటుంచి ఈ కుర్రవాడిలో టామ్‌లో లేని కొత్త లక్షణం కనిపిస్తోంది. ఆ లక్షణమేమిటో మాత్రం స్ఫురించటం లేదు. అది ఫలానా అని చెప్పటానికి సాధ్యంకావటం లేదు. అయినా ఆమె మాతృహృదయానికి ఈ కొత్తదనం బాణంలా గుచ్చుకుని బాధ పెడుతోంది. ఒకవేళ ఈ కుర్రవాడు తన కొడుకు కాడేమో?...ఆc, వట్టిమాట. తనకొడుకు కాకపోతే ఇంకెవరు అతడు? ఈ భావం కలిగినందుకు ఆమెలో ఆమెకే నవ్వువచ్చింది అంత దుఃఖంలో కూడా.

అయితే ఎంత ప్రయత్నించినా ఈ భావం తొలగిపోవటం లేదు. అతడు తన కొడుకు కాడేమో నన్న అనుమానం పెనుభూతంలా ఆమెని తరిమింది; ఆమె మనస్సుని చెయ్యిపెట్టి కెలికినట్టు కెలికింది; పురుగులా దొలిచింది; ఎంత తోసివేసినా మళ్లీ మళ్ళీ మనస్సుపై వాలింది. ఇక ఈ సమస్యని అటో ఇటో తేల్చుకోకపోతే మనస్సుకు శాంతి ఉండదనిపించింది.

ఇందు కేమిటి ఉపాయం? ఏ పరీక్ష పెడితే తేలుతుంది ఈ విషయం? తీవ్రంగా ఆలోచించింది ఆ పేదరాలు. ఎన్నో ఉపాయాలు ఆలోచించింది. ఏదీ సరియైన సాధనంగా తోచలేదు. తిరుగులేని ఉపాయం కావాలి. ఉహూ. లాభంలేదు. అతడు తన కుమారుడేనని నిర్ధారించే పరీక్ష ఏమీ లేదు.

ఇంతలో ఆమెకు కుర్రవాని మృదువైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వినిపించాయి. క్రమం తప్పకుండా ఒకే లయలో గాలి పీలుస్తూ వదులుతున్నాడు. అంటే మంచి నిద్రలో ఉన్నాడన్నమాట.

ఈ లయబద్ధమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో ఉండి ఉండి వినిపిస్తోం దొక మూలుగు. గొంతుక ఎవరో నొక్కి వేస్తున్నట్టు పీడకల వచ్చినప్పుడు కష్టంమీద వెలువడే ఏడుపులా వుంది ఆ మూలుగు.

వెంటనే ఆమెకు చక్కటి ఉపాయ మొకటి తోచింది. ఒక రోజున టామ్‌కాంటీ ఏదో ఉత్సవం సందర్భంలో టపాకాయ పేలుస్తున్నాడు. అది అకస్మాత్తుగా అతని ముఖంమీద పేలింది. అప్పుడు తీవ్రంగా భయపడి కళ్లకు చెయ్యి అడ్డం పెట్టుకున్నాడు. అయితే అందరిమాదిరిగా అరచెయ్యి లోపలి వేపుకి పెట్టుకోలేదు. అరచెయ్యి బయటికి తిప్పి అడ్డం పెట్టుకున్నాడు. ఆ రోజునుంచీ అతని కిదే అలవాటై పోయింది. హఠాత్తుగా, ఉలిక్కిపడినప్పుడల్లా అరచెయ్యి వెలుపలికి తిప్పి కళ్ల కడ్డం పెట్టుకుంటాడు. ఈ

అలవాటును టామ్ తల్లి వందలసార్లు గమనించింది. ఇది ఆమె కిప్పుడు జ్ఞాపకం వచ్చింది.

ఆమె చకచకా తన ప్రయత్నం ప్రారంభించింది. సద్దుకాకుండా లేచి కొవ్వొత్తి వెలిగించింది. నెమ్మదిగా యువరాజు పక్కవద్దకు పాకివెళ్లింది. దీపానికి చెయ్యి అడ్డంపెట్టి అతని చెవిపక్కన చప్పుడు చేసింది. అతను కళ్లుతెరిచే క్షణానికే కొవ్వొత్తిని కళ్ల ఎదట ఝుళిపించింది. యువరాజు ఉలికిపడి లేచాడు. కాని విలక్షణమైన చేష్ట ఏమీ చెయ్యలేదు.

పాపం ఆ పేదరాలుకు ఆశ్చర్యం, దుఃఖం రెండూ ముంచుకు వచ్చాయి. అయితే ఆమె ఏమీ ఎరగనట్టు అతన్ని మళ్లీ నిద్రపుచ్చింది. తన పరీక్ష ఇలా వ్యర్థమైనందుకు ఆమెకు దాదాపు మతిపోయినంత పని అయింది. ఒకవేళ టామ్‌కు పిచ్చెక్కడం వల్ల పాత అలవాటు మర్చిపోయాడేమోనని ఆలోచించింది. కాని, అబ్బే! ఆ అలవాటును మాన్పటం దేవుడి తరం కాదు. అతని మనస్సుకు పిచ్చెక్కి వుండవచ్చు; కాని అతని చేతులికి పిచ్చెక్కదు. ఎన్నో ఏళ్లనుంచీ బలంగా పట్టుకొని వున్న ఆ అలవాటు ఇంత కొద్ది కాలంలో నశించదు. దీనికి ఆమె ఇదివరకు అనేక నిదర్శనాలు చూసివుంది కూడా.

తన పరీక్ష వ్యర్థమైనప్పటికీ ఆమెకు అతనిమీద ఆశ పోలేదు. ఇందాక అనుమానం ఎంత బలంగా

ఆమెని పీడించిందో ఇప్పుడు ఆశ అంత దృఢంగా ఆమె మనస్సును హత్తుకుంది. అందుచేత ఆమె మళ్లీ లేచి ఇంవాకటివలెనే యువరాజును అకస్మాత్తుగా నిద్రలేపి వెలుతురు చూపింది. రెండోసారీ అలాగే అయింది. మూడోసారి ప్రయత్నించింది. అప్పుడూ అంతే అయింది. ఇక తన ప్రయత్నం విరమించుకుని పక్కపై మేను వాల్చింది.

"నా చిట్టి తండ్రి కాక ఇంకెవ రితడు? తప్పక నావాడే. నావాడు కాదని ఎల్లా తోసెయ్యగలను?" అని లోపలే వెక్కి వెక్కి ఏడుస్తూపడి నిద్రపోయింది.

యువరాజు ఆ రోజున అనుభవించిన బాధలవల్లా, దెబ్బలవల్లా అలిసి అలిసి ఉన్నాడు. అందుచేత అతనికి బాగా గాఢంగా నిద్ర పట్టింది. గంట తరవాత గంట గడుస్తోంది; అతడుమాత్రము ఒళ్లెరగక నిద్రిస్తున్నాడు. కొంతసేపటికి మత్తుతగ్గింది; సగం నిద్ర, సగం మెలకువలో ఉన్నాడు. పలవరింతలు ప్రారంభమైనాయి.

"సర్ విలియమ్!"

మరి కాసేపాగాక:

"హాం, సర్ విలియమ్ హెర్బర్ట్ ఇలా రా, నా కొక తమాషా కల వచ్చింది, వింటావా?......సర్ విలియమ్! ఏయ్ నిన్నే మనిషీ! నేను బిచ్చగాణ్ణయి పోయినట్టు కలవచ్చింది......ఎవ రక్కడ? అంతా ఎక్కడికి పోయారు?".

"ఏమిటి తమ్ముడూ, కలవరిస్తున్నావా? ఎలా వుంది ఒంట్లో?" అని ఒక మెల్లని కంఠం అతనికి అస్పష్టంగా వినిపించింది.

"సర్ విలియమ్ హెర్బర్ట్! ఎవరు నువ్వు?"

"నేనా? ఎవరినేమిటి? నీ అక్కని; ఇంకా నీకు మతి రాలేదూ; అయ్యోపాపం, ఎంత అవస్థవచ్చిందిరా తమ్ముడూ నీకు. కాని అరవబోకమ్మా, నాన్న లేస్తే అందర్నీ మళ్లీ బాదేస్తాడు," అన్నది నాన్.

యువరాజు భయపడి హఠాత్తుగా లేచి కూర్చున్నాడు; వళ్లంతా పచ్చి పుళ్లుగా వుంది. వెంటనే తన పరిస్థితి అంతా గుర్తుకొచ్చింది; చుట్టూ చూసి మళ్లీ వెనక్కి వాలిపోయి మూలిగాడు:

"ఇది కల కాదన్నమాట."

నిద్రలో మరిచిపోయిన బాధ, విచారం అన్నీ మళ్లీ అతన్ని ముట్టడించాయి. అందరిదగ్గరా గారాబంగా ముద్దులు గుడుస్తూ, మహాప్రభువుల గౌరవ నమస్కారాలు అందుకుంటూ రాజభవనంలో విహరించే యువరాజు కాదు తను. ఇప్పుడు తనొక బిచ్చగాడు; కుక్కలకు, పందులకు తగిన కొంపలో దీనుడై, నిస్సహాయుడై మూలుగుతున్నాడు.

తనలో తను ఇల్లా ఆలోచించుకుంటున్నా, అతనికి ఇంటిబైటనుంచి ఏవో కేకలు, కోలాహలం వినిపిస్తూనేవున్నాయి. ఇంతలో ఎవరో తలుపుమీద తీవ్రంగా తట్టారు. జాన్ కాంటీ గుర్రు ఆపేశాడు.

"ఎవ రా తలుపు తట్టేది? ఏం కావాలి?" అని గదమాయించాడు.

ఒక గొంతుక సమాధానమిచ్చింది:

"రాత్రి నువ్వు కర్రతో కొట్టిం దెవరో తెలుసా?"

"తెలియదు. తెలుసుకోవల్సిన అవసరంకూడా లేదు," అని అహంకారం ఉట్టిపడేట్టు అన్నాడు కాంటీ.

"సర్లే. నీ మిడిసిపాటు త్వరలోనే తేలిపోతుంది. నీ తలకాయమీద ప్రేమ ఏమన్నా వుంటే నువ్వు కాలికి బుద్ధిచెప్పటమే మార్గం. ఆ మనిషి చచ్చి పోయాడు. అతడు ఎవరో అనుకుంటున్నావేమో, ఫాదర్ ఆండ్రూ."

"అరె బాప్. చచ్చానిక. ఇప్పుడేం చెయ్యాలి?" అని కాంటీ గబగబ మంచం దిగి అందర్నీ లేపాడు: "లేవండి, ముండల్లారా! పారిపోవాలి వెంటనే; లేక పోతే ప్రాణాలు దక్కవు, ఊఁ, త్వరగా."

మరి అయిదు నిమిషాల్లో కాంటీ కుటుంబం యావత్తూ, సామాన్లు నెత్తి కెత్తుకుని వీధుల్లో పడి పారి పోతున్నారు. జాన్ కాంటీ యువరాజు చెయ్యి దృఢంగా పట్టుకున్నాడు; చీకట్లో బరబర యీడ్చుకుపోతు న్నాడు.

"ఒరే పిచ్చివెధవా! నోరెత్తావంటే మక్కె లిరగతంతాను. నీ పిచ్చివాగుడు కాస్సేపు మర్చిపో. మన పేర్లు బయట పెట్టకు. నీ కొక కొత్తపేరు పెడ

తాను; ఎవరన్నా అడిగితే అదే చెప్పు. ఏం అర్థమైందా?" అని బోధించాడు యువరాజుకు. స్తేమిగతా వాళ్లకిలా చెప్పాడు: "మనం విడిపోవల్సివస్తే మళ్ళీ లండనువంతెనమీద కలుసుకుందాం. వంతెనమీద ఆఖరి బట్టలదుకాణం వుందే, అదీ మనచోటు.(అంతా కలుసుకున్నాక యాకంగాసౌత్ వార్కు లండన్ సివారు) లోకి పోదాం."

ఇంతలో వారు చీకట్లోంచి హఠాత్తుగా వెలుగులోకి వచ్చారు. వెలుగులోకే కాదు జనసమూహంలోకి కూడాను. వందలకొలదీ జనం తాగి తందనాలు తొక్కుతున్నారు; పాటలు, అరుపులు, ఒకటేమిటి ఆ ప్రాంతమంతా హోరెత్తి పోతోంది. థేమ్సునదిపొడుగునా నెగళ్లు మిన్నంటేటట్టు మండుతున్నాయి. లండన్ వంతెన, సౌత్ వార్కువంతెన ప్రాంతాలు దీపాల తోరణాలతో ప్రకాశిస్తున్నాయి. నదిపైన రంగు రంగుల దీపకాంతులు ప్రతిఫలించి ఆ దృశ్యం కన్నుల పండువుగా వుంది. నిమిష నిమిషానికి ఔట్లు మొదలైన బాణసంచా గూబలు పగిలేట్టు శబ్దంచేస్తూ పేల్తున్నాయి. అది పట్టపగలుమాదిరి వుంది గాని రాత్రిలా లేదు.

ఈ జనకోలాహలాన్ని చూడగానే జాన్ కాంటీ బూతుల పంచాంగం విప్పాడు. వెనక్కి తిరగమని తన వాళ్ల నాజ్ఞాపించాడు. కాని అప్పటికే ఆలస్యమై పోయింది. జనం వాళ్లని చుట్టుముట్టారు. వెనక్కిగాని

ముందుకి గాని పోయే సందు లేదు. మరొక నిమిషంలో కాంటీకుటుంబం ఒకళ్ల కొకళ్లు దూరమై పోయారు. జాక్ కాంటీ యువరాజును మాత్రం వదల్లేదు. కాని ఈ గందరగోళంలో తప్పించుకు పారిపోయే అవకాశా లున్నట్లు యువరాజుకు తోచింది. సమయంకోసం చూస్తున్నాడు.

కాంటీ జనాన్ని అటూ ఇటూ నెట్టుకుంటూ దోవ చేసుకు పోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ నెట్టడంలో కాంటీ ఒక మనిషిమీద తూలాడు. ఆ మనిషి చిత్తుగా తాగివున్నాడు; వాణ్ణి చూస్తే సారాపీపా, పిప్పళ్లబస్తా మొదలైన వస్తువులు జ్ఞాపకం వస్తాయి. అతడు గద లాంటి తనచెయ్యి కాంటీ బుజంమీద వేసి ఊపుతూ,

"ఏంటి నేస్తం! అంత దూకుడుమీ దున్నావ్? అంతా పండగ జేసుకుంటుంటే ను వ్వొక్కడివీ ఏంటో పనిమీద పోతుండావే? ఆగు, కాసంత నిదానించు," అని నిలేశాడు.

"చెయి తియ్. నాగొడవ నాది. ఆర్చేవాడివా, తీర్చేవాడివా నువ్వు? ఎహె, చెయ్యితియ్యమంటుంటే; నన్ను పోనియ్," అన్నాడు కాంటీ మొరటుగా.

"ఓ, జోరుగా మాట్టాడుతుండావే. నిన్ను కదల నివ్వను. వేల్సు యువరాజులుంగారి పేరుచెప్పి సారా తాగందే, అడుగేశేవో, ఇహ జూస్కో," అని ఆ వ్యక్తి చేతులు బారజాపి అడ్డంగా నుంచున్నాడు.

"అయితే కూజా తీసుకురా తొందరగా."

అప్పటికే మిగతాజనం వీళ్ల చుట్టూ గుమి గూడారు; చిత్తుగా తాగి మత్తెక్కి కాళ్లమీద నిలబడ లేకపోతున్నారు; వాళ్లిలా అరిచారు:

"కూజా, సారాకూజా తీసుకురండెహో! ఈ డెవడో మా గిరగా ఉండాడు. కుత్తుకదాకా తాగిద్దాం. తాక్కపోతే చేతులు, కాళ్లు కట్టేసి నదిలో పారేద్దాం."

పెద్ద సారాకూజా తీసుకురాబడింది. ఇందాకటి లావాటి వ్యక్తి దాన్ని కాంటీకి అందించాడు.

ఉత్సవసమయాల్లో ఇలా అంతా కలిసి ఒకే కూజాలోంచి సారా తాగటం ఇంగ్లీషువాళ్లలో ఎన్ని వందల ఏళ్ళనుంచో వస్తున్న సంప్రదాయం. ఆ కూజాని 'ప్రేమ కూజా' అంటారు. అందులోంచి సారా తాగుతూ "నిన్ను ప్రేమిస్తున్నాను," అని ఒకళ్ళొకళ్లు అనుకోవాలి. కూజా అందించినప్పుడు దాన్ని ఒక చేత్తో అందుకుని, రెండోచేత్తో మూత తీసి మరీ తాగాలి, అది వాళ్ళ ఆచారం.

జాన్ కాంటీ ఒక చేత్తో ప్రేమ కూజా నంది పుచ్చుకుని రెండోచేత్తో మూత తీశాడు. అంటే యువ రాజును విడిచిపెట్టాడన్నమాట. చెయ్యి విడిచీ విడవ గానే యువరాజు క్షణం వృథా చెయ్యకుండా అందర్నీ తోసుకుని గబ గబ పరిగెత్తాడు. మరుక్షణంలో జాన్ కాంటీ ఎటు చూసినా కనిపించనంత దూరానికి వచ్చే శాడు.

ఇక తను చెయ్యవలసిం దేమిటో స్పష్టంగా నిర్ణ యించుకున్నాడు యువరాజు. వేల్సు యువరాజుకు లండన్ నగరపౌరులు ఇవాళ విందు చేస్తున్నారు. ఈ సంగతి ఇందాక తాగుబోతుల ప్రేలాపనలో బయట పడింది. తను ఇక్కడ వుండగా వేల్సు యువరాజుకు విందు జరగట మేమిటి? కనక ఆ బిచ్చగాళ్ల కుర్రాడు టామ్ తను లేని అవకాశం చూసుకుని తనే యువ రాజుగా చెలామణీ అవుతున్నాడన్నమాట. పాపం గదా అని ఆదరించినందుకు ఆ టామ్ ఎంత ద్రోహం తలపెట్టాడు? తను యువరాజు కాదని, అసలు యువ రాజును వెదకండని తెలపనక్కర్లా?

కనుక చెయ్యవలసిం దేమిటంటే—విందు జరుగు తున్న 'గిల్డ్ హాల్'కు పోవాలి. అక్కడ తనే యువ రాజు నని చెప్పి, టామ్ని పట్టుకు శిక్షించాలి. అతన్ని కొంతకాలం పశ్చాత్తాపం పొందనివ్వాలి. తరవాత న్యాయశాసన ప్రకారం ఉరితీసి, వీథుల్లో శవాన్ని ఈడ్పించి, ముక్కలు చేసి కాకులకు గద్దలకు వెయ్యాలి. అంతే, మరో మార్గం లేదు.

## 12

యువరాజు వేషంలో టామ్ కాంటీ కోట ఈవ లకు రావటం మనం చూశాం. తనకోసం సిద్ధపరచ బడిన 'రాజనౌక' నెక్కి అతడు బయల్దేరాడు గిల్డ్ హాల్ (పురమందిరం) వైపు. అతని నౌకను అనుసరించి

ప్రభువుల, ఇతర అధికారుల నౌకలు వస్తున్నాయి. థేమ్సునదిలో అటూఇటూ బారులుతీర్చి నిలబడ్డాయి కొన్ని వందల నౌకలు. ప్రతి దానిలోనూ రంగుల దీపాలు వెలుగుతున్నాయి. బ్యాండుమేళాలతోనూ, ఫిరంగుల మోతలతోనూ వాతావరణమంతా బరువెక్కింది. ఒడ్డుల నిలబడిన ప్రజాసమూహాలు టామ్ కనిపించగానే టోపీలు తీసేసి, జయజయ ధ్వానులతో స్వాగతం ఇస్తున్నారు.

నౌకలోని సిల్కుసోఫాలో సగం మునిగికూర్చుని దిక్కులు చూస్తున్న టామ్‌కాంటీ తనకు జరుగుతున్న ఈ అపూర్వ గౌరవం! ఎంత విస్మయంపొందాడో చెప్పలేం. అతని పక్కన సోఫాల్లో ఠీవిగా కూర్చున్న యువరాణి ఎలిజబెత్‌కూ, జేన్‌గ్రేకూ ఈ గౌరవాలూ, స్వాగతాలూ ఓ లెక్కలోకే రాలేదు.

నిర్మలమైన సరస్సులో మెల్లిగా, సోమరిగా ఈదుతున్న రాజహంసలాగా, 'రాజ నౌక' అలా ఒయ్యారంగా పోయి పోయి, ఆగవలసిన రేవులో ఆగింది. టామ్ నౌక దిగాడు. పరివారసమేతంగా కొంత దూరం నడిచాడు. చీప్‌సైడ్‌బజారు దాటి బేసింగ్ హాల్ వీధిగుండా గిల్డుహాల్ చేరుకున్నాడు.

గిల్డ్‌హాల్ ప్రాకారద్వారంవద్ద లండన్ నగరపు మేయరు, మునిసిపాలిటీసభ్యులూ సిద్ధంగానూ వున్నారు. వారు టామ్‌ను, ఇద్దరు బాలికలనూ గౌరవపూర్వకంగా ఆహ్వానించారు. వారు పొడుగ్గా కాళ్ల

వరకూ వేలాడే వదులైన ఎర్రటి దుస్తులు ధరించి డాబుగా వున్నారు. మనబాల అతిథులను హాలు బయట ఆవరణలో వేసిన చాందినీలోకి తీసుకుపొయ్యారు.

అంతా ఎవళ్ల స్థానాల్లో వాళ్లు కూర్చున్నారు. విందుసమయంలో టామ్‌కు అందుబాటులో ఉండవలసిన ప్రభువులు, వారి భార్యలు అతని కుర్చీవెనక కుర్చీల్లో వరసన కూర్చున్నారు. మిగతా ప్రభువులు, మునిసిపాలిటీసభ్యులు కొంతదూరంలో వేరే బల్లల వద్ద కూర్చున్నారు. ఇంకా తక్కువ తరగతికి చెందిన అధికారులు, చిన్న ఉద్యోగులు హాల్లో వేయబడిన బల్లలవద్ద కూర్చున్నారు. ఇంతలో బాకాలు ఊదబడినాయి; విందుఏర్పాట్లకు అధికారియైన ఒక లావాటి గుండ్రటి వ్యక్తి (ఇతన్ని బట్లరు అంటారు) ప్రవేశించాడు. బట్లరు వెనక అతని సేవకులు మాంసపు పళ్లెం పట్టుకుని ప్రవేశించారు. మాంసం వేడివేడిగా పొగలు గక్కుతూ ఘుమ ఘుమాయిస్తోంది.

భోజనానికి ముందు జరిగే దైవప్రార్థన ముగిశాక టామ్ (ఏమేం చెయ్యాలో అతనికి ముందే పాఠం నేర్పబడ్డది) గంభీరంగా లేచాడు. అతనితో మిగతా అతిథులూ యావన్మందీ నిశ్శబ్దంగా లేచారు. అందమైన బంగారు 'ప్రేమకూజా' అందిపుచ్చుకుని ఒక గుక్క ద్రాక్షరసం తాగాడు. అది అందిపుచ్చుకుని యువరాణి ఎలిజబెత్ తాగింది. తరవాత జేన్ గ్రే తాగింది. 'ప్రేమకూజా' ఈవిధంగా చేతినుంచి చేతికి

బల్లనుంచి బల్లకూ తిరిగింది. తరవాత విందు ప్రారంభ మైంది.

ఆరోజు అర్ధరాత్రయ్యేసరికి ఉత్సవకోలాహలం మిన్ను ముట్టింది. ప్రభువులు, వారి భార్యలు, మేయరు, మునిసిపాలిటీఅధికార్లు, ఇంకా తదితర గొప్ప గొప్ప అతిథులు చిత్తుగా, పూటుగా, కంఠందాకా తాగే శారు. అక్కణ్ణించి ప్రారంభించారు నృత్యం. ఆడవాళ్లు మొగవాళ్లు కలిసి చెట్టాపట్టా లేసుకుని గిల్డుహాలు నృత్యమందిరంలో చిందులు త్రొక్కారు. ధగద్ధగాయ మానమైన దీపకాంతుల్లో, రకరకాల, రంగురంగుల, వెలలేని వస్త్రాలతో, ఆభరణాలతో, అలంకారాలతో వారు శివమెత్తినట్టు ఆ రాత్రల్లా నృత్యం చేస్తూనే వున్నారు. జన్మలో కనివిని ఎరగని ఈ దృశ్యం టామ్ చూసి తన్మయుడైపోయాడు తన ఉన్నత సింహాసనం మీద నోరు తెరుచు క్కూర్చుని. కాని అతని పక్కన కూర్చున్న ఎలిజబెత్, జేన్ గ్రేలు ఇలాటి దృశ్యాలు ఎన్ని చూశారో, కించిత్తయినా చలించ లేదు.

అయితే ఏ యువరాజుగారి వార్థమైతే లండన్ ప్రజలు ఈ ఉత్సవం జరుపుతున్నారో ఆ అసలు యువ రాజు ఎడ్వర్డు ట్యూడర్ ఆ సమయంలో, గిల్డుహాలు ప్రాకారం బయట చిరుగ్గుడ్డ లేసుకుని వాదిస్తున్నాడు. అతని చుట్టూ పోమరిపోతుజనం పోగడ్డారు. అతడు ఎత్తైన ఒక రాతిమీదకెక్కి ఉపన్యాసం దంచేస్తు న్నాడు. పిడికిళ్లు బిగించి ఊగిస్తూ ఊగుతూ, తనే అసలు

యువరాజునని చెప్పాడు; తనకు తీరని అన్యాయం, అవమానం జరిగిందన్నాడు; తన హక్కులు తనకి తిరిగి ఇమ్మన్నాడు; తన స్థానంలో దర్జాగా కూచ్చుని, కులుకుతున్న ద్రోహిని ఖండించాడు. ఈ 'నాటకం' అంతా చూసి జనం చాలా ఆనందించారు; అతన్ని దగ్గిర్నించి చూడాలని ఒకళ్ల నొకళ్లు తోసుకున్నారు. చివరికి అతన్ని వెక్కిరించడం వేళాకోళమాడ్డం సాగించారు. వాళ్లు ఏడిపిస్తున్న కొద్దీ యువరాజుకు ఉడుకు మోత్తనం ఎక్కువైంది. ఇంకా బలంగా గర్జించాడు తన హక్కులు తన కిమ్మని. అతనికి తెలియకుండానే కన్నీళ్ల ప్రవాహంతో అతని చెక్కిళ్లు, బట్టలు తడిసి పోయాయి; అయినా అతడు జంకూగొంకూ లేకుండా రాజఠీవితో జనాన్ని ఎదిరించాడు బెదిరించాడు!

"మళ్ళీ చెబుతున్నాను, కుక్క ల్లారా! పందుల్లారా! నేను యువరాజుని. నన్ను మీా రెంత వెక్కిరించినా సరే, నా కెవ్వరూ ఈ ఆపదలో సహాయం చెయ్యకపోయినా సరే, నే నిక్కణ్ణించి కదలను. నేను వేల్సుయువరాజును, వేల్సుయువరాజును, వేల్సుయువరాజును."

"నువ్వు యువరాజువైనా కాకపోయినా నీ కేం భయంలేదు. మైల్స్ హెండన్ నీపక్కన నిలబడినంత కాలం నీమీాద ఈగైనా వాలదు. నీ ధైర్యసాహసాలు అద్భుతంగా వున్నాయి. నా మాట నమ్ము, నేను నీ స్నేహితుణ్ణి."

ఈ మాటలన్న మనిషివంక అందరూ విచిత్రంగా చూశారు. అతని వేషం, నడకతీరు, మాటతీరు చూస్తే ఒక వీరుడిలాగా, జల్సాపురుషుడిలాగా వున్నాడు. అక్కడున్న అందరికంటె పొడుగ్గా, అందంగా, కండలు తిరిగివున్నాడు. అతని వస్త్రాలు ఖరీదైనవే. కాని బాగా మాసి, దుమ్ముకొట్టుకొని వున్నాయి. టోపీ, అందులోని కుచ్చు నలిగి, రంగు మాసి వున్నాయి. బెల్టులోంచి తుప్పుపట్టిన ఒర, అందులో పొడుగాటి ఖడ్గం వేలాడుతున్నాయి. ప్రపంచంలో ఎవణ్ణీ లెఖ్ఖ్క జమా చెయ్యనట్టు, గర్వంతో కూడిన చిరునవ్వు ఆ యువకుని పెదవులపై నాట్యం చేస్తోంది.

ఈ కొత్తవ్యక్తిని చూడగానే అందరూ వేళాకోళం ప్రారంభించారు :

"ఏ డెవడు ? ఇంకో యువరాజా ?"

"అరేయ్ గట్టిగా అనకురా ఆమాట. ప్రమాదకరంగావున్నాడు మనిషి."

"వీడూ యువరాజేరా; వాడి మొహం చూడ రాదూ?"

"ఆ కుర్రాణ్ణి పట్టుకున్నాడేంవాడు ? వాళ్ళిద్దర్నీ విడదీయండి. ఇద్దర్నీ బందిలిదొడ్డికి తోలుకు పోదాం."

జనం ఇలా అరుచుకుంటూ కొత్తవ్యక్తినీ, యువ

రాజునూ సమీపించి చుట్టుముట్టారు. ఒకడు యువరాజు మీద చెయ్యి వేసి లాగబోయాడు కూడా.

మరుక్షణంలో కొత్తవ్యక్తి ఒరలోంచి కత్తి దూశాడు. యువరాజుమీద చెయ్యి వేసినవాణ్ణి కత్తితో ఒక్కతోపు తోశాడు. ఆ తోపుకు వాడూ, వాడివెనక ముగ్గురూ ఒకళ్ల పై ఒకళ్లు తూలిపడ్డారు.

వెంటనే ఒక వంద గొంతికలు, "ఆ కుక్క వేధ



మీదికివచ్చే జనంతో పోరాడుతున్న యువరాజు, మైల్స్ హెండన్.

వని చంపండి. చంపండి. చంపండి," అని అరిచాయి. జనం ఇంకా దగ్గిరికి వచ్చారు. మన యోధుడు ఒక చేత్తో యువరాజును పట్టుకొని మరొక చేత్తో కత్తి తిప్పుతూ దగ్గర కొస్తున్నవాళ్లని దూరానికి తరమ సాగాడు. యువరాజుకూడా అక్కడ దొరికిన ఒక కఱ్ఱ నందిపుచ్చుకుని మీదికి వచ్చేజనంతో యుద్ధం చెయ్య సాగాడు. అయినా జనం ఆగలేదు. ఇద్దరు ఎంతసేపని వాళ్లతో పోరాడగలరు? ఇద్దరూ ఇంక పట్టుబడిపోయే టట్టున్నారు. జనప్రవాహం కోపోద్రేకంతో నది మీదికి తోసుకొస్తున్నది.

కాని ఇంతలో బాకాలు వినిపించాయి. "రాజ భటులకు దారి ఇవ్వండి," అని హెచ్చరిక వినబడింది. గుఱ్ఱాలపై కొందరు రాజభటులు జనంమీదికి తోసుకు వచ్చారు. గుఱ్ఱాల తొక్కులాటకు, రాజభటుల లాఠీ దెబ్బలకు నిలవలేక జనం ఎక్కడివాళ్లక్కడ చెల్లా చెదరై పోయారు. రాజభటులు నేరుగా గిల్డు హాలు లోపలికి పోయారు. ఇదే సమయమని, కొత్త వ్యక్తి యువరాజును ఎత్తుకుని పరుగుతీశాడు జనం లేని వైపుకు.

## 13

గిల్డుహాల్ లో నృత్యకోలాహలం ఇంకా ముమ్మరంగా సాగుతూ నేవుంది. ఇంతలో నృత్యధ్వనినీ, సంగీతాన్నీ, కోలాహలాన్నీ ముంచేస్తూ బాకాధ్వనులు వినబడ్డాయి. వెంటనే ఎక్కడివాళ్లక్కడ స్తంభించి

పోయారు - గాఢ నిశ్శబ్దం ఒక నిమిషం సేపు. కోట నుంచి అప్పుడే గుర్రంపైవచ్చిన రాజదూత గంభీరమైన కంఠం వినిపించింది. దూరాననున్న వారికి కూడా విని పించేలాగా పొడుగాటి గొట్టంలోంచి చేశాడొక ప్రకటన. ఆ ప్రకటనలోని ఆఖరు మాటలు:

"మహారాజు స్వర్గస్థులయ్యారు."

సమావేశమైన ఆ సభికులపై ఈ దుర్వార్త పిడుగులా పడింది. అందరూ తలలు వంచి కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వున్నారు. పిమ్మట అంతా ఒకే సారిగా మోకరించి, టామ్‌వైపు చేతులు జాచారు; హాలు హాలంతా కంపించేలాగ ఒకే కంఠంతో అన్నారు:

"మహారాజుకు దీర్ఘాయురారోగ్యాలు కలుగు గాక!"

పాపం టామ్ చిత్రప్రతిమలా స్తబ్ధుడై ఈ దృశ్యం చూశాడు; ఒక పక్కన యువరాణి, జేన్ గ్రే, మరో ప్రక్క హెర్ట్‌ఫర్డు ప్రభువు మోకరించి తలలు వంచివున్నారు. అతనికి మెరుపులా ఒక ఆలోచన తట్టింది. హెర్ట్‌ఫర్డు ప్రభువు చెవిలో ఇలా అడిగాడు:

"నిజం చెప్పండి ప్రభూ! మహారాజు తప్ప ఇంకెవ్వరూ ఇవ్వగూడని ఆజ్ఞ నేనిస్తే ఇప్పుడది నెరవేరుతుందా? ఎవ్వరన్నా కాదంటారా?"

"ఈ రాజ్యంలో ఏ ప్రాణీ మీ ఆజ్ఞ తిరస్కరిం

చదు. ఇంగ్లండుకు మహారాజు మీరే. మీ మాటే శాసనం."

టామ్ నిటారుగా నిలబడి మహోత్సాహంతో గొంతెత్తి అన్నాడు:

"ఇకనుంచీ రాజ శాసనం దయ, ప్రేమ, కరుణ. ఈ రాజ్యంలో ఇకమీద క్రూరత్వానికి స్థానం లేదు. ఈ నాటినుంచీ రాజశాసనానికి నెత్తురుమరక లంట రాదు. లేవండి అందరూ. లండన్ గోపురానికి పరి గెత్తి వెళ్లి నార్ఫోక్ ప్రభువును విడిపించండి. ఇది మహా రాజు ఆజ్ఞ."

ఈ మాటలు వినగానే మళ్ళీ అంతా ఒకే కంఠంతో జయ జయ ధ్వనులు చేశారు.

"రక్తశాసనం అంతమైంది. ఇంగ్లండు మహా రాజు ఎడ్వర్డుకూ జై. జై. జై."

## 14

జనసమూహపు బారినుండి తప్పించుకుని సుర క్షిత స్థలానికి పరిగెత్తిన యువరాజు, మైల్స్ హెండన్ సందులు, గొందులు దాటుకుంటూ నదివైపు నడిచారు. త్రోవలో వారికే ఆటంకమూ కలుగలేదు. లండన్ వంతెనమీదికి వచ్చేసరికిమాత్రం మళ్లీ గుంపులోకి జొరబడవలసి వచ్చింది. హెండన్ యువరాజు, అహ కాదు, మహారాజు చెయ్యి గట్టిగా పట్టుకుని వదల్లేదు. అప్పటి కప్పుడే మహారాజు హెన్రీ మరణవార్త నగర

మంతటా అగ్నిప్రమాదంలా వ్యాపించింది. ఏ నోట చూచినా "మహారాజు చనిపోయారు!" అనే మాటలే. కుర్రవాడీ వార్త వినగానే క్షణంసేపు చేష్టలు దక్కి స్తంభించిపోయాడు; కళ్ల వెంబడి బాష్పాలు కాలవ గట్టాయి. కాని, గుంపును చీల్చుకుని ముందుకు పోవడ మెలాగా అనే సమస్యలో ఈదుతున్న మైల్స్ హెండన్ మన బాలరాజు దుఃఖాన్ని గమనించనే లేదు.

తనలో తనే దుఃఖిస్తూ రాజు హెండన్‌తో నడుస్తున్నాడు. అతని కళ్ల ఎదట తండ్రిరూపమే నటించ సాగింది. మహారాజు హెన్రీ ప్రజలను ఎంత హడలు గొట్టినా, తనను మాత్రం అతిప్రేమతో, గారాబంతో చూశాడు. అందుచేత ఆయన మరణించాడని వినగానే ఎడ్వర్డు దుఃఖాని కంతంలేకపోయింది. ఈక్షణంలో తన కంటే దిక్కులేని, అనాథప్రాణి ప్రపంచంలో మరొక టున్నదా అని వాపోయాడు.

"ఆరవ ఎడ్వర్డు మహారాజుకూ జై" అనే నినాదాలు మిన్నుముట్టాయి. ఈ జయ జయ శబ్దాలు విని రాజుహృదయం మహానందంతో పరవశమైంది. గర్వంతో వేళ్ల చివరలవరకూ పులకరించాడు. మరు క్షణంలోనే తనొక్కసారి పరిశీలించుకుని, "హుం! నేను మహారాజుని. ఎంత వింత?" అనుకున్నాడు.

లండన్ వంతెనపై గుంపుని చీల్చుకుని దారి చేసుకుని పోతున్నారు మన స్నేహితులిద్దరూ. లండన్ వంతెన కట్టబడి అప్పటికి ఆరువందల ఏళ్లయింది.

దాదాపు రెండు ఫర్లాంగుల పొడుగుంటుంది. మిగతా వంతెనలకూ దీనికీ తేడా ఏమిటంటే దానిమీద ఎప్పుడూ జనం రద్దీగా తిరుగుతూవుండటమే కాదు. ఆ పక్కనా ఈ పక్కనా వరసగా బీదాబిక్కీ నివసించే పూరిగుడిసె లున్నాయి. దాదా పొక పెద్ద గ్రామానికి సరిపోయే జనులు దానిమీద నివసిస్తున్నారు. దాన్ని ఓమాదిరి పట్టణం అనచ్చు. అక్కడొక సత్రవ వున్నది. సారా దుకాణాలు, రొట్టెల దుకాణాలు, కూరగాయల కొట్లు, ఆఖరి కొక చర్చి కూడా వున్నాయి. మొత్తానికి దానిమీద ప్రజలు లండన్ నగరంలోకి వెళ్లకుండానే తమ కావలసిన వన్నీ అక్కడే కొనుక్కోగలరు; దేనికీ వాళ్లు అది దాటిపో నవసరంలేదు. అక్కడి ప్రతి ఒక్కడికీ ప్రతి మరొక్కడి చరిత్ర అమూలాగ్రం కంఠతా వచ్చు; ఎవడి తల్లి తండ్రు లెవరో, తాత ముత్తాత లెవరో, వాళ్ల కుటుంబ వ్యవహారాలేమిటో, వాళ్లు నిన్న ఏంకూర వండుకు తిన్నారో కూడా చెప్పగలరు. వంతెన ఎప్పుడు ఎవరు కట్టించిందీ, దానికి ఈ ఆరువందల సంవత్సరాలలో ఎప్పుడెప్పుడు మరమ్మతులు జరిగిందీకూడా చెప్పగలరు. వాళ్లు ఒక ప్రత్యేకమైన 'వంతెనభాష' మాట్లాడతారు. వాళ్ల ఆలోచనలు కూడా 'వంతెన ఆలోచనలే'; ఇంతెందుకు వాళ్లు కూసే బూతులు కూడా 'వంతెన బూతులే'. అక్కడ నివసించే ప్రజలు తప్ప ఇంకెవరూ అక్కడ ఒక్క నిమిషమైనా నిలవలేరు. కొత్తవాళ్లు కాప్రాంతం రోత

కలిగిస్తుంది. ఎక్కడ చూసినా చెత్త, రొచ్చు, పందులు. ఆ పందులమందలో పందులై కలిసిపోతారు ప్రజలు. అక్కడే పిల్లలు పుడతారు, పెరుగుతారు. ముసలి వాళ్ళయి చనిపోతారు. మళ్ళీ ఈ లోగా కొత్తతరం తయారౌతుంది. బయటి ప్రపంచం ఎలాంటిదో వా రెరగరు. అసలు లండన్ వంతెనగాక మరో ప్రపంచం ఉందనికూడా వా రెరగరు. రాత్రిం బగళ్లు విరామం లేకుండా అటూ ఇటూ తిరిగే జనం, అరుపులు, ఏడు పులు, సకిలింపులు, బళ్ల చప్పుడు, ఇవే వారి ప్రపంచం. ఆ ప్రపంచానికి అధికారులు తామే.

వంతెనమీద పుట్టి పెరిగిన మనుషులు ఇం కెక్కడికన్నా పొరపాటున వెళ్లవలసివచ్చిందో నీటి బయట చేపల్లా గిలగిల కొట్టుకునేవారు. నిజమైన జీవితం ఇక్కడ తప్ప మరెక్కడా ఉంటానికి వీల్లేదని వారి కొక పరమ విశ్వాసం. 'వంతెన చరిత్రలో' ఒక కథ వున్నది. ఒక 'వంతెన మనిషి' తన డెబ్బయ్యో ఏట వంతెన విడిచి మరేదో వూరు వెళ్లాడట. నిలవచేసిన డబ్బుతో అక్కడ ఇల్లూ అదీ కొనుక్కుని స్థిర పడ్డా డట. కాని అయిదారు రోజులైందో లేదో వాడికి వంతెన మీద ఎక్కడలేని బెంగా పట్టుకుంది. డెభ్బయ్యేళ్లు వంతెనమీద ఆ రణగొణధ్వనిలో, రొచ్చులో, రోతలో హాయిగా జీవించిన ఆ మనిషి ప్రశాంతమైన ఆ పల్లె టూరులో ఒక్క నిమిషం కూడా ఊపిరి పీల్చ లేక ఉక్కిరి బిక్కిరైపోయాడు. ఆ మనాదితో చిక్కి

శల్యమై, మళ్ళీ వంతెనమీాదకే వచ్చి స్థిరపడ్డాడట. మన కథాకాలంనాటికి - ఊహు - ఇదంతా మన కథ కక్కర్లేదు ; ప్రస్తుతాని కొద్దాం.

మైల్స్ హెండర్ ఉండేది ఈ వంతెనమీాదగల సత్రవలోనే. సత్రవను మన మిత్రులిద్దరూ సమీాపించారు. మెల్లెక్కుతుండగా ఒక గార్దభస్వరం వినిపించింది:

"అహ్హా! వచ్చావ్రూ? నీకోసమే నాయనా, ఊరంతా వెతుకుతున్నాను. ఈసారి నా ఇనపచేతుల్నించి తప్పించుకు పోలేవ్రు. నీ బొమికెలు చూర్ణం చేసి కల్లులో కలిపి తాక్కపోతే నా పేరు జాన్ కాంటీ కాదు హే..." అంటూ ఆ తాగుబోతు బాలరాజును పట్టుకొనటానికి చెయ్యి జాపాడు. మైల్స్ హెండన్ రాజు నివతలకు లాగి,

"ఆగు నేస్తం. ఎందుకల్లా తొందరపడతావు? ఇతడు నీ కేమవుతాడు?" అన్నాడు.

"ఇంకోళ్ల గొడవల్లో తలదూర్చకు, తల పగిలిపోగల్దు. ను వ్వేవడివసలు న న్నడగటానికి? వాడు నా కొడుకు."

"అబద్ధం," అని హుంకరించాడు బాలరాజు.

"బలేగా అన్నావు మిత్రమా! నీకు మతి సరిగా ఉన్నా, లేకపోయినా నీ ధైర్యానికి మెచ్చుకోవలసిందే. ఇతడు నీ తండ్రి అయినా కాకపోయినా నేను మాత్రం నిన్ను అతడి కప్పగించను. నిన్ను కొడతా

సని బెదిరిస్తున్నాడు గదూ! నువ్వు నన్ను వదిలిపెట్టకు. నీమీద ఈగ వాలనివ్వను." అని ధైర్యం చెప్పాడు మైల్స్ హెండన్.

"అవును నిజం. ముమ్మాటికీ నిజం. నేను వాడి వెరగను; ఒకవేళ వాడితో వెళ్లవలసివస్తే నా శవం మాత్రమే వెడుతుంది," అన్నాడు రాజు.

"సరే, అయితే, తేలిపోయింది. నీకు రక్షణగా నే నున్నాను."

"చూద్దాం, చూద్దాం. వీణ్ణీ, నిన్నూ కూడా కట్టగట్టి—"

"ఈ క్రూరవాడిమీద చెయ్యి వేశావో, నీ ప్రాణాలు నీకు దక్కవు" "అంటూ మైల్స్ హెండన్ కత్తిమీద చెయ్యి వేశాడు. కన్నుమూసి తెరిచే టంతలో బొడ్డులోంచి బాకు లాగాడు. హెండన్ గబుక్కున కాంటీచేయి పట్టుకుని మెలిపెట్టి బాకు లాక్కుని పారేశాడు. కాంటీ వెనక్కి తగ్గాడు.

"ఏయ్, మూర్తీభవించిన చెత్తా! విను. ఈ బాల్లుణ్ణి కొందరు తాగుబోతులనుంచి రక్షించాను నేను. సమయాని కక్కడ లేకపోతే నిష్కారణంగా ఇతన్ని వాళ్లు మెడ పిసికి చంపిఉండేవారు. ఇంత శ్రమపడి ఇతన్ని రక్షించింది నీ చేతుల కప్పగించడాని కనుకున్నావా? నువ్వు తనతండ్రి కాదని ఇతడంటు న్నాడు. అది నిజమని నమ్ముతున్నాను. అతడు నీ చేతుల్లోపడి నరకబాధపడటంకంటే నదిలోపడి చని



"హెండన్ కాంటీచెయ్యి మెలిపెట్టి బాకు లాక్కొని పారేశాడు"

పోవటం మంచిది కనక నువ్వింక వెళ్లవచ్చు. ఊఁ, కదులు. నాకు కోపమొచ్చిందంటే మనిషిని కాను. నే నాట్టే మాటలు ఖర్చుపెట్టేవాణ్ణి కాను."

జాన్ కాంటీ చేసేది లేక బండబూతులు కురుస్తూ, కదిలిపోయాడు.

హెండన్ సరాసరి సత్రవలో ప్రవేశించాడు. భోజనం పైకి పట్టుకు రావలసిందని చెప్పి బాలరాజుతో కలిసి మెట్లెక్కి మేడమీదికి వెళ్లాడు. అందులో తను

అద్దెకు తీసుకున్న గది తెరిచాడు. ఒకమూల మంచం, దానిమీాద మాసిన పరుపు, ఒక బల్ల, రెండు కుర్చీ పీటలు వున్నాయి. జబ్బుగా వున్నట్టు కనిపించే రెండు కొవ్వొత్తిముక్కలు ఆ గదిని మసకగా వెలిగిస్తు న్నాయి.

ఆకలివల్ల, తిప్పటవల్ల అలిసి, నీరసించివున్న రాజు కాళ్ళీడ్చుకుంటూపోయి మంచంమీాద మేను వాల్చాడు. అప్పటికి రాత్రి రెండు, మూడు గంటలవు తుంది. సగం నిద్రలోవున్నట్టు ఇలా గొణిగాడు:

"భోజనం రాగానే నన్ను లేపు," అంటూ నిద్రలో మునిగిపోయాడు.

హెండర్ చిరునవ్వు నవ్వి తనలో త నిలా అనుకున్నాడు:

"ఈ బిచ్చగాడి ప్రవర్తన మహా విచిత్రంగా వున్నదే. దర్జాగా లోపలికి వచ్చాడు; అడగనూలేదు పెట్టనూ లేదు, తన సొంతయిల్లులాగా మంచమెక్కి ముసుగెట్టి పడుకున్నాడు. నే నెక్కడ పడుకుంటాననుకున్నాడో. పాపం మతి పూర్తిగా చలించింది. తను వేల్సు యువరాజు ననే విచిత్రమైన ఊహ ఈ పసివాడి కెలాగ వచ్చిందో, ఆశ్చర్యంగా వుంది. లక్షణాలను బట్టి చూస్తే అచ్చంగా రాజకుమారుడివలెనే వున్నాడు. పాపం దిక్కులేని పక్షి. ఎన్నికష్టాలు పడి వున్నాడో; లేకపోతే మనస్సు అలా పాడైవుండదు. సరే. నే నతనికి స్నేహితుడుగా వుంటాను; నా

ప్రాణాలిచ్చియైనాసరే చివరవరకూ రక్షిస్తాను. ఎందు కనో ఈ పసివాడిమీాద అపారమైన, అవ్యాజమైన ప్రేమ కలుగుతున్నది. ఆ తాగుబోతును, ఇందాక ఆ గుంపును ఎంత ధీమాగా, ధైర్యంగా ఎదిరించాడు! ఎంత చక్కని, ముద్దొచ్చే చిన్నారిముఖం! పాపం కళ్లు మూసి, కష్టాలు మరిచి గాఢనిద్రలో లీనమై పోయాడు. అమాయకత్వం ముఖంమీాద తాండవి స్తోంది. నే నతనికి చదువు నేర్పుతాను; మెల్లిగా మనో వ్యాధి కుదురుస్తాను; నా తమ్ముడివలె చూచుకుని సంరక్షిస్తాను; అతన్ని బాధించటానికి వచ్చినవా ళ్లెవ రైనా సరే తల రెండుచెక్కలు చేస్తాను."

బాలరాజు అమాయకంగా నిద్రపోతున్నాడు. మైల్స్ హెండర్ అతనిమీాదికి వంగి, ప్రేమగా బుగ్గల మీాద, తలమీాద నిమిరాడు. ఇంతలో బాలరాజు చలికిగాబోలు జవ్వన ఆపాదమస్తకం వణికాడు.

"పాపం చలికి వణుకుతున్నాడు. ఎంత మంద బుద్ధిని! కప్పకుండా వదిలేశాను. ఏం కప్పను? పోనీ లేవదీసి పైన పరుపు కప్పుదామంటే, గాఢనిద్రలో వున్నాడు; లేపడం మంచిది కాదు."

కప్పడాని కేదన్నా దొరుకుతుందేమో నని మైల్స్‌హెండన్ గదంతా వెదికి చూశాడు. చివరికి తనకోటు తీసి కుర్రవాడికి వెచ్చగా కప్పాడు. "నాకు కోటు లేకపోయినా ఫరవా లేదు. చుప్పటిగాని కోటు గాని లేకుండా పరాయిదేశాల చీకటికొట్లలో ఏడు

దీర్ఘ శీతాకాలాలు గడపలేదా? ఇప్పుడు స్వదేశంలో
మధురమైన స్వేచ్ఛ ననుభవిస్తున్నాను; ఇది చాలు
నాకు. ఈ చలి నాకో లెక్కా?" అనుకుంటూ మన
వీరుడు, కాలాడిస్తూవుంటే చలి అనిపించదని, గదిలో
పచార్లుచేస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు.

"ఈ పసివాడికి ఈ పిచ్చి ఎలా పట్టిందో వింతగా
వుంది. ఇంకా తను వేల్సు యువరాజునే నని భావిస్తు
న్నాడు. వేల్సు యువరాజు ఇప్పుడు మహారాజు అయి
నట్లు తెలియదుగాబోలు. తెలిసినా పిచ్చివాడికేముందీ?
తను వేల్సు యువరాజునే నంటాడు.....నాతండ్రిగారు
బతికున్నారో లేదో ఏడేళ్ళయింది ఆయన క్షేమసమా
చారాలు తెలిసి. ఇంటిదగ్గర మిగతావాళ్ళంతా ఎలా
వున్నారో? నన్ను మరిచిపోయివుండరుగద. ఈ పసి
వాణ్ణి నాతో ఇంటికి తీసుకుపోతాను. నా తండ్రిగారు
గాని, అన్నగారు గాని అభ్యంతరం చెప్పరు. ఎటొచ్చీ
తమ్ముడు హ్యూ అభ్యంతర పెట్టచ్చు. కాని నేను వాణ్ణి
లెక్కచేస్తానా? అడ్డ వస్తే తల బద్దలు గొడతాను.
ఏమో. హ్యూ బుద్ధి ఈపాటికి మారివుండగూడదా?
ఊహూ మారదు. వాడిబుద్ధి అంతే. నక్క, కుక్క,
పంది, గాడిద ఏ పేరు పెట్టినా వాడు సార్థకం చేసు
కుంటాడు..."

అతని ఆలోచనల కడ్డంగా ఒక సేవకుడు భోజన
పదార్థాలు తీసుకొచ్చి బల్లమీద పెట్టాడు. కుర్చీ
పీటలు బల్ల కటొకటి ఇటొకటి వేశాడు. తలుపు మూసి

వెళ్లిపోయాడు. ముయ్యాటంలో దఢేలున శబ్దమైంది. ఆ శబ్దానికి బాలరాజు లేచాడు. చుట్టూ సంతోషంగా కలయచూశాడు. "పట్టి కలేనా? నిజమనుకున్నా." అని నిట్టూర్పులు విడుస్తూ తనలో తను గొణిగాడు. ఇంతలో తనమీద కప్పబడిన కోటు చూశాడు. అతని దృష్టి కోటుమీదనుండి మైల్సుమీదకు మరలింది. తనకోసం అతడు ఎంత త్యాగంచేశాడో గుర్తించాడు.

"పాపం నువ్వు చలికి వణుకుతున్నట్టున్నావు. తీసుకో ఇక అక్కర్లేదు నీకోటు. తీసుకో, నువ్వు చాలా మంచివాడివిలా కనిపిస్తున్నావు," అన్నాడు కృతజ్ఞతతో. మంచం దిగి బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు. ఒక మూల చేతులు కడుక్కునే బేసిన్ వున్నది. అక్కడకు వెళ్లి ఏదో నిరీక్షిస్తున్నట్లు నుంచున్నాడు.

## 15

బాలరాజు సీటిబేసిన్ వద్ద మౌనంగా నుంచోవటం చూసి మైల్సుహెండన్ అన్నాడు :

"ఫస్టుక్లాసయిన భోజనం వచ్చింది. వేడివేడిగా, పొగలుగక్కుతూ, ఆహ్వానిస్తున్నది చూశావా? ఇదేమిటో తెలుసా? కోడిమాంసం; రా, నీ కడుపు పట్టినంత తిను. తిని, నీళ్లుతాగి, కాస్సేపు కునుకు తీశావంటే, పోయిన ఉషారు తిరిగివస్తుంది."

బాలరాజు ఇంకా మౌనంగానే నిల్చున్నాడు

అతని ముఖంలో కొంచెం చిరాకు, విసుగు కూడా కని పిస్తున్నాయి. హెండర్‌కి అర్థం కాలేదు సంగతేమిటో.

"ఏమిటలా చూస్తావ్?" అని అడిగాడు.

"నేను ముఖంకడుక్కోవాలి."

"ఓస్ ఇంతేనా? దీనికోసం నన్నడగాలా? ఇక్కడి వస్తువులు నీ ఇష్టమొచ్చినట్టు, నీ సొంతంలాగా వాడుకో. దేనికీ నన్నడగక్కర్లేదు."

అయినా బాలరాజు కదల్లేదు, మెదల్లేదు; అలాగే నుంచున్నాడు; చిరాగ్గా కాలితో నేల తంతు న్నాడు, హెండర్ ఇంకా విస్తుపోయాడు అర్థంకాక.

"అరె. అలా నిలబడిపోయావేమిటి? ఇంకా ఏం కావాలి?"

"నీళ్లు అందించాలని తెలియదూ? అనవస రంగా వాగక నీళ్లుపొయ్యి."

హెండర్ వెక్కిరింపుగా నవ్వబోయాడు; కాని నవ్వును బలవంతాన అణుచుకుని, "చచ్చాన్రా దేవుడా! ఇదా సంగతి. ఇతని ప్రవర్తన అంతకంతకు విచిత్రమై పోతున్న దే," అనుకున్నాడు లోపల. గబ గబ లేచి బాలరాజుఆజ్ఞ నిర్వర్తించాడు. ఇంతలో.

"చాలు. తువ్వాలు—" అని గద్దింపు విన బడింది. ఉలికిపడి బుజానవున్న తువ్వాలుతీసి మాట్లాడ కుండా అందించాడు. తరవాత తనుకూడా ముఖం, చేతులు, కాళ్లు కడుక్కున్నాడు. బాలరాజు కుర్చీ పీట లాక్కుని భోజన మారగించటానికి సిద్ధపడు

తున్నాడు. హెండన్ రెండో కుర్చీపీటదగ్గరసా లాక్కుని కూర్చోబోయాడు బాలరాజు గభాలునలేచి అధికారస్వరంతో గర్జించాడు:

"ఆగు. మహారాజుసన్నిధిలో కూర్చుంటావా? బుద్ధిలేదూ?"

పెడుగుపాటులాంటి ఈ గర్జనకు హెండర్ పునాదులతోసహా కదిలిపోయి నిల్చున్నాడు.

"ఓ. ఈ పిచ్చివాడి పిచ్చి, కాలంతోపాటు మారుతోందే. వృద్ధరాజు పోయినసంగతి ఇతనికి కూడా ఎలా తెలిసిందో? వేల్సుయువరాజుదశలోంచి మహారాజు దశలోకి దిగింది పెచ్చి. ఇతనితోపాటే నేను కూడా మారాలి; కొంత కాలంపాటు ఈ పిచ్చికి తగ్గట్టే నడుచుకోవాలి. మరో మార్గంలేదు. లేకపోతే నన్ను లండన్ గోపురంలో ఖయిదుచేస్తా నంటాడు కూడాను."

ఈ ఆలోచనతో తనలో తనే నవ్వుకున్నాడు. రెండో కుర్చీపీట ఇవతలకు లాగివేసి బాలరాజు వెనక చేతులు కట్టుకునుంచున్నాడు. సేవకుడివలె అవీ, ఇవీ; అందిస్తున్నాడు. కాళ్లు నొప్పులు పెట్టినయ్. ఆ కాలిమీద కాసేపు, ఈ కాలిమీద కాసేపు నుంచుంటున్నాడు.

బాలరాజుభోజనం పూర్తయింది. సుష్టుగా తినటంవల్ల రాజఠీవి కొంచెం నడలింది; ఉషారు హెచ్చింది, మాట్లాడాలని బుద్ధిపుట్టింది.

"నీ పేరేమిటన్నావ్?"

"మైల్స్ హెండన్ అంటారు ప్రభూ!" అని

జవాబిచ్చాడు. 'ఇతనితో పేచీరాకుండా వుండాలంటే ప్రభూ, మహారాజా, స్వామీ మొదలైన పదాలు ఉపయోగించాల్సిందే. ఇంతలో వచ్చిన నష్టమేమీ లేదుగదా! నేను కొంచెం మోటుగా వ్యవహరిస్తే అంతా అభాసవుతుంది,' అనుకున్నాడు తనలో తను. బాలరాజు ఇంకో గ్లాసెడు సారాయం తాగి మూతి తుడుచుకున్నాడు; హృదయం వెచ్చబడింది. సగం మూసుకున్న కళ్లలోంచి సంతృప్తి తొంగిచూస్తోంది! ఇలా గన్నాడు:

"ఊఁ, నీకథ కాస్త వినిపించు. నిన్నుచూస్తే దయ కలుగుతోంది. ఏదన్నా ప్రభుకుటుంబంలోనివాడివా?"

"అవును మహారాజా! నాతండ్రి కెంట్ రాష్ట్రం లోని 'హెండన్ హాల్' అధిపతి; ఆయనపేరు సర్ రిచర్డు హెండన్."

"ఎప్పుడో విన్నట్టే జ్ఞాపకం. ఊఁ, నీ కథ చెప్పు."

"ఆ, పెద్ద కథంటూ ఏం లేదు ప్రభూ! ఓ అరగంటసేపు తమరికి వినోదంగా చెప్పమంటే చెబు తాను. నా తండ్రి సర్ రిచర్డు చాలా ధనవంతుడు; ధర్మగుణానికి పేరుపడ్డవాడు. నా తల్లి నా చిన్నతనం లోనే చనిపోయింది. నాకు ఆర్థర్ అనేఅన్న, హ్యూ అనే తమ్ముడు వున్నారు. ఆర్థర్‌కు మా తండ్రిగుణాలే అబ్బినై. కాని హ్యూ 'దుష్టబుద్ధి' అనేపేరుకు తగిన వాడు; నీచుడు, అసూయ, ద్రోహచింత, స్వార్థం మొదలైన దుర్గుణాలు మూర్తీభవించినవాడు. అతడు

చిన్నప్పటినుంచీ అంతే; పదేళ్లకిందట నేను స్వదేశం నుండి వెళ్లగొట్టబడినప్పుడూ అంతే. అప్పటికతనికి పందొమ్మిదేళ్ల వయస్సు. నా కిరవై ఏళ్లు, నా అన్న ఆర్థర్ కు ఇరిపై రెండేళ్లు ఉంటాయి. మా మేనత్తకు ఎడిత్ అనే కూతురున్నది; ఆమే కప్పటికి పదహారేళ్లుంటాయి. మా ఇంట్లోనే ఉండేది; అందాలబరిణె; సుగుణాలమూట. ఆమెకు అన్నదమ్ము లెవరూలేరు; తండ్రికున్న అపార సంపదలన్నిటికీ ఆమేవారసురాలు. నే నామెను ప్రేమించాను; ఆమె నన్ను ప్రేమించింది. కాని మా తండ్రి ఆమెను ఆర్థర్ కివ్వాలని సంకల్పించాడు. ఆర్థర్ అదివరకే మరొక పిల్లని ప్రేమించి రహస్యంగా పెళ్లి చేసుకుందామనే ఆలోచనలో వున్నాడు. అందుచేత అతడు నాకు, ఎడిత్ కు అడ్డం రానని, మేమిద్దరం స్వేచ్ఛగా ప్రేమించుకోవచ్చుననీ చెప్పాడు. నా తమ్ముడు హ్యూ వున్నాడే, వాడికి ఎడిత్ కుగల అపారధనంమీద ప్రేమపుట్టింది. ఎడిత్ ను పెళ్లి చేసుకుంటే ఆ ధనమంతా తనకే చెందుతుందిగదా అని వాడి దురాశ. ఎలాగైనా మా ఇద్దర్నీ విడదీయాలని చూశాడు. నామీద ఎన్నో చాడీలు ఎడిత్ కు చెప్పాడు. కాని ఆమె వాణ్ణి నమ్మక తోసివేసింది.

మా తండ్రికి మాఅందరిలోకీ హ్యూ అంటే విపరీతమైన అభిమానం. కడగొట్టుకొడుకు కనుకనూ, అందరికీ వాడంటే అసహ్యం కనుకనూ, హ్యూను

మా తండ్రి ప్రేమగా చూసేవారు. పైగా వాడు ఆయన దగ్గర జేరి తియ్యటి మాటలు చెబుతుండేవాడు. అంత చాకచక్యంగా అబద్ధాన్ని నిజం చెయ్యగల దొంగ ఇంకోడు లేడు. నేనా రోజుల్లో కొంచెం జల్సాగా, పోకిరీగా తిరిగేవాణ్ణి. అంతే ఇతరులకు హానిచేసేవాణ్ణని అర్థంకాదు. నా నడతవల్ల ఎవరికీ బాధకలగకుండా చూసుకునేవాడిని. అయినా హ్యూ మాత్రం నా మీద పగకొద్ది మానాయనగారిదగ్గర కొండెములు చెప్పి నేనంటే ద్వేషంపుట్టేట్టు చేశాడు. మా అన్న కొంచెం రోగిష్టిమనిషి. అతడు కాస్తా ఎప్పుడో గుటుక్కుమంటే, ఈలోగా నన్ను తన కడ్డంరాకుండా దూరానికి పంపించివెయ్యవచ్చునని, ఇక ఎడిత్ ధన సంపదలు తనకు చెందటానికి అడ్డంకి వుండదని హ్యూ ఎత్తువేశాడు. ఆ తరవాత జరిగిన కథంతా చెప్పాలంటే చాలాసేపు పడుతుంది; టూకీగా చెబుతాను; మేడ మీద నా గదిలో కిటికీకి ఒక రోజున హ్యూ తాడు వేళ్లాడదీశాడు. మా తండ్రిని పిలుచుకువచ్చి ఆ తాడు చూపించాడు. నేను ఎడిత్ ను లేవదీసుకుపోయి రహస్య వివాహం చేసుకోవాలని పన్నాగం పన్నాననీ, అందుకే తాడు అలా వేళ్లాడదీశాననీ, నా మీద కల్పించి చెప్పాడు; కొందరు సేవకులక్కూడా లంచాలు ముట్టజెప్పి వాళ్లచేత సాక్ష్యమిప్పించాడు. నా తండ్రికి పట్టరాని కోపంవచ్చింది.

తత్ఫలితంగా నేను దేశద్రిమ్మరిని కావలసి

వచ్చింది. మా తండ్రి మూడేళ్లపాటు నన్ను ఇంగ్లండు దేశంనుంచి బహిష్కరించారు. యూరప్ ఖండంలో అప్పుడు యుద్ధాలు ముమ్మరంగా జరుగుతున్నాయి. వాటిల్లో ఇంగ్లండుపక్షాన చేరి పోరాడాను. ఒక యుద్ధంలో నేను శత్రువులకు ఖైదీగా చిక్కాను. ఆ దేశపు కారాగారాల్లో పదేళ్లపాటు నరకజీవితం గడిపాను. తరువాత జరిగిన సంధిలో ఖైదీలందరినీ విడిచిపెట్టారు. నేను కూడా విడుదలై స్వదేశానికి వచ్చాను; నేను తెచ్చుకున్న డబ్బు ఖర్చయిపోయింది; ఇక ఏకాద్దిగానో మిగిలింది. ఈ పదేళ్లలో హెండన్ హాల్‌లో ఏం జరిగిందో, మా తండ్రి మా అన్న బతికున్నారో లేదో కూడా నాకు తెలియదు. ఎడిత్ ఏమైందో తెలియదు. సాధ్యమైనంత త్వరగా ఇంటికి పోవాలని మనస్సు ఉరుకులు, పరుగులు పెడుతోంది. ఇదీ నా కథ."

బాలరాజు కథ సావధానంగా విన్నాడు. కాసేపు మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"నీకు చాలా అన్యాయం జరిగింది. కాని నీకు త్వరలోనే న్యాయం జరిగేట్టు చేస్తాను. ఏసుక్రీస్తు సాక్షిగా, శిలువసాక్షిగా మహారాజునైన నేను వాగ్దానం చేస్తున్నాను," అన్నాడు.

మైల్స్ హెండన్ కథ వినగానే బాలరాజుకు కూడా తన గాధ చెప్పుకోవాలని బుద్ధిపుట్టింది. తను లామెదుస్తుల్లోకి ఎలా వచ్చిందీ, టామ్ తన దుస్తుల్లో

మహారాజుగా ఎలా చెలామణి అవుతున్నదీ, తను ఏ యే కష్టాలు పడ్డదీ, అంతా వివరంగా వర్ణించాడు. హెండన్ ఈ వృత్తాంతం విని పొందిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. బాలరాజు తన కథ ముగించ గానే, హెండన్ తనలో తను ఇలా అనుకున్నాడు :

"ఇతని తెలివి తేట లద్భుతంగా వున్నాయి. ఎంత చక్కని కథ అల్లాడు! నిజమా అని భ్రమింపజేసేట్టుం దితని కల్పితకథ. సామాన్యమైన బుర్ర కాదు. పాపం, ఈ అనాథ శిశువెవరో ఇలా పిచ్చివాడై జాలి గొలుపు తున్నాడు. నే నితన్ని విడవను. స్నేహితుడుగా తమ్ముడుగా ఆదరిస్తాను ; మనోవ్యాధిని నయం చేయి స్తాను. ఎప్పటికో ఒక రోజుకి సంపూర్ణవ్యక్తి అవు తాడు; తనకీ, నాకూ పేరుతెస్తాడు. ఇతడు నా వాడు; నే నతనివాణ్ణి.

బాలరాజు మళ్లీ ప్రారంభించాడు :

"నన్ను అవమానంనుంచి, దెబ్బలనుంచి రక్షిం చావు. నా ప్రాణాన్ని రక్షించటం మూలంగా ఇంగ్లండు దేశకిరీటాన్నే రక్షించావు. నీకు కృతజ్ఞుణ్ణి. నిన్ను బహుమానించటం నావిధి. నీ ఇష్టమొచ్చిన వరమడుగు అనుగ్రహిస్తాను."

ఆలోచనలో మునిగివున్న హెండన్ ఈ మాటలు విని తెప్పరిల్లాడు. 'నావిధి నేను నెరవేర్చాను, నాకు బహుమాన మెందుకు,' అని చెబుదామను కున్నాడు. ఇంతలో చక్కని ఆలోచన తట్టింది.

"ఆలోచించుకో నెమ్మదిగా. ఇంత ముఖ్య విషయంమీద తొందరపడి నిర్ణయం చెయ్యబోకు. తరవాలేదు, నీకేం భయంలేదు," అన్నాడు రాజు.

హెండర్సన్ ఆలోచించాడు:

"ఆ, అది. అది అడుగుతాను ఇదే సమయం. ఇది దాటిపోతే మళ్లీ కుదరదు. గంటనుంచీ చూస్తున్నాగా, చాలా బాధగా వుంది. ఇప్పుడడక్కపోతే ఇలా ఎన్నిరోజులు బాధపడవలసివస్తుందో. అతడు వరమిస్తాననడం మంచిదే అయింది."

హెండన్ అతివినయంగా రాజుముందు మోకరించాడు.

"ప్రభూ! నేను తమ భృత్యుణ్ణి. భృత్యుడు చెయ్యవలసిన కర్తవ్యమే నేను చేశాను. మహారాజకు ప్రాణదానం చెయ్యగలగటంకంటె వేరే అదృష్టమేం కావాలి నాకు? అయినా తమరు కోరుకోమన్నారు గనక ఒక చిన్న కోరిక కోరుకుంటాను.

సుమారు నాలుగువందల ఏళ్లకిందట ఇంగ్లండు రాజైన జాన్‌కు, ఫ్రాన్సురాజుకూ విరోధం వచ్చిన సంగతి తమకు తెలుసు. ఈ విరోధం పరిష్కారం చెయ్యటానికి ఇద్దరు రాజులూ ఒక తేలికమార్గం కని పెట్టారు; తమతరఫున ద్వంద్వయుద్ధం చేసేందుకు ఇద్దరు వీరులను నియమించారు. ఈ శౌర్యప్రదర్శనానికి సాక్షిగా స్పెయిన్ రాజు నెన్నుకున్నారు. ప్రదర్శన స్థలంలోకి ఫ్రెంచి వీరుడు ప్రవేశించాడు. అతడది

వరకే అనేక ద్వంద్వయుద్ధాల్లో గెలిచి ప్రకాస్తి పొంది వున్నాడు. అతన్ని చూసి ఇంగ్లీషు వీరులంతా హడిలి వెనకంజవేశారు. ఒక్కరూ సాహసించి ముందుకు రాలేకపోయారు. అందుచేత ఇంగ్లీషురాజుకు ఓటమి కలిగేట్టు కనిపించింది. ఆఖరి ఉపాయంగా జాన్ రాజు లండన్ గోపురంలో ఖైదీగా మగ్గుతున్న డికోర్సీ ప్రభువును విడుదలచేసి పిలిపించాడు. డికోర్సీప్రభువు ద్వంద్వయుద్ధానికి ఇష్టపడి, రంగస్థలంలోకి అడుగు పెట్టాడు; మనిషి తాడిచెట్టుఎత్తున, మర్రిచెట్టులావున, రాక్షసిలాగా వున్నాడు. ఆయన్ని చూసీచూడగానే ఫ్రెంచివీరుడు హడలిపోయాడు. ఆయనపేరు వినగానే మూర్ఛపోయినంత పని అయింది అతనికి. ఎందుకంటే డికోర్సీప్రభువు బలశౌర్యాలు ప్రపంచ ప్రఖ్యాతి గలవి. చివరికి ఫ్రెంచివీరుడు కత్తిపారేసి కాలికి బుద్ధి చెప్పాడు. అంచేత జాన్ రాజు గెలిచాడు. తనని గెలిపించినందుకు కృతజ్ఞతగా డికోర్సీప్రభువును "నీ ఇష్టం వచ్చిన కోరిక కోరుకో" మన్నాడు. డికోర్సీ తనకే మక్కరలేదనీ, తనూ, తనసంతతివాళ్లూ ఇంగ్లండు రాజుల సమక్షంలో టోపీతీసివేయనవసరం లేకుండా అనుగ్రహించమన్నాడు. జాన్ రాజు ఆ కోరిక మన్నించాడు. డికోర్సీప్రభువుసంతతివాళ్లు ఇప్పటికీ ఇంగ్లండు రాజులసమక్షంలో టోపీలు తీసివేయరని తమకు తెలుసుగదా! అదేవిధంగా నేనుకూడా ఒక చిన్న కోరిక కోరుతున్నాను. నేను, నా సంతతివాళ్లు

ఇంగ్లండు రాజులసన్నిధిలో నుంచోనవసరం లేకుండా, కూర్చోటం అపరాధం కాకుండా అనుగ్రహించాలి. ఇదే నా కోరిక."

"లే, సర్ మైల్స్ హెండన్! నీ కోరిక అనుగ్రహించాం. సూర్యచంద్రులున్నంతవరకూ, భూమిమీద ఇంగ్లండు దేశం, ఇంగ్లండులో మహారాజపదవి ఉన్నంతకాలం నీ కోరికకు అంతరాయం రాదు," అని గంభీరంగా అంటూ, బాలరాజు హెండన్ ఖడ్గం తీసుకుని అతని బుజంమీద లాంఛన ప్రకారం తాకించాడు.

హెండన్ లేచి కుర్చీపీట లాక్కుని ఉసురుసురు మంటూ చతికిలపడ్డాడు. బాలరాజు ఏదో ఆలోచిస్తూ గదిలో పచార్లు చెయ్యసాగాడు. హెండన్ అతన్ని చూస్తూ అనుకున్నాడు:

"సమయానికి ఆలోచనతట్టింది గాని లేకపోతే చచ్చేవాణ్ణే. ఎన్ని వారాలు నుంచునిఉండవలసి వచ్చేదో? ఈ పిచ్చివాడు నన్ను కూర్చోవద్దంటాడయ్యే. నయమే. ఇక ఫర్వాలేదు. దేశాలు తిరిగి తిరిగి, నాకాళ్లు అసలే పచ్చిపుళ్లుగా వున్నాయి. ఇప్పుడు నాకన్నిటికంటే ముఖ్యంగా కావలసింది విశ్రాంతి... అన్నట్టు నన్ను సర్ మైల్స్ హెండన్ అని పిలిచాడు. నాకు 'సర్' బిరుదుకూడా తగిలించా డన్నమాట... నవ్వొస్తోంది ఇతని తరహా చూస్తే. కాని నవ్వగూడదు పాపం. నా కేది నవ్వుకలిగిస్తోందో అది అతనికి పరమ సత్యం. దాన్ని వెక్కిరిస్తున్నట్టు తెలిస్తే నొచ్చుకుం

టాడు...కొంపతీసి ఇతర్లముందు కూడా నన్ను సర్ మైల్స్ అని పిలవడుగదా. నా వాలకానికి, సర్ బిరుదానికి చాల మైళ్ళదూరముంది. జనం ఏడిపించిపారేస్తారు...పోనీలే పిలిస్తే పిలవనీ. సర్ మైల్స్ అని పిలిస్తే అతనికి సంతోషం కలిగేటప్పుడు నేను మాత్రం ఎందుకు వద్దనాలి? అతని సంతోషమే నాకుసంతృప్తి."

## 16

మిత్రు లిద్దరికీ ఒక్కసారే నిద్ర ముంచుకొచ్చింది. బాలరాజు మంచంమీదికి చేరాడు.

"అరె. ఇతడు మళ్ళీ నా మంచం ఆక్రమించాడే? నే నేం చెయ్యాను, ఎక్కడ పడుకోను?"అనుకున్నాడు హెండన్. హెండన్ భావాలు గ్రహించాడో ఏమో, బాలరాజు బద్ధకంగా ఆవులిస్తూ ఆజ్ఞాపించాడు: "నువ్వు తలుపుమూసి దాని దగ్గరే పడుకో. జాగ్రత్తగా కాపలాకాయి." మరుక్షణంలో బాలరాజు దుప్పటి ముసుగెట్టి కష్టాలకన్నిటికీ దూరంగా నిద్రాదేవి ఒళ్ళోకి పారిపోయాడు.

"ఇతడు నిజంగా రాజై పుట్టవలసినవాడుగాని సామాన్యుడు కాడు. ఎక్కడా వెలితిలేకుండా రాజు పాత్ర నటిస్తున్నాడు,"అని మెచ్చుకున్నాడు హెండన్. తను తలుపుకడ్డంగా కాళ్లు చాచుకుని వట్టి నేలమీదే మేను వాల్చాడు. వెంటనే నిద్రపట్టింది. అప్పటికి తెల్లవారటాని కింక ఎంతో వ్యవధిలేదు. హెండన్ ఆ పదు

కోవడం, పడుకోవడం మధ్యాహ్నం ఒంటిగంటదాకా పడుకున్నాడు నిశ్చింతగా. తరవాత లేచి ఇంకా నిద్ర పోతున్న బాలరాజు ముసుగు తొలగించాడు. దారం ముక్కలతో అతని కొలతలన్నీ తీసుకున్నాడు. కొలత లన్నీ తీసుకోవటం పూర్తయ్యే క్షణంలో రాజు మేలు కున్నాడు. చలి ఎక్కువగా వుందని గునిశాడు. ఏం చేస్తున్నావని అడిగాడు.

"ఏం లేదు ప్రభూ! కొంచెం బజార్లో పనివుంది, వెళ్లి వెంటనే తిరిగొస్తాను. తమరు నిద్రపోండి. ఆగండి, బాగా కప్పుతాను, ఆ, అలా." ఈ చివరిమాటలు వినబడేలోపుగానే బాలరాజు స్వప్నప్రపంచంలో అడుగు పెట్టాడు. హెండన్ నిశ్శబ్దంగా తలుపు తెరిచి, మూసి బయటికి వెళ్లాడు. అరగంటతరవాత తిరిగి వచ్చాడు. బాలరాజుకు సరిపోయే కోటు, లాగు. బూట్లు మొదలైనవి కొనుక్కొచ్చాడు. అవన్నీ పాతవే. అయినా అట్టే చిరగలేదు. కొంచెం మాసివున్నాయి. మంచంకేసి ఒకసారి చూసి హెండన్ కుర్చీపీటమీద కూర్చుని దుస్తులు పరిశీలించాడు.

"డబ్బుంటే ఇంకా మంచివి కొందును. లేనప్పు డేం చేస్తాం; ఉన్నదాంతోనే సంతృప్తిపడాలి -

"సోకైనా పిల్లరా,-దానిసూపు లెంత వాడిరా...కొంగు
సోకినంత సాలురా, - గుండెసోలి తేలిపోవురా..."

అని హెండన్ జానపదగీతం అందుకున్నాడు.

"పసివాడు కొంచెం కదిలినట్టున్నాడు. మన

బండగొంతిక కొంచెం తగ్గించాలి. లేకపోతే మేలుకుం టాడు. ఎంత అలిసివున్నాడో, బాగా నిద్రపోయినంత సేపు పోనివ్వాలి. ముందింకా బోలెడు ప్రయాణం చెయ్యాలి కూడాను...ఈలాగు బాగానే వుంది. రెండు చోట్లమాత్రం కాస్త టాకీలువెయ్యాలి. కోటు ఫరవా లేదు...ఓర్...ఈ చిరుగు చూడలేదే.....బూట్లు గట్టి గానే వున్నాయి. అతని చిన్న పాదాల కివి చాలు. కాళ్లు వెచ్చగా వుంచటానికేగదా. ఇవి చాలు, అట్టే ఫాషన్‌గా లేకపోతే నేం?

"సోకైనా పిల్లరా, - దాని సూపు లెంత వాడిరా...—"

హెండన్ నెమ్మదిగా పాడుతున్నాడు. చొక్కా జేబుకు గుచ్చిన సూదీ, జేబులోంచి దారమూ తీశాడు. సూదిలోకి దార మెక్కించటం ఒక పెద్ద సమస్యైపో యింది. మగవాళ్లందరికున్న అలవాటే హెండన్‌కూ ఉన్నది. సూది కదలకుండా గట్టిగా పట్టుకున్నాడు. దారం రెండో చేత్తోపట్టుకుని సూదిలో కెక్కించటానికి ప్రయత్నం చేశాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా గురి తప్పిపోతోంది. ఆడవాళ్లు అలా చెయ్యరు. దారం కదలకుండా పట్టుకుని సూదినే కదులుస్తూ దారం ఎక్కిస్తారు. అది తేలికపద్ధతి. కాని పురుషులకీ పద్ధతి వెయ్యి జన్మ లెత్తినా అలవడదు. అసలు సునాయా సంగా సూదిలోకి దార మెక్కించటం వారికి శరీర శాస్త్రరీత్యా చేతకానిపని అనిపిస్తుంది.

హెండన్ తన ప్రయత్నంలో విజయం పొందే టప్పటికి ముచ్చెమటలుపోసి మొహం కందగడ్డలా ఎర్ర బడింది. చిరుగులు వెదికి కుట్టడం ప్రారంభించాడు.

"సత్రవవాడికి ఇచ్చెయ్యగా మిగిలే దాంతో రెండు గాడిదలు కొనాలి. దాంతోనే ప్రయాణపు ఖర్చులుకూడా సరిపెట్టుకోవాలి. హెండన్ హాలుకు ఇక్కణ్ణించి ఎలా లేదన్నా రెండురోజుల ప్రయాణం వుంటుంది. ఇహ అక్కడికెడితే మొయ్యలేనంత డబ్బు.

కొంప సోకినంత సాలురా, - గుండె సోలితేలి.........

అబ్బా! సూది కసిక్కన దిగింది. ఊ......యుద్ధాల్లో తగిలిన గాయాలముందు ఇదో లెక్కా, పత్రమా, జమా?... హెండన్‌హాలులో అడుగు పెట్టామూ అంటే, ఇక మన్ని అడిగేవా డెవడూ లేడు. మన ఇష్టం వచ్చినట్టు దర్జాగా ఉండచ్చు......ఎడిత్ ఏం చేస్తూవుంటుందో వెళ్లేటప్పటికి?...

ఏటిఒడ్డు వాడలో, - నిమ్మ తోటలోని నీడలో, - 'సాయి
నీటుకాడ!' రమ్మనీ - కన్ను గీటి నన్ను పిలిచెరా......
సోకైనా పిల్లరా......

హా...మైల్స్ హెండన్‌కు కుట్టుపని చేతకాదని ఎవ రనగలరు? అన్ని చిరుగులకీ టాకీలు కుట్టేశాను," అనుకుని కుట్టిన బట్టలు ఎత్తిపట్టుకుని తన నేర్పుకి తానే ఆశ్చర్యపడుతూ చూసుకున్నాడు.

"చాలా బావున్నాయి బట్టలిప్పుడు. ఆ తోలు గుడ్డలు విప్పి ఇవి తొడిగించానంటే పిల్లజమీందారులా వుంటాడు నా మిత్రుడు. అతని అందమైన లేతముఖానికి ఈ టోపీ మరింత అందం తెస్తుంది. ఇక లేపి, ముఖం, చేతులు కడిగించి, బట్టలు తొడగాలి. ఈలోగా భోజనం తయారై వస్తుంది.

సోకైనా పిల్లరా, - దాని సూపు లెంత వాడిరా...
అహ సోకైనా,.......ఒహో సోకైనా,......
బల్ సోకైనా పిల్లరా, - దాని సూపులెంత వాడిరా......

అంటూ లేచి మంచం దగ్గిరికి వెళ్లాడు. ముసుగు తీసి చూశాడు. బాలరాజు లేడు!! అతని స్థానంలో పొడుగాటి తలగడ వుంది. మైల్స్ హెండన్ విస్మయంతో నోరు తెరుచుకుని చూశాడు; గదిలో అన్ని మూలలూ చూశాడు; పరుపుకింద, మంచంకింద, బల్లకింద చూశాడు.

ఇంతలో నౌకరొకడు భోజనసామగ్రి తీసుకుని పైకొచ్చాడు. వాడిమీద విరుచుకుపడ్డాడు మైల్స్ హెండన్.

"చెప్పు ఆకుర్రాడేమయ్యాడో. పందీ, కుక్కా, అంట్లవెధవా! నీకు కాలం మూడింది," అంటూ వాడి మెడ పట్టుకున్నాడు హెండన్. "ఎక్కడికి పోయాడా కుర్రాడు?"

నౌకరు భయంతో గజగజ వణకుతూ జరిగిన సంగతంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.

"మీరు బయటికి వెళ్లగానే ఒకబ్బాయి ఎవరో వచ్చి ఆ కుర్రాణ్ణి తీసుకురమ్మన్నారని చెప్పాడు. సౌత్ వార్కుకు పోయే దోవలో వంతెనమీద మీరు నుంచున్నారనికూడా చెప్పాడు. నేను పిల్లాణ్ణి లేపి మీరు రమ్మంటున్నారట, అని చెప్పాను. అతడు 'ఇంత పొద్దున్నే లేపట మేమిటి' అని గొణుగుతూ విసుక్కున్నాడు. మీరు వచ్చి 'మనవిచేసుకోవాలిగాని, ఎవడో ముక్కు మొహం ఎరగనివాడితో కబురుపంపట మేమిటి?' అనికూడా విసుక్కున్నాడు. తరవాత ఆ కొత్తబ్బాయితో కలిసి వెళ్లాడు.

"ఓరి పందీ ! నీ కామాత్రం బుద్ధి లేదట్రా? నేను రమ్మన్నానంటే ఎల్లా నమ్మావురా గాడిదా, కుక్కా! మంచంమీద చూశావా? ఎవరో పడుకున్నట్టు నమ్మించటానికి తలగడ పెట్టి ముసుగువేసివుంది. అది చూసైనా, నీకు తెలియలా మోసం జరుగుతోందని?" అంటూ మళ్లీ మెడపట్టుకున్నాడు హెండన్.

"నేను చూడలేదు బాబూ! రక్షించండి. నే నే పాప మెరగను."

"ఛీ వెధవా! ఇదంతా కుట్రగా కనిపిస్తోంది. ఇదిగో, ఆ వచ్చిన కొత్తవాడితో ఇంకెవరన్నా ఉన్నారా ?"

"ఒక్కడేనండి బాబూ !"

"నిజమేనా ?"

"అమ్మతోడండి."

"ఆలోచించు, జ్ఞాపకం చేసుకో. నిజం చెప్పక పోతే పీక నులిమి చంపేస్తాను."

నౌకరు కొంతసేపు ఆలోచించాడు.

"ఆ కొత్తాయన వచ్చినప్పుడు ఎవరూ లేరండి కాని పిల్లవాణ్ణి వెంటపెట్టుకుని తీసుకపోతుంటే రోడ్డు మీాద కెళ్లేసరికి ఎవడో తాగుబోతు వాళ్లదగ్గరి, కొచ్చాడు. ఇంతలో..."

"ఏం జరిగింది? తొందరగా చెప్పు."

"రోడ్డుమీాద మంద ఎక్కువై ఇంక వాళ్ళెవరూ కనిపించలేదండి. అప్పుడే కొంప మునిగినట్టు మా యజమాని నన్ను కేకేశాడు. నేను లోపలికి పోవల్సివచ్చింది..."

"ఛీ వెధవా! అవతలకు పో. దూరంగా. మళ్లీ నా కళ్ళ పడ్డావంటే నరికేస్తాను. ఆగు...వాళ్లు ఏవేపు పోయారన్నావు?"

"సౌత్ వార్కు వేపు పోయారండి."

"ఛీ, ఇంకా ఇక్కడే ఉన్నావ్? పో అవతలికి. దేబెపీనుగ; యాక్కు మొహమూా, వీడూను."

నౌకరు మాయమైపోయాడు. వాడి వెంటే హెండసన్ కూడా మెట్లు దిగాడు. ఒక్కొక్క అడుగుకి రెండేసి మెట్లు చొప్పున దిగాడు. "వాడే, ఆ తాగుబోతుముండాకొడుకే; అతన్ని తన కొడుకని లాక్కుపోయినవాడే. ఎక్కడని వెదకను? నా చిట్టిరాజా ఎక్కడికి పోయావు? అయ్యో నిన్ను పోగొట్టుకున్నాక

నే నుండి ఏం లాభం? ఛా! నిన్ను పోగొట్టుకోవట మేమిటి? భూప్రపంచంలో ఎక్కడున్నా సరే నిన్ను వెదకక మానను. బైబిల్ సాక్షిగా ప్రతిజ్ఞ చేస్తున్నాను. నువ్వు కనిపించేదాకా నేను నిద్రపోను; అన్నం తినను."

ఈలోగా హెండన్ లండన్ వంతెనమీద కొచ్చేశాడు. జనాన్ని తోసుకుంటూ, నెట్టుకుంటూ దారి చేసుకునిపోతూ చుట్టూ పరీక్షిస్తున్నాడు. అతని కొకటే భావం తిరిగి తిరిగి మనస్సును కలచివేస్తోంది.

"పసుక్కున్నాడట పాపం వెళ్లేముందు. అయినా నేను రమ్మన్నాననేటప్పటికి లేచి బయల్దేరాడట. ఇంకోడు పిలిస్తే వెళ్లేవాడా? ఊహూ. వెళ్లడు. నే నంటే ఎంత నమ్మకం లేకపోతే అలా కొత్తవాడితో పడి పోతాడు?"

# 17

బాలరాజును అన్వేషించడానికి మైల్స్ హెండన్ బయల్దేరిన అదేరోజు తెల్లవారుఝామున టామ్ కాంటీ రాజభవనంలో హంసతూలికా తల్పాల మీద సుఖస్వప్నాలు కంటూ నిద్రిస్తున్నాడు. కల అంతమై నిద్రలేచాడు. ఇంకా చీకటిగానే వుంది.

"హాం, నాన్! బెట్! ఎక్కడ మీరు? ఇంకా చెత్తపరుపులమీదే దొర్లుతున్నారా? ఇటురండి. ఎంత మంచి కలవచ్చిందో నాకు? బలే తమాషాకల! నాన్! బెట్!" అని పిలిచాడు.

ఆ చీకట్లో టామ్‌కాంటీ ఒకవ్యక్తి తన మంచం పక్కనకూచుని ఉండటం చూశాడు.

"ఏం సెలవు మహారాజా!" అని ఆ వ్యక్తి వినయంగా అడిగాడు.

"మహారాజునా నేను...ఓ, అంతా తెలిసింది, తెలిసింది. ఇది కల కాదన్నమాట. ఎంత దురదృష్టవంతుణ్ణి...ఎవరు నువ్వు ?...నువ్వెవరివైతే నేం ? అసలు నే నెవర్ని ?"

"తమరా ? నిన్నటివరకూ తమరు వేల్సు యువరాజులు. నేటినుండీ ఇంగ్లండు సార్వభౌములైన ఎడ్వర్డు ప్రభువులు."

టామ్ తలగడల మధ్య తలదాచుకుని బరువుగా నిట్టూర్పులు విడుస్తూ,

"అది కల కాదన్నమాట. కలేఅయితే ఎంత బావుండేది? నువ్వికపోవచ్చు..." అన్నాడు. మళ్లీ నిద్రలో మునిగిపోయాడు. ఇంకోకల వచ్చింది : ఒక పచ్చని మైదానంలో టామ్‌కాంటీ ఒక్కడే ఆడుకుంటున్నాడు. అతనిచుట్టూ లేళ్లు, కుందేళ్లు, జింకలు ఉల్లాసంగా పరుగెత్తుతున్నాయి. అతడు పిల్లంగోరు ఊదుతూ తన్మయుడై వున్నాడు. ఇంతలో పన్నెండంగుళాలకంటే ఎత్తులేని ఒక మరుగుజ్జు ప్రత్యక్షమయ్యాడు. ఒక చెట్టు చూపించి దాని మొదట్లో పిల్లంగోరుతో తవ్వమని చెప్పాడు. టామ్‌కాంటీ అలాగే తవ్వాడు. గలగల్లాడుతూ పన్నెండు పెన్నీలు

బయట పడ్డాయి. ఈ అపారధనం చూసి టామ్ సంతోషం పట్టలేకపోయాడు. మరుగుజ్జు ఇంకా ఇలా చెప్పాడు:

"నేను నిన్నెరుగుదును. నువ్వు చాలా బుద్ధిమంతుడివి. ప్రతి ఆదివారంనాడూ ఇక్కడ తవ్వు. పన్నెండు పెన్నీలు నీకు దొరుకుతాయి. యీరహస్యం ఎవరికీ చెప్పకు."

టామ్ పన్నెండు పెన్నీలు మోగించుకుంటూ ఆఫల్ కోర్టుకు వచ్చాడు. 'ప్రతిరాత్రీ మా నాన్నకో పెన్నీ ఇస్తాను. దాంతో వాడిబాధ వదిలిపోతుంది. నాకు చదువు చెప్పే ఫాదర్ ఆండ్రూకు వారానికో పెన్నీ జీతమిస్తాను. మిగతా నాలుగు పెన్నీలు మా అమ్మకీ, నాన్, బెట్ లకీ యిస్తాను. మా దరిద్రం వదలిపోతుంది. రోజూ కడుపునిండా మెక్కి హాయిగా వుంటాము," అనుకున్నాడు తనలోతను. ఇంటికి రాగానే తల్లిని పిలిచి పన్నెండు పెన్నీలు చేతిలో పోశాడు.

"ఇదిగో మన డబ్బు. ఇందులో నాలుగు పెన్నీలు మీరు తీసుకోండి. ఇది దొంగిలించి గాని, బిచ్చమెత్తిగాని తెచ్చిన డబ్బుకాదు. గౌరవంగా చెమటోడ్చి సంపాదించిన డబ్బు," అని చెప్పాడు.

ఇంత డబ్బు చూసి టామ్ తల్లి తన కళ్లు తనే నమ్మలేకపోయింది. టామ్‌ను సంతోషంతో కౌగిలి పట్టుకుని, అన్నది:

"మహారాజా! బాగా పొద్దెక్కింది. ఇక లేవరా?"

ఇదేమిటి వాళ్ళమ్మ ఇలా అంటుందేం? టామ్ కళ్లు తెరిచిచూశాడు. ఎదురుగా నుంచున్నది వాళ్లమ్మ కాదు. కల అంతమైంది. కిటికీలగుండా వచ్చిన సూర్య కాంతి గదిలో బంగరుతివాసీలా పరుచుకుని వున్నది. మంచంపక్కన శయ్యాగార ప్రభువు మోకరించి వున్నాడు. ఇంకా తను ఈ కారాగారంలోనే ఖైదీగా వున్నట్టు గ్రహించాడు టామ్. "ఎప్పటికో నాకు విముక్తి?" అనుకుంటూ చుట్టూచూశాడు. పొడుగాటి ఆ గదిలో టామ్ శయ్యనుండి ద్వారందాకా వరసగా ప్రభువులు నుంచున్నారు. టామ్ లేచి కూర్చుని పట్టు తెరలు వొత్తిగించాడు. వెంటనే టామ్‌కు రాజోచిత సంస్కారాలు ప్రారంభమయినై.

ద్వారందగ్గిర నుంచున్న ప్రధానసేవక ప్రభువుతో ప్రారంభమైంది కార్యక్రమం. ఆయన ఒక చొక్కా రెండు చేతులా అందుకుని జంతుశాల ప్రభువుకు అందించాడు. ఆయన దాన్ని మహాబట్లరు ప్రభువు కందించాడు. ఆయన శయ్యాగారపు అసిస్టెంటు ప్రభువుకు, ఆయన విండ్సర్ అరణ్యాధికారికి, ఆయన కోశాధ్యక్షుడికి, ఆయన వస్త్రశాఖాసేవక ప్రభువుకు, ఆయన సైన్యాధ్యక్షుడికి, ఆయన లండన్ గోపురాధికారికి, ఆయన అంతఃపుర ప్రధానాధికారికి, ఆయన బర్కిలీ ప్రభువుకు, ఆయన నౌకాశాఖాధిపతికి,

ఆయన కాంటర్బరీ ప్రధాన మతగురువుకు, ఆయన శయ్యాగార ప్రభువుకు అందించాడు. శయ్యాగార ప్రభువు చొక్కా నందుకుని టామ్‌కు తొడిగాడు. ఈ తతంగమంతా చూసి టామ్ విస్తుపోతూ చొక్కా తొడిగించుకున్నాడు.

టామ్‌కు తొడగబడిన రాజదుస్తుల్లో ప్రతి ఒక్కటీ ఈ సుదీర్ఘ పంక్తిలోంచి అంచెలంచలుగా టామ్‌శరీరాన్ని చేరుకున్నది. ఈ దీర్ఘ కార్యక్రమంతో మన ప్రైనీకి నడుం నెప్పెట్టింది; కాళ్లు లాగడం మొదలెట్టాయి. కాని అది రాజసంప్రదాయం. దాన్ని టామ్ కోసమని ఈ రోజున మార్చుకోమంటే ఎల్లా కుదురుతుంది?

తొడగవలసిన దుస్తుల్లో ఆఖరివైన మఖమల్ బూట్లు తమ దీర్ఘప్రయాణం సాగించాయి. ఎలాగైతేనేం అవి శయ్యాగార ప్రభువును చేరుకున్నాయి. ఆయన ఒక్కసారి వాటిని పరీక్షగా చూశాడు. ఆయన ముఖంలో కోపం ప్రజ్వలించింది. బూట్లను తిరిగి కాంటర్బరీ ప్రధానమతగురువు కందించి,

"చూడండి, ప్రభూ!" అన్నాడు. మతగురువు ముఖం కందగడ్డలా ఎర్రబడింది. ఆయన వాటిని నౌకా శాఖాధిపతి కందించి "చూడండి ప్రభూ!" అన్నాడు. ఆయనముఖం మంచులా పాలిపోయింది. "చూడండి ప్రభూ!" అని ఆయన అనే లోపుగానే బర్కిలే ప్రభువు అందుకున్నాడు. ఆయనముఖం నల్లని బొగ్గులా మాడి

పోయింది. బూట్లు అందుకుని అంతఃపుర ప్రధానాధి కారి ఆముదం తాగినముఖం పెట్టాడు; లండన్ గొప్ప రాధికారిముఖం తుమ్మల్లో పొద్దుగూకినట్టయింది. ఈ విధంగా బూట్లు తిరుగు ప్రయాణం సాగించి ప్రధాన సేవకప్రభువును చేరుకున్నాయి. ఆయన 'ఏమిటా ఈ గందరగోళమంతా' అని కంగారుపడుతూ బూట్లు పరిశీ లించి చూశాడు. ఒక బూటుకుబిగించే తాడు లేదు. ఇదీ ఈ గందరగోళానికి కారణం. కొత్త బూట్లు తేవ డానికి ఒక సేవకుడు పరుగెత్తుకు పోయాడు. ప్రధాన సేవక ప్రభువు జంతుశాలప్రభువు చెవిలో రహస్యంగా అన్నాడు: "ఇంత గొప్ప నేరం చేసినందుకు బూట్లు శాఖాధికారికి యావజ్జీవ ఖైదు శిక్ష పడకతప్పదు."

మొత్తానికి, అంటే, ఎట్టకేలకు, కొత్తబూట్లు రావటం, టామ్‌కాంటీకి అవి తొడగబడటం, అతడు మంచం దిగి నుంచోటానికితగిన పరిస్థితికి చేరుకోవటం మొదలైన వ్యవహారమంతా సజావుగానే జరిగి పోయింది. ఒక ప్రభువు నీళ్లు పోశాడు; మరొక ప్రభువు టామ్ ముఖం కడిగాడు; ఇంకొకడు తువ్వా లుతో తుడిచాడు. కాలక్రమాన టామ్ తల దువ్వించు కొవటానికి సిద్ధం చేయబడ్డాడు. ఆపని కూడా పూర్త యింది. ఈ అలంకారా లన్నిటితోనూ టామ్ కొత్తగా ఈడొచ్చిన ఆడపిల్లలా అందంగా తయా రయ్యాడు. తరవాత భోజనశాలకు తీసుకుపోబడ్డాడు.

ప్రాతఃకాల భోజనం పూర్తయ్యాక టామ్‌ను

దర్బారుకు తీసుకుపోయారు. అతనికి అటూ, ఇటూ వెనకాల, విచ్చు కత్తులు ధరించిన యాభైమంది సైని కులు నడిచారు. దర్బారులోని ఉన్నత సింహాసనం మీాద టామ్ కూర్చోపెట్టబడ్డాడు. అక్కడ రాజ్యపరి పాలనకు, సంబంధించిన కొన్ని చిల్లర వ్యవహారాలు జరగవలసి వున్నాయి. మహారాజు మేనమామన్నైన హెర్ట్‌ఫర్డ్ ప్రభువు అవసరమైనప్పుడల్లా సలహా లివ్వ డానికి సిద్ధంగా టామ్ ప్రక్కన చేతులు కట్టుకుని నుంచున్నాడు.

హెన్రీ మహారాజు చనిపోయేముందు తన కుమారుడికి రాజ్యపాలనలో సహాయం చేసేందుకు గాను ఒక మంత్రివర్గాన్ని ఏర్పరిచాడు. వారందరూ దర్బారులో ప్రవేశించి టామ్‌కు నమస్కరించి నుంచు న్నారు. ఈమంత్రివర్గానికి నాయకుడు కాంటర్బరీ ప్రధాన మతగురువు. ఆయన మంత్రివర్గంలోని సభ్యుల పేర్లు చదివి వినిపించాడు. వాటిలో హెర్ట్‌ఫర్డు ప్రభువు, సెంటుజాన్ ప్రభువు మొదలైన ప్రముఖుల పేర్లున్నాయి. ఈ మంత్రివర్గంగాక బాలరాజుకు ఒక "రక్షకుడు" కూడా అవసరమైవున్నాడు. కాని హెన్రీ రక్షకుని నియమించకుండానే ప్రాణాలు వదిలాడు.

కాంటర్బరీ మతగురువు ఏవో కాయితాలు చదువుకుపోతున్నాడు. అవన్నీ రాజ్యపాలనకు సంబం ధించిన క్లిష్టవ్యవహారాలు. అవి టామ్‌బుర్రలోకి ప్రవే శించటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాయిగాని లాభం

లేకపోయింది. మతగురువు చదువుతున్న విషయాల్లో కల్లా ఒక్కటే బ్రహ్మాండమైన సమస్య అతన్ని జల గలా పట్టుకుంది. హెర్ట్ఫర్డును పిలిచి టామ్ రహస్యంగా అడిగాడు.

"మహారాజుకు అంత్యక్రియలు జరిగేది ఎప్పుడు?"

"వచ్చే నెల 16 వ తారీకున మహారాజా!"

"తమాషాగావుందే! ఇన్ని రోజులదాకా శవం కుళ్ళిపోకుండా ఉంటుందా?"

పాపం టామ్ కేం తెలుసు రాజ సంప్రదాయాలు? ఆఫల్ కోర్టులో దిక్కూ మొక్కూ లేక చచ్చిపోయినవాళ్ళని నిమిషాల్లో బరబర అవతల కీడ్చెయ్యటంమాత్రమే అత నెరుగును. మరి రాజకుటుంబాల్లో అలా కాదు. మరణించినతర్వాత ఎన్నిరోజుల వరకైనా సరే శవం చెడిపోకుండా చేసే ఉపాయాలు అవలంబించి నిలవఉంచుతారు.

ఈలోగా ప్రభుత్వ కార్యదర్శి ఒకడు వచ్చి మర్నాడు11 గంటలకి, ఇతర దేశాల రాయబారులు వచ్చి మహారాజుదర్శనం చేసుకోగోరుతున్నారని విన్నవించాడు. వాళ్ళకి తన్ను చూడవలసిన అవసర మేమిటో టామ్ కర్థంకాలేదు. హెర్ట్ఫర్డు వివరించి చెప్పాడు: "తమరు అలాగేనని సెలవివ్వండి. ఇంగ్లండు దేశానికి, రాజకుటుంబానికి గొప్పదుఃఖం సంభవించింది గదా! అందుచేత తమతమ దేశాలతరఫున

సానుభూతి తెలపడానికి రాయబారులు రాగోరు తున్నారు.''

టామ్ సరేనన్నట్టు తల ఊగించాడు.

మరొక కార్యదర్శి వచ్చాడు. అతడు గత 6 నెలల్లోను రాజకుటుంబానికి అయిన ఖర్చుల పద్దు తీసుకొచ్చాడు. ఆరునెలలకి 28 వేల పౌనులు (దాదాపు 4 లక్షలరూ.లు) ఖర్చయిందని వినగానే టామ్‌కి మూర్ఛ వచ్చినంత పని అయింది. అంత పెద్ద మొత్తాన్ని టామ్ జన్మలో ఎప్పుడూ చూడలేదు సరి గదా, చెవులతో విననైనా లేదు. ఇందులో 20 వేల పౌనులు ఇంకా తీర్చలేదని వినగానే అతనికి మళ్ళీ గుండె ఆగినంత పని అయింది. ఇంతే కాదు, ప్రభుత్వ కోశాగారంలో పెన్నీ కూడా నిలవలేదని, రాజభవనానికి చెందిన 1200 మంది సేవకులకు జీతాలు ముట్ట లేదని, వారందరు ఇబ్బందిపడుతున్నారని కూడా ఖజానా కార్యదర్శి మనవిచేశాడు. టామ్ గొంతుక పెగుల్చుకుని అన్నాడు :

"ఇలాగైతే మనం కొద్దిరోజుల్లో కుక్కలకంటే నాకష్టంగా జీవించవలసి వస్తుంది. ఈ ఇంటియజమానులు మన్ని వెళ్ళగొట్టేస్తారు. కనుక ముందుగానే జాగ్రత్తపడటం ఎందుకైనా మంచిది. చిన్న ఇల్లొకటి అద్దెకు తీసుకుందాం. సేవకులందర్నీ పంపించేద్దాం. ఈ సేవకులుండటం మూలాన పనులు ఆలస్యం కావటంతప్ప మనకి మరే లాభమూ లేదు. ప్రతిపనికీ

అడ్డంవస్తారు; ఏ పనీ మనంతట మన్ని చేసుకోనివ్వరు బిల్లింగ్స్‌గేటువద్ద చేపల మార్కెట్టుందే; దాని కెదురుగా ఒక చిన్న ఇల్లుంది. అది తీసుకోవటం మంచిదనుకుంటాను—”

హెర్ట్‌ఫర్డుప్రభువు టామ్ బుజాన్ని నొక్కి— ఈ పిచ్చివాగుడు నాపకపోతే, అతడింకా ఎందాకా పోయేవాడో తెలియదు. అయితేకొత్త “రాజు” పిచ్చివాడయ్యాడని అక్కడ అందరికీ ముందే తెలుసుగనక ఎవరూ ఆశ్చర్యం ప్రకటించలేదు.

ఇంకో కార్యదర్శి వచ్చి కీర్తిశేషుడైన మహారాజుగారి వీలునామా చదివి వినిపించాడు. అందులో విషయాలు: హెర్ట్‌ఫర్డుప్రభువుకు “డ్యూక్” (సామంతుడు) పదవి ఇవ్వాలి; ఆయన తమ్ముడైన సర్ థామస్ సేమూర్‌ను, కొడుకును జమీందార్లను చెయ్యాలి. అలాగే రాజ్యంలోని కొందరు ఉన్నతాధికార్లకు పెద్దపదవు లివ్వాలి.

టామ్ ఇదంతా సావధానంగా వింటున్నాడు. “పాతబాకీలు తీర్చేసిం తర్వాత మిగతా విషయాలు చూసుకోవచ్చుగా,” అని హెర్ట్‌ఫర్డ్ చెవిలో చెప్పాడు. కాని హెర్ట్‌ఫర్డు

“మీరు మాట్లాడకుండా ఊరుకోండి. అన్నిటికీ సరేననండి,” అని సలహా యిచ్చాడు.

టామ్‌కు బాగా ఆశ్చర్యం కలిగించిన విషయమేమిటంటే తాను పెదవి కదల్చనైనా అక్కరలేకుండా

తల వూగిస్తే చాలు, కింది అధికారులు పై పదవుల్లోకి, పై అధికారులు ఇంకా పై పదవుల్లోకి పోతారు. ఇంత గొప్ప మహిమ తన కున్నందుకు అతని ఆశ్చర్య, సంతోషాలకు మేర లేదు. అతనికో మంచి ఆలోచన తట్టింది. తన తల్లిని ఆఫల్ కోర్టు జమీందారిణిగా చేస్తే? కాని తను కేవలం నిమిత్తమాత్రుడు. ఈ ప్రభువుల, మంత్రుల చేతిలో తను కీలుబొమ్మ. వాళ్లెలా ఆడిస్తే అలాఆడాలి. వాళ్లు తనమాట వింటారా?

ఈవిధంగా చాలాసేపు రాజ్యవ్యవహారాలు జరిగాయి. అంతా మందకొడిగా వుంది. తనకు సంబంధంలేని అయోమయ విషయాలు విని విని, టామ్ బుర్ర వేడెక్కింది. చెప్పలేని విసుగు పుట్టింది. "నేనేం పాపం చేశానని దేవుడునన్ను రాజు చేశాడు. హాయిగా ఎండలో ఎండుతూ, వానలో నానుతూ, బురదలో దొర్లేవాడికి నాకీ ఖర్మ ఏమిటి?" అని చింతించాడు. ఈ చింతతో అలిసిపోయి సింహాసనంమీద నేకునికిపాట్లు పడసాగాడు. చివరికి చల్లగా నిద్ర పోయాడు. దాంతో సామ్రాజ్య వ్యవహారాలన్నీ ఎక్కడివక్కడ స్తంభించిపోయాయి. నిద్రపోయే ఆ పసివాణ్ణి అందరు మౌనంగా చూస్తూ నేలలో పాతుకు పొయ్యారు.

పది పదకొండు గంటలవేళ యువరాణి ఎలిజబెత్, జేన్ గ్రేలు టామ్‌ను పరామర్శ చెయ్యటానికి వచ్చారు. ఆ తరవాత పెద్దయువరాణి మేరీ వచ్చి

కాస్సేపు మాట్లాడిపోయింది. మేరీ అక్కడ కూర్చు న్నంత సేపూ టామ్‌కు ముళ్ళ మీదున్నట్టే వుంది. ఎందు కంటే యువరాణి మేరీ చిరచిరస్వభావం గలది; ఆవిడ నవ్వుతుండగా మనుష్య మాత్రు డెవరూ చూసి ఎర గడు; ఈ మెగారే ఎడ్వర్డు తరవాత రాజ్యానికి వచ్చి అనేక వందలమంది ప్రొటెస్టెంటు మతస్థులను మంటల్లో కాల్పించి చరిత్రలో ప్రసిద్ధికెక్కింది.

పరామర్శకు వచ్చినవా రంతా వెళ్ళిపోగానే టామ్ "అమ్మయ్య" అనుకుని నడుం వాల్చాడు. కాని ఇంతలో ఒక పన్నెండేళ్ల కుర్రాడు దర్శనంకోసం వచ్చాడు. బక్క పలచగా వున్నాడు; నల్లటి దుస్తులు వేసుకున్నాడు; జంకుతూ జంకుతూ వచ్చి టామ్ ఎదట మోకరించి తలవంచాడు.

"ఎవరు నువ్వు? ఏం పని?"

"మరిచిపోయారా మహాప్రభూ! నేనేనండి, నేనే."

"నువ్వంటే? నిన్నెప్పుడూ చూసినట్టుగుర్తు లేదే?"

"తమ 'దెబ్బలబ్బాయి' నండి."

"నా దెబ్బలబ్బాయివా?"

"అవును మహారాజా! నా పేరు హంఫ్రీమార్లో."

టామ్‌కు పెద్ద సమస్యవచ్చిపడింది. ఈ 'దెబ్బ లబ్బాయి' ఎవరైఉంటాడో ఎంత ఊహించినా తోచడంలేదు. ఏమిటి చేయడం? 'ఒహో నువ్వా?' అంటే...కాని తరవాత వాడు చెప్పేదొక్కటీ అర్థం కాక తెల్లపోవలిసివస్తుంది. ఈ పరిస్థితిలో ఏం

చెయ్యాలి? ఆc. బలే ఉపాయం తట్టింది. ఇకముందు కూడా ఇలాంటి కొత్తవాళ్లు తరుచు తటస్థపడేట్టు న్నారు. మాట అందించేందుకు హెర్ట్‌ఫర్డు, సెంట్ జార్జ్ ప్రభువులు కూడా దగ్గర్లో లేరు; వాళ్లు మంత్రి వర్గంలో సభ్యులుకనక రాజకార్యాల్లో మునిగి వున్నారు. ఇక తనకి సహాయం చేసే దెవరు? ఈ కొత్త కుర్రవాడిద్వారా అన్నింటికీ కూపీలు లాగ గలిగితే చాలామటుకు చిక్కు తీరిపోతుంది. ఆc. అదే మంచిది. వీడి ద్వారానే కావలసిన సమాచారమంతా లాగాలి. ఇంత మంచి ఆలోచన తట్టినందుకు తన్నుతనే మెచ్చుకున్నాడు. కొత్త కుర్రవాణ్ణి ఎగాదిగా చూసి.

"ఆc. కొద్దిగా జ్ఞాపకం వస్తోంది. నువ్వ—నువ్వ—ఉహు. అంత బాగా జ్ఞాపకం రావడం లేదు. కొద్దిగా అందిస్తే జ్ఞాపకం వస్తుందేమో చూస్తాను. ఏదీ మళ్లీ చెప్పు నువెవ్వరివో?"

"చిత్తం మహారాజా! రెండురోజులకిందట తమరు గ్రీకుపాఠం అప్పజెప్పడంలో మూడుసార్లు తప్పులొచ్చాయి. జ్ఞాపకం ఉన్నది కదండి."

"ఆc. అవును. ఇప్పుడిప్పుడు అవన్నీ గుర్తొస్తున్నాయి. (తనలో: ఏడిసినట్టుంది, నేను గ్రీకు పాఠం అప్పజెప్పడ మేమిటి, వీడి తలకాయ. నేనే గ్రీకు పాఠం అప్పజెప్పేటట్టుంటే మూడుకాదు ముప్ఫయి తప్పులొస్తాయి.) సరే. తరవా తేమయింది?"

"మీకు పాఠం సరిగా రానందుకు మేష్టారికి.

కోపం వచ్చింది. అందుచేత ఈరోజున నన్ను బాగా చితకగొడతానని కూడా అన్నారు."

"నిన్నా? పాఠం రానిది నాకైతే నిన్నెందుకు కొట్టడం?" అని టామ్ అత్యంత విస్మయంతో అడిగాడు.

"తమరు మళ్ళీ మరిచిపోతున్నారు. మీకు పాఠాలు రానప్పుడల్లా ఆయన నన్ను కొడుతూ వుంటారు."

"ఆఁ. ఆఁ. అవును. నాకు పాఠాలు నేర్పేది నువ్వేగా. నాకు పాఠం రాకపోతే నువ్వు సరిగా నేర్పటం లేదని ఆయన నిన్ను కొడుతూ వుంటారు——"

"మహారాజా! అలా అంటారేమిటి? నేను తమకు పాఠాలు నేర్పుతానా? నేను తమ సేవకుల్లో హీనాతిహీనుణ్ణి. నేను తమకు ఉపదేశించేవాడినా? మళ్ళీ పొరబాటు పడుతున్నారు."

"ఏమిటయ్యా ఈ గొడవంతా? నాకేం అర్థం కావడంలేదు. మరి నిన్నెందుకు కొడతాడు మేష్టారు? పిచ్చెక్కింది నాకా నీకా? చెప్పు. నాకు పాఠం రాకపోతే నిన్నెందుకు కొడతాడు?"

"మహారాజా! తమకు మనస్థిమితం లేనందున ఇంత చిన్న సంగతి మరిచిపోయారు. వేల్సు యువరాజు పవిత్రశరీరాన్ని ఎవరూ కొట్టరాదుగదా. అందుచేత యువరాజు తప్పు చేసినప్పుడల్లా ఆయన బదులు నేను శిక్ష అనుభవిస్తూ ఉంటాను. ఇందులో దోషమేమీ లేదు. అది నా ఉద్యోగం. యువరాజు బదులు నేను దెబ్బలు తినకపోతే నాకు జీవన మెలా గడుస్తుంది?"

ఈ వివరణతో టామ్ ఆశ్చర్యానికి పట్ట పగ్గాలు లేవు. ఇలా గనుకున్నాడు: "రాజుల ఇళ్ల లో ఆచారాలు ఎంత విచిత్రంగా వుంటాయి? తప్పు చేసిం దొకరైతే శిక్ష అనుభవించే దింకొకరు.—నాబదులు తలదువ్వించుకొనడానికి, నీళ్లు పోసుకుని బట్టలు తొడిగించుకోడానికి కూడా ఒక కుర్రవాణ్ణి ఏర్పాటు చేస్తే బావుండును. బతికిపోతాను; అంతే గాదు. అప్పు డెన్ని దెబ్బలు తినమన్నా సంతోషంగా తింటాను." తరవాత టామ్ దెబ్బలబ్బాయి నడిగాడు.

"మరయితే మేష్టారివ్వాళ నిన్ను కొట్టారా?"

"లేదు మహారాజా! మన కంఠరికీ సంభవించిన ఈ మహాదుఃఖంగొడవలో మేష్టారి సంగతి ఇప్పటి దాకా మరిచిపోయినట్టున్నారు. పైగా మీరు ఆ రోజున నాతో అన్నారు కూడా, నన్ను కొట్టకుండా ఆజ్ఞాపిస్తామని. ఆ విషయం జ్ఞాపకం చేద్దామనే ఇలా వచ్చాను."

"అవును. అంతా జ్ఞాపకం వస్తోంది. నీ వీపు కేమీ ప్రమాదం రాకుండా చూసే పూచీ నాది."

దెబ్బలబ్బాయి సంతోషం పట్టలేకపోయాడు. తనకు దెబ్బలు తప్పగలవని. మోకరించి అన్నాడు:

"మహారాజా! మీ ఋణం తీర్చుకోలేను. కాని మరొకచిన్న మనవి ఉన్నది ప్రభూ!"

"ఏమి టది?" టామ్ ప్రసన్నుడై అడిగాడు.

"తమ రిప్పుడు వేల్సు యువరాజులు కాదు. తమ తండ్రిగారు కాలధర్మం చెందడంతో మహారాజు లయ్యారు. తమ మాటకు ఈ రాజ్యంలో ఎదురాడే వాడు లేడు. ఇదివరకు తమరు తండ్రిగారి బలవంతం మీాద చదివేవారు. ఇకముందు మీా ఇష్టారాజ్యంకనక తమరు పుస్తకాలన్నీ తగలబెట్టెయ్యొచ్చు. చదువు మానివెయ్యవచ్చు. అటువంటి సందర్భంలో నేను సర్వ నాశనమైపోతాను. నాతోపాటు నా చెల్లెళ్లుకూడా—"

"సర్వనాశనమైపోతావా? ఎల్లా?"

"తమ రెరగని దేమున్నది మహారాజా! నా వీపే నా జీవనాధారం. నా వీపుకు పనిలేకపోతే నా నోట దుమ్మే. తమరు చదువు మానేస్తే, 'దెబ్బ లబ్బాయి' ఒకడు ఉండవలసిన అవసరం పోతుంది. అప్పుడు నా ఉద్యోగం ఊడిపోతుంది..."

దెబ్బలబ్బాయి విచారం చూసి టామ్ కూడా ఎంతో ఇదయ్యాడు.

"నువ్వేం బెంగపడకబ్బాయ్! నీ ఉద్యోగాన్ని నీకూ, నీ సంతతి వాళ్లకూ శాశ్వతం చేస్తున్నాను—"అంటూ టామ్ కత్తిసి ఆ కుర్రవాడి బుజానికి ఆనించాడు. "లేవోయ్ హంఫ్రీ మార్లో! నువ్వికనుండీ ఇంగ్లండురాజకుటుంబానికి వంశానుగత దెబ్బల ప్రభువువి. విచారపడకు. నేను చదువు మానెయ్యను. నీ వీపుకి ప్రతిరోజూ పని ఉండేలాగ, తద్వారా నీ జీతం మూడింత లయ్యేలాగ చదువు తాను. సరేనా?"

హంఫ్రీ కళ్లు కృతజ్ఞతతో ప్రకాశించాయి.

"ధన్యుణ్ణి మహారాజా! మీ ఔదార్యఋణం తీర్చుకోలేను. ఇక నాకూ, మార్లోవంశానికీ శాశ్వతంగా భోజనసమస్య తీరిపోయింది."

తరవాత చాలసేపు టామ్ కాంటీకి, హంఫ్రీ మార్లోకి సంభాషణ జరిగింది. టామ్ తెలివైనవాడు గనక ఆట్టే పొరబాట్లు రాకుండానే మొత్తానికి బోలెడు సమాచారం లాగాడు. రాజభవనంలో ఎవరెవరో, ఎప్పుడు ఏ పని చెయ్యాలో, ఎలా సంచరించాలో మొదలైన అమూల్యమైన భోగట్టా చాలా సంపాదించాడు. ప్రతిరోజూ హంఫ్రీ మార్లోవద్ద కొంత సేపు శిష్యరికం చెయ్యాలని అన్ని సంగతులూ పూర్తిగా నేర్చుకోవాలని టామ్ నిశ్చయించుకున్నాడు. హంఫ్రీ తన దగ్గరకు రావాలని కోరినప్పుడల్లా రానిచ్చేటట్లు సేవకులకు కట్టడిచేశాడు.

హంఫ్రీ నిష్క్రమించగానే హెర్ట్‌ఫర్డుప్రభువు యమకింకరుడులా ప్రవేశించాడు. బాలరాజు మతిస్థిరం తప్పిందని ప్రజ లనుమానిస్తే ఆ సంగతి రాజద్రోహులకు తెలిస్తే కొన్ని అపాయాలు సంభవించవచ్చుననీ, అలాంటి అనుమానాలు రాకుండా చెయ్యాలంటే బాలరాజు అడపా తడపా నలుగురిమధ్యకూ వస్తూ పోతూ వుండాలనీ, జాగ్రత్తగా మసులుకోవాలనీ హెర్ట్‌ఫర్డు ప్రభువు చెప్పాడు. అందుకోసమని బాలరాజు ఇంకా రెండుమూడు రోజులాగి, ప్రతిరోజూ

బహిరంగంగా భోజన మారగించా లనీ, నడకలోనూ, మాటలోనూ మరి కొంచెం రాజఠీవి చూపిస్తే ఎటువంటి అనుమానాలకూ తావుండదనీ ఆయన చెప్పాడు.

తరవాత ఏ సందర్భంలో ఎలా ప్రవర్తించాలో, ఎవరిపట్ల ఏయే మర్యాదలు ప్రదర్శించాలో హెర్ట్ ఫర్డు ప్రభువు టామ్‌కు "జ్ఞాపకం చెయ్యడం" ప్రారంభించాడు. కాని టామ్ ఈ విషయాలు చాలామటుకు హంఫ్రీమార్లో నుంచి ఇది వరకే నేర్చుకొని ఉండడం మూలాన అతడు మాటిమాటికీ "ఈ సంగతి నా కిది వరకే తెలుసు, ఆ సంగతికూడా తెలుసు, అదీ తెలుసు." అని అడ్డం వచ్చాడు. మహారాజుఆరోగ్యం బాగుపడు తున్న సూచనలు కనిపిస్తున్నందుకు హెర్ట్ ఫర్డు ప్రభువు సంతోషించాడు. హంఫ్రీమార్లోనుంచి ఈ భోగట్టా అంతా టామ్ సేకరించినట్టు ఆయన కేం తెలుసు? అందుచేత "మహారాజు"కు మరొక ముఖ్యవిషయం కూడా జ్ఞాపకం వచ్చిందో లేదో పరీక్షించడానికి హెర్ట్ఫర్డు ప్రభువు నిశ్చయించాడు :

"మహారాజుమనస్సు క్రమంగా కోలుకొంటున్నందుకు నేను దేవుడికి ధన్యవాదా లర్పిస్తున్నాను. మీరు ఇంకొంచెం ప్రయత్నిస్తే మమ్మల్నందర్నీ కల వరపెడుతున్న మరో సమస్యకూడా తీరిపోతుంది. రాజముద్ర ఏమైందో తెలియక నిన్న ఎంత పెద్దగొడవ జరిగిందో తమకు గుర్తున్నదిగదా! అది తమ తండ్రి గారి సంతకానికి చెందిన ముద్రకనుక ఈ రోజునుంచీ

దానితో అవసరంలేదు. అయినప్పటికీ అది కనిపించక మే మందరం తల్లడిల్లుతున్నాము. దాన్ని తండ్రిగారి నుంచి తమరే స్వయంగా తీసుకున్నారు. ఎక్కడ పెట్టారో జ్ఞాపకం తెచ్చుకోవలసిందని నా విన్నపం."

టామ్‌కు నట్టేట్లో మునగానాం, తేలానాం అన్నట్టుగా వుంది ఈ రాజపదవి. అన్నీ చిక్కులే, అన్నీ సమస్యలే, అన్నీ కష్టాలే. ఆ దిక్కుమాలిన రాజముద్ర ఏమిటో టామ్ ఎప్పుడూ చూడలేదు; అసలది ఎలా వుంటుందో కూడా అతనికి తెలియదు ఒకక్షణం సందేహించి అమాయకంగా అడిగాడు:

"రాజముద్ర అంటే ఎలా ఉంటుంది? ఏం చేస్తారు దాంతో?"

హెర్ట్‌ఫర్డ్ ప్రభువు ఈ సమాధానం విని కుంగి పోయాడు. "మహారాజు మనస్సు బాగుపడుతోందని సంతసించాను. ఇక ఒకటే బాగుపడడం. పసిరాజుకు ఎంత కష్టం సంభవించింది!" అని లోపల అనుకున్నాడు. నెమ్మదిగా విషయం తప్పించాడు. మిగతా రాజకీయ వ్యవహారాలేవో కాసేపు మాట్లాడాడు. తరవాత సెలవుతీసుకుని నిష్క్రమించాడు.

## 18

మర్నాడు విదేశాల రాయబారులు మహా రాజు దర్శనంకోసం వచ్చారు. విశాలమైన సింహాసనం మీద టామ్ ఒక మూలనక్కి కూర్చున్నాడు; రాయ

బారులు హెన్రీ మరణించిన సందర్భంలో తమ తమ ప్రభుత్వాలు పంపించిన సానుభూతి సందేశాలు-ఒక్కొక్కళ్లు అయిదారు పేజీలు చొప్పున చదవటం ప్రారంభించారు.

రాయబారులను ముందు చూసినప్పుడు టామ్‌కి సరదాగానే వుంది; ఎందుకంటే వారి దుస్తులు చిత్రవిచిత్రంగా వున్నాయి. ఒక్కొక్క దేశపు రాయబారి ఒక్కొక్క రకమైన దుస్తులు వేసుకున్నాడు; ఒక్కొక్క రకంగా జుట్టుదువ్వుకుని, ఒక్కొక్క రకమైన టోపీ పెట్టుకున్నాడు. వారి బాహ్యాడంబరాల మీద ఆసక్తి తగ్గిపోగానే, వారు చదివే పాఠంతా దుర్భరంగా తయారైంది. చివరికి రాయబారులు ఎవరిదోవన వారు నిష్క్రమించినప్పుడు టామ్‌కు ఏదో భారంతీసేసినట్టయి తేలికపడ్డాడు.

ఆ రోజంతా రాజకీయవ్యవహారాలతోనే సతమత మయ్యాడుటామ్. వినోదాలకని ప్రత్యేకించబడ్డ రెండు గంటలూకూడా గిజాటుగానే గడిచాయి; ఎందుకంటే రాజుల ఇళ్లల్లో జరిగే వినోదాలు వినోదాల్లాగా ఉండవు; అలవాటు లేనివాళ్లకు ముళ్లమీద నుంచున్నట్టు ఉంటుంది.

ఎలాగైతే నేం ఆ రోజుకూడా గడిచింది. మర్నాడు అతనికి కొంతవరకూ రాజరికం అలవాటయింది. టామ్ ఇప్పటికి మహారాజై మూడు రోజులైంది. ఈ మూడురోజులూ టామ్ "దెబ్బలబ్బాయిని"

బాగా ఉపయోగించుకున్నాడు. అతనినుండి తనకు కావలసిన సమాచారమంతా రావడమే కాకుండా కాలక్షేపంకూడా అయింది.

కాని నాలుగోరోజంటే టామ్ కెక్కడలేని భయమూ పట్టుకుంది. ఆ రోజునుంచీ అతడు ప్రతి రోజూ బహిరంగంగా భోజనమారగించాలి. అంతే కాదు; కొన్ని విదేశవ్యవహారాలను ఫైసలుచెయ్యడం, హెర్టుఫర్డుప్రభువును "రాజ రక్షకుడుగా" నియమించడం, మొదలైన గడ్డు వ్యవహారాలు కూడా ఆ రోజునే పూర్తికావాలి.

ఆ నాలుగో రోజు రావడం టామ్ కెంత మాత్రమూ ఇష్టం లేదు. తెల్లవారకుండా వుంటే బావుండుననిపించింది. కాని టామ్‌కోసమని సూర్యుడుదయించక మానాడా! తెల్లవారింది; గుండెలపై గంపెడుబరువుతో టామ్ నిద్ర లేచాడు. మామూలుగా జరగవలసిన కాలకృత్యాలు యథావిధిగా జరిగాయి. దర్బారు కింకా కొంత వ్యవధివుంది.

ఈ లోగా టామ్ దిగులుగా పచార్లు చేస్తున్నాడు ఒక నడవాలోంచి మరోనడవాలోకి. ఒక కిటికీ తెరిచాడు అక్కడనుంచి కోటకెదురుగా వున్న రాజబాట బాగాకనిపిస్తోంది. జనులు గుంపులు గుంపులుగా కేకలు వేసుకుంటూ పోతున్నారు. అది చూడగానే టామ్‌లో బాలురందరికీ సహజంగావుండే కుతూహలం రేకెత్తింది.

"ఏమిటో అది? ఎవరన్నా కనుక్కువస్తే బావుండును," అని సందేహిస్తూ అన్నాడు.

పక్కనే వున్నాడు హెర్ట్‌ఫర్డు ప్రభువు. ఆయన వినయంగా తలవంచి, "తమరు మహారాజులు. తమ సెలవైతే ఈ క్షణంలో కనుక్కుని చెప్పగలను," అన్నాడు.

"అయితే కనుక్కోండి," అన్నాడు టామ్ ఉత్సాహంగా. తనలో ఇలాగనుకున్నాడు: "రాజుగా ఉండడంలో కొన్ని ఇబ్బందు లున్నా కొన్నిలాభాలు కూడా లేకపోలేదు. నోట్లోంచి మాట రావడంతడవు నిమిషాలమీద చేసేస్తున్నారు. నేనంటే వీళ్లకింత భక్తి ఎందుకో?"

హెర్ట్‌ఫర్డు ప్రభువు ఒకభటుని పిలిచి, సంగతేమిటో కనుక్కురమ్మని ఆజ్ఞాపించాడు. రాజభటుడు తిరిగివచ్చి ఒక పురుషుడికి, ఒక స్త్రీకి, ఒక బాలికకి న్యాయాధికారులు మరణశిక్ష విధించారని, వారిని వధ్యస్థానానికి తీసుకుపోతుంటే జనులు వెంటపడ్డారనీ తెలియజేశాడు.

మరణశిక్ష అనేమాట వినేసరికల్లా టామ్ హృదయం ఝల్లుమంది. అతనిలో కరుణరసం వరదలై ప్రవహించింది. నిండుప్రాణాలతో ఉన్న తోటిమానవులను నిలువునా చంపెయ్యడమా? నేరస్థులు ఎటువంటి నేరంచేశారో, ఆ నేరంవల్ల ఎవరి కెంత బాధకలిగిందో, అసి అతడలోచించలేదు. టామ్ మక్కు-

వచ్చులారని పసివాడైనా అతని ఉన్నత హృదయం ఒక్క విషయంగుర్తించింది. బలవంతంగా ప్రాణాలు తీసేస్తుంటే మనిషి కెలా వుంటుంది? అప్పుడతని మనస్సు ఎలా గిజ గిజ లాడుతుంది? అబ్బా!

టామ్ రెండో ఆలోచన లేకుండా, తను పేరుకి మాత్రమే రాజనికూడా ఆలోచించకుండా ఆజ్ఞాపించాడు:

"వాళ్ల నిలా తీసుకురండి." వెంటనే తెలివి తెచ్చుకుని బెదిరాడు. తను అంత గర్వంగా ఆజ్ఞాపించినందుకు కోపం వచ్చిందేమో నని హెర్ట్‌ఫర్డు ప్రభువు వంక, రాజభటుడివంక చూశాడు, వారు కించిత్తైనా కోపంగాని, ఆశ్చర్యంగాని ప్రకటించలేదు. భటుడు రాజాజ్ఞను నెరవేర్చడానికి అవతలకు వెళ్ళిపోయాడు. టామ్‌కు ఈసారి నిజంగా ధైర్యం వచ్చింది. తన ఇష్టం వచ్చినట్టు అధికారం చెలాయించవచ్చనే నమ్మకం కలిగింది.

టామ్ దర్బారు హాల్లోకి తీసుకుపోబడ్డాడు. మంత్రులు, ఇతర ఉన్నతాధికారులు ఎవరి స్థానాల్లో వాళ్ళు ఆసీను లయ్యారు. టామ్ కూర్చున్న సింహాసనం వెనక అంగరక్షకులు నిలువబడ్డారు. ఇంతలో రాజభటులు టకటక బూట్లశబ్దం చేసుకుంటూ ప్రవేశించారు. ముందు ఒక రక్షకభటాధికారి, అతని వెనుక భటులు, వారిమధ్య నేరస్థులు వచ్చారు.

రక్షకభటాధికారి టామ్ ఎదుట మోకరించి, లేచి, ఒక ప్రక్కకు వెళ్ళి నిలబడ్డాడు. నేరస్థులు మోకరించి అలాగే తలలు వంచుకు నున్నారు. టామ్ కుతూహలంతో పరికించి చూశాడు నేరస్థుల్ని. వారిలో నలభై ఏళ్ల పురుషుడొకడున్నాడు. అతన్నెక్కడో చూసినట్టనిపించింది టామ్‌కి. కాని ఎక్కడ చూశాడో గుర్తురాలేదు. ఇంతలో నేరస్థుడు ఒక్కసారి తలఎత్తి టామ్‌ను చూడటానికి ప్రయత్నించాడు. కాని మహారాజువేషంలో, గంభీరమైన, దుర్నిరీక్ష్యమైన తేజస్సుతో వెలుగుతున్న టామ్‌ను కన్నెత్తి చూడటానికి సాహసించలేక తల మళ్ళీ వంచేశాడు. అతడు తల ఎత్తడంలో ముఖం స్పష్టంగా కనబడి టామ్‌కు తక్కిమని అంతా జ్ఞాపకం వచ్చింది.

టామ్ ఇలా గనుకున్నాడు: "వాడే వీడు. సంవత్సరాదినాడు నా స్నేహితుడు గైల్స్‌విట్ థేమ్సు నదిలో మునిగిపోతుండగా రక్షించింది వీడే. నేనప్పుడితని సాహసాన్ని ఎంతో మెచ్చుకున్నాను. పాపం సైతానుమాయకు లోబడి ఏం నేరం చేశాడో? ఆ రోజు నాకు బాగా జ్ఞాపకంవుంది. ఎందుకంటే ఇతని సాహసకృత్యంచూసి ఆలస్యంగా ఇంటికి వెళ్ళినందుకు మా బామ్మ నన్ను చితకగొట్టింది. అవ్వాళ తిన్న దెబ్బలు జన్మలో మరిచిపోలేను. అంచేత ఆ రోజు నా మనస్సులో శాశ్వతంగా ముద్రవేసుకుని వుండిపోయింది."

తరువాత టామ్ మిగతా ఇద్దరు నేరస్థులను అవ తలికి తీసుకుపోవలసిందని ఆజ్ఞాపించాడు. రక్షకభటాధి కారిని అడిగాడు:

"ఇతడు చేసిన నేరం ఏమిటి?"

అధికారి మోకరించి జవా బిచ్చాడు.

"ఇతడు విషప్రయోగం చేసి ఒకణ్ణి చంపాడు మహారాజా !"

"నేరం ఋజువైందా ?"

"తిరుగులేకుండా ఋజువైంది మహారాజా !"

టామ్ ఇంకేం మాట్లాడతాడు? అత న్నెలా గైనా రక్షించాలను కున్నాడు. కాని నేరం ఋజు వైం తరవాత ఇంకేం చేయగలడు ?

"సరే, తీసుకుపోండి అతన్ని. ఇంత సాహస వంతుడు అలా ఎందుకు హత్య చేశాడో? (నోరు జారి ఇలా అన్నందుకు టామ్ సిగ్గుపడ్డాడు) అహాహా. చూట్టానికి మంచి సాహసం గలవాడులాగా వున్నాడే, ఇంత నీచమైన నేరం ఎందుకు చేశాడా అని."

ఖైదీ తలెత్తి, చేతులు పిసుక్కుంటూ, దీనంగా అన్నాడు :

"ఓ మహారాజా! రక్షించండి, నేనే పాపం ఎరగను. నేనే దోషం చెయ్యలేదు. నామీద నేరం సరిగ్గా ఋజువు కాలేదు. నా కన్యాయంగా శిక్ష వేశారు. ప్రభూ ! శిక్ష కొట్టెయ్యమని నేను కోరడం లేదు. నా కెల్లాగూ చావు తప్పదు. కాని కొంచెం

కనికరించండి. నన్ను ఉరితీసేలాగు తీర్పు ఇప్పించండి—"

టామ్ ఆశ్చర్యపడ్డాడు.

"అదేమిటి? నీకు ఉరిశిక్ష కాదా విధించింది?"

"కాదు మహారాజా! నన్ను సలసలకాగే నూనెలో వేసి చంపుతారు."

టామ్ అదిరిపోయి సింహాసనంలోంచి లేచాడు; భయంతో అతని మోకాళ్లు గజగజ మన్నాయి; మొహం పాలిపోయింది. కొంతసేపటికి తేరుకున్నాడు.

"అలాగే. నీకోరికను మన్నిస్తాం. నువ్వు వెయ్యిమందికి విషంపెట్టి చంపినా నీ కలాంటి ఘోర శిక్ష వెయ్యను."

బంధితుడు సాష్టాంగపడి అంతులేని సంతోషంతో, కృతజ్ఞతతో అన్నాడు:

"ప్రభూ! దేవుడు మి మ్మెప్పుడూ రక్షించుగాక! మీరు ఈ బీదవాడిపై ఈరోజున చూపిన కనికరం సూర్యచంద్రు లున్నంతవరకూ ప్రపంచం మరిచి పోదు."

టామ్ హెర్ట్‌ఫర్డ్ ప్రభువు నడిగాడు:

"ఇతడు నేరం చేసినప్పటికీ ఇంత ఘోరశిక్ష విధించడం న్యాయమేనా?"

"అది మన దేశ శాసనాలరీత్యా న్యాయమే మహా రాజా! జర్మనీలో దొంగనాణెములు ముద్రించినవారిని కూడా మరిగే నూనెలో కాల్చి చంపుతారు—

నూనెలో ఒక్కసారిగా పడెయ్యరు. తాడుతో పైనుంచి వేలాడదీసి కొంచెం కొంచెం నూనెలోకి దింపుతూ, ముందు పాదాలవరకూ, తరవాత మోకాళ్లవరకూ—"

"ఆగండి. ఇక చెప్పద్దు. వినడానికే భయంగా వుంది," అంటూ టామ్ అరచెయ్యి వెలుపలకు పెట్టి కళ్లు మూసుకున్నాడు. గగుర్పాటు తగ్గినతర్వాత అన్నాడు:

"ఈ ఘోరశాసనం నేటినుండీ మార్చించండి. ఇది మానవులకు తగిన న్యాయం కాదు—రాక్షస న్యాయం."

హెర్ట్‌ఫర్డుప్రభువు ప్రభువుల తరగతికి చెందిన వాడైనా, మిగతావారివలె క్రూరుడు కాదు. తన "మేనల్లుడి" దయాబుద్ధిని ఇలా ప్రశంసించాడు:

"మహారాజువాక్కే శాసనం. ఈనాటినుండీ ఈ అమానుష శాసనాలు రద్దుచేసే ప్రయత్నాలు చేస్తాం. చరిత్ర మీ వంశాన్ని, ముఖ్యంగా మిమ్మ కృతజ్ఞతతో జ్ఞాపకం ఉంచుకుంటుంది."

రక్షకభటాధికారి ఖైదీతో అవసరం తీరిపోయిం దనుకుని వాడిని అవతలకు తీసుకుపోబోయాడు. కాని టామ్ "ఆగు" అని ఆజ్ఞాపించి, "ఈ ఖైదీ తనమీద నేరం బాగా ఋజువుకాలేదంటున్నాడు. నేనే స్వయంగా విచారణ చేస్తాను, నీకు తెలిసింది నువ్వు చెప్పు," అన్నాడు.

రక్షకభటాధికారి చేతులు జోడించి సమాధానం చెప్పాడు :

"కోర్టువారి విచారణలో నేరం ఇలా తేలింది ప్రభూ! ఇస్లింగ్టన్ పేటలో ఇతడు ఒక పూరికొంపలోకి వెళ్ళడం చాలమంది చూశారు. ఆ కొంపలో ఒకడు జబ్బుగా వున్నాడు. అతడు ఒంటరిగా నిద్రపోతున్నాడు. ఇతడు లోపలికి వెళ్లి అయిదు నిమిషాల తర్వాత బయటికి వచ్చి తనదోవన తాను పోయాడు. లోపల జబ్బుతో వున్న వ్యక్తి మరొకగంటలో గిలగిల కొట్టుకుని, చాలా బాధపడి మరణించాడు."

"ఇతడు విషమిస్తుంటే ఎవరన్నా చూశారా? అసలు విషం కనిపించిందా?"

"లేదు ప్రభూ!"

"అయితే విష మిచ్చినట్టు ఎలా ఋజువైంది?"

"లక్షణాలు చూస్తే విషంవల్ల చనిపోయినట్టే వుందని వైద్యులు నిర్ధారణచేశారు."

శాస్త్రజ్ఞానం అట్టే అభివృద్ధి కాని ఆ రోజుల్లో వైద్యులకున్నంత ప్రభావం ఇంకెవరికీ లేదు. అందుచేత టామ్ ఇంకేమనటానికీ వీల్లేకపోయింది.

"వైద్యులు నిర్ధారణ చేసింతర్వాత ఇక అనుమానం లేదు. విషప్రయోగమే జరిగివుంటుంది."

"అంతేకాదు మహారాజా! ఇస్లింగ్టన్‌లో ఇదివరకు ఒక మంత్రగత్తె ఉండేది. ఆమె రోగి విషంవల్ల చనిపోతాడని ఒకసారి 'సోది' చెప్పిందిట. పైగా

ఫలానా ఫలానా మాదిరిగా ఉండే ఒక కొత్తవాడు వచ్చి విషం పెడతాడనికూడా 'సోది'లో చెప్పిందట. ఆ మంత్రగత్తె చెప్పిన మాదిరిగానే ఈ ఖైదీ ఉన్నాడని పలువురు సాక్షులు సాక్ష్య మిచ్చారు. కనుక ఈ విధంగా నేరం ఋజువు చేయబడింది."

నేరాని కింతకంటే గొప్ప ఋజువేంకావాలి ఆ అజ్ఞానయుగంలో? మంత్రగత్తెల జోస్యమంటే ఆ రోజుల్లో భయభక్తులు విపరీతంగా ఉండేవి. ఖైదీని ఇక మానవమాత్రు డెవడూ రక్షించలేడని టామ్ గుండె రాయిచేసుకున్నాడు. అయినా ప్రయత్నించి చూద్దామని,

"నువ్వేమన్నా చెప్పుకునే దుంటే చెప్పుకో," అని ఖైదీకి అనుజ్ఞ ఇచ్చాడు.

"నేను నిర్దోషిని మహారాజా! కాని నే నెంత వాదిస్తేమాత్రం ఏం లాభం? నా తరఫున సాక్ష్య మిచ్చే మనిషి ఒక్కడూ లేడు. ఉంటే, ఆరోజున నేను ఇల్లింగ్టన్ పేటకు వెళ్లనే లేదని ఋజువు చేసిఉండే వాడిని. అసలు ప్రాణం తీయటానికి వెళ్లానన్న సమయంలో నేను థేమ్సునదిదగ్గర వున్నాను—"

"ఏం చేస్తున్నా వక్కడ?" అడిగాడు టామ్.

"మునిగిపోయే ఒక కుర్రవాణ్ణి ఒడ్డుకు లాక్కొస్తున్నాను—"

"అరె. నిజమేనా?"

"నిజం మహారాజా!"

టామ్ రక్షకభటాధికారివైపు తిరిగి,

"ఏ రోజున ఇతడు హత్యచేశా డన్నావు?" అని అడిగాడు.

"కిందటి సంవత్సరాదినాడు పగలు పదిగంటల వేళ—"

"ఖైదీని విడిపించండి. ఇది మహారాజు ఆజ్ఞ."

దర్బారులో గుసగుసలు బయలుదేరాయి. టామ్ ఏదో తప్పుచేసినవాడిలా జంకుతూ అందరి వంకా చూశాడు. బుద్ధిపూర్వకంగానే తను ఈ ఆజ్ఞ ఇచ్చినట్లు అంతా అనుకోవాలని ఇంకా ఇలా గన్నాడు:

"నేరం సరిగా ఋజువు కాలేదు. ఎవరో బుద్ధిహీనులిచ్చిన సాక్ష్యాలు విని ఈ అమాయకుడికి మరణ శిక్ష విధించడం నాకు మహా కోపం కలిగిస్తున్నది."

దర్బారులో గుసగుసలింకా ఎక్కువయ్యాయి. అందరూ టామ్‌ను మెచ్చుకుంటున్నారు; అత డిచ్చిన తీర్పుకు కాదు; అతని న్యాయబుద్ధికి కాదు. టామ్ చూపిన తెలివితేటలకి వాళ్లాశ్చర్యపోయారు.

"మహారాజు పిచ్చివాడని అన్నవాళ్ళే పిచ్చివాళ్లు—"

"ఎంత తెలివైన ప్రశ్న లడిగారు మహారాజు! అసలాయన తత్త్వం మొదటినుంచీ అంతే. రెండు నిమిషాల్లో తేల్చిపారేస్తారు ఎంత గొప్ప సమస్యనైనా. అబ్బే! ఆయనకు పిచ్చేమిటి? శుభ్రంగా ఉన్నారు."

"దేవునిదయవల్ల మహారాజుఆరోగ్యం బాగు పడింది. సరిగ్గా తండ్రిమోస్తరే—"

సభ్యు లీవిధంగా ఎవరికి తోచింది వాళ్ళు గుస గుసలాడుతున్నారు. అక్కడక్కడ కొన్ని మాటలు టామ్‌చెవిని పడ్డాయి. అంతా తన్ను మెచ్చుకుంటు న్నారని గ్రహించాడు. దాంతో మరింత ధైర్యం ఏర్ప డింది. ఖైదీని భటులు అవతలకు తీసుకుపోయి విడుదల చేయగానే మిగతా ఇద్దరు ఖైదీలను తీసుకురమ్మని టామ్ ఆజ్ఞాపించాడు.

ముప్ఫయ్యేళ్ళ ఒక స్త్రీ, పదేళ్ల బాలిక దర్బారు లోకి ప్రవేశపెట్టబడ్డారు. వారు గొల్లున ఏడుస్తూ వచ్చారు. భటులు వాళ్ళని నోరుమూయించారు.

"వీళ్ళేం నేరం చేశారు?" టామ్ రక్షకభటాధి కారి నడిగాడు.

"వీళ్ళిద్దరూ మంత్రగత్తెలు మహారాజా!"

"ఏం చేశారో చెప్పు?"

"మాంత్రికశక్తులు సంపాదించడంకోసం వీళ్లు తమంతట తామే సైతానుకు అమ్ముడుపోయారు."

టామ్ ఒళ్లు గగుర్పొడిచింది. పుస్తకాల్లో ఇలాంటి భయంకరకథలు చాలా చదివాడు.

"అందుచేత వీరికి ఉరిశిక్ష విధించారు కోర్టు వారు."

"ఏరోజున జరిగింది ఈ అమ్మకం?"

"కిందటి డిసెంబరులో ఒకరోజు అర్ధరాత్రివేళ."

"ఎక్కడ జరిగింది?"

"శ్మశానంలోనండి."

"అక్కడ అప్పు డెవరెవ రున్నారు?"

"వీళ్లిద్ద రేనండి—అన్నట్టు వాడుకూడా."

"వా డెవడు?"

"దేవుని విరోధి సైతాను."

"అయితే వీళ్లు అమ్ముడుపోయినట్టు ఎలా తెలిసింది?"

"వీరు శ్మశానానికి వెడుతుండగా కొందరు తాము చూసినట్టు సాక్ష్యాలిచ్చారు. అందువల్ల సైతానుకు అమ్మకం జరిగివుంటుందని సందేహం కలిగింది. పైగా కొన్నిరోజుల తరవాత ఈ ఇద్దరూ తమ మంత్రప్రభావంవల్ల గొప్ప తుపాను తెప్పించారు. ఆ తుపాను స్వయంగా చూసినవాళ్లు, దానివల్ల ఇళ్లూ వాకిళ్లూ పోగొట్టుకున్నవాళ్లు అనేకమంది సాక్ష్యాలిచ్చారు."

"తుపానువల్ల ఈ స్త్రీకూడా నష్టపడిందా?"

టామ్ వేసిన ఈ ప్రశ్న చాలా తెలివైందని కొందరు పెద్దతలకాయలు మెచ్చుకున్నారు. రక్షకభటాధికారికి మాత్రం ఈ విచారణ వట్టి చాదస్తంగా కనిపించింది.

"అవును ప్రభూ! తుపానులో ఈమె ఇల్లూ వాకిలీ కూడా కొట్టుకుపోయాయి."

"అంటే తను కల్పించిన తుపానువల్ల తనుకూడా నష్టం పొందిన దన్నమాట. ఇక ఆమెకు మంత్ర శక్తివల్ల వచ్చిన లాభ మేముంది? ఈమాత్రం దానికి తననూ, తన కూతుర్నీ సైతానుకు అమ్ముకోవడం చూస్తే ఈమె పిచ్చిదని తేల్తున్నది. పిచ్చివాళ్లకు తా మేం చేస్తున్నదీ తమకే తెలియదు. కనుక వాళ్ళకు పాపం అంటుకోదు."

టామ్ తెలివితేటల్ని పెద్దతలకాయలు మరో సారి మెచ్చుకున్నారు.

"ఈ బాలిక కెన్నేళ్లు?"

"తొమ్మిదేళ్లుంటాయి ప్రభూ!"

"మైనారిటీ తీరని పిల్లలకు ఇలా క్రయవిక్రయాలు చేసేందుకు అధికారం ఉందా?" అని టామ్ దర్బారులోని ఒక జడ్జీ నడిగాడు.

జడ్జీ కొంతసేపు ఆలోచించి సమాధాన మిచ్చాడు:

"న్యాయశాస్త్రరీత్యా మైనర్లకు క్రయ విక్రయాధికారాలు లేవు. కాని సైతానువిషయం వేరు. ఒక మైనరును సైతాను కొనదలచుకుంటే మనం అడ్డగించలేం. అదే ఒక ఇంగ్లీషువాడు చేస్తే న్యాయ శాసనం అతన్ని అడ్డగించగలదు."

టామ్‌కు బలే కోపం వచ్చింది.

"తమ మొహంలాగుంది న్యాయశాసనం.

గౌరవష్ఠుడైన ఇంగ్లీషువానికి లేని అధికారం సైతాను కెందు కుండాలి? అక్రమం కాదా ?"

టామ్ తెలివి చూసి ఇంకా ఆశ్చర్యపోయారు సభలోని పెద్ద బుర్రలు. ఎవరికీ తట్టని ఇంత గొప్ప ప్రశ్న "మహారాజుకు" తట్టినందుకు వారు చాలా మెచ్చుకున్నారు.

టామ్ వాడించేధోరణి చూసి నేరస్థురాలికు కొంత ఆశ కలిగింది. అందుచేత జాగ్రత్తగా వింటు న్నారు ప్రతిమాట. ఇది గమనించి టామ్ మరింత జాలిపడ్డాడు వారిమీద. అధికారిని తిరిగి ప్రశ్నిం చాడు :

"తుపాను ఏ విధంగా తెప్పించారు వీళ్లు?"

"కాలి మేజోళ్లువిప్పి దులిపితే తుపానువస్తుంది."

టామ్ కుతూహలానికి పట్టపగ్గాలు లేవు. ఉత్సాహంతో అడిగాడు :

"బలే,బలేగా వుంది. అలా చేస్తే తుపాను ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తుందా?"

"అవును మహారాజా! కొద్దిగా మంత్రాలు కూడా చదువుతారనుకుంటాను."

టామ్ ఆ స్త్రీకేసి తిరిగి "ఏదీ తుపాను తెప్పించు," అని ఆజ్ఞాపించాడు.

సభ్యులంతా ఉలిక్కిపడి లేచారు. వాళ్ల కంగారు చెప్ప నలవికాదు. తుపాను ప్రమాదాన్నుండి

తప్పించుకోవడ మెలాగో తెలియలేదు. ఆ రోజుల్లో శస్త్రశక్తులమీద అంత మూఢవిశ్వాసం ఉండేది.

సభ్యుల అవస్థను టామ్ గమనించలేదు. తుపాను ఎలా వస్తుందో చూడాలన్న ఆదుర్దాలో తన ప్రజల యోగక్షేమాలు మరిచిపోయాడు.

టామ్ ఆజ్ఞ విని నేరస్థురాలు తెల్లబోయింది.

"ఫరవాలేదు. నీ కేం భయంలేదు. నిన్ను విడుదల చేస్తాను. తుపాను తెప్పించు."

ఆమె తిరిగి గొల్లున ఏడుస్తూ,

"మారాజా! నా కే మంత్రాలూ చేతకావు. బీదముండని, కాపాడండి, బతికినన్నాళ్లూ మీ దయ మరిచిపోను."

"నువ్వు భయపడుతున్నావు ఊరికే. నీమీద ఈగ వాలనివ్వను. ఒక్కసారి తుపాను తెప్పించావంటే నీకు గొప్ప బహుమానంకూడా ఇస్తాను. నిన్నూ నీ కూతుర్నీ కూడా విడుదల చేస్తాను. ఒక్క తుపాను చాలు—ఎంత చిన్నదైనా సరే."

పాపం నేరస్థురాలు ఇంకా ఏడుస్తూ మొత్తుకుంది. తన కలాటి శక్తులు లేవనీ, ఉంటే మహారాజు ఆజ్ఞప్రకారం చేసి తన కూతుర్ని బ్రతికించుకునే దాన్ననీ, తనను చంపి తన కూతుర్ని వదిలేసినా సంతోషమేననీ అన్నది.

టామ్ చివరి కిలా గన్నాడు:

"ఈ స్త్రీ నిజం చెబుతోందని నేను నమ్ము తున్నాను. నిజంగా మంత్రశక్తులే వుంటే తన కూతుర్ని రక్షిస్తానన్నా ఎందు కూరుకుంటుంది. అమ్మా! ఇక మీరు పోవచ్చు. మిమ్మల్ని విడుదల చేశాను."

తల్లీ కూతుళ్లు తమ ప్రాణాలు దక్కినందుకు సంతోషం పట్టలేక టామ్‌కు వంగి వంగి నమస్కారాలు చేశారు. వారు వెళ్లబోతుండగా టామ్ ఆగమన్నాడు.

"అమ్మా! నా మాట వినవ్? ఒక్కటంటే ఒక తుపాను చాలు. నీ కెంత డబ్బు కావాలంటే అంత డబ్బిస్తాను. అసలు నీ మేజోళ్లు విప్పి దులుపు. తుపాను వస్తుందేమో చూద్దాం"

బీదరాలు టామ్ఆజ్ఞను శిరసావహించింది. టామ్ అత్యంత కుతూహలంతో చూస్తున్నాడు; సభికులు కంగారుపడడం మొదలెట్టారు. ఆమె మేజోళ్లు దులిపింది. తన కుమార్తె మేజోళ్లుకూడా విప్పి దులిపింది. కాని అందులోంచి రెండు మూడు గడ్డిపరకలు తప్ప తుపానూ రాలేదు, గిపానూ రాలేదు. టామ్ నిట్టూర్పువిడిచాడు. సభికులు కూడా "అమ్మయ్య" అనుకున్నారు.

"సైతాను నీ మంత్రశక్తులు మళ్లీ లాగేసుకున్నాడు. మళ్లీ ఎప్పుడన్నా అవి నీకు దొరికితే నాకు ఒక తుపాను బాకీఉన్నావనిమాత్రం మరిచిపోకేం. ఇక పో."

# 19

మైల్స్ హెండన్ బాలరాజును వెదుకుతూ సౌత్ వార్కు వైపు బయల్దేరాడు. వాళ్ళనీ వీళ్ళనీ అడుగుతూ, బాలరాజు ఏవేపు తీసుకుపోబడ్డాడో కొంతవరకూ గుర్తుపట్టాడు. ఆ రోజు సాయంత్రం వరకూ సౌత్ వార్కులోనే తన అన్వేషణ సాగించాడు. ఎంతసేపు ప్రయత్నించినా అలిసిపోవడమే తప్ప అతని ప్రయత్నాలేమీ ఫలించనే లేదు. ఒక సత్రంలో కాస్త ఎంగిలిపడి ఒక మంచం అద్దెకు తీసుకుని నడుం వాల్చాడు.

హెండన్ పడుకున్నాడేగాని అతని మనస్సంతా బాలరాజు మీదనే లగ్నమై వుంది. పసివాడు కొంత సేపటికైనా గుర్తిస్తాడు, తను అపాయంలో పడ్డట్టు. గుర్తించి ఆ తాగుబోతునుంచి తప్పించుకునే ప్రయత్నాలు చేస్తాడు. తప్పించుకొంటే ఎటు పోతాడు ? లండన్నగరానికా? ఊహు పోడు. ఎందుకంటే లండన్ వెడితే మళ్ళీ అపాయాల్లో చిక్కుకున్నట్టే. అయితే మరి ఎటు పోతాడు? మైల్స్ హెండన్ ఒక్కడే తన్ను రక్షించగల స్నేహితుడని అతనికి తెలుసు. కనుక అతనికోసం వెదుకుతాడు. మైల్స్ హెండన్ తన స్వగృహమైన హెండన్హాలుకు వెళ్ల దలచుకున్నాడని అతడెరుగును. అందుచేత అతడు కూడా హెండన్ హాలుదారే పడతాడు. ఆ. అంతే. ఇప్పుడంతా.

స్పష్టమైపోయింది. సౌత్ వార్కులో ఆలసిస్తే లాభం లేదు. వెంటనే హెండన్‌హాలు దిశగా మార్గమంతా అన్వేషిస్తూ బయల్దేరిపోవాలి.—ఇక బాలరాజు గతి ఏమైందో చూద్దాం.

బాలరాజును తీసుకుపోయిన కొత్త యువకుడిని ఎవడో తాగుబోతు కలుసుకున్నట్టు వంతెన సత్రవలోని నౌకరు చెప్పాడు. కాని ఆ తాగుబోతు వాళ్ళని వంతెనమీద కలుసుకోలేదు. వెనక వెనక అనుసరించాడు. వాడి ఎడమ చెయ్యి సగానికి మడిచి కట్టు కట్టబడి వున్నది. ఎడమ కంటికి కూడా ఎర్రటి గుడ్డ కట్టబడి వుంది. కర్రపుచ్చుకుని కొద్దిగా కుంటుతున్నాడు. కొత్త యువకుడు బాలరాజును చాలా సందులు గొందులు తిప్పి మొత్తానికి సౌత్ వార్కు గ్రామం దాటించాడు. ఆ పైన అన్నీ కీకారణ్యాలే. బాలరాజు ఇంతసేపూ చిరాకుతోనే నడుస్తున్నాడు. సౌత్ వార్కు దాటగానే ఇక కోపం పట్టలేక పోయాడు. ఒక్క అడుగైనా ముందుకు కదలనన్నాడు. 'కావలిస్తే హెండన్నే ఇక్కడికి రమ్మను. అతనికోసం మహారాజైన నేను నడిచివస్తానా' అని పట్టు పట్టాడు.

కొత్త యువకుడన్నాడు: "మహారాజా! తమ స్నేహితుడు ఆ అడవిలో గాయాలు తిని పడిపోయాడు. అతడెలా రాగలడు?"

"గాయపడ్డాడా? అరెరె. చెప్పవేం? ఎవడా ద్రోహి, నా స్నేహితుణ్ణి గాయపరిచింది? ఆ ద్రోహి

ఎవడైనా సరే శిక్షించితీరుతాను. పద, దారి చూపు."

యువకుడు బాలరాజును అడవిలోకి తీసుకు వెళ్ళాడు. చెట్ల మధ్య సన్నని కాలిబాట వున్నది. పోయి పోయి ఒక పాడుపడిన గుడిసె చేరుకున్నారు. ఎక్కడా ప్రాణిసంచలనం లేదు. పరిసరాలన్నీ నిశ్శబ్దంలో మునిగి వున్నాయి. యువకుడు గుడిసెలో దూరాడు. బాలరాజుకూడా లోనికి పోయి చూశాడు. అక్కడెవరూ లేరు. బాలరాజుకు చటుక్కున అనుమానం కలిగింది.

"ఎక్కడతడు?"

యువకుడు హేళనగా నవ్వాడు. బాలరాజు వెంటనే క్రోధంతో కంపించాడు. పక్కనున్న ఒక రాయిఎత్తి యువకుని పైకి దూకబోయాడు. ఇంతలో మరొక వికటాట్టహాసం వినబడింది. వెనక్కి తిరిగి చూడగా, ఇందాక వెనకాలే కుంటుతూ వచ్చినవాడు.

"ఎవరు నువ్వు? నీకిక్కడేం పని?"

"ఏడిశావులే. ఎంత వేషం వేసుకుంటే మాత్రం నీ అబ్బనే నువ్వు గుర్తుపట్టలేవట్రా?"

"నువ్వు నా తండ్రివి కాదు. నేను నిన్నెరగను. నేను మహారాజుని. నా సేవకుణ్ణి ఎక్కడ దాచావో చెప్పు. లేకపోతే నీకు ఘోరమైన శిక్షవిధిస్తాను."

"నీకు పిచ్చెత్తినమాట నిజం. పిచ్చాణ్ణి కొట్టడానికి చేతులు రావటం లేదు. కాని నాకు కోపం

వచ్చిందంటే మనిషినికాను. ఇక్కడ నువ్వెంత పిచ్చిగా వాగినా ఫరవాలేదు. అయినా మనం జాగ్రత్తగా వుండాలి. విను. నేనొకణ్ణి చంపాను. పోలీసులు నన్ను వెదుకుతున్నారు. అందుకని మన పేర్లన్నీ మార్చేశాను. నాపేరిప్పుడు జాన్ హాబ్స్. నీపేరు జాక్. నువ్వు ఈసారి పారిపోయావంటే వూరుకోను. నువ్వు నాకు అవసరం. దొంగతనాలకి వాటికి, నీలాంటి వాడొకడు లేందే యెట్లా? చెప్పు. నీ అమ్మ, బామ్మ, ఆడపిల్లలు ఎటు పోయారు? వంటైన చివరకు రమ్మని చెబితే రాకుండా ఎటు పోయారు?"

"నా కేం తెలియదు. నా తల్లిగారు నా చిన్నప్పుడే చనిపోయింది. నా అక్కగార్లు రాజభవనంలో వున్నారు."

ఇదంతా వింటున్న యువకుడు పెద్దపెట్టున నవ్వాడు. బాలరాజు అతనిమీదికి రాయి విసిరే వాడే; కాని జాన్ కాంటీ - కాదు, వాడు పేరు మార్చుకున్నాడుగా - జాన్ హాబ్స్ రాయి లాగి పారవేశాడు.

"ఒరే హ్యూగో! కుర్రాణ్ణి ఏమనకురా. వాడికి బాత్తిగా పిచ్చెక్కింది. ఒరే జాక్. కూర్చో అక్కడ కదలకుండా. జాగ్రత్తగా మసులుకుంటే నీకు కాస్సే పాగి ఓ రొట్టెముక్క పారేస్తా."

హాబ్స్, హ్యూగో లిద్దరూ ఒక మూలచేరి రహస్యంగా ఏదో సంభాషణ ప్రారంభించారు. బాల

రాజు గుడిసెలో ఇంకో మూలకు పోయాడు. అక్కడ గడ్డివుంటే దానిమీద పడుకున్నాడు. చనిపోయిన తండ్రిని తలుచుకుంటే అతనికి దుఃఖం మళ్లీ వుక్కిలిం తలుగా వచ్చింది. అలాగే ఏడుస్తూ నిద్రపోయాడు.

నిద్రలేచేటప్పటికి అప్పుడే చీకటి పడుతోంది. గుడిసెమీద వాన చినుకులు శబ్దం చేస్తున్నాయి. బాల రాజు కళ్లు మూసుకుని మళ్లీ కొంచెం కునుకుతీశాడు. ఇంతలో ఏదో గల్లంతు వినబడి, ఉలికిపడి లేచాడు. గుడిసెలో ఎవరెవరో జనం కిక్కిరిసిఉన్నారు. మధ్యగా చలిమంట వున్నది. ఆడవాళ్లు మగవాళ్లు, ముసలివాళ్లు, పడుచువాళ్లు, చంటిపిల్లలు అన్నిరకాల వారూ ఉన్నారు. దున్నపోతుల్లా మదించి, కోర మీసాలతో, పొడుగు వెంట్రుకలతో పిశాచాల్లాంటి వారు కొందరు; వింతవింత దుస్తులు ధరించిన ఒక మాదిరి యువకులు కొందరు; కళ్లమీద పట్టీలు వేసు కున్న గుడ్డిబిచ్చగాళ్లు కొందరు; కొయ్యకాళ్లు పెట్టు కుని, ఊతకర్రలు గల కుంటి బిచ్చగాళ్లు కొందరు; అందులో ఒకడు ఊళ్లు తిరిగి సరుకు అమ్మకునేవాడు; వాడిపక్కనే వాడి సరుకులసంచి వున్నది; ఒకడు చాకులు పదునుపెట్టేవాడు; ఒకడు పాత్రలకు మాట్లు వేసేవాడు; ఇంకోడు మంగలి. ఆడవాళ్లలో కొందరు పడుచుపిల్ల లున్నారు; కొందరు నడుంవంగి, ఒళ్లు ముడతలు పడ్డవాళ్లున్నారు; గుడ్డి బిచ్చగాళ్ల పక్కన వాళ్లని నడిపించేందుకుగావును పెంపుడు కుక్క-

-లున్నాయి; వాటికి డొక్కలంటుకుపోయి ఈసురో
మంటున్నాయి.

ఇదంతా ఒక పెద్ద దొంగల గుంపు. ఇప్పుడే వాళ్లవిందు ముగిసింది. ఇక ఆటపాటలు ప్రారంభం కానున్నాయి. ఒకతె కల్లుకుండలోంచి కల్లు పోస్తోంది అందరికీ. కల్లుతాగినకొద్దీ ఉషారెక్కుతోంది.

“ఊ. ఇక పాటలు కానివ్వండి. ఇవ్వాళ కుంటి నక్క, గుడ్డి కొక్కిరాయి పాటలు పాడాలి.” అని కొందరు అరిచారు.

కుంటినక్క లేచాడు. కొయ్యకాలు ఊడలాగి అసలు కాళ్లమీద నిటారుగా నుంచున్నాడు. గుడ్డి కొక్కిరాయి కళ్ళమీద అతికించుకున్న పట్టీలు లాగేసి ఆరోగ్యవంతమైన కళ్లు రెండూ ప్రదర్శించాడు. వాడి మెళ్లో అట్టముక్క ఒకటి వేళ్లాడుతోంది. దానిమీద “అయ్యా, గుడ్డివాణ్ణి, ధర్మం చెయ్యండి,” అని అక్షరాలున్నాయి. ఆ అట్టముక్క కూడా తీసేసి తన తోటి దొంగపక్కనే నుంచున్నాడు.

చేతులో కల్లుముంతలు పుచ్చుకుని పాటగాళ్లు చిందులువేస్తూ పాట ప్రారంభించారు.

“నక్కాని సుక్క వే...” ప్రేక్షకులు, తాళం వేస్తూ “ఓ సిన్నదాన!” అని పల్లవి అందుకున్నారు.

“నక్కానిసుక్క వే—ఓసిన్నదాన
సుక్కలకురాణి వే—ఓసిన్నదాన

రత్నాలుకోరతే—ఓసిన్నదాన
కన్నెత్తిసూడవే—ఓసిన్నదానా”

పాట, చిందులు ఇంకా పైస్థాయిలోకి పోయాయి. అంటే కైపు బాగా తలకెక్కిందన్నమాట.

కల్లగాదు నీతోడు—ఓసిన్నదాన
కల్లుతోడు ముంతతోడు—ఓసిన్నదాన
నిన్న పేటల నిన్నుసూసి—ఓసిన్నదాన
నిలవలేక నీరసిస్తి—ఓసిన్నదాన
కట్నాలుకానుకలు—ఓసిన్నదాన
కరువుదీర తెచ్చానె—ఓసిన్నదాన

ఈవిధంగా కొంతసేపు కాలక్షేపమయ్యాక సభ ప్రారంభమయింది. మంటకు దగ్గిరసా కూర్చున్న వాగిలో ఒక ఆజానుబాహు వున్నాడు. వాడు ఈ ముఠాకు నాయకుడు. దొంగల మాటలలో “జాక్ హాబ్స్” ఈ ముఠాలో పాత సభ్యుడేనని, ఈ నాయకుడిదగ్గర తర్ఫీదు పొందినవాడేనని తేలింది. అతన్ని పూర్వం ఎరిగినవాళ్లు ఇంకా కొందరు ముఠాలో ఉన్నారు. వారతన్ని కుశలప్రశ్నలు వేశారు. ముఠాలోంచి విడిపోయాక ఏమేంజేశావని అడిగారు. చాలా ఏళ్లనుంచీ లండన్ లోనే కాపురం ఉంటున్నాననీ, లండన్ నగరమంత సుఖమైన ప్రదేశం ఇంకోటి లేదనీ హాబ్స్ చెప్పాడు. అయితే మరి లండన్ వదిలి ఎందుకు వచ్చేశావని వారడిగారు. అతడొక మనిషిని హత్య చేశాడని తెలియగానే దొంగల సంతోషానికి మేర లేక

పోయింది. హత్య చేయబడినవాడు మతగురువని తెలియ
గానే వాళ్ళఉత్సాహం, ఆనందం పెల్లుబికిపోయాయి.
ఒక్కొక్కరే వచ్చి జాన్ హాబ్స్ కరస్పర్శ చేసి అభి
నందించారు.

ముఠాలో ఇప్పుడు ఎంతమంది సభ్యు లున్నా
రని హాబ్స్ అడిగాడు. దొంగల నాయకుడు సమా
ధాన మిచ్చాడు :

"కన్నపుదొంగలు, బందిపోట్లు, హంతకులు,
జేబుదొంగలు అంతాకలిసి పాతిక ముప్ఫయి దాకా
ఉంటారు. ఇంకా కొందరు మనవాళ్లే తూర్పుకు పోతు
న్నారు. రేపు మనం కూడా వాళ్ళతోపాటు తూర్పుకు
ప్రయాణమై పోతున్నాం."

"ఇక్కడున్న పెద్ద మనుషుల్లో బెన్ కనిపించ
డేం? విడిపోయాడా?"

"పాపం బెన్ వీరస్వర్గ మలంకరించాడు. కిందటి
వేసాకాలం ఒక ముట్టడిలో తలపగిలి చచ్చిపోయాడు."

"పాపం. బెన్ నిజంగా సమర్థుడైనవాడు.
మాంచి ధైర్యస్థుడు. ఆయన లేకపోవటం మన సంఘా
నికి తీరనిలోటు."

"నిజమే మరి. కాలం కలిసిరాక చచ్చిపో
యాడు. ఏంచేస్తాం? ఆయన ఉంచుకున్న ముండ
జెస్సీ ఇప్పుడు మనకిందే ఉంది. అదికూడా తూర్పుకు
పోతున్నది. రేపు చూస్తావుగా దాన్ని. చాలా మంచి

పిల్ల. నియమం, నిగ్రహంగల మనిషి. వారానికి ఆరు రోజులకంటే ఎక్కువ తాగదు."

"అవునవును జ్ఞాపకముంది. మెచ్చుకోదగినపిల్ల. దానితల్లి ఎక్కడుంది? చచ్చిపోయిందా? ఆ ముసల్దాని తెలివితేటలు నిజంగా పరమాద్భుతం. అంత జిత్తులమారి నక్క నింకెక్కడా చూళ్లేదు."

"ఆ జిత్తులవల్లే అది చచ్చిపోయింది. దానికి సోది చెప్పడం వచ్చునుగదూ. అంచేత దాన్ని మంత్రగత్తె కింద కట్టి చంపారు. మంటల్లో వేయించి కాస్త కాస్తే చంపారు. ఎంత ధైర్యంగా, నిబ్బరంగా ప్రాణాలు వదిలిందనుకున్నావ్? నాకు బలే ఏడుపొచ్చిందప్పుడు. మంటచుట్టూ జనం చేరి చూస్తున్నారు. మంటలు లేచి నెమ్మదిగా ఒక్కొక్క చేతినీ, కాలినీ ఉడకబెడుతున్నాయి. అప్పుడది తిట్టిన తిట్లు వర్ణనాతీతం. శాసనాలని, చట్టాలని, దేశాన్ని, అధికారుల్ని, ప్రజల్ని అందర్నీ తిట్టింది. ఊరికే చచ్చిందా? వీరోచితంగా చచ్చింది. వెయ్యేళ్లు బతికినా అటువంటి తిట్లు నువ్వు వినలేవు. రకరకాల బూతులు కల్పించి తిట్టింది. బూతుల్లో మమ్మల్ని మించినవాళ్లు లేరని గర్వపడే మేమంతా సిగ్గుపడిపోయాం. కాని విచారించదగ్గ విషయ మేమంటే దాని బూతు కవిత్వమంతా దానితోనే చచ్చింది. దానిశిష్యులు దేశమంతటా వున్నారు గాని ఒక్కళ్లకీ దాని కవిత్వం చేతగాదు. పాపం చచ్చిపోయింది..." అంటూ దొంగల నాయకుడు కళ్ల

నీళ్లు పెట్టుకున్నాడు. మిగతావాళ్లు కూడా సాను భూతితో నిట్టూర్పులు విడిచారు. అంతా విచార సముద్రంలో మునిగిపోయారు. మామూలుగా దొంగలు ఎంత కఠినాత్ములైనా, వాళ్ళకికూడా అప్పుడప్పుడు అంటే పదేళ్లకోసారి జాలి, ప్రేమ మొదలైన భావాలు కలక్కపోవు. అందులో ముఖ్యంగా జెస్సీ తల్లివంటి గొప్ప గొప్ప కవులు చచ్చిపోవడం వాళ్లకు మరీ దుఃఖాన్ని కలిగిస్తుంది.

మళ్ళీ తలోక ముంతా ఖాళీ చెయ్యగానే పోయిన ఉత్సాహ సంతోషాలు తిరిగి వచ్చాయి.

"మన స్నేహితుల్లో ఇంకా ఎవరన్నా కష్టాలు పడ్డారా?" అని హాబ్స్ దొంగలనాయకుని అడిగాడు.

"ఆఆ. తిండికి జరక్కపోతే ఏంచేస్తారు? ముఖ్యంగా కొత్తగా మన వృత్తిలోకి వచ్చినవాళ్లు మరీ కష్టపడ్డారు. వాళ్లు మొదట్లో గౌరవస్థులైన రైతులు. వాళ్ల పొలాల్ని జమీందార్లు లాక్కుని గొర్రెల బీళ్లుగా మార్చుకున్నారు. పాప మీ రైతులు మరేపనీ చేతకాక బిచ్చమెత్తుకోడం ప్రారంభించారు; రాజ భటులు పట్టుకుని చొక్కాలూడదీసి నెత్తురొచ్చేదాకా కొట్టారు; మనవాళ్లు మళ్లీ బిచ్చమెత్తారు; రాజభ టులు కొట్టి ఒక్కొక్క చెవి కోసేశారు; వాళ్లు మూడో సారి బిచ్చమెత్తారు. ఈసారి భటులు చెంపల మీద వాతలుపెట్టి బానిసలుగా వేలంవేశారు. మన స్నేహి తులు పారిపోయారు, పట్టు బడ్డారు, చివరికి వాళ్లపీడ

ఉరిశిక్షతో వదిలిపోయింది. ఇల్లా వున్నదబ్బాయ్ దేశం. నుంచోండిరా యోకెల్, బర్నెస, హోడ్జ్ మీమీ అలంకారాలు చూపించండి."

ముగ్గురుసభ్యులు లేచి తమ వీపులు ప్రదర్శించారు. వాటిపై అడ్డదిడ్డంగా వాతలున్నాయి. ఒకడు జుట్టు తొలిగించి పూర్వం తన ఎడమచెవి ఉన్న ప్రదేశాన్ని చూపించాడు. రెండోవాడు తన బుజంమీద వాతల్ని, కోసివెయ్యబడిన చెవి చూపించాడు. మూడోవా డిలా గన్నాడు:

"నాపేరు యోకెల్. ఒకప్పుడు బాగా వున్న రైతునే. పెళ్లాం బిడ్డలతో సుఖంగా జీవించేవాణ్ణి. తరవాత నాస్థితి అంతా తారుమారైంది. ఇప్పుడు నాపెళ్లాం బిడ్డలు స్వర్గంలో ఉన్నారో నరకంలో ఉన్నారో తెలియదు. ఏమైనా ఇంగ్లండులో మాత్రం లేనందుకు వా ళ్లదృష్టవంతులే. మొదట్లో నాముసలి తల్లి రోగులకి ఉపచారాలు చేసి సంపాదించుకొనేది. ఒకసారి ఒకరోగి చచ్చిపోగా నాతల్లే చంపిందనీ, అది మంత్రగత్తె అనీ నేరంమోపి అధికారులు కాల్చి చంపారు. ఇంగ్లీషు శాసనాలకీ జై. నాతల్లిని ఇంగ్లీషు నరకంనుండి తప్పించినందుకు ఇంగ్లీషు శాసనాలకి జై. అందరూ జై అనండి. అదీ, అల్లాగు. తరవాత నేను, నాపెళ్లాం ఇంటింటికీ వెళ్లి బిచ్చమెత్తాము. కాని ఇంగ్లండులో ఆకలిగా ఉండటంకూడా నేరమే. కనక మమ్మల్ని కొరడాలతో కొడుతూ ఊరూరూ తరిమారు.

ఆ దెబ్బలకి నాపెళ్లాం మేరీ నెత్తురు కక్కుకుని చచ్చిపోయింది. జై ఇంగ్లీషు శాసనాలకీ. నా పిల్లల గతా? వాళ్లు మలమలమాడి విలవిల కొట్టుకుని చచ్చారు. తాగండి మిత్రులారా! మనలాంటి సర్వాభాగ్యులపై ఇంగ్లీషు శాసనాలు ఎంత దయగా ఉంటాయో చూశారా? వాటిపేరు చెప్పి ఇంకోసారి తాగండి. ఆ, అల్లాగు. నేను మళ్ళీ బిచ్చమెత్తాను. రొట్టెముక్క రావడానికి బదులు నా ఎడమచెవి పోయింది. మళ్లీ బిచ్చమెత్తాను. కుడి చెవిపోయింది. ఇంకా బిచ్చమెత్తాను. నన్ను పట్టుకుని బానిసగా అమ్మారు. నా చెంపమీాద ఈ వాత నా బానిస తనానికి గుర్తు. నేను బానిసని. విన్నారా? ఇంగ్లీషు బానిసని. అర్థమైందా? మీా ఎదురుగానుంచున్నాడే వీడు....వీడు బానిస...సరే నేను నా యజమానినుండి కట్లు తెంచుకుని పారిపోయాను. ఈసారి గనక నన్ను అధికారులు పట్టుకుంటే ఉరితీస్తారు. జై ఇంగ్లండు దేశానికీ. జై ఇంగ్లీషు శాసనాలకీ."

"ఎన్నటికీ అల్లా జరగదు. నిన్ను ఉరితీసే న్యాయశాసనాలు ఈ రోజునుంచీ రద్దవుతాయి." అని ఎక్కడినుంచో ఈమాటలు కొట్టొచ్చినట్టు వినబడ్డాయి. ఆవేపు చూశారంతా. గడ్డిమీాదనుండి లేచి బాలరాజు రాజఠీవితో వారి మధ్యకు నడిచివచ్చాడు.

"ఎవరు నువ్వు? ఎందు కొచ్చావు?" అని అందరూ చుట్టుముట్టారు. వారి మధ్య తోసుకూ

బెంబుకూ లేకుండా ఠీవిగా నుంచున్నాడు బాలరాజు. సహజగర్వంతో సమాధాన మిచ్చాడు:

"నేను ఇంగ్లండు సార్వభౌముడైన ఎడ్వర్డును."

ఈ మాటలకి పెద్దపెట్టున అంతా నవ్వారు. బాలరాజుకు ఉక్రోషం వచ్చింది.

"మర్యాద లేని గాడిదల్లారా! మహారాజును హేళన చేస్తున్నారా?" అని గర్జించాడు. కాని నవ్వు హోరులో అతని మాటలు మునిగిపోయాయి. నవ్వు సద్దుకున్న తర్వాత "జాన్ హాబ్స్" సభికులకు తెలియజేశాడు:

"వీడు మా అబ్బాయే లెండి. ఈమధ్య కాస్త పిచ్చెక్కింది. వాడి మాటలకు మీరేమీ అనుకోవద్దు. తను మహారాజు నంటూవుంటాడు పిచ్చివాడు."

"నేను మహారాజునే. సమయం వచ్చినప్పుడు నీ కాసంగతి ఋజువు చేస్తాను కూడా. నువ్వు హత్య చేశావని నీ నోటితోనే ఒప్పుకున్నావు. దానికి తగిన శిక్ష అనుభవించేటప్పుడు తెలుస్తుంది నేను మహారాజునో కాదో."

"ఓరి వెధవా! నన్ను రాజభటులకు పట్టిద్దామనుకుంటున్నావా? నల్లిని నలిపినట్టు నలిపేస్తాను నిన్ను—"

"టట్—టట్," అని అడ్డంవచ్చాడు దొంగల నాయకుడు. బాలరాజుమీదికి సింహంలా దూకబోతున్న హాబ్స్‌ను ఒక్క గుద్దులో పడవేశాడు. "ఛీ,

నీకు బుద్ధి లేదుటోయ్? కుర్రవాడిమీదికి ఒంటికాలి మీద లేస్తున్నావే? ఇక నాముందు ఇలాంటి వెర్రి చేష్టలు చేశావంటే నిన్ను నేనే ఉరితీస్తాను." అని మందలించాడు. బాలరాజుకేసి తిరిగి,



"మన మంతా మిత్రులం. సి మిత్రుల్ని ఇలాగ బెదరించరాదు. వారినిగూర్చి మరెక్కడా పల్లెత్తయినా చెప్పగూడదు. ఇది మన సంఘం కట్టుబాటు. రాజుననుకోడం సరదాగా ఉంటే అలాగే అనుకో. అంతేగాని మమ్మల్ని చిక్కుల్లో పెట్టకు. ఎందుకంటే

సీ పిచ్చివాగుడు అధికారు లెవరైనా వింటే అందర్నీ అరెస్టు చేస్తారు. అది రాజద్రోహం. మనం కొన్ని విషయాల్లో దుర్మార్గులమైతే కావచ్చు. కాని తనను పాలించే రాజుకే ద్రోహం తలపెట్టేంత నీచుడెవడూ లేడు మనలో. కావలిస్తే మన మిత్రుల రాజభక్తి ఎంత గొప్పదో చూపిస్తాను. (బిగ్గరిగా) అంతా అనండి— ఇంగ్లండు సార్వభౌముడు ఎడ్వర్డుకూ జై!"

"ఇంగ్లండు సార్వభౌముడు ఎడ్వర్డుకూ జై!"

పూరిగుడిసె పునాదులతోసహా ఎగిరిపోతుందా అనిపించేటంత గట్టిగా దొంగలు నినాదం చేశారు. బాలరాజుముఖం సంతోషంతో వికసించింది. కొద్దిగా తల వంచి అమాయకంగా తన కృతజ్ఞత తెలిపాడు. మళ్ళీ వారిలో హర్షాట్టహాసం చెలరేగింది. నాయకు డన్నాడు: "అబ్బాయ్! నీ పిచ్చిధోరణి మాను. మంచిది కాదు. కావలిస్తే ఇంకో మంచి బిరుదేదైనా తగిలించుకో. మహారాజ బిరుదంమాత్రం వద్దు."

గుంపులోనుంచి ఎవడో ఒక ప్రతిపాదన చేశాడు:

"హా హా హీహీచక్రవర్తి." తతిమావాళ్ళు ఈ మాట [illegible]కున్నారు వెంటనే. "హాహా హీహీ చక్రవర్తికీ జై!" అనే నినాదాలు మిన్నుముట్టినై. పిల్లి కూతలూ, నక్క అరుపులూ, గాడిదల సంగీతం ప్రారంభమయినై చక్రవర్తి గౌరవార్థం.

"పట్టాభిషేకం చెయ్యండి."

"ఏదీ ఆ కిరీటం ఇలా అందుకో."

"రాజదండం ఎక్కడ ?"

"సింహాసనంమీద కూర్చోపెట్టండి."

పదిమంది చుట్టుముట్టారు నిస్సహాయుడైన బాల రాజును. ఒకడు సీనారేకుడబ్బా కిరీటంగా అమర్చాడు. ఇంకొకడు చిరుగులకంబళిని కప్పాడు. మరొకడు బాలరాజును ఎత్తి సారాపీపామీద ఆసీనుణ్ణి చేశాడు. ఇంకొకడు చేతికొక కర్ర నందించాడు రాజదండమనే పేరుతో. ఇదంతా కన్నుమూసి తెరచేంతలో జరిగిపోయింది. తరవాత అంతా సాష్టాంగ ప్రణామాలు చేశారు. పిల్లికూతలు మొదలైన మంగళ శబ్దాలతో గుడిసె హోరెత్తిపోయింది.

"మహారాజా! రక్షించండి మీ పేదప్రజల్ని. మ్యావ్ మ్యావ్!"

"మీ బానిసలం మహారాజా! మీ మెత్తని పాదంతో ఒక్కతన్ను అనుగ్రహించండి. బాయ్ బాయ్!"

"రాజాధిరాజా! మార్తాండతేజా! శూన్య రాజ్యచక్రవర్తీ! మేం తినే అన్నంలో మీ కాలి దుమ్ము దులపండి. అది తినే అదృష్టం మాకు కలిగించండి."

"మామీద ఉమ్మెయ్యండి హాహాహీహీ చక్రవర్తీ! మా మనమలు, మునిమనమలు తమ పేరు సగర్వంగా చెప్పుకుంటారు కలకాలం."

కాని ముఠాలో ఒక హాస్యగాడున్నాడు. బాల రాజును హేళన చెయ్యటంలో ఆ రోజు అగ్రతాం బూలం వాడికే వచ్చింది. వాడు వినయంగా మోకరించి బాలరాజు ఎడమ కాలు ముద్దుపెట్టుకోబోయాడు. బాలరాజు ఫెడీమని మూతిమీద తన్నాడు. వాడు వెనక్కి పడి, లేచి బాలరాజును బ్రతిమిలాడాడు :

"మహారాజా! ఒక గుడ్డపీలిక దయచెయ్యండి. తమపాదం తగిలిన చోట కప్పుకుంటాను. పవిత్రమైన ఆ ప్రదేశాన్ని తుచ్ఛమైన గాలిసోకకుండా దాచుకుంటాను. మహారాజుపాదస్పర్శతో పులకించిన ఆ భాగాన్ని ప్రదర్శనకు పెడతాను. వందమిల్లింగులు పెడతాను ఒక్కొక్క టిక్కెట్టు ఖరీదు."

హాస్యగాడి మాటలకు ముఠావాళ్లు పొట్ట చెక్కలయ్యేట్లు విరగబడి నవ్వారు. సార్వభౌముని కళ్లు అశ్రువులతోను, హృదయం అవమానభారంతోను నిండిపోయాయి. "నేను వీరి కేం అపకారం చేశానని ఇలా అవమానిస్తున్నారు? పైగా ఉపకారమే చేస్తానన్నానే! వీరా నా ప్రజలు?"

## 20

దొంగల ముఠా తెల్లవారుజామునే లేచి తూర్పుకు ప్రయాణం సాగించారు. బాగా మబ్బుపట్టి చలి వణికించేస్తోంది. వాతావరణంమాదిరిగానే ముఠావాళ్ళు కూడా దిగులుగా, బెంగగా ఉన్నారు.

రాత్రి ఉత్సాహమంతా వచ్చింది. దీనికి గాలి మార్పు కారణం కావచ్చును; లేక ఆకలిమంటలు కారణం కావచ్చును. కొందరు మౌనంగా ఉన్నారు; కొందరు ముట్టుకుంటే కరిచేట్టున్నారు; మొత్తానికి అందరూ చిక్కమొగాలేశారు.

ముఠా నాయకుడు బాలరాజును హ్యూగో అదుపులో ఉంచాడు; పసివాడి జోలికి పోతే తన్ని తగిలేస్తానని జాక్ కాంటీని హెచ్చరించాడు; అతన్ని జాగ్రత్తగా కాపాడమని హ్యూగోను ఆజ్ఞాపించాడు.

కొంచెం ప్రొద్దెక్కింది; మబ్బులువిచ్చి, చలి తగ్గింది. ముఠావాళ్ల మొగాలు కాస్త తేటపడ్డాయి. ఉత్సాహం కాస్త కాస్తే తిరిగివచ్చింది. చివరికి యథాప్రకారంగా రౌడీపనులు ప్రారంభించారు. ఒకళ్ళనొకళ్లు తిట్టుకోవడం, తిమ్ముకోవడం సాగించారు. రోడ్డుమీద పోయే వాళ్లనుకూడా దుర్భాషలాడి అవమానించసాగారు. ప్రతివాళ్లూ ఈ దొంగలకి దారితొలగి, వాళ్లు ఏమన్నా తలవంచుకు పోవడం చూస్తే ఆరోజుల్లో ఇలాంటిపోకిరీరకానికి ఎంత పలుకుబడి వుందో తెలుస్తుంది. ఊళ్ళబయట చాకళ్లు బట్టలారవేసుకుంటే మన రౌడీలు బహిరంగంగా తమకి కావలసినవాటిని అపహరించారు. పాపమా చాకళ్లు బట్టలు పోయినందుకు విచారించలేదు సరిగదా, తమ శరీరాలు క్షేమంగా ఉన్నందుకు సంతోషించి ఊరుకున్నారు.

చివరికి దొంగలు ఒక ఊళ్లో ఒక రైతుఇంటి మీద దాడి చేశారు. ఈ జబర్దస్తీ అతిథులను చూసి ఇంటి యజమాని, అతనిభార్య, కొడుకులు, కూతుళ్లు గజగజ వణుకుతూ స్వాగతమిచ్చారు. ఇల్లంతా శుభ్రంచేసి భోజనం ఏర్పాట్లుచేశారు. దొంగలు భోజనంచేస్తూ యజమాని భార్యతోను, కూతుళ్లతోను, వేళాకోళాలు, సరసాలు ప్రారంభించారు. ఇష్టమొచ్చిన బూతు మాటలు వాడుతూ, భోళ్లున నవ్వడం మొదలెట్టారు. మాంసంలో వచ్చిన ఎముకముక్కలను బాగా చీకి చీకి, ఇంటి యజమానిమీద, కొడుకుల మీద విసిరారు; నెత్తికి ఠంగున తగిలినప్పుడల్లా నవ్వారు. భోజనానంతరం కొంచెం వెన్న మిగిలితే యజమాని కూతురుకు బుగ్గలమీద పులిమారు. చివరికి నిష్క్రమిస్తూ, తమ దండయాత్రసంగతి అధికారులకు గనుక తెలియజేస్తే ఇల్లంతా దోచుకుని, తగుల బెట్టిపోతామని, బెదిరించి మరీ వెళ్లారు.

మధ్యాహ్నమయ్యే సరికి దొంగలు ఒక పెద్ద గ్రామం చేరారు. ఒక గంటసేపు ఊరిబయట గడ్డివాముల వెనక విశ్రమించారు. తరవాత ఎవరికి వాళ్లు విడిపోయి వేరు వేరు దోవలగుండా ఊళ్లోకి ప్రవేశించారు. ఎవడికి చేతనైన వృత్తి వాడు అవలంబించి మర్యాదగా డబ్బు సంపాదించే ప్రయత్నాలు చేశారు.

బాలరాజును వెంటబెట్టుకుని హర్యాగో వీధుల్లో తిరిగాడు. వాడికి ఏం చేయడానికీ పాలుపోలేదు.

"దొంగతనానికి వీలు చిక్కేటట్లు లేదు. ఇంత దరిద్రగొట్టుఊరు నే నింకెక్కడా చూడలేదు. ఒరే జాక్, బిచ్చమెత్తుదామా?"

"నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. నేను మాత్రం నీకు సహాయం చెయ్యను," అన్నాడు బాలరాజు.

"చెయ్యవ్వా? బిచ్చమెత్తడం చేతగాదా?"

"చేతగాదు."

"ఎప్పటినుంచీ బాబూ? నువ్వు లండన్‌లో పుట్టి నప్పటినుంచీ చేసిన పనేమిటి?"

"నోర్ ముయ్ కుక్కా!"

"అట్టే ఖర్చు చెయ్యకు తిట్లు. నీకు పెళ్ళయ్యాక పెళ్ళాం మీద ప్రయోగిద్దువు గానిలే వాటిని. నువ్వు రోజూ అడుక్కువచ్చేవాడివని మీ నాన్న చెప్ప లేదా?"

"వాడు నాతండ్రా? వా డెవడో నే నెరగను."

"ఇదుగో నబ్బాయ్. నీ కింకా వెర్రి కుదర్లేదు. కాస్సేపు ఏదో సరదాగా అన్నావు, బాగుంది. అస్త మానమూ అదే పాటా? ఇల్లా అన్నావని మీ నాన్నతో చెప్పానంటే నీ చర్మం వలిచేస్తాడు."

"వాడి కెందు కా శ్రమ. నేనేవాడికి చర్మం ఒలిపిస్తాను."

"నీ ధైర్యాన్ని మెచ్చుకోవలిసిందే. మెచ్చు కుంటున్నానుకూడా. కాని నీ తండ్రి అబద్ధం చెబు తున్నాడని అనుకోను. అంటే అతనికి అబద్ధాలు చేత

కాదని కాదు. అవసరమొస్తే అంత చక్కగా అబద్ధ
మాడగలవాడు ఇంకోడు లేడు! కాని అవసరమేమీ
లేనిదే, ఇలాంటి చిన్నవిషయాల్లో అబద్ధమెందుకు
ఆడతాడు? తెలివైనవాడు అబద్ధాల్ని చాలా పొదు
పుగా వాడుకుంటాడు. సరే బిచ్చమెత్తవద్దులే.
ఏదన్నా దొంగిలిద్దామా?"

"నన్ను విసిగించకు, సి. ఇష్టంవచ్చినట్లు చేసుకో."

హ్యూగోకు కోపం వచ్చింది.

"బిచ్చమూ వద్దు. దొంగతనమూ వద్దు.
ఇంకేం చేద్దామంటావు? ఆఖరుసారి న్యాయంగా
చెబుతున్నాను విను. నేను నేలమీద పడి మూలు
గుతూ ఉంటాను. నువ్వు దారి పోయేవాళ్లను అడుగు.
మాట వినకపోతే ని పని పట్టిస్తా."

బాలరాజు ఏదో గర్జించబోయాడు. హ్యూగో
అడ్డంవచ్చి.

"అదుగో. ఎవరో పెద్దమనిషి వస్తున్నాడు.
మంచివాడులాగా ఉన్నాడు. నేను కిందపడి దొర్లుతూ
మూలుగుతూ వుంటాను. ఆయన దగ్గరకు రాగానే
నువ్వు గొల్లున ఏడవాలి. 'బాబూ! ధర్మంచెయ్యండి.
నా అన్న మూర్ఛరోగంతో చస్తున్నాడు. మా
కెవరూ దిక్కులేరు. ఒక్క పెన్నీ ధర్మంచెయ్యండి.
మీపేరు చెప్పుకుని బతుకుతాం. కనికరించండి—' అని
కాళ్లా వేళ్లా పడి గోలగా ఏడవాలి. ఆయనదగ్గిర్నించి
పెన్నీ పిక్కిందాకా వదలద్దు," అని వెంటనే నేలమీద

అకస్మాత్తుగా విరుచుకుపడ్డాడు. పంది మూలిగినట్లు మూలగడం, కళ్లు తేలవేసి దొర్లడం. జుట్టు పీక్కోడం, మొదలైన దొంగవేషాలన్నీ అతి నేర్పుగా ప్రదర్శించ సాగాడు. దూరాన పెద్దమనిషి దగ్గిరికొచ్చేసరికి వాడి అవతారం ఎలా ఉండాలో అలా వుంది. వాడి మూలుగు ఇంకా ఉధృతమైంది కూడాను.

"అయ్యొయ్యో. ఎవరీ అబ్బాయ్? ఎందుకిల్లా పడి కొట్టుకుంటున్నాడు? అయ్యోపాపం. పట్టి లేవ తీద్దాం," అని ఆ పెద్దమనిషి జాలితో అన్నాడు.

"ముట్టుకోవద్దు బాబూ, ముట్టుకోవద్దు. ఈ మాయరోగం నన్ను పడేసినప్పుడు ఎవరూ ముట్టుకో గూడదు. ముట్టుగుంటే ఆ రోగం వాళ్ళకూడా అంటుకుంటుంది. నాతమ్ముణ్ణి అడగండి నా బాధంతా చెబుతాడు. ఒక్క పైసా బాబూ. ఒక్క పైసా దయ చెయ్యండి. నాలుగు రోజుల్నించి తిండిలేక ఎండి పోయాం. ఒక్క పైసా పారేసి మా ఖర్మకి మమ్మల్ని వదిలెయ్యండి," అని హయ్యోగో విలవిలలాడినాడు.

"ఒక్క పైసేం ఖర్మం! మూడు పైసలిస్తాను తీసుకో నాయనా! పాపం ఎంత కష్టంలో వున్నావో!" అంటూ ఆ పేదగుండె పెద్దమనిషి జేబులు తడిమి డబ్బు తీసి ఇచ్చాడు.

"ఆ అన్నను లేవదీద్దాం పట్టు. నా కా జబ్బు వస్తే వచ్చిందిలే. ఇంత కష్టంలో వున్నవాడిని వదిలేసి ఎల్లా వెళ్లను?—"

"వాడు నా అన్న కాదు," అధిబాలరాజు మాట కడ్డం వచ్చాడు.

"నీ అన్న కాదూ ?"

"చూడండి బాబూ! నా సొంత తమ్ముడు కూడా నేను కష్టాల్లో వుండగా ఎల్లా అబద్ధా లాడు తున్నాడో! ఇంత కాలం వీణ్ణి నా రెక్కలమీదే పెంచానండి. ఇప్పుడు చూడండి ఏమంటున్నాడో ?"

"అదేమి టబ్బాయ్, నీ అన్న ప్రమాదంలో వుండగా అలా తప్పించుకో చూస్తావేం ? నీకు సిగ్గు లేదూ ? పాపం ఎంత బాధపడుతున్నాడో—అతడు నీ అన్న కాకపోతే మరెవరు?"

"గజదొంగ, మాయలమారి. నా మాట నమ్మకం లేకపోతే నీ జేబులు చూసుకో. నువ్వు నాతో మాట్లాడుతున్నప్పుడే నీ జేబు కత్తిరించి ఖాళీ చేశాడు—"

బాలరాజు మాట పూర్తి చెయ్యకముందే హఠాత్తుగా లేచి వళ్లు దులుపుకుని దౌడు తీయడం ప్రారంభించాడు. వాడి వెనక పేదగుండె పెద్దమనిషి కూడా పట్టుకోవాలనే ఆదుర్దాతో పరిగెత్తసాగాడు. బాలరాజు తనకు విముక్తి లభించినందుకు దేవుడికి ధన్యవాదా లర్పించి ఇమరో దిక్కుకు పలాయనం చిత్తగించాడు. గ్రామం దాటి, దట్టమైన ఒక కీకా రణ్యంలో జొరబడే వరకూ అతడు వెనుదిరిగి చూడ లేదు. కొన్ని గంటలసేపు అలాగే నడిచినడిచి

సాయంత్ర మయ్యేసరికి అరణ్యం దాటేశాడు. బాగా
ఆకలవుతున్నది. ఒక రైతుఇంటిదగ్గర ఆగాడు. అతడు
నోరు తెరిచి అడగకముందే ఇంటివాళ్లితన్ని తరి
మేశారు. అతనిబట్టలు చూసి దొంగవెధవను
కున్నారు వాళ్లుకూడా.

బాలరాజుకు ఆకలితో పాటు కోపం కూడా
చురుకెక్కుతున్నది. ఈసారి ఎవరైనా తనను అవమా
నిస్తే సహించరాదని నిశ్చయించుకున్నాడు.

చీకటి పడింది. చలిగాలి సాగింది. బాలరాజు
కాళ్లీడ్చుకుంటూ నడవలేక నడవలేక నడుస్తున్నాడు.
కాళ్లరిగిపోయాయి. చీకట్లో దారీ తెన్నూ తెలియడం
లేదు. గాలిలో గుసగుసలు వినిపిస్తున్నాయి గాని
ఒక్క ప్రాణీ కనిపించడం లేదు. దూరాన ఏదో
వెలుగు కనిపించడం దగ్గిరికి పోతే ఏమీ లేకపోవడం—
ఇదంతా చూసి ఆ పసివాడు గుబగుబలాడిపోయాడు.
ఇంగ్లండు దేశానికి ఏకచ్ఛత్రాధిపతిఅయినా అతనికి ఈ
రోజున ఆశ్రయమిచ్చి ఆదరించే దిక్కు లేకపోయింది.

కీచురాళ్లు 'గీ' మని రొద చేస్తున్నాయి. గుడ్ల
గూబలు భయంకరంగా అరుస్తున్నాయి. ఎక్కడో
గొర్రెల మువ్వలు కదిలినట్లు కుక్కలు బౌ మన్నట్లు
అస్పష్ట శబ్దాలు వినిపించాయి. మనుషులు గుసగుస
లాడుతున్నట్లు ఎండినఆకులు సవ్వడి చేశాయి.

కొంతసేపటికి ఒక చిన్న ఇల్లు కనబడింది. అది
ఎవరిదో రైతుల ఇల్లు. ఇంటికి ఒక పెడగా ధాన్యం

గాదె ఉన్నది. దాని చాటున బాలరాజు దాగాడు. గాదెలో ఇద్దరు కూలీలు దీపం పెట్టుకుని ఏదో పని చేస్తున్నారు. దీపం వెలుగులో ఇంటి వెనకభాగాన గల పశువుల కొట్టం కనిపించింది. కూలీల కంటపడకుండా బాలరాజు మెల్లిగా నీడల్లో పాకుతూ కొట్టంలో ప్రవేశించాడు. ఇంటివెనక అరుగుమీద పడేసి ఉన్న కంబళ్లీ నొకదాన్ని తీసికొన్నాడు. పశువుల కొట్టం గాఢాంధకారంగా ఉన్నది. చీకట్లో తడుముకో డడంలో పోయి పోయి గడ్డికుప్పమీద పడ్డాడు. వెచ్చటి గడ్డిమీద కంబళ్లిని కొంత పరిచి, కొంత కప్పుకున్నాడు. పైన ఇంకా కాస్త గడ్డి కప్పుకున్నాడు. ధాన్యం గాదెలోని కూలీలు వాళ్లపని పూర్తయ్యాక వెళ్లిపోతూ పశువులకొట్టం గేటుకూడా మూసిపోయారు. అందుచేత బయట ఎంత చలిగాఉన్నా లోపల వెచ్చ వెచ్చగానే ఉన్నది. బాలరాజుకు ఒక మూల ఆకలి దహిస్తున్నది; మరొకమూల నిద్ర ముంచుకొస్తున్నది. చివరికి నిద్ర ఆకలిని జయించింది. పగలు పరిగెత్తి పరిగెత్తి అలిసిఉన్నాడేమో సులువుగా నిద్ర మైకానికి లొంగిపోయాడు.

ఇంతలో ఎవరో తన్ను తాకినట్టయింది. బాలరాజు ఉలికిపడి కళ్లు తెరిచాడు. అతనిభయం వర్ణనాతీతం. ఆ ఏకాంత అంధకారంలో ఎవరిదో తెలియని ఆస్పర్శ అతన్ని భయవిహ్వలుణ్ణి చేసింది. చెవి ఒగ్గి విన్నాడు ఏదైనా శబ్దం వినిపిస్తుందేమోనని.

అంతా నిశ్శబ్దం. అలా కానేపు భయంతో మేలుకున్న తర్వాత అతనికి తెలియకుండానే నిద్రమైకం కమ్మింది. ఇంతలో మళ్లీ ఎవరో తాకినట్టయింది. భయం ముప్పిరిగొని ముచ్చెమటలుపోశాయి. శరీరం ఆపాదమస్తకం ఝల్లుమంది. చీకట్లో కన్నుపొడుచుకున్నా ఏమీ కనిపించడం లేదు. అది నిజంగా చీకటేనా? దెయ్యాలు జుట్టు విరబోసుకున్నాయా? ఏం చెయ్యాలి? అదీ ప్రశ్న. అవతలకు పారిపోతే? ఎల్లా? తలుపువేసేసి వుందిగద. ఇంకో మూలకిపోయి పడుకుంటే? ఆ దెయ్యం అక్కడికిమాత్రం రాదూ? ఈ నాలుగు గోడలమధ్య జైలులో ఆ దెయ్యం తన్ను పీక నులిమి చంపేస్తే? ఇంతకీ అది దెయ్యమేనా? చెయ్యి జాచి చుట్టూ తడుముదామనుకున్నాడు. కాని ధైర్యం చాల లేదు. మూడుసార్లు చెయ్యి కొంచెం జాచాడు. మళ్ళీ జవ్వన వెనక్కి లాక్కున్నాడు ధైర్యం చాలక. నాలుగోసారి మళ్లీ చెయ్యి ఇంకొంచెం ముందుకు పోనిచ్చాడు. అకస్మాత్తుగా చేతికేదో వెచ్చగా, మెత్తగా తగిలింది. గభాలున చెయ్యి వెనక్కు లాక్కున్నాడు. నిలువునా వణకిపోయాడు చలిజ్వరం వచ్చిన వాడిలాగ. అదేదో కొత్తగా చచ్చినమనిషి శవమై ఉంటుందనుకున్నాడు. అందుకనే ఇంకా వెచ్చగా ఉంది. అలా ఆ రాత్రంతా శవం పక్కన గడపడం దుర్భరం కాదా? ఏం చెయ్యాలి?

అతనికి తెలియకుండానే చెయ్యి మళ్ళీ ఆవస్తువు దగ్గరికి పోయింది. వెనక్కు లాక్కుందా మనుకున్నా చెయ్యి లాక్కోలేకపోయాడు. ముందు వెంట్రుకల కుత్తి చేతికి తగిలింది. ఇంకా పైకి పోనిచ్చాడు. వెచ్చటి తాడు చేతిలోకి వచ్చింది. చెయ్యి ఇంకా పోనిచ్చాడు—, వెచ్చగా కాళ్లు డొక్కలో పెట్టుకుని అమాయకంగా పడుకున్న ఆవుదూడ!! అతడు పట్టుకున్నది తాడు కాదు. దూడతోక. ఆతోకే రెండుసార్లు అతన్ని స్పృశించింది.

బాలరాజు తన భయానికి సిగ్గుపడ్డాడు. "నిద్రపోతున్న దూడతోక తగిలినందుకే భయపడ్డాను, ఏం మనిషిని," అనుకున్నాడు. వెంటనే ఇలా అనుకున్నాడు: "నేను దూడతోకకి కాదుగా భయపడింది. అది ఏదో తెలియకనే భయపడ్డాను."

అది మరేమీ కాక దూడే అయినందుకు బాలరాజు సంతోషించాడు. అంతే కాదు. ఆ ఒంటరితనంలో దూడలాంటి సాధుప్రాణి తనకు తోడుగా దగ్గరగా పడుకోవడం అతనికి ధైర్యమిచ్చింది. స్వజాతీయులైన మానవులు అతన్ని పురుగుని చూసినట్టు చూశారు; కొట్టారు, తిట్టారు, తరిమారు, ఉరిమారు, అవమానించారు. మానవులని పేరుపెట్టుకున్న వారికంటే ఈ అమాయక సాధుజంతువు ఎన్నోరెట్లు నయంగాదా!

వెచ్చని దూడ శరీరాన్ని నిమురుతూ ఇలా ఆలోచిస్తున్నాడు. అతనికో మంచి ఆలోచన తట్టింది. వెంటనే లేచి కంబళీ దూడపక్కకు జరుపుకున్నాడు. దూడవీపును కావలించుకుని కంబళీ దానికూడా కప్పాడు. ఇప్పుడు బహువెచ్చగా, సుఖంగా ఉన్నది. దాదాపు వెస్టుమినిస్టర్ కోటలో మెత్తని పరుపులమీద పడుకున్నంత హాయిగాఉన్నది.

ఈ హాయితో మధురమైన భావాలు రాసాగాయి. జీవితం కేవలం చెత్తమయం కాదనిపించింది. దొంగల ముఠా నుండి తప్పించుకోవడమనేది మొదటి ముఖ్యమైన శుభవిషయం. రెండోది, పశువులకొట్టమైతేనేంగాక ఆశ్రయమంటూ దొరికింది. మూడోది, జంతువైతేనేం గాక ఒక ప్రాణి తోడుగా తన కంబళీలో పడుకున్నది. ఇంతకంటే వేరే ఆనందించదగినదేమున్నది ఆదుర్భర పరిస్థితుల్లో ?

అర్ధరాత్రి దాటింది. చలిగాలిజోరెక్కువైంది. గాలి కొంతసేపు వ్యాధిగ్రస్తుడిలాగ మూలిగింది ; కొంతసేపు హోరున సముద్రంలాగ ఘోషించింది ; గచ్చుమీద సీనారేకు గీచినట్లు 'గీ' పెట్టింది; కొంతసేపు నక్కల ఊళని అనుకరించింది. అయితే నేం ఇదంతా బాలరాజుకు, శ్రావ్యమైన సంగీతం లాగ వినిపించింది. బయట గాలి మొరగనీ, ఉరమనీ, కోస్త్రడనీ, తిట్టనీ, ఏడవనీ, అతడు హాయిగా పడుకున్నాడు; నిద్రలో మైమరచిపోయాడు; కలల్లో ఇంగ్లండు రాజ

న్యాడు; శత్రువులను శిక్షించాడు; పాతశాసనాలు రద్దుచేసి కొత్తశాసనాలు చేశాడు.

దూరంగా కుక్కలు మొరిగాయి; గుడ్లగూబలు గోల్లుమన్నాయి; గాలి ఏడ్చింది; వానజల్లు ప్రారంభమై ఒకటే రొద చేసింది. ఇంగ్లండు సార్వభౌముడు పశువుల కొట్టంలో కలలు కంటున్నాడు. ఆవు దూడకూడా దగ్గరగా కంబళీలో దూరి నిద్రపోయింది. కోట్లాది ప్రజలకు ప్రేమపాత్రుడు, కనుసన్నతో ఒక దేశపు యావత్తు జీవితాన్ని పరిపాలించగల సమర్థుడు, రాజవంశీకుడు, మహారాజు అయిన ఎడ్వర్డు ట్యూడర్ తన ప్రక్కన పడుకున్నాడని దానికేం తెలుసు ?

## 21

పొద్దున బాలరాజు లేచి చూసుకునేటప్పటికి అతని దుప్పటి ముసుగులో ఎలిక పిల్ల ఒకటి పడుకునుంది. అతను కదలగానే అది తుర్రున పారిపోయింది. మానవులచేత నిరాదరింపబడిన తన్ను జంతువులు ఆదరించడం చూసి అతనికి దిగులూ, సంతోషమూ కూడా కలిగాయి.

తలుపు దగ్గిర పిల్లలనవ్వులు, మాటలు వినిపించాయి. బాలరాజు లేచి సరిగ్గా కూర్చున్నాడు. తలుపు తెరుచుకుంది. పదేనిమిదేళ్ల బాలికలిద్దరు నవ్వుకుంటూ లోపలికొచ్చి బాలరాజును చూసి ఉన్నచోటనే ఆగి

పోయారు. అతన్ని తేరిపారచూశారు. ఒకళ్ల చెవిలో ఒకళ్లు ఏదో గుసగుస లాడారు. కొంచెం నిబ్బరించు కొన్నాక బిగ్గరిగానే మాట్లాడసాగారు.

"అతని మొహం ఎంత అందంగా ఉందో!"

"జుట్టు ఎంత బావుందో!"

"పాపం చిరుగుగుడ్డలు తొడుక్కున్నాడు."

"చాలా ఆకలి మీదున్నాడల్లే వుంది."

కొద్దిగా సమీపించారు. భయపడుతూ శాస్త్ర శాస్త్ర దగ్గిరికి జరిగారు. బాలరాజును వింతజంతు వును చూసినట్లు ప్రతికోణంనుంచీ పరీక్షగా చూశారు. కాని మీదబడి కరుస్తాడేమో నన్నట్లు జాగ్రత్తగా దూరంగానే నుంచున్నారు. ఆఖరికి ఎదు రుగా వచ్చిఒకళ్ల నొకళ్లు గట్టిగా పట్టుకుని నిలబడ్డారు. ఒకపిల్ల ధైర్యం చిక్కబట్టుకుని అమాయకంగా అడి గింది :

"ఎవరబ్బాయ్ నువ్వు?"

"నేను మహారాజును."

బాలికలు అదిరిపడ్డారు.

"ఏ రాజువు ?"

"ఇంగ్లండు మహారాజును." బాలికలు ఒకళ్ల మొగాలు ఒకళ్లు చూసుకున్నారు. బాలరాజును తేరి పారచూశారు; మళ్ళీ ఒకళ్లనొకళ్లు చూసుకున్నారు.

"విన్నావుటే మార్జీ? మహారాజుట. నిజమే అయివుంటుందా?"

"నిజమే అయివుండాలి ప్రిన్సీ! అబద్ధ మెందుకు చెబుతాను? ఎందుకంటే ప్రిన్సీ, నిజం కాకపోతే అబద్ధ మౌతుంది. నిజాలు కానివన్నీ అబద్ధాలే. అందుకని అతనన్నది నిజమే అయివుండాలి."

బలే తర్కం. ఈ వాదానికి తిరుగులేదు. మార్జి సమాధానం విని ప్రిన్సీ సందేహాలు ఎగిరిపోయాయి; ప్రిన్సీ కాసే పాలోచించింది; బాలరాజు నడిగింది మళ్ళీ.

"నువ్వు నిజంగా మహారాజువేఅయితే నువ్వు చెప్పింది నిజమే అయివుండాలి."

"నేను నిజంగా మహారాజునే." దీంతో ప్రిన్సీ మనస్సు కుదటపడింది. సందేహాలన్నీ నివృత్తి అయిపోయాయి. అతడు మహారాజే నని నిశ్చయ మైంది. అందుకని "ఇక్కడి కెల్లా వచ్చావు? నీకింత కంటె మంచిబట్టలు లేవా? ఎక్కడి కెడుతు న్నావు?" అని భోగట్టా చేశారు. తనసొదను వేళా కోళం చెయ్యకుండా వినేవాళ్లు ఇంత కాలానికి దొరికి నందుకు బాలరాజుకు పరమానందమైంది. తన కథంతా ఏకరువు పెట్టాడు. తను పడ్డ కష్టాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు. రెండు రోజులనుంచీ అన్నమే తినలేదన్నాడు. ఇదివిని వాళ్లకి కడుపు చెరువయ్యేంత దుఃఖం వచ్చింది. అతన్ని చెయ్యిపట్టుకుని గబ గబ ఇంట్లోకి లాక్కుపోయారు.

బాలికల తల్లి కూడా కుర్రవాణ్ణి ఆదరించింది. ఆమె వితంతువు; కష్టాలు ఎలా ఉంటాయో బాగా

ఎరిగిఉండటంవలన తమలాంటి పేదవారిని చూస్తే ఆమె కెంతో జాలి. అందులోనూ మనవాడి "పిచ్చి" ధోరణి చూసి ఇంకా జాలిపడింది. "ఇతడెవరో తన వాళ్లనుండి తప్పిపోయినాడల్లే వుంది," అనుకున్నది. అందుచేత అతని ఆరాలన్నీ తీయడానికి ప్రయత్నించింది. మళ్ళీ వాళ్లవాళ్ల కతన్ని అప్పజెప్పాలని ఆమె అభిప్రాయం. చుట్టుపక్కల ఊళ్లపేర్లు, పట్నాలపేర్లు చెప్పి చూసింది. కాని అతడా పేర్లే ఎప్పుడూ విననట్లు ఊరుకున్నాడు. ఆమె ఒక పక్క వంటచేస్తూనే ఇతనితో మాట్లాడుతోంది. గొల్లల పిల్లడేమోనని గొర్రెల విషయం ఎత్తింది. సాలెవాళ్ల బ్బాయేమోనని బట్టలనేత విషయం ఎత్తింది. వడ్రంగం, కమ్మరిపని, వ్యవసాయం మొదలైన ఎన్నో వృత్తులను సంభాషణలోకి రానిచ్చింది కాని బాలరాజు దేనిలోనూ ఆసక్తి చూపలేదు. ఒకవేళ ఎవరిఇంట్లోనన్నా పాలేరేమో నని పాలేళ్లు చేసే పనులన్నీ చెప్పిచూసింది. ఊహూ. బాలరాజు కిమ్మనకుండా కూర్చున్నాడు.

ఆఖరికి ఆమె వంటవిషయం మాట్లాడింది. వెంటనే అతనిముఖం వికసించింది. ఆకలితో గోషు గోషు మంటున్నాడేమో, వంట పేరెత్తగానే అతడు ఎక్కడలేని ఉత్సాహము చూపెంచాడు. రకరకాల తినుబండారాలనుగూర్చి చాలసేపు ఉపన్యసించాడు. కనుక ఇతడెక్కడో వంటవాళ్లదగ్గిర అవీఇవీ అందించేవాడుగా పనిచేసిఉండాలని ఆమె నిర్ధారణ చేసు

కున్నది. కాని అతడు పేర్కొన్న తినుబండారాలన్నీ ధనవంతుల ఇళ్లలో ఉపయోగించబడేవేగాని సామాన్యుల ఇళ్లలోవి కాదు. మరి ఇతడు చూస్తే నిరుపేదలాగాఉన్నాడు. బహుశా పిచ్చెక్కకముందు రాజుగారి వంటశాలలో పని చేశాడేమో. పిచ్చెక్కిం తరవాత ఇవన్నీ వెళ్ల గొట్టిఉంటారు. అందుచేత తను మహారాజునని వాగుతున్నాడు. అయినా ఇంకా పరీక్షించి చూడాలనుకున్నదామె.

"ఇప్పుడే వస్తాను. కాస్త ఈ కోడిగుడ్లు పగల గొట్టి అట్లువెయ్యి," అనిచెప్పి తను అవతలకు వెళ్ళింది. తల్లివెంట పిల్లలుగూడా అవతలకు వెళ్లారు.

బాలరాజు ఇలా గొణుక్కున్నాడు. "పూర్వం ఆల్ఫ్రెడ్ అనే ఇంగ్లీషు రాజుకుకూడా ఇలాంటి అవస్థే పట్టింది. ఆల్ఫ్రెడ్‌లాంటివాడే చేసినప్పుడు నేను మాత్రం వంటచేస్తే తప్పేముంది? అయితే అతనిలాగా పదార్థాలు పాడుచెయ్యను."

కోడిగుడ్లు పగలగొట్టి అట్లువేశాడు. అతని ఆలోచనలు రాజ్యవ్యవహారాలమీదికి పోయాయి. యజమానురాలు తిరిగివచ్చేసరికి అట్లు నల్లగా బొగ్గయి వూరుకుంది. ఇది చూసి బాలరాజు గాబరాపడ్డాడు. కాని యజమానురాలేమీ అనలేదు. ఇతనికి వంట బొత్తిగా చేతకాదని నిర్ధారణచేసుకుని పొయ్యిదగ్గిర తనే కూర్చుని వంట పూర్తిచేసింది.

తరవాత ఆమె భోజనానికి బల్ల, కుర్చీలు సిద్ధం చేసింది. బాలరాజుకు బిచ్చగాళ్లకు పెట్టినట్టు వీధి వసారాలో పాతగిన్నెల్లో భోజనం పెడదామనుకుంది. కాని బాలరాజు ఎవరి అనుమతిలేకుండానే తనంతట తను వచ్చి ఒక కుర్చీ నాక్రమించాడు. ఇక యజమానురాలేమీ అనలేకపోయింది. అందరితోపాటు ఈ "బిచ్చగాళ్ల అబ్బాయి"నికూడా కూర్చోనిచ్చింది.

వేరే పరిస్థితుల్లో అయితే బాలరాజు మిగతా వాళ్లు తనతోపాటు కూర్చున్నందుకు పేచీపెట్టేవాడే. కాని ఇప్పుడేమీ అనలేకపోయాడు. ఎందుకంటె బాగా ఆకలి దంచేస్తోంది. పేచీపెట్టుకోడానికి తగిన ఓపిక లేదు. అదీగాక, ఇందాక తను కోడిగుడ్లట్టు మాడ్చినందుకు ఊరికే ఇదవుతున్నాడు. తను తప్పుచేసినా యజమానురాలు దయతో ఏమీ అననందుకు ఆమె సత్తడు అభినందించాడు. అందువల్ల కూడా వాళ్లు తన పక్కన కూర్చోవడం సహించాడు.

మొత్తానికి ఇరుపక్షాలవాళ్లూ చాల ఉదారంగా ప్రవర్తించామని తమ్మతామే ప్రశంసించుకున్నారు.

భోజనానంతరం యజమానురాలు అంటు గిన్నెలు తోమమని బాలరాజుకు పురమాయించింది. ఈ పురమాయింపుకు అతడు నిర్ఘాంతపోయాడు. ఎదురుతిరుగుదామనుకున్నాడు. కాని మళ్లీ తమాయించుకున్నాడు. "పూర్వం ఆల్ఫ్రెడ్ రాజు వంట చేశాడు. బహుశా గిన్నెలుకూడా తోమేఉంటాడు.

కనుక నేను చేస్తేమాత్రం తప్పేముంది?" అను
కున్నాడు.

గిన్నెలమసి నీళ్లతో కడిగితే పోదా అను
కున్నాడు. కాని ఎంతసేపు తోమినా చేతులు అరిగాయి
గాని మసిపోలేదు. ఏదోవిధంగా ఆ పనిపూర్తిచేశాడు.
ఇక త్వరగా ఇక్కడనుండి బయటపడదామను
కున్నాడు. కాని యజమానురాలు బంగాళదుంపల
చెక్కులు తీయమని మళ్ళీ పురమాయించింది. విసు
క్కుంటూ బాలరాజు ఆ పనికూడా ప్రారంభించాడు.
కాని అతడు చెక్కులు తీసిన బంగాళదుంపలన్నీ గోలీ
కాయల్లాగ తయారవుతున్నాయి. సమయానికి యజ
మానురాలు అడ్డపడి మిగతా బంగాళదుంపలు ధ్వంసం
కాకుండా రక్షించుకుంది. తరవాత కత్తిపీట పదునుపెట్ట
మని పురమాయించింది. అదయింతరవాత నూతిలోంచి
నీళ్లు తోడమన్నది. సుకుమారుడైన బాలరాజు ఈ
కాసిని పనులతోనే పూర్తిగా అలిసిపోయాడు. తన
పూర్వీకుడైన ఆల్ఫ్రెడ్ ఏర్పరచిన ఆనవాయితీని దాటి
పోతున్నానని భయపడ్డాడు. మధ్యాహ్నభోజనం
కూడా కానిచ్చాడు. ఇక వెళ్లిపోదామనుకున్నాడు.
అయితే చెప్పివెళ్లడమా, చెప్పకుండా వెళ్లడమా అని
సమస్య కలిగింది. ఇంతలో యజమానురాలు తడి
బట్టలు దొడ్లో ఆరవెయ్యవలసిందని మూటతీసుకొచ్చి
అప్పగించింది. ఆమె లోపలికి పోగానే ఇదే సమయమని
వీధివాకిట్లోకి వచ్చాడు.

వాకిట్లో అడుగుపెట్టాడో లేదో పది పదిహేను గజాలదూరంలో జాన్ కాంటీ, హ్యూగో ఎదురయ్యారు. జాన్ కాంటీ సరుకులమ్ముకునేవాడి వేషంలో వున్నాడు. హ్యూగో నెత్తిమీద సరుకుల సంచి వున్నది. అదృష్ట వశాత్తు వాళ్లు తలలువంచి మాట్లాడుకుంటూ వస్తున్నం దువల్ల బాలరాజును చూడలేదు. బాలరాజు గిరుక్కున వెనక్కి తిరిగి దొడ్లో ప్రహారీగోడదూకి కాలికొద్దీ ఉడా యించాడు.

# 22

బాలరాజు ఊరిబయటకు వచ్చేశాడు. కనుచూపు మేరదూరంలో ఒక అరణ్యం కనిపిస్తోంది. జాన్ కాంటీ, హ్యూగోలు తన్ను వెంటాడుతున్నారని తెలుసుకున్నాడు. కనుక తనకు ఆశ్రయమిచ్చేది అరణ్యమే ననుకున్నాడు. గబగబ నడిచి అరణ్యమధ్యం చేరుకున్నాడు. అక్కడ అంతా గాఢనిశ్శబ్దంగా వున్నది. అప్పటికే సాయంకాలమైనందున చలిగాలి వీవసాగింది. నడుస్తుంటే వెచ్చగా ఉంటుందని ఆగకుండా నడవ సాగాడు.

నిశ్చలంగా ఉన్న నీటిలో చిరుకెరటాల కదలి కలు బయలుదేరినట్లు అప్పుడప్పుడు గాఢనిశ్శబ్దాన్ని భంగంచేస్తూ చెట్లగుండా ఏవో ధ్వనులు వినబడు తున్నాయి. అవి ఎండినఆకుల గుసగుసలా? దెయ్యాల రహస్య సంభాషణలా? ఏమైందీ తెలియడంలేదు. ఆ

అస్పష్ట శబ్దాలు నిశ్శబ్దంకంటె భయావహంగా ఉన్నాయి.

అలా ఎంతో దూరం నడిచాడు. పోయినకొద్దీ చెట్లు దట్టమౌతున్నాయి; చీకటికూడా దట్టమౌతున్నది. ఏదైనా తిన్నని బాట కనిపిస్తుందేమో, రాత్రి ఉండటాని కేదైనా సురక్షిత స్థలం దొరుకుతుందేమో అనే ఆశతో బాలరాజు నడిచిపోతున్నాడు. తొందరగా నడవాలనే కంగారులో అనేకసార్లు దారితొలగి ముళ్ల తీగల్లోనూ, పొదల్లోనూ చిక్కుపడ్డాడు.

ఇంతలో దూరాన మిణుకు మిణుకు మంటూ వెలుతురు కనబడింది. బాలరాజుహృదయం సంతోషంతో గంతులేసింది. చకచక నడిచి వెలుతురువచ్చే స్థలాన్ని సమీపించాడు. అదొక పూరికొంప. తెరిచిన కిటికీగుండా దీపకాంతి వస్తోంది. హఠాత్తుగా నిశ్శబ్దాన్ని చెదరగొడుతూ మాటలు వినిపించాయి. బాలరాజు హడలిపోయి పారిపోదామని వెనక్కి తిరిగాడు. కాని ప్రమాదమేమీ లేదు. ఎవరో గొంతెత్తి ప్రార్థన చేస్తున్నారంతే. బాలరాజు కిటికీవద్ద బొటనవేళ్ల మీద నుంచుని లోపలికి చూశాడు. అది చిన్నగది. ఒకమూల కుక్కిమంచం, దానిమీద గడ్డిపరుపు, ఒకటో రెండో కంబళీలు ఉన్నాయి. ఇంకొక మూల మూడు నాలుగు కుండలు, దాకలు, పెనం, ఇతర వంటసామాను ఉన్నాయి. మంచందగ్గిరగా ఒక చిన్న బెంచీ, కూర్చునేందు కొక ముక్కాలిపీట ఉన్నాయి. వెచ్చదనంకోసం

పొయ్యిలో వెయ్యబడిన మంట ఉజ్వలంగా మండుతోంది.

ఒకపెడగా పూజాస్థలం. కొయ్యపెట్టెమీద కొవ్వొత్తి వెలుగుతున్నది. దాని పక్కన తెరిచిన పుస్తకం, బైబిలుగావును, ఉన్నది. పుస్తకం పక్కన మనిషిపుర్రె ఉన్నది. ఇవి ఆగదిలోని నిశ్చేతన నిర్జీవ పదార్థాలు. పెట్టెపక్కన సజీవపదార్థమొకటి సాష్టాంగంగా పడుకుని ఉన్నది.

అత డొక డెబ్బయ్యేళ్ల వృద్ధుడు. ప్రార్థన పద్యాలు ఉచ్చరిస్తున్నాడు కాబట్టి సజీవుడుగా ఉన్నాడనుకోవలసివస్తున్నది గాని చూట్టానికి చచ్చిపోయిన వాడిలాగ పడిఉన్నాడు. మనిషి దుస్తులను బట్టి మతగురువని గ్రహించవచ్చు. ఏ అపాయమూ లేకుండా మతగురువు నివాసంవంటి సురక్షిత స్థలానికి వచ్చినందుకు బాలరాజు సంతోషించాడు. తలుపు తట్టాడు. మతగురువు సాష్టాంగభంగిమంనుండి లేచి జవాబిచ్చాడు:

“రావచ్చు. కాని నీ పాపాలు అక్కడే దులుపుకుని రావాలి; ఇది పవిత్రస్థలం.”

తలుపు తెరుచుకుని బాలరాజు లోనికి ప్రవేశించాడు. వృద్ధుడు బాలుణ్ణి పరకాయించి పరీక్షగా చూసి “ఎవరు నువ్వు?” అన్నాడు.

“నేను మహారాజును.”

వృద్ధుడు బ్రహ్మానందపరవశుడై "రండి రండి మహారాజా!" అని ఆహ్వానించాడు. ఆనందం వల్లనో, లేక వృద్ధాప్యంవల్లనో తెగకంపిస్తూ, ఎక్కడి వస్తువు లక్కడ గబగబ సర్దేశాడు. బెంచి ఖాళీచేసి పొయ్యి దగ్గరగా వేసి బాలరాజును కూర్చోపెట్టాడు. ఒక్క క్షణం ఆగకుండా "రండి, రండి, అయ్యా, దయ చెయ్యండి, మహారాజా కూర్చోండి, రండి, అయ్యా--" అని వాగుతూనేవున్నాడు. పొయ్యిలో కట్టెలువేసి మంట ఇంకా పెద్దది చేశాడు.

"రండి రండి, మహారాజా! అనేకమంది ఇదివర కిక్కడకు ఆశ్రయంకోసం వచ్చేవారు. కాని అందర్నీ తరిమేశాను. తమరు మహారాజులు కనుక రానిచ్చాను. అందులో తమరు రాజ్యం పరిత్యజించి, భోగవిలాసాల నన్నిటినీ సన్యసించి మురిగ్గుడ్డల్లో వచ్చారు. కనుక ఇదే నా హృదయపూర్వక స్వాగతం. ఇదే నా త్యాగ పూర్వకఆహ్వానం. రండి అయ్యా, రండి." బాలరాజు వృద్ధుణ్ణి వారించి అసలుసంగతి చెప్పబోయాడు. కాని అతడు వినిపించుకుంటేగా; శరవేగంతో వాగే స్తున్నాడు.

"తమ రిక్కడ తపస్సు చేసుకుంటారా అండీ? చాలా బావుంటుంది ఇక్కడ. గొడవ, చీకు, చింతా ఏమీ ఉండదు. పైగా స్వర్గం ఇక్కడికి చాలా దగ్గి రండి. నిశ్శబ్దంగా ప్రార్థన చేసుకోడానికి, బైబిలు పఠించడానికి, ధ్యానం, జపం మొదలైన కర్మకాండకి ఇంత

కంటే మంచిచోటు లేదండి. కందమూలాలు, ఫలాలు కావలసినన్ని దొరుకుతాయి. ఆత్మను పరిశుద్ధం చేసుకోడానికి శరీరాన్ని చితగ్గొట్టవలసి ఉంటుందిగదండి; అందుకు మంచి ఫస్టుక్లాసయిన బెత్తాలు ఇక్కడ సమృద్ధిగా దొరుకుతాయి. ఇక్కడికి జనం రారు కూడాను. మన ఇష్టారాజ్యంగా ఉండచ్చు ఏమంటారు?"

ఈరీతిగా ముసలాడు వాగుతున్నాడు. కొంత సేపటికి ఆయాసంవచ్చిందిగావును, గుండె చేత్తో పట్టుకుని, గొంతు తగ్గించి గొణగసాగాడు. అయినా పచార్లుచెయ్యడం, సర్దిందే సర్దడం మానలేదు. వృద్ధుడు గొంతు తగ్గించడంచూసి బాలరాజు గొంతెత్తి తనెవరో, ఈ స్థితి కెలావచ్చాడో విశదంగా చెప్పాడు. కాని వృద్ధుడు ఒక్కమాటగూడా వినిపించుకోకుండా తనలో తను గొణుగుతూనేఉన్నాడు. చివరికి బాలరాజును సమీపించి చెవిదగ్గరగా వంగాడు.

"ష్. ష్. నే నొక రహస్యం చెప్పనా?" అన్నాడు. మళ్లీ ఆగిపోయి ఏదో విన్నాడు శ్రద్ధగా. గబగబ బొటనవేళ్లమీద నడిచి కిటికీవద్దకు పోయి బయటికి తొంగిచూశాడు కిటికీ మూసేసి మళ్లీ బొటన వేళ్లమీదనే నడిచివచ్చాడు. బాలరాజుచెవిలో రహస్యంగా చెప్పాడు:

"నే నెవరో తెలుసా? దేవదూతను."

బాలరాజు ఉలికిపడి లేచాడు. "హరి భగవం

తుడా! మళ్లీ అపాయాల్లో చిక్కుకున్నాను. ఇతడెవరో పిచ్చివాడు."

బాలరాజు ముఖంలో భయం తాండవిస్తోంది. వృద్ధసన్యాసి ఇది గమనించాడు:

"ఆ, ఆ, దారిలోపడుతున్నారు. తమ ముఖంలో భయం కనిపిస్తోంది. ఇక్కడికి వచ్చిన ప్రతివాళ్లూ, అదేమిటోగాని, భయపడతారు. ఇక్కడేముందో మరి. బహుశా, స్వర్గం ఇక్కడికి సమీపంలో ఉండడం కారణం కావచ్చు. మహారాజా, మీరు నమ్ముతారో లేదో గాని స్వర్గలోకం ఉందే, ఇక్కడకు అది చాలా దగ్గర. నేను మామూలుగా అక్కడికి వెళ్లి వస్తూఉంటాను తెలుసా. కన్నుమూసి తెరిచేటంతలో వెళ్లడం, రావడంకూడా జరిగిపోతుంది. (రహస్యంగా) నేను దేవదూతను తెలుసా. అయిదేళ్ల కిందట దేవలోకంనుంచి దేవతలు వచ్చారిక్కడికి. నన్ను చూసి వాళ్లు విడిచిపెట్టలేకపోయారంటే నమ్మండి. నేనంటే ఎంత భక్తి, ఎంత గౌరవం! అప్పుడే నన్ను దేవదూతను చేశారు. దేవదూత అంటే ఏమిటనుకున్నారో? దేవతలకంటే గొప్ప. దేవుడు తరవాత దేవదూతే గొప్పవాడు. నేను స్వర్గలోకపుదర్బారులో పాల్గొంటూ ఉంటాను; దేవుని మంత్రులతో సంప్రదింపులు జరుపుతుంటాను. నా చెయ్యి ముట్టుకోండి; భయపడకండి, ముట్టుకోండి. ఊఁ, అలాగు. అబ్రహాం, ఐజాక్, జేకబ్ మొదలైనవారు కరస్పర్శ చేసిన చెయ్యి ఇది. హేఁ. ఏమిటనుకున్నారో?

నేను దేవుని సింహాసనం పక్కన రత్నాసనంమీద కూర్చునేవాణ్ణి. దేవుణ్ణి అనేకసార్లు ముఖాముఖి సందర్శించాను. ఆయ నోసారి పలక రిద్దామనుకున్నా గాని బావుండదని ఊరుకున్నాను—”

వృద్ధుడు హఠాత్తుగా ఆగాడు; క్షణంలో అతని ముఖం తీవ్రకోపంతో ఎర్రబడింది. గుడ్లగూబ కళ్ల లాగా అతని కళ్లు భయంకరంగా మెరిశాయి.

“అవును, నేను దేవదూతను; వట్టి దేవదూతను మాత్రమే. మరేమీ కాను. పోప్‌ను కావలసినవాణ్ణి దేవదూతనై ఊరుకున్నాను. ఆఖరికి ఆర్చిబిషప్‌ను కూడా కాలేకపోయాను. అసలు నేను పోప్ నవుతా నని ఇరవై ఏళ్లకిందట నాకు కలలో దివ్య సందేశం. వచ్చింది. కాని రాజు నన్ను నాపదవినుంచి తొలిగించాడు. నా భావిజీవితాన్నంతటినీ నాశనం చేశాడు. నాపదవి పోవడంతో నాకు ఇల్లూ, వాకిలీకూడా లేకుండాపోయి దిక్కులేనివాణ్ణయాను.”

వృద్ధుడు గాడిద ఓండ్రపెట్టినట్లు ఏడవడం మొదలెట్టాడు. వెర్రికోపంతో తల బాదుకున్నాడు; గుండెలమీద గుద్దుకున్నాడు. మధ్య మధ్య “నేను పోప్ కావలసినవాణ్ణి. దేవదూతనై ఊరుకున్నాను, ఛీ!” అని గొణుగుతున్నాడు.

ఈవిధంగా ముసలివాడు దాదాపు గంటసేపు బాలరాజును హింసపెట్టాడు. ఈ పిచ్చివాడి వాగుడు ఎంత దుర్భరంగా ఉండాలో అంత దుర్భరంగా ఉన్నది

కాని ఇంతలో వృద్ధుడు గొంతు మార్చాడు; క్షణంలో మరో మనిషైపోయాడు; ఎంతో దయతో మంచిగా మాట్లాడసాగాడు. బాలరాజు కాళ్ళమీద, చేతుల మీద గాయాలు చూసి ఎంతో జాలిపడి ఏవో మందులు రాశాడు; తొందరగా వంట ప్రయత్నాలు చేశాడు; అప్పు డప్పుడు బాలరాజు తల, బుగ్గలు ప్రేమతో నిమిరి తియ్యటిమాటలు చెప్పాడు. కాసే పట్లో "దేవదూత" పట్ల బాలరాజు కేర్పడ్డ వైముఖ్యం, భయం, అసహ్యం అన్నీ తొలగిపోయాయి. పైగా అతనికి వృద్ధునిమీద గౌరవంకూడా కలిగింది.

వంట కాగానే బాలరాజుకు భోజనంపెట్టి తను కూడా భోంచేశాడు. పూజాస్థలంవద్ద ప్రార్థనాదికాలు కానిచ్చి బాలరాజుకు పక్కగదిలో శయ్య అమర్చాడు. చలివెయ్యకుండా కంబళీ కప్పాడు. తరవాత తను వెళ్లి పొయ్యిదగ్గిర కూర్చుని ఏమీ తోచక కట్టెలు ఎగదోయడం మొదలెట్టాడు. మళ్లీ ఆగాడు; ఏదో మరిచిపోయినదాన్ని జ్ఞాపకం చేసుకుంటున్నట్లు బుర్ర గోక్కున్నాడు; నుదుటిమీద వేళ్లు తాటించాడు. కాసేపటికి అదేదో జ్ఞాపకం వచ్చిందిగావును, ఝుమ్మని లేచాడు. బాలరాజున్న గదిలోకి తొంగిచూసి అడిగాడు:

"తమ రెవ రన్నారు?"

"మహారాజును."

"ఏ మహారాజు?"

"ఇంగ్లండు మహారాజును."

"ఇంగ్లండు మహారాజులా? అయితే హెన్రీ పోయారా?"

"అవును. ఈమధ్యనే పోయారు. నేనాయన కుమారుణ్ణి."

వృద్ధ మతగురువు కనుబొమలు ముడిచాడు. గుప్పిళ్లు బిగించి పళ్లు పటపట కొరికాడు; అప్పు డతని కళ్లు చూస్తే ఎలికమీదికి దూకబోతున్న పిల్లి కళ్లు జ్ఞాపకం వస్తాయి. తలపంకిస్తూ ఇలా అన్నాడు:

"మమ్మల్నందర్నీ పదభ్రష్టుల్ని చేసి ఇళ్లలోంచి తరిమేసిం దెవరో తెలుసా? నీ తండ్రి హెన్రీయే."

కాని బాలరాజు సమాధానమివ్వలేదు. అప్పుడే నిద్రపోయాడు. వృద్ధుడు దగ్గిరికి వచ్చి నిద్రపోతున్న ఆ అమాయకముఖం రెప్పవాల్చకుండా చూశాడు. "హూ. నిద్రపోతున్నాడు. దీర్ఘంగా నిద్రపోతున్నాడు—" అనుకున్నాడు. వృద్ధుడిముఖంలో క్రౌర్యం, కాపట్యంతో కూడిన ఆలోచనలు ముద్రితమయ్యాయి. అత డిక ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఏదో వెదకసాగాడు. మధ్య మధ్య ఆగి చెవులొగ్గి ఏదో వింటున్నట్లు నటించాడు. అప్పుడప్పుడు బాలరాజు శయ్యకేసికూడా చూస్తున్నాడు. ఇంత సేపూ తలకాయ ఆడిస్తూ, గొణుగుతూనే ఉన్నాడు. చివరికి అతడు వెదుకుతున్న వస్తువు కనబడింది. తుప్పుపట్టిన కసాయికత్తి అది. ఒక గూట్లో

నుంచి సానరాయి కూడా తీశాడు. పొయ్యిదగ్గరగా పీటమీద కూర్చుని కత్తిని సానబట్టసాగాడు.

అరణ్యమధ్యాన ఒంటరిగా, నిశ్శబ్దంగా ఉన్న ఆ పూరిగుడిసె చుట్టూ గాలి నిట్టూర్పులు విడుస్తూ పచార్లు చేస్తోంది. దూర దూరాలనుంచి చీకట్ల గుసగుసలు, ఆకాశంలో నక్షత్రాల రహస్యసంభాషణలు విని పిస్తున్నై. గుడిసెలో ఎలుకలు తమ బిలద్వారాలవద్ద నిలిచి వృద్ధుడివంక కాసేపు చూసి తుర్రున పారిపో తున్నవి. మతగురువు మాత్రం తదేకంగా గొణుగుతూ, సణుగుతూ కత్తికి పదును పెడుతున్నాడు. మధ్యమధ్య ఏమాత్రం పదునెక్కిందోనని కత్తి అంచును బొటన వేలితో పరీక్షిస్తున్నాడు. "ఊ-ఎక్కుతోంది, పదు నెక్కుతోంది. అవును. పదునెక్కుతోంది-" అనుకుం టున్నాడు.

కాలం గడిచిపోతున్న సంగతి అతడు గమనిం చడమే లేదు. ఆలోచనల్లో మునిగి తనపని తాను చేసుకుపోతున్నాడు. అడపా తడపా బిగ్గరగా ఇలా అంటున్నాడు.

"హెన్రీ బాల్బీ తన్నేశాడు; అంటే ఇంకో లోకానికి ప్రయాణంకట్టాడు; బహుశా ఈపాటికి నరకలోకపు అగ్నిసరస్సులో ఈతకొడుతూఉండచ్చు. మంచి పని చేశాడు—బాల్బీ తన్నేశాడు. మమ్మల్నం దర్నీ నాశనంచేసి తప్పించుకుని పారిపోయాడు. మమ్మల్ని తప్పించుకున్నా దేవుని కోపంనుంచి తప్పిం

చుకోలేదుగా. నరకలోకం నే నెప్పుడూ చూడలేదు గాని అక్కడ అగ్నిజ్వాలలు మహా విచిత్రంగా ఉంటాయట. ఎన్ని యుగాలైనా అవి అడలా మండుతూ ఉంటాయట. అన్ని కట్టెపుల్ల లెక్కడ్నే నుంచి వస్తాయో?"

వృద్ధుడు మాటలమధ్య బలవంతాన నవ్వు ఆపుకుంటున్నాడు.

"హెన్రీ అడ్డం వచ్చాడు గాని లేకపోతే నే నీపాటికి పోప్ నయ్యేవాడిని. పట్టి దేవదూతనై ఊరుకున్నాను. హెన్రీ బాల్చి తన్నేశాడు. కాని మించిపోయిందేమీ లేదు. కొడుకున్నాడుగా."

బాలరాజు కొద్దిగా కదిలాడు. వృద్ధుడు ఒక్క అంగలో శయ్యదగ్గిరికి చేరుకుని మోకాళ్లమీద కూర్చున్నాడు. చేతిలో కత్తి ఎత్తి పట్టుకున్నాడు. అదేసమయానికి బాలరాజు కళ్లు తెరిచి శూన్యంగా చూశాడు. తిరిగి కళ్లు మూసుకుని మరో క్షణంలో నిశ్చలంగా నిద్రలో తేలిపోయాడు.

వృద్ధుడు మరికొన్ని క్షణాలు అలాగే ఉన్నాడు. ఏమనుకున్నాడో యేమో లేచి వెనక్కి వచ్చేశాడు.

"ఉహూ. ఇది కాదు సమయం. ఇంకా అర్ధరాత్రి దాటలేదు. అతడుగనుక కేకలేస్తే ఈ చుట్టుపక్కల ఎవరైనా ఉంటే వింటారు. ఇప్పుడు మంచిది కాదు," అనుకున్నాడు.

తరవాత గట్టి తాడొకటి సంపాదించి బాల

రాజుకు నిద్రాభంగం కలగకుండానే కాళ్లు కట్టివే శాడు. చేతులు కడదామని ప్రయత్నించాడు. రెండు చేతులూ దగ్గిరికి తీసుకురావాలని ఎన్నో సార్లు యత్నిం చాడు. కాని అన్నిసార్లూ బాలరాజు చేతులు మళ్లీ యథాస్థానంలోకి లాక్కున్నాడు. వృద్ధుడు రెండు చేతులూ ఒకచోటికి చేర్చడం, తాడు కట్టబోయే సమ యానికి బాలరాజు చేతులు లాక్కోవడం, ఇలా జరి గింది. వృద్ధుడికి విసుగు పుడుతోంది ఈ కాలయాప నతో. చివరికి బాలరాజు తనంతటతానే చేతులు రెండూ గుండెలమీద వేసుకున్నాడు. మరుక్షణంలో అవి గాఢంగా బంధింపబడ్డాయి. తరువాత బాలరాజు గడ్డంకిందనుండి తలమీదకు పొడుగాటి గుడ్డపేలిక నొకదాన్ని కొన్ని చుట్లు చుట్టాడు వృద్ధుడు. కాళ్లు, చేతులు, నోరు కదలడానికి ఏమాత్రం వీల్లేకుండా అంత గట్టిగా బిగించబడినప్పటికీ బాలరాజు ఇంతసేపు నిశ్చలంగా నిద్రపోతూనే ఉన్నాడు గాని కదలనైనా లేదు. అంత చాకచక్యంతో, నేర్పుతో, మృదువుగా వృద్ధుడు తన విరోధి కొడుకును బంధించాడు.

## 23

వృద్ధుడు ముక్కాలిపీట తెచ్చుకుని మంచం పక్కన వేసుకున్నాడు. దానిమీద కూర్చుని కాల వ్యయం కూడా గమనించకుండా కత్తిని ఇంకా సాన పడుతున్నాడు. అతని దేహం సగభాగం నీడలోను,

మిగతాది వెలుతురులోను ఉంది. మాంసం హరించుకు పోయిన అతని పొడుగాటి వేళ్లు, చేతులు, కొంగ మెడవలె ముందుకు పొడుగ్గా వంగిన అతని మెడ— ఇవన్నీ చూస్తే—గూడులో చిక్కుకున్న పురుగు మీదికి లంఘించబోయే భీకరమైన సాలీడులాగా ఉన్నాడు.

ఇంత సేపూ వృద్ధసన్యాసి బాలరాజువంకే చూస్తున్నాడు. కాని అవి శూన్యదృక్కులు. ఏదో ఆలోచనాప్రపంచంలో ఉన్నాడు గాని నిజంగా బాల రాజువంక చూడడంలేదు. హఠాత్తుగా సన్యాసి ఆలో చనలనుండి బయటపడ్డాడు; బాలరాజు మేలుకుని కళ్లు తెరుచుకు చూస్తున్నాడని అప్పుడే గమనించాడు. బాలరాజు పదునుపెట్టబడుతున్న కత్తినే తదేకంగా చూస్తున్నాడు, అతని భయం వర్ణనాతీతం. వృద్ధుడు ఆభయం చూసి సంతృప్తితో చిరునవ్వు నవ్వాడు. కత్తి పదునుపెట్టడం మానలేదు; చిరునవ్వుతో ఇలా అన్నాడు :

"డింభకా! అస్మత్పరమ విరోధియైన అష్టమ హెస్త్రీకి పుత్రుడివై జన్మించితివి. దానికి తగిన ప్రతి ఫల మిప్పుడే పొందెదవుగాక! నీ ఇష్టదైవమును ప్రార్థించుకొనుము డింభకకీటమా!"

తన పగ సాధించుకొంటున్నాననే గర్వంలో "దేవదూత" భాషలోకూడా గీర్వాణం కనబరిచాడు.

బాలరాజు కట్లు విడిపించుకోవాలని తెగతన్ను

కున్నాడు. ఎంత ప్రయత్నించినా భల్లూకపు పట్టు లాంటి కట్లు విడిపోలేదు. చివరికి అలిసిపోయి ఆయాసం సూచించే కంఠస్వరంతో "ఊ" అని మూలిగాడు.

"ప్రార్థించుకున్నావా? బాగా? చనిపోయే టప్పుడు చేసే ప్రార్థన చెయ్యి, ఏం?"

బాలరాజు శరీరం నిలువునా గగుర్పొడిచింది; జలదరించింది. ముఖంలో మచ్చుకైనా నెత్తురుచుక్క లేదు. మళ్లీ విడిపించుకోడానికి ప్రయత్నించాడు. అతని వ్యర్థ ప్రయత్నాలు చూసి వృద్ధపిశాచం నిశ్చలంగా నవ్వుతూనే ఉన్నాడు. తల ఊంకిస్తూ, గొణుగుతూ, కత్తి పదును పెడుతున్నాడు. "కాలం వృథా చెయ్యకు, ఎనిమిదో హెన్రీ కొడకా! మరణప్రార్థన చేసుకో. మృత్యువు నాహ్వానించుకో," అని సలహా ఇస్తున్నాడు.

పాపం బాలరాజు ఎంత తన్నుకుంటేనేం, బంధనాలు కాస్తయినా సడలలేదు. కన్నీళ్లు జలజల చెక్కిళ్ల వెంట ప్రవాహాలు కట్టి కారుతున్నాయి. నోరు గట్టిగా బంధింపబడివున్నందున బలవంతాన మూలుగు వెలువడుతోంది. అయితే ఈ దృశ్యం వృద్ధభూతంలో కించిత్తయినా జాలి కలిగించలేదు. ఖైదీ తప్పించుకు పారిపోతాడనే భయంలేదు. కనుక వెంటనే చంపకుండా, వీలైనంతసేపు అతనిని మృత్యుభయంలో హింసపెట్టి తీరిగ్గా చంపాలని వృద్ధుని ముచ్చట. కొన్ని కొన్ని

రాక్షసప్రకృతిగల క్రూరజంతువులు ఇలాగే చేస్తాయి.
చేతికి చిక్కిన బలహీనమృగాన్ని వెంటనే చంపవు.
చాలాసేపు కాళ్లమధ్యనూ, నోటిలోను ఇరికించి,
దానితో ఆడుకుని, వినోదించి ఎప్పుడో తీరిగ్గా చంపు
తాయి. పిల్లిచెలగాటం ఎలుకకు ప్రాణసంకటం!

వృద్ధుడు హఠాత్తుగా గ్రహించాడు తెల్లవార
వస్తోందని. గభాలున లేచాడు. "అరెరె, తెల్లవారి
పోతోంది, ఇక ఆలస్యం చెయ్యకూడదు. అప్పుడే
రాత్రి గడిచిపోతోంది. ఈ రాత్రిని ఒక ఏడాదిదాకా
పొడిగించే శక్తి నాకుంటే?...ఓరీ దురాత్మా! క్రైస్తవ
మతద్రోహి పుత్రకా! కాచుకొను మిదే మదీయ చండ
ప్రచండ గండభేరుండ ఖడ్గప్రహారంబును—" అని
రెండు మూడుసార్లు కత్తి ఝుళిపించి బాలరాజు గుండె
మీదకు వంగాడు. బాలరాజు మూలుగులు తీవ్రమై
నాయి.

అదేసమయంలో బయట కొంతదూరంలో పద
ధ్వనులు, కంఠధ్వనులు వినిపించాయి. వృద్ధుడు ఉలికి
పడి నుంచున్నాడు. చేతిలోని కత్తి జారిపడిపోయింది.
కాళ్ళు, చేతులు కంపించాయి. గబగబ బాలరాజుమీద
కంబళీ కప్పాడు ఆపాదమస్తకం. బయట కంఠధ్వనులు
ఎక్కువయ్యాయి. ఎవరో కోపంగా మాట్లాడుతు
న్నారు. పోట్లాటల్లో సాధారణంగా ఉపయోగించబడే
బూతులు వినిపించాయి. తర్వాత కొట్లాట జరుగుతు
న్నట్లు వినిపించింది. ఎవరో "బాబోయ్" అని అరి

చారు. తర్వాత ఎవరో పారిపోతున్నట్టు చప్పుడైంది. వెంటనే తలుపు దడదడ విరామం లేకుండా బాదా రెవరో.

"తలుపు తియ్యండి. తలుపు తలుపు, త్వరగా తియ్యాలి," అని కేకవినబడింది.

ఈ కేక బాలరాజుకు మధురాతి మధురసంగీతమై వినిపించింది. అతడు బ్రహ్మానందభరితుడయ్యాడు. ఎందుకంటే ఆ కంఠధ్వని మైల్సు హెండన్ది.

వృద్ధుడు ఒక్క కోపంతో పళ్లు పటపట కొరుకుతూ గది బయటకు వచ్చాడు. నిశ్శబ్దంగా తలుపులు మూసేశాడు. వాకిలితలుపు తెరిచాడు. అక్కడ జరిగిన సంభాషణ చెవులు రిక్కించి విన్నాడు బాలరాజు.

"నమస్కారం మహాశయా! ఏడీ కుర్రాడు? నా కుర్రవాడేడీ?"

"ఏ కుర్రాడు?"

"అబద్ధం చెప్పకు మహాశయా! మనదగ్గిర నీ నక్కజిత్తులేమీ చేపవ్. ఎవ రనుకున్నావో జాగ్రత్త! కోపమొస్తే మనిషినికాను, పెద్దపులిని. ఆ అబ్బాయిని నా దగ్గిర్నించి ఇద్దరు దుర్మార్గులు దొంగిలించారు. వాళ్లనీ ప్రాంతంలో ఇప్పుడే పట్టుకుని తన్నాను. వాళ్లు చేసిన తప్పు ఒప్పుకుని నిజంచెప్పారు. ఆ అబ్బాయి వాళ్లదగ్గిరనుంచి తప్పించుకుపోయాట్ట. ఈ యింట్లో నే

ఉండిఉంటాడని చెప్పారు వాళ్ళు. అతని కాలిగుర్తులు కూడా ఈ ఇంట్లోకే వచ్చినట్టు తెలుపుతున్నాయట. కనక అత డిక్కడికే వచ్చిఉండాలి. నన్ను మోసం చెయ్యాలని ప్రయత్నించకు, ఏడీ అతడు?"

"ఓ అతడా? రాజునని చెప్పుకుంటూ చిరుగుడ్డల్లో వచ్చిన పిల్లవాడా? అతడు పాపం చాలా ఆకలితో వచ్చాడు. నేను ఆదరించి తిండిపెట్టాను. రాత్రంతా ఇక్కడే పడుకున్నాడు. ఇంతకుముందే అతన్ని ఓపనిమీద ఓ చోటికి పంపాను. ఇప్పుడే వస్తాడు. కాసేపాగండి."

"ఏమంటునా? త్వరలో వస్తాడా? నేను పరిగెత్తితే అతన్ని పట్టుకోగలనా?"

"మీరు కదలక్కర్లేదు. అత నిప్పుడే రాగలడు"

"అయితే సరే, అతడు వచ్చేదాకా ఇక్కడే ఉంటాను. - ఏయ్ ఆగు నువ్వతన్ని పనిమీద పంపించావా? నువ్వా? - ఇది శుద్ధఅబద్ధం. నువ్వు పంపితే అతను వెళ్లాడా? మానవమాత్రు డెవడూ అతన్ని ఆజ్ఞాపించలేడు. నువ్వొకవేళ ఆజ్ఞాపిస్తే నీ గడ్డం పీకి తగలబెట్టి మరీ వెళ్లేవాడు. మహాశయా! నువ్వు వృథాగా అబద్ధమాడుతున్నావు. నీ పప్పులు నా దగ్గిర ఉడకవు."

"అవును. అతడు మానవమాత్రులమాట వినడు. కాని నేను మానవమాత్రుణ్ణి కాను."

"ఎవరు నువ్వు?"

"అది రహస్యం - ఎవరితోనూ చెప్పకండి నేను దేవదూతను."

మైల్స్ హెండన్ అంత ఆదుర్దాలో ఉన్నా ఈ మాటకు పెద్దపెట్టున నవ్వాడు.

"ఓ నువ్వు దేవదూతవా? అయితే అతడు వెళ్లినమాట నిజం కావచ్చు. సాక్షాత్తు దేవుని దూత ఆజ్ఞాపించినప్పుడు మహారాజైనా సరే శిరసావహించి తీరుతాడు. ష్. ఏమిటా చప్పుడు?"

ఇంతసేపూ బాలరాజు ఈ సంభాషణ వింటూనే ఉన్నాడు. వృద్ధుని మాయమాటలు నమ్మి హెండన్ తన నిక్కడ కనుక్కోకుండానే వెళ్లిపోతాడేమో నని భయం, మళ్ళీ వృద్ధుని మోసం గ్రహించి తన్ను విడిపిస్తాడనే ఆశ - ఈ రెండు భావాలమధ్య అతను ఊగుతున్నాడు. హెండన్ కెలాగైనా వినిపించేట్టు అరవాలని గట్టిగా చాలసార్లు మూలిగాడు. కాని హెండన్ వినిపించుకోలేదు; విన్నా పాటించలేదు.

వృద్ధుడు జవాబిచ్చాడు:

"చప్పుడా? ఏం లేదే. బయట గాలిచేస్తున్న చప్పుడే. ఇంకేం లేదు.

"కావచ్చును. కాని ఇందాకటినుంచీ వినిపిస్తోంది - బహుశా గాలేనేమోలే (మళ్ళీ మూలుగు) అరె. మళ్ళీ వినిపిస్తోంది. తమాషాగా ఉందే. ఆగు. ఇదంతా వెదకాలి నేను."

బాలరాజు సంతోషం చెప్పతరంకాదు. మరొక్కసారి మూలగాలని ప్రయత్నించాడు. కాని అతడప్పటికే ఆయాసపడిపోయాడు. అందుచేత అతి హీనస్వరంతో మాత్రమే మూల్గగలిగాడు. వృద్ధు డన్నమాటలు అతన్ని మరింత కుంగదీశాయి.

"అవునండీ, మళ్లీ ఏదో చప్పుడైంది. ఇంట్లో మాత్రం కాదనుకుంటా, బయటికి పోయి చూద్దాం రండి."

వృద్ధుడు హెండన్‌ను వాకిట్లోకి తీసుకుపోయాడు. వారు తిరిగివచ్చేసరికి కొన్ని యుగాలయినట్లనిపించింది బాలరాజుకు. ఆశనిరాశల ఆటు పోటుల మధ్య ఉయ్యాల లూగుతున్నాడు.

బయట గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. హెండన్ అంటున్నాడు:

"ఇక్కడ ఒక్క నిమిషమైనా ఆలస్యం చెయ్యను; చెయ్యలేను. పాపమతడు ఈ అరణ్యంలో ఎక్కడో దారితప్పిపోయి ఉండాలి. ఎటు వెళ్లాడనలు? చెప్పు త్వరగా. ఎటు?"

"అతడు—ఆగండి. నేనుకూడా మీతో వస్తా."

"ఆ. చాలా మంచివాడివి. నీ అంత మంచి దేవదూతను ఇంకొకణ్ణి చూడలేదు. త్వరగా రా. ఆ అబ్బాయికోసం తెచ్చాను ఈ గాడిదని. ఇదెక్కుతావా? లేక నా గుర్రాన్నెక్కుతావా? నీ ఇష్టం."

"అక్కర్లేదు. నేను గాడిదలు, గుర్రాలు, ఎక్కను. నడిచే వస్తాను."

తరవాత మైల్స్ హెండన్ గుర్రమెక్కి అదిలించడం, క్రమంగా వారి పదధ్వనులు దూరదూరమై పోవడం వినిపించింది. బాలరాజు హృదయంలో మినుకు మినుకు మంటున్న ఆశాజ్యోతి టప్పున ఆరిపోయింది. నిరాశాంధకారం ఆవరించింది.

"నా నమ్మినబంటు, స్నేహితుడు నాకీ ప్రపంచంలో ఉన్న ఒకే ఒక రక్షకుడు మోసగింపబడ్డాడు. నాకు నాలుగడుగుల సమీపందాకా వచ్చి కూడా నన్ను కనుక్కోలేకపోయాడు. మళ్ళీ వృద్ధపిశాచి తిరిగి వస్తాడు. వచ్చి - " అక్కడితో ఆలోచించడం మానేశాడు. విపరీతంగా తన్నుకోసాగాడు. యావచ్ఛక్తినీ ఉపయోగించి బంధనాలు తెంచాలని యత్నించాడు. మంచంమీద ఎగిరెగిరి పడ్డాడు. బ్రహ్మాండమైన అతని ప్రయత్నాల ఫలితంగా మీద కప్పబడిన కంబళీమాత్రం తొలగిపోయింది. ఇది అదృష్టమో, దురదృష్టమో పాఠకులే ఊహించాలి.

ఎందుకంటే అదే నిమిషంలో వాకిలి తలుపు తెరువబడింది. ఆ సవ్వడి విని బాలరాజు హృదయం క్షణం స్తంభించింది. వృద్ధుని ఖడ్గం తన గుండెలపై నాట్యంచేస్తున్నట్టే భావించాడు. అమిత భయోద్రేకంతో కళ్లు మూసుకున్నాడు; అమిత భయోద్రేకంతో తిరిగి కళ్లు తెరిచాడు.

కళ్ల కెదురుగా జోడు దెయ్యాల్లాగా నుంచుని ఉన్నారు జాన్ కాంటే, హ్యూగోలు. కాని ఆ క్షణంలో వారు తన్ను రక్షించడానికి వచ్చిన దేవతల్లాగా కని పించారు బాలరాజుకు.

మరి రెండునిమిషాల్లో అతడు స్వేచ్ఛపొందాడు. విముక్తి ప్రదాతలైన ఆ దొంగ లిద్దరూ బాలరాజును చెరో రెక్క బలంగా పట్టుకుని గబగబ లాక్కు పోయారు. ఒక పావుగంటకల్లా అరణ్యం దాటి అంత ర్హితులై పోయారు.

## 24

"హాహా హీహీ చక్రవర్తి" పరిస్థితి మళ్ళీ మొదటి కొచ్చింది. దొంగలముఠాకు మళ్లీ బందీ అయ్యాడు. ఒకసారి తమనుండితప్పించుకు పోయాడనే అక్కసుకొద్దీ ముఠావాళ్లు బాలరాజును ఇంకా ఏడిపిం చడం ప్రారంభించారు. అయితే జాన్ కాంటే హ్యూగో లకు తప్ప మిగతా వారెవరికీ అతనిమీద నిజంగా ద్వేషం లేదు. ఊరికే వేళాకోళానికి ఉడికిస్తున్నా, అంద రికీ అతనంటే అవ్యాజానురాగం ఏర్పడింది. అతని ధైర్యం, హుందాతనం చూసి వాళ్లకు కనీసం మన స్సులోనైనా అభిమానం ఏర్పడింది.

ముఠానాయకుడు దగ్గరలేనప్పుడు కాంటే, హ్యూగోలు బాలరాజును తెగతిప్పలు పెట్టేవారు; అతని రాజరికాన్ని అవమానించేవారు. హ్యూగో

మరీని; ఉత్తిపుణ్యానికి, ఒంటికాలిమీద లేచేవాడు. ఒకసారి పొరపాటున తొక్కినట్లు బాలరాజు కాలు తొక్కాడు. బాలరాజు చూసీ చూడనట్టు ఊరుకున్నాడు. హ్యూగో ఇంకోసారి అలాగే తొక్కాడు. బాలరాజు ఇంకా ఓర్పు విడవకుండా మౌనంవహించి కూర్చున్నాడు. కాని, హ్యూగో మూడోసారి కూడ ఆకతాయిగా ప్రవర్తించేసరికి బాలరాజు కోపం పట్టలేకపోయాడు. పక్కనున్న దుడ్డుకర్ర తీసుకుని ఒకదెబ్బతో హ్యూగోను పడగొట్టాడు. ఈదృశ్యం చూసి దొంగలు సంతోషపరవశులై చప్పట్లు చరిచారు. "హోహో హీహీ చక్రవర్తికీ జై" అనే నినాదాలు మిన్నుముట్టాయి. హ్యూగోకు చచ్చినంత పనయింది. పదేళ్ల బాలుని చేతిలో, ఇందరి ముందు, అంత దుర్భర పరాభవం జరిగితే ఎలా సహించగలడు? తోకతొక్కిన తాచులా లేచాడు; దుడ్డుకర్ర పుచ్చుకుని కుందేలుపైకి లంఘించే సింహంలా మీదికి ఉరికాడు.

మన దొంగలకి ఇలాంటి ద్వంద్వయుద్ధాలంటే సరదా మిక్కుటం. వెంటనే వీరద్వయంచుట్టూ చక్రాకారంలో మూగారు, ఈ పోరాటపు పర్యవసానం కళ్లారాచూసి ధన్యులు కావాలనే ఆసక్తితో. "అయ్యో! ముక్కుపచ్చలారని పసివాడే. అతన్ని రక్షించడం మన ధర్మంకదా," అనేధ్యాస ఎవడికీ లేదు. ఒకడు పిల్లకోడే గెలుస్తుందని, మరొకడు పెద్ద కోడే నెగ్గుతుందని పందెం కాశారు.

హ్యూగో మీాది కురికి ఉరకడంతోనే బాల రాజు పక్కకు తొలిగి బుర్రమీాద మరో దెబ్బ తాటించాడు. హ్యూగో గిర్రున తిరిగి మళ్లీ పడ్డాడు. బాలరాజు రాచనగరులో పట్టుతివాసీలమీాద, మెత్తటి పచ్చికదారులమీాద తప్పటడుగులు వెయ్యడం నేర్చు కున్నప్పటినుంచీ మహావీరులమధ్య మెలిగాడు; యూరప్ ఖండంలో అగ్రేసరులని పేరుగాంచిన నిపుణుల వద్ద కత్తిసాము క్షుణ్ణంగా అభ్యసించాడు. ఖడ్గయుద్ధం లోను, ధనుర్విద్యలోను అతనికి తెలియని మెలకువలు, రహస్యాలు లేవు. అటువంటివానిచేతికి కర్ర ఇస్తే, హ్యూగోలాంటి దేశద్రిమ్మరులు, తాగుబోతులు ఏపాటి నిలుస్తారు?

హ్యూగో వళ్లు దులుపుకుని లేచి వీరావేశంతో కిందూ మీాదూలేకుండా కర్రతో మోదుతున్నాడు. బాలరాజు తొణుకూ బెణుకూ, అలసట, ఏమీా లేకుండా తీవిగానిలబడి ఒక్కదెబ్బకూడా తగలకుండా తప్పుకుంటున్నాడు. హ్యూగో ఎక్కడ కొట్టబోతే అక్కడ కర్ర అడ్డంపెట్టి కాచుకొంటున్నాడు. ఇంత గొప్ప నైపుణ్యం దొంగ లిదివర కెన్నడూ, ఎక్కడా చూడలేదు. నోరుతెరుచుకుని విభ్రాంతులై బాలరాజు విద్యను తిలకిస్తున్నారు.

ఈరీతిగా ఒక పావుగంటకు పైగా ద్వంద్వయుద్ధం జరిగింది. బాలరాజుకు ఒక్క దెబ్బయినా తగలలేదు. కాని హ్యూగోకు మాత్రం కాళ్లమీాద,మణికట్లమీాద,

ముడుసులమీద, నెత్తిమీద విపరీతంగా గాయాలు తగి
లాయి. శత్రువు కాపుపెట్టుకోని చోటనల్లా బాలరాజు
తంగున గురితప్పకుండా కొట్టాడు. హ్యూగో కిందపడితే
లేవలేని స్థితికి వచ్చాడు. ఆఖరుసారిగా ప్రయత్నిద్దామని
కర్ర ఎత్తాడుగాని బాలరాజు బలంకొద్దీ కొట్టి కర్రను
రివ్వున దూరానికి ఎగరగొట్టాడు. ఆయుధం పోగానే
ఇక లాభంలేదని గ్రహించి హ్యూగో వెన్నిచ్చి గుంపు
లోంచి దూసుకుని పారిపోయాడు.

"పిల్లకోడి గెలిచింది, పిల్లకోడి గెలిచింది," అనే
కేకలతో ప్రేక్షకులు బాలరాజును ఎత్తేశారు. ఒకడు
అతన్నెత్తుకుని బుజాలమీద కెక్కించుకున్నాడు. జయ
జయ ధ్వానాలతో అతన్ని ముఠానాయకునివద్దకు
తీసుకుపోయి అతనిపక్కన కూర్చుండ బెట్టారు. నాయ
కుడు "హాహా హీహీ చక్రవర్తి" గుణగుణాలను,
శౌర్యాన్ని ప్రశంసిస్తూ గంభీరోపన్యాస మిచ్చాడు.
అతనికి "ఆంగ్లకేసరి" అనే బిరుదిచ్చాడు. "హాహా
హీహీ చక్రవర్తి" అనే పేరు ఏడిపించడానికిమాత్రమే
పెట్టింది గనుక దాన్ని ఇకమీదట ఎవరైనా వాడారంటే
ముఠానుంచి బహిష్కరించేస్తా నన్నాడు.

"ఆంగ్లకేసరిని" ఏ వృత్తిలో ప్రవేశపెడదా
మన్నా సాధ్యంకాలేదు. ఒకసారి ఒకళ్ల వంటయింట్లోకి
పంపారు ఏదన్నా ఎత్తుకురమ్మని. అతడు వట్టిచేతు
లతో తిరిగిరావడమే కాకుండా ఇంటివాళ్లతో చెప్పి
బయటపెడతానని బెదిరించాడు కూడా. గిన్నెలమాట్ల

వాడితో పంపించారు సహాయం చేస్తూ ఉండమని. కాని బాలరాజు వేలైనా కదల్చలేదు సరిగదా, సుత్తితో తల పగలగొడతానని మాట్లవాణ్ణి హడలగొట్టాడు. హ్యూగోతో పంపించారొకసారి బిచ్చ మడుక్కోడానికి. అతడు దిక్కులు చూస్తూ నుంచున్నాడు గాని నోరైనా మెదపలేదు. అంతేకాక వీలైనప్పుడల్లా తప్పించుకుపోవడానికి ప్రయత్నించాడు. కాని అతని ప్రయత్నా లేమీ ఫలించలేదు. ఈవిధంగా కొన్ని రోజులు గడిచాయి.

ద్వంద్వయుద్ధం జరిగిన రోజునుంచీ హ్యూగో బాలరాజుపై తాచుపాములా పగబట్టాడు. కాని బహిరంగంగా పగతీర్చుకునేందుకు అవకాశం దొరకడం లేదు. అందుచేత వాడు ఉపాయాలమీద ఉపాయాలు ఆలోచిస్తున్నాడు. ఆఖరికి రెండు ఉపాయాలు స్థిరపరుచుకున్నాడు. ఒకటి బాలరాజుకు శాశ్వతంగా అవమానం కల్గించేపని చెయ్యాలి. రెండు. మొదటిది కుదరని పక్షంలో, బాలరాజుమీద ఏదో నేరంతోసి రక్షకభటులకు పట్టుబడేట్లు చెయ్యాలి.

మొదటి ఉపాయం ఇది: బాలరాజు కాలిమీద "పుండు" పడేట్లు చెయ్యాలి. పుండుపడటానికి దొంగ బిచ్చగాళ్లు ఒక విచిత్రపద్ధతి నవలంబిస్తారు. పచ్చి సున్నం, సబ్బు, ఇనుముతుప్పు ఈ మూడూ కలిపి 'పేస్టు' తయారుచేస్తారు. దాన్ని తోలుముక్కమీద ఒత్తుగా రాసి కాలికి పట్టీ వేస్తారు. కొద్దిసేపట్లో 'పేస్టు'

పని చేయడం మొదలుపెడుతుంది. చర్మం మంట పెడు
తుంది; తరువాత పగుల్తుంది; అప్పుడు పట్టీ విప్పేస్తారు.
చర్మం పగిలినచోట నెత్తురు పూస్తారు. నెత్తురెండిన
తర్వాత ఆ ప్రదేశం ఎర్రటి వ్రణంలాగ చూట్టానికి
భయంకరంగా ఉంటుంది. ఈ అవతారంతో వీధుల్లో
తిరుగుతూ దారేపోయేవాళ్లను ధర్మం అడుగుతారు.
జాలిగుండెగలవాళ్లు హృదయం కరిగి ధర్మంచేస్తారు.
జాలిలేనివాళ్లు బిచ్చగాడి పీడవదిలించుకోవాలనైనా,
చీదరించుకుంటూ పారేస్తారు.

ఒకరోజు మధ్యాహ్నం ముఠావాళ్లు ఎవళ్ల
వృత్తులమీద వాళ్లు పోయారు. హ్యూగో మాట్లవాణ్ణి
కూడా తన ప్లానులోకి తీసుకున్నాడు. మాట్లవాడికి
కూడా బాలరాజుమీద కంఠందాక కోపం ఉంది.
ఇద్దరూ కలిసి బాలరాజును ఆమాట ఈమాట చెబుతూ
చెట్లచాటుకు తీసుకుపోయారు. అక్కడ బాలరాజును
పడేసి కాళ్లూ, చేతులూ, నోరు కట్టేశారు. హ్యూగో
కాలికి పట్టీకట్టాడు. బాలరాజు ఎంత గింజుకున్నా
లాభం లేకపోయింది. 'పేస్టు' చర్మాన్ని కరవడం
మొదలెట్టింది.

ఇంతలో అదృష్టవశాత్తు అక్కడికొక మనిషి
రావడం, బాలరాజుకు అపాయం తప్పిపోవడం జరిగింది.
అత డెవరో కాదు. ఆరోజున ఇంగ్లీషుశాసనాలని విమ
ర్శిస్తూ ఉపన్యాసం దంచిన "బానిస" సేం. అతడు జరు

గుతున్నదంతా క్షణంలో గ్రహించి పట్టీ విప్పేసి కాలు శుభ్రంగా కడిగాడు.

బాలరాజు "బానిస" చేతిలోఉన్న కర్ర లాక్కుని హ్యూగోను, వాడి స్నేహితుణ్ణి ఉతకాలని చూశాడు. కాని "బానిస" అడ్డపడి వారించాడు. ఆ రాత్రి ముఠా అంతా సమావేశమైనప్పుడు హ్యూగో కుట్రను నాయకుని కెరుకపరచాడు. అతడు కుట్రదారులను మందలించి, ఇకమీద బాలరాజును బిచ్చానికి తీసుకుపోవద్దని, దొంగతనాలకే తీసుకుపొమ్మని ఆజ్ఞాపించాడు.

మందలింపుతో వదిలిపోయినందుకు హ్యూగో సంతోషించాడు. ఇదివరకల్లా బాలరాజును 'చౌర్య వృత్తిలోకి దింపాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఈసారి సాక్షాత్తు అధిష్ఠానవర్గంవారే ఆజ్ఞాపించారు కనుక బాలరాజు ఆజ్ఞ ఉల్లంఘించడానికి వీల్లేదు.

అందుచేత హ్యూగో బాలరాజును వెంట బెట్టుకుని ఆమర్నాడు మధ్యాహ్నమే దొంగతనానికి బయల్దేరాడు. అతడు ఎలాగోలాగు పోలీసులకు పట్టు పడేలా చెయ్యాలని హ్యూగో ఎత్తువేశాడు. అయితే తనే పట్టిచ్చినట్లు ముఠావాళ్లకు అనుమానం కలక్కుండా చెయ్యాలి. ఎందుకంటే "ఆంగ్లకేసరి" మీద ముఠాలో అభిమానం జాస్తి అవుతోంది. తన ద్రోహం తెలిస్తే వాళ్లూరుకోరు.

హ్యూఏగో బాలరాజుతో ఒక ఊళ్లో ప్రవేశిం చాడు. దూరంగా ఒక పొట్టి ఆడమనిషి నెత్తిమీద ఏదో తట్టపెట్టుకుని రావడం చూశాడు.

"ఆ తట్టలో ఏదో ఉన్నట్లుంది. కాచుకోరా ఆంగ్లకేసరీ! నా తడాఖా," అని మనస్సులో అను కున్నాడు. ఇంతలో ఆస్త్రీ దగ్గిరి కొచ్చింది. ఆమెను దాటిపోనిచ్చాడు. మెల్లిగా వెనకాలే వెళ్లి తట్టలోని మూటను సంగ్రహించి బాలరాజుచేతికిచ్చి "నువ్వు నా వెంటే పరుగెత్తుకురా," అని చెప్పాడు. తను పరుగు పుచ్చుకున్నాడు. ఇంతలో ఆడమనిషి నెత్తిమీద బరువు తగ్గిపోవడం గమనించి మూట నెవరో దొంగిలించా రనుకుంది. "దొంగలగ్రోయ్ రండగ్రోయ్" అని గావుకేకలు పెట్టింది. వెనక్కి తిరిగి చూసేసరికి, బాల రాజుచేతిలో మూట ఉండడం చూసి పరుగెత్తుకువచ్చి అతని చెయ్యి పట్టుకుంది. ఆమె అరుపులకు వాళ్లూ వీళ్లూ పోగడ్డారు. ఇదంతా కన్నుమూసి కన్ను తెరిచే టంతలో జరిగిపోయింది. బాలరాజు మూట పారేసి పారిపోవడానికి కూడా సందు చిక్కలేదు. హ్యూఏగో కిన్నాగం కొంతసేపటికిగాని అర్థంకాలేదు. పారి పోవడానికి ప్రయత్నించాడు కాని ఆస్త్రీ భల్లూకపుపట్టు పట్టేసింది. పైగా జనంకూడా గుమిగూడారు.

హ్యూఏగో ఇదంతా చాటున దాక్కుని చూస్తు న్నాడు. ఇక అతడు చూడదగిందేదీ లేదు. శత్రువు రక్షకభటులకు పట్టుబడడమే తరువాయి. అందులో

అనుమానమేమీ లేనందున చూడవలసిన అవసరము లేదు. కనుక చల్లగా జారుకున్నాడు అక్కడినించి.

బాలరాజు కోపంగా అన్నాడు: "విడిచిపెట్టు మూర్ఖురాలా! నీ మూట దొంగిలించింది నేను కాదు"

కాని అత డెంత గుంజుకున్నా ఆడమనిషి పట్టు విడవలేదు. పోగడ్డ జనులు బాలరాజును ఏక వరసన బూతులు తిడుతున్నారు. వాళ్లలో ఒక వడ్రంగి ఉన్నాడు. అతడు మహోద్రేకంతో చొక్కా చేతులు పైకి లాగి, తేలుకొండీల్లాంటి మీసాలు మెలిపెట్టి, "ఒరే దొంగవెధవా! నిన్ను పచ్చడి చేస్తారా," అంటూ లంఘించాడు. కాని అదే క్షణంలో ఒక పొడవైన కత్తి అతని బుజాన్ని నెమ్మదిగా తాకింది. వడ్రంగి హడిలిపోయి వెనక్కి తిరిగాడు.

"తొందరెందుకు మిత్రులారా! ఆ పిల్లవాడేదన్నా తప్పు చేస్తే న్యాయాధికారులకు అప్పగించాలి గాని మనంతట మనమే చెయ్యి జేసుకుంటే ఎల్లా? అమ్మా! అత డెక్కడికి పారిపోడు. వదిలిపెట్టు."

ఈమాట లంటున్న యువకుణ్ణి వడ్రంగి నఖశిఖ పర్యంతం పరిశీలించాడు. ఆ ఒడ్డు, పొడుగు, వీర లక్షణాలు, చేతిలో ఖడ్గం-ఇవన్నీ చూసి కంగారుగా పక్కకి తప్పుకున్నాడు. చేతకాని కోపంతో చేతులు దులుపుకుంటూ అవతలికి వెళ్లిపోయాడు. ఆడమనిషి ఇష్టంలేకపోయినా బాలరాజు చెయ్యి విడిచిపెట్టింది. మిగతా జనులు అతన్ని ద్వేషం నిండిన చూపులు

చూశారు గాని ఎవడూ నోరెత్త సాహసించలేదు. బాలరాజు తన మిత్రుణ్ణి ఒక్క అంగలో చేరుకుని,

"ఎక్కడికి పోయావ్ సర్ మైల్స్; నన్ను వదిలి ఎందుకు పోయావ్ సర్ మైల్స్!" అని గద్గద కంఠంతో అడిగాడు.

## 25

హెండన్ చిరునవ్వు నవ్వాడు. బాలరాజు చెవిలో ఇలా అన్నాడు:

"మహారాజా! గట్టిగా మాట్లాడకండి. నన్ను నమ్మండి. చివరికి అంతా శుభాంత మౌతుంది". తనలో ఇలా అనుకున్నాడు: "సర్ మైల్స్! అరె. నాకు సర్ బిరుదం ఉన్నట్టే జ్ఞాపకం లేదు. ఈ బాలుడు ఇంత వెర్రివాడైనా అన్నీ జ్ఞాపకం వుంచుకుంటు న్నాడు. ఇది ఉత్తుత్తి బిరుదమే కావచ్చు. కాని యూర పులోని కొన్ని కొన్ని నిజమైన రాజ్యాల్లో సామంత ప్రభువుగా ఉండడంకంటే ఇతని స్వప్న రాజ్యంలో 'సర్' ని కావడంలోనే ఎక్కువ ఆనందం ఉన్నది."

గుంపును చీల్చుకుంటూ క్రోధారుణనేత్రుడైన కాన్‌స్టేబిల్ ఒకడు వచ్చాడు. మోటగా బాలరాజును రెక్కపట్టుకు లాగబోయాడు-కాని హెండన్ వారించి అన్నాడు:

"నెమ్మదిగా మిత్రమా! నువ్వతన్ని లాగ నక్కరలేదు. అతడే వస్తాడు. నేను పూచీ వుంటాను కావలిస్తే. నువ్వు ముందు నడు.

కానిస్టేబిల్ ఆడమనిషిని, బాలరాజును వెంట పెట్టుకుని బయద్దేరాడు. హెండన్ అనుసరించాడు. బాలరాజు ఎదురు తిరుగుదామనుకున్నాడు గాని హెండన్ హెచ్చరించాడు:

"మహారాజా! తమరే రాజశాసనాలను ఉల్లంఘిస్తే మాబోటివారి నిక అనే పనేముంది?"

"అవును. నువ్వన్నది నిజం. ఇంగ్లండు సార్వభౌముడు ఈరోజున అదృష్టవిహీనుడు; సామాన్యులలో సామాన్యుడు. ఇతర ప్రజలందరూ రాజశాసనాలకు ఎలా తల ఒగ్గాలని తలుస్తానో, అలాగే నేను కూడా ప్రజల్లో ఒకణ్ణిగా ఉంటున్నాను గనుక శాసనాలను శిరసావహిస్తాను."

న్యాయమూర్తి అడిగిన ప్రశ్నలకు జవాబు చెబుతూ ఆడమనిషి "ఈకుర్రవాడే నా మూట దొంగిలించాడు," అన్నది. కాదని సాక్ష్యమిచ్చే వారెవరూ లేనందున బాలరాజే దొంగ అని స్థిరపడింది. మూట విప్పిచూడగా అందులో వంటకు సిద్ధం చేయబడిన పంది పిల్ల ఉన్నది. అది చూసి జడ్జిగారు ఆందోళన చెందారు; మైల్సు హెండన్ ముఖం పాలిపోయింది. బాలరాజుమాత్రం సంగతేమీ తెలియనందున అమాయకంగా నుంచున్నాడు. జడ్జిగారు ఆడమనిషి నడిగారు:

"అమ్మా! దీని ఖరీదెంత?"

"మూడు షిల్లింగుల ఎనిమిది పెన్సులండి."

జడ్జీ ఆందోళన ఇంకా ఎక్కువైంది. కోర్టులో చేరిన జనసమూహాన్ని పరిశీలించి చూసి కానిస్టేబిల్‌కు ఆజ్ఞాపించాడు:

"అందర్నీ బయటికి పంపించు ఒకసారి."

కోర్టులో జడ్జి, కానిస్టేబిల్, ముద్దాయి, ఫిర్యాది, మైల్స్ హెండర్‌సన్ తప్ప ఎవరూ లేరు. జడ్జి ఫిర్యాదికేసి తిరిగి అన్నారు:

"అమ్మా! పాపం ఏదో తెలియక చేశాడు పిల్లవాడు. ఆకలికి తాళలేక దొంగతనానికి దిగాడేమో గాని బుద్ధిపూర్వకంగా చెయ్యలేదనుకుంటా. అతని ముఖం చూడు; ఎంత నిర్మలంగా, అమాయకంగా ఉన్నదో? నీకు తెలుసుగా పదమూడున్నర పెన్నీల కంటే ఖరీదైన వస్తువును దొంగిలిస్తే దొంగకు మరణ శిక్ష పడుతుంది. పాపం ఈ కుర్రవాణ్ణి ఎందుకు ఉరి తీయిస్తావు?"

బాలరాజు అదిరిపడ్డాడు. కాని నిగ్రహించుకుని నిబ్బరంగా నుంచున్నాడు. కాని ఫిర్యాది నిబ్బరించుకోలేక గడ గడ వణికిపోయింది.

"అయ్యో నా కడుపు కాలా. అయ్యో నన్ను పాతిపెట్టా. ఎంత పాపిష్టిదాన్ని! బంగారంలాంటి కుర్రాణ్ణి ఉరితియ్యనిస్తానా? నా ఆస్తి అంతా దొంగిలించినా ముద్దొచ్చే ఈ బంగారుపాపణ్ణి కసాయివాళ్లకు ఒదిలేస్తానా? బాబూ, జడ్జిగారూ! మీరే చెప్పండి, ఏం చెయ్యమంటారో?"

జడ్జిగారు గంభీరంగా అన్నారు :

"ఖరీదేమైనా తగ్గించడానికి వీలుందేమో చూడు. ఇంకా నేను ఫిర్యాదును కాగితంమీద కెక్కించలేదు."

"బాబ్బాబు, మీకడుపు చల్లగా మంచిమాట చెప్పారు. ఎనిమిది పెన్నీలని చెప్పి రాసుకోండి."

మైల్స్ హెండన్ సంతోష పరవశుడయ్యాడు. "మహారాజును" తాకరాదని కూడా మరచిపోయి బాలరాజును ఎత్తుకుని కౌగలించుకుని ముద్దెట్టుకున్నాడు.

ఆడమనిషి తన పందిపిల్లని తీసుకుని బయటికి వెళ్ళిపోయింది. కాన్ స్టెబిల్ కోరచూపులు చూస్తూ తలుపు తెరిచి తనుకూడా ఆమెవెంట వెళ్ళాడు. జడ్జిగారు ఫిర్యాదును కాగితంమీద రాసుకుంటున్నారు.

కాన్ స్టెబిల్ అవతలి కెందుకు వెళ్ళాడో కని పెట్టాలని మైల్స్ హెండన్ కూడా కోర్టుహాల్లోకి నడిచాడు నిశ్శబ్దంగా. చాటున నుంచుని కాన్ స్టెబిల్, ఆడమనిషి చేస్తున్న సంభాషణ విన్నాడు.

"చాలా బావుందమ్మా పందికూన. మంచి రుచిగా ఉండేట్టుంది. నేను కొంటాను. ఇవిగో ఎనిమిది పెన్నీలు."

"ఇదేంటయ్యోవ్ ? ఎనిమిది పెన్నీ లిస్తానంటావ్ ? మూడుషిల్లింగుల ఎనిమిది పెన్నీలుపెట్టి

పొద్దునే కొన్నాను—కాస్తా కూస్తా అనుకున్నావేమో? ఎవళ్ళకా_వాలి నీ ఎనిమిది పెస్నీలు?"

"మరి జడ్డిగారిదగ్గర ప్రమాణంచేసి చెప్పావే ఎనిమిది పెన్నీలని? పద అయితే కోర్టులోకి. అబద్ధ మాడినందుకు నీకు జుల్మానా, దొంగిలించినవాడికి ఉరి శిక్ష—"

"ఆగవయ్యా, చాల్లే. ఆ చిట్టివాణ్ణి ఉరితీయిస్తావా? ఆ ఉసురు నాకు చుట్టుకోదూ? సరే, తీసుకో. కర్కోటకుడిలాగ తగులుకున్నావ్."

ఆడమనిషి వెళ్ళిపోయింది. హెండన్ ఏమీ ఎరగనట్టు కోర్టు గదిలోకి వెళ్ళినుంచున్నాడు. కాన్‌స్టేబిల్ పందిపిల్లను ఎక్కడో దాచివచ్చాడు. జడ్జీగారు రిపోర్టు, తీర్పు రాసుకుని, బాలరాజుకు ఒక రోజు ఖైదు, ఖైదుఅయిన తర్వాత బహిరంగంగా పది కొరడా దెబ్బలు శిక్ష విధించారు. బాలరాజు తీర్పు విని ఆగ్రహావేశుడయ్యాడు. "ఈ జడ్జితల నరికెయ్యండి," అనే మాట నాలిక చివరిదాకా వచ్చింది. కాని హెండన్ మళ్ళీ వారించాడు.

కోర్టు ముగిసింది. కాన్‌స్టేబిల్ బాలరాజుతో జైలుకు బయలుదేరాడు. హెండన్ అనుసరించాడు. కోర్టు ఆవరణ దాటి రోడ్డుమీదకు వచ్చారు. బాలరాజు ఆగి హెండన్‌తో అన్నాడు:

"బుద్ధిహీనుడా! జైల్లోకి వెడతానననేనా నీ ఉద్దేశ్యం?"

"మ్. మాట్లాడకండి. నాలో మీకు నమ్మకం లేదా? మీరు మామూలు ధోరణిలో మాట్లాడితే కథ రసాభాసం అవుతుంది. జరిగేది జరక్కమానదు మీ కిష్టమైనా, కాకపోయినా. చివరికి అంతా శుభాంతం అని నేను హామీ ఇస్తున్నాగా."

## 26

అప్పటికి సాయంకాలమైంది. గూళ్లకు పక్షులు, ఇళ్లకు మనుషులు చేరుకుంటున్నారు. చలిగాలి విజృంభిస్తోంది. కాన్‌స్టెబిల్ ఖైదీతోసహా నాలుగురోడ్లు కలిసే ఒకచోటుకు వచ్చాడు. జైలు మరికొన్ని గజాలదూరంలో ఉంది. జనం ఆట్టేలేరు చుట్టుపక్కల. హెండన్ కాన్‌స్టెబిల్ బుజంమీద చెయ్యివేసి ఆపి రహస్యంగా అన్నాడు:

"మిత్రమా! కాస్తాగు, ఇక్కడెవరూ చూసే వాళ్లు లేరు. ఈ కుర్రవాణ్ణి పాపం వదిలెయ్యి."

"నాతోనే ఈ మాటలనడం? మీ రెవరనుకున్నారో? మిమ్మల్ని ఈక్షణంగా అరెస్టుచెయ్య గలను."

"అరెరె, ఎందు కంత తొందరపడతావు? నువ్వు అటువేపు చూస్తూ నుంచో. ఈ అబ్బాయి ఇటు తిరిగి పారిపోతాడు. అప్పుడు నీతప్పేమీ ఉండదు."

"చాల్చాలు. ఈ మాటలు నా దగ్గర చెప్పకండి. ఇది రాజద్రోహం—"

"నువ్వు పందిపిల్లను ఎనిమిదిపెన్నీలకు కొనడం నేను చూడ లేదనుకున్నావా?"

కాన్‌స్టేబిల్ ఆట కట్టింది; నోట మాట రాలేదు; కొంతసేపటికి ధైర్యం తెచ్చుకుని "చూస్కో- ని న్నేం చేస్తానో?" అంటూ హెండన్‌ను బెదిరించాడు కాని హెండన్ ప్రశాంతంగా ఇలా అన్నాడు :

"మిత్రమా! నువ్వంటే నాకెందుకో ఇష్టం కలుగుతోంది. బుద్ధిపూర్వకంగా నీకు అపకారం చెయ్యాలని నాకు దురుద్దేశ్యమేమీలేదు. నువ్వు ఆడ మనిషితో అన్న ప్రతిఒక్క- ముక్కా- నేను విన్నాను. కావలిస్తే విను," అని ఆ సంభాషణ అంతా పూస గుచ్చినట్టు అప్పజెప్పాడు. "ఏం సరిగా అప్ప జెప్పానా? ఇప్పుడైనా నమ్మకంకలిగిందా? అవసర మైతే ఈ సంభాషణనే జడ్జీగారిముందు అప్పజెప్ప లేననుకుంటున్నావా?"

కాన్‌స్టేబిల్ పనైపోయింది. స్తబ్ధుడై మూగ పోయి నుంచున్నాడు. కాని ఇంకా లొంగలేద.

"నేను ఊరికే వేళాకోళాని కన్నాను ఆ మెతో అదంతా నిజమనుకుంటున్నారేమో?"

"పందిపిల్లను దాచడంకూడా వేళాకోళమేనా?"

"ఆ, కాకమరేమిటి?"

"అయితే ఇప్పుడే వస్తా నాగు. జడ్జీగారు మంచి అనుభవజ్ఞులు. ఆయన్నడిగివస్తాను ఇది వేళాకోళమో నిజమో," అని రెండడుగులు నడిచాడు హెండన్.

కాన్‌స్టెబిల్ సందేహించాడు; చిరచిరలా డాడు; అస్పష్టంగా తిట్టాడు; ఉమ్మేశాడు; చివరి కిలాగ అరిచాడు:

"ఆగండి సార్, ఆగండి. జడ్జీగారిదాకా ఎందుకు లెండి. ఆయనదగ్గిర వేళాకోళాలు పనికిరావు. చాలా కోపిష్టిమనిషి. ఆయన ఇది విన్నాడంటే నా ఉద్యోగం లాగేస్తాడు. చూడు బాబూ! ఏదో పిల్లలు గలవాణ్ని. నాకూట్లో దుమ్మెందుకు పోస్తారు?— ఇంతకీ మీ కేం కావాలి?"

"ఏంలేదు, చాలాచిన్న విషయం. నువ్వు కాసేపు గుడ్డివాడివి, మూగవాడివి కావాలి; రెండు నిమిషాలసేపు పక్షవాతం తెచ్చుకో."

"ఎలైనా నాకే వస్తుంది ముప్పు. కాస్త న్యాయం ఆలోచించండిసార్. నేను ఆమనిషితో వేళాకోళానికి అన్న మాటలు పట్టుకుని ఏడిపిస్తే ఎలా గండి? మీరే ఆలోచించండి, నేను చేసింది వేళాకోళమో గాదో. ఒకవేళ తప్పే అనుకుందాం. కాని అది ఎంత చిన్నతప్పో చూడండి. మీరు చూసీ చూడనట్లూరు కోవాలిగాని—"

"అదే నేనూ అనేది. నువ్వు ఒక్క నిమిషం చూసీ చూడనట్లూరుకో. ఆ అబ్బాయి దాటి పోతాడు."

"నాకు ప్రమాదం తెచ్చిపెట్టకండి సార్."

"ఏదెక్కువ ప్రమాదమో ఆలోచించుకో. నువ్వు చేసిన నేరాని కో పేరుంది, తెలుసా?"

"తస్సాదియ్యా, దాని కో పేరుగూడానా? నేనే మొదటిసారిగా అలాంటి పని చేశానని గర్వపడు తున్నానే! ఏమి టది బాబూ!"

"ఇంగ్లీషు న్యాయశాస్త్రంలో దాన్ని 'అన్య ధనగ్రసనం' అంటారు."

"అబ్బో. గట్టి పేరే ఉందే? ఎప్పుడూ విన లేదు."

"దానికి శిక్షఏమిటో తెలుసా?"

"తెలియదు సార్ మీరే చెప్పండి."

హేండన్ చిరుదగ్గు దగ్గి గొంతు సవరించు కున్నాడు. రొమ్మునిండా గాలి పీల్చాడు. "జాగ్రత్తగా విను," అని గుక్కపట్టాడు: "ఘోర భీకరనరకప్రాంత దురంత నిరంతర దహ్యమాన వహ్నిజ్వాలికా కీలికా మాలికా___"

"బాబోయ్, ఆపండి. వింటుంటేనే హడలుగా ఉంది. ఇంత గొప్ప శిక్ష నే ననుభవించ లేను బాబూ! రక్షించండి. ఇవి చేతులు కావు, కాళ్లనుకోండి. నా గొంతు కొయ్యకండి___" అంటూ కాన్‌స్టెబిల్ కాళ్లా వేళ్లా పడి ప్రాధేయపడ సాగాడు.

"ఆ. మ రిదేం మజాకా అనుకున్నావా? ఇప్పుడు దారికి వస్తావుగదూ? అటు తిరిగి నుంచో.

అన్నట్టు ఆ ఆడమనిషికి పందిపిల్ల నిచ్చేస్తావుగదూ ? ఇంకెప్పుడూ ఇలాంటి బుద్ధితక్కువపని చెయ్యకు."

"ఇంకెప్పుడూ చెయ్యనండి. మీరు చెప్పిన ఆ పొడుగాటి శిక్ష జ్ఞాపకమున్నంతవరకూ చెయ్యను. మీరు వెళ్లిపొండి. తలుపులు బద్దలు గొట్టి మీరే ఖైదీని విడిపించుకుపోయారని చెబుతాను. జైలు తలుపులు శతాబ్దాలనాటివిలెండి. అందుచేత జడ్జీగారు తేలిగ్గా నమ్మేస్తారు."

"చాల మంచివాడివి నువ్వు. మొదటే చెప్పానుగా, నువ్వంటే నా కిష్టం కలుగుతోందని. జడ్జీగారు కూడా ఈ కుర్రవాడిమీద ఎంతో జాలి చూపించారు. అతడు తప్పించుకుపోయినందుకు ఆయన సంతోషిస్తారే గాని మరేం అనుకోరు."

హెండన్ బాలరాజును వెంటబెట్టుకుని గబగబ ఆ ప్రదేశం దాటిపోయాడు.

## 27

బాలరాజును ఊరిబయట ఫలానాచోట తన కోసం వేచిఉండవలసిందనీ, తాస్త్రీలోగా ఇన్నాళ్లూ బసచేసిన సత్రానికి పోయి బాకీడబ్బు చెల్లించి శీఘ్రమే వచ్చే స్తానని హెండర్ చెప్పాడు.

మరొక అరగంటకల్లా బాలరాజును హెండర్ సంకేతస్థలంలో కలుసుకున్నాడు. లండర్ వంతెనమీది దుకాణంలో, బాలరాజుకోసం తాను ఇదివరకు

కొన్ని మంచి దుస్తులు కూడా హెండన్ తనతో తెచ్చాడు. బాలరాజు తనపేలికలు విప్పి అవి తొడుక్కున్నాడు. ఇప్పు డతనికి కాస్త వెచ్చగా ఉన్నది. తన అశ్వరాజంమీద హెండన్ ఎక్కాడు. గార్దభరాజంమీద బాలరాజు ఎక్కాడు. ఇద్దరూ హెండన్ హాలుదిశగా ప్రయాణం సాగించారు.

బాలరాజును అట్టే ప్రయాసపెట్టడం మంచిది కాదనుకున్నాడు హెండన్. ప్రయాణపు బడలిక, వేళపట్టున భోజనం, నిద్రలేకపోవడం మొదలైన వాటితో అతని ఆరోగ్యం ఇంకా చెడిపోవచ్చు. విశ్రాంతి వల్ల అతని మనస్సు కాస్త కుదుటపడవచ్చు. ఎప్పటికైనా అతని ఉన్మాదం పోయి మామూలు మనిషి కాకపోతాడా అని హెండన్ గంపెడాశపెట్టుకుని ఉన్నాడు. కనుక తనమటుకు తనకు ఇంటికి చేరుకోవాలని ఎంతతొందరగా ఉన్నప్పటికీ బాలరాజు ఆరోగ్యందృష్ట్యా వీలైనన్ని మజిలీలు చేసుకుంటూ పోవడమే మంచిదని హెండన్ భావించాడు.

పదిమైళ్లు దాటి వచ్చేసరికి ఒక గ్రామం తగిలింది. ఆరాత్రికిఅక్కడ ఆగి ఒక సత్రంలో బస చేశారు. భోజనాల సమయంలో పాత సంబంధాలు తిరిగి నెల్పకొల్పబడ్డాయి; బాలరాజు భోంచేస్తుండగా హెండన్ కుర్చీవెనక చేతులుకట్టుకుని విధేయుడై నుంచున్నాడు. కావలసినవన్నీ అందించాడు ;

మంచంమీద పరుండబెట్టి శాలువలు కప్పాడు. తాను యథాప్రకారం తలుపుదగ్గిర నేలమీదనే ముసుగుతన్ని పడుకున్నాడు.

మరునాడు, ఆ మరునాడు, కులాసాగా కబుర్లు చెప్పకుంటూ ప్రయాణం సాగించారు. తాము లండన్‌వంతెనమీద విడిపోయినప్పటినుండి జరిగిన స్వానుభవాలను ఒకరి కొకరు చెప్పకున్నారు. హెండన్ తాను బాలరాజుకోసంఎక్కడెక్కడ వెదికి ఏయేకష్టాలు పడిందీ చెప్పాడు; "దేవదూత" బాల రాజును చూపిస్తానని తన్ను అడవిఅంతా తిప్పాడు; చివరికి మళ్లీ పాకవద్దకే తీసుకువచ్చాడు- తరవాత లోపల పడకగదిలోకి వెళ్లిచూసి బాలరాజు రాలే దని చెప్పాడు;ఆరోజల్లా తాను అక్కడే బాలరాజు కోసం నిరీక్షిస్తూ గడిపాడు; చివరికి నిరాశచేసుకుని మళ్లీ అన్వేషణకు బయలుదేరాడు.

"కాని మహారాజా! ఆ దేవదూత తమరు తిరిగిరాలేదని ఎంత విచారపడ్డాడనుకున్నారు?" అన్నాడు హెండన్.

"అవును, ఎందుకు విచారపడడూ? నన్ను కూడా స్వర్గానికి పంపించాలని చూశాడు," అంటూ బాలరాజు తన కథంతా వినిపించాడు. అంతా విని హెండన్,

"అరెరే! ఎంత తెలివితక్కువమూర్ఖుణ్ణి! ఆ దేవదూత పిచ్చివాడనుకున్నానుగాని ఇంత దురాత్మ

డనుకో లేదు. లేకపోతే అప్పుడే వాణ్ణి ధ్వంసంచేసి స్వర్గానికి పంపేవాణ్ణి," అని ఎంతో నొచ్చుకున్నాడు.

ప్రయాణపు ఆఖరిరోజున హెండన్ ఉత్సాహం రెచ్చిపోయింది. నోరు ఒక్కక్షణం ఊరుకో లేదు. తన వృద్ధ జనకునిగూర్చి, అన్న ఆర్థర్‌నుగూర్చి, తన ప్రియురాలు ఎడిత్‌ను గూర్చి వాగుతూనే ఉన్నాడు. ఆ సంతోషంలో తన కపకారంచేసిన తమ్ముడు హ్యూనుగూర్చికూడా రెండుమూడు మంచి మాటలన్నాడు. హెండన్ హాలుకు తను వెళ్ళగానే అందరూ ఆనందాతిరేకంతో మూర్ఛపోతారన్నాడు; పెద్దపెద్ద ఉత్సవాలు జరుగుతాయన్నాడు.

వాళ్లు ప్రయాణం చేస్తున్నప్రాంతం మనోహర దృశ్యాలతో కన్నులపండువుగా ఉన్నది. విశాలమైన ఆ రోడ్డుకిరు వైపులాపచ్చని పంటచేలు, చెట్లుచేమలు ఉన్నాయి; అక్కడక్కడ కాయగూరల తోటలు, పళ్లతోటలు ఎదురయ్యాయి. ఒక్కొక్కచోట ఒక మాదిరి ఎత్తైన గుట్టలు కనిపించేవి. ఇక హెండర్ గ్రామం దగ్గిరికి వస్తోందనగా మైల్స్ హెండర్ ఉండబట్టలేక గుట్టలమీదికి ఎక్కి ఊరు, తమ గృహం కనిపిస్తాయేమో నని పరిశీలించేవాడు. చివరికి ఒక గుట్టమీదనుండి అతని గ్రామం కనిపించింది. సంతోషంగా అరిచాడు.

"అదుగో మహారాజా! అదే మాఊరు. ఆ కని పించేదే మాఇల్లు. ఎంత ఎత్తైన గోపురాలో

చూడండి. అది మాతండ్రిగారి ఉద్యానవనం. అహ్హా! ఇప్పుడు మీకు తెలుస్తుంది, వైభవ విలాసాలంటే ఏమిటో? మాఇంట్లో డబ్భయ్ గదులున్నాయి; ఇరవై ఏడుగురు పరిచారకులున్నారు. ఎంత గొప్పో ఆలోచించండి. ఊ ఊరికించండి మీ గార్ధభరాజాన్ని. ఆట్టే దూరం లేదు."

వాహనాలను నానా అవస్థపెట్టిపరిగెత్తించారు. అయినా గ్రామం చేరుకునేసరికి మధ్యాహ్నం మూడుగంటలు దాటింది. ఊళ్లో ప్రవేశించారు. "ఇదే మాచర్చి—అది సత్రవ—ఆ పైది మార్కెట్టు. ఇది వసంతోత్సవాలు జరిగే చోటు—ఏమీ మారలేదు సుమండీ మాఊరు! పదేళ్ల కిందట ఎలా ఉండేదో ఇప్పుడూ అలాగే ఉంది. మనుషులుమాత్రం కొద్దిగా మారారు. కొందర్ని గుర్తుపట్ట గలుగుతున్నాను గాని, నన్నెవరూ గుర్తుపట్టడమే లేదు. ఈ పదేళ్లలో నేను చాలా మారిపుంటాను—"అంటూ వాగుతున్నాడు పెండక్కి దోవపొడుగునా. ఊరి చివరికి వచ్చారు. వంకర టింకరగా, ఇరుకుగా ఉన్న ఒక సందులోకి వాహనాలు పోనిచ్చారు. ఒక అరమైలుఅలా పోగా పోగా ఒక పెద్దగేటు కనిపించింది. రెండు నిలువుల ఎత్తున్న పెద్ద స్తంభాలు, వాటిమీద సింహప్రతిమలు ఉన్నాయి గేటుకు. గేటు దాటి లోనికి ప్రవేశించ గానే చల్లని పూలతోట, మధ్యలో బ్రహ్మాండమైన

భవనం కనబడ్డాయి. ప్రస్తుతానికి వారి ప్రయాణం ముగిసింది.

"స్వాగతం, రాజా, హెండర్ హాలుకు హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను మిమ్మ.

ఈరోజు ఎంత సుదినం! మాతండ్రి, అన్న, ఎడిత్ నన్ను చూసి ఎంత సంతోషిస్తారో చెప్పలేను. రాజా! నా బంధువులు నేను వచ్చినసంతోషంలో తమరిని గమనించకపోవచ్చు. అంతమాత్రాన మిమ్మ గౌరవించలేదని చిన్నబుచ్చుకోవద్దు. ప్రథమ సంతోషం అయిపోగానే వారు మిమ్మ గౌరవించడమేకాదు; నేను మి మ్మెంత ప్రేమిస్తున్నానో తెలిస్తే వారుకూడా నెత్తినెక్కించుకుంటారు; పువ్వుల్లో పెట్టి పూజించగలరు కూడాను."

హెండన్ గుర్రం దిగి బాలరాజును గాడీదనుండి దించాడు. బాలరాజును పొదివి పట్టుకుని నాలుగు అంగల్లో భవనసోపానాలు ఎక్కాడు. ఇంకొకనాలుగు అంగల్లో విశాలమైన ఒక హాల్లో ప్రవేశించారు. బాలరాజును ఒక ఆసనంమీాద కూర్చుండబెట్టిహాలుకు ఒక చివర, వ్రాతబల్లముందు కూర్చుని ఏదో రాసుకుంటున్న యువకునివద్దకు పరుగెత్తాడు.

"హ్యూ, హ్యూ, హ్యూ! నేనువచ్చాను. రా, తమ్ముడా! నన్ను కౌగలించుకో! ఏరీ నాన్నగారేరీ! ముందు ఆయన కరస్పర్శ చేస్తేనేగాని నాకు తృప్తి లేదు, ఏరీ, ఎక్కడ?"

కాని హ్యూ్యా తలెత్తిచూసి విస్మితుడై వెనక్కి తగ్గాడు. కొన్నిక్షణాలు మైల్స్‌ను తదేకంగా పరీక్ష చేసి చూశాడు. కనుబొమలు చిట్లించి, 'ఎవరోయ్ నువ్వు?' అన్నట్లు చూశాడు. తుదకిలా అన్నాడు :

"నీకు మతి భ్రమించినట్లుంది. నూతనుడా! పాపం చాలా కష్టాలు పడినట్టున్నావు, నీవాలకం, దుస్తులు చూస్తే అలాగే అనిపిస్తోంది. పాపం, న న్నెవరనుకుంటున్నావు?"

"నువ్వెవరివో నేను గుర్తుపట్టలేదనా నీ ఉద్దేశ్యం? నువ్వు హ్యూ్యా హెండన్‌వి కాక ఇంకెవరివి?" అన్నాడు మైల్స్ కొంచెం తీవ్రంగా.

హ్యూ్యా నిశ్చలంగా మళ్లీ ప్రశ్నించాడు :

"సరే, నువ్వెవరి వనుకుంటున్నావు?"

"ఇందులో అనుకోవలసిన అవసరమేమీ లేదు. నే నెవరినో నాకెంత తెలుసో, నీకూ అంతే తెలుసు. నేను మైల్స్ హెండన్‌నని నీకు నిస్సందేహంగా తెలుసు."

హ్యూ్యా ముఖంలో సంతోషభావం కదిలింది.

"ఏమిటి? ఇది నిజమే? చచ్చిపోయినవారు తిరిగి రాగలరా? వస్తే చాలాఅదృష్టవంతుణ్నే. పాపం, మా చిన్నన్న ఏడేళ్ల క్రిందట చనిపోయినవాడు తిరిగి బతికి వచ్చాడంటే ఎవరు సంతోషించరు ? ఇటుగో నూతనుడా? నాతో వేళాకోళమాడకు. ఏదీ, వెలుగులోకి రా, సరిగ్గా చూడనీ నిన్ను."

హ్యూ రెక్కపట్టుకుని మైల్స్‌ను కిటికీవద్దకు లాక్కువెళ్లాడు. నఖశిఖపర్యంతం అతన్ని పరీక్షించాడు.

"ఊఁ. ఇంకా పరీక్షించు. బాగా చూడు. నేను నీచిన్నన్ననే. అవునా? ఇప్పుడు నమ్మకం కలిగిందా? అనుమానం తీరిందా? నేను మైల్స్‌నేకదూ? ఆ. రా తమ్ముడా! కౌగలించుకో. సంతోషం పట్టలేకుండా ఉన్నాను."

కాని హ్యూ అతన్ని నెట్టివేశాడు.

"అయ్యో,ఎంత దురదృష్టవంతుణ్ణి! ఇంకెక్కడి చిన్నన్న! ఆ దేవుడు నన్నైనా తీసుకుపోలేదు," అంటూ హ్యూ కళ్ల నీళ్లు తుడుచుకున్నట్టు నటించాడు.

"హ్యూ! నేను మైల్స్‌నుకానా?"

"కావు. ఆ ఉత్తరం నిజమే నన్న మాట."

"ఏ ఉత్తరం?"

"అదే. ఆ రేళ్లకిందట గాబోలు విదేశాలనుండి వచ్చింది. నాచిన్నన్న యుద్ధంలో మరణించాడని ఎవరో స్నేహితుడు మానాన్నగారికి రాశాడు."

"అబద్ధం! మోసం! ఏరీ నాన్నగార్ని పిలు. ఆయన నన్ను గుర్తిస్తారు."

"చనిపోయినవాళ్ల నెలా పిలవడం?"

"చనిపోయారా? నాన్నగారు పోయారా?" అని మైల్స్ రుద్ధకంఠంతో అన్నాడు. అతని పెదిమలు దుఃఖావేగానికి కంపించాయి. "అయ్యో! ఎంత

మందభాగ్యుణ్ని. ఎవరి సందర్శనంకోసం ఇన్నాళ్లు కలవరించానో ఆయన నిక చూసేభాగ్యం లేదు నాకు...సరే, అన్న ఆర్థర్ నైనా పిలు."

"అతడుకూడా చనిపోయాడు,"

"ఏమిటిది? నా సంతోషం చల్లారిపోయింది. ఎంత ఉత్సాహంతో వచ్చానో, అంత క్రుంగదీసే వార్తలు వినిపిస్తున్నాయి. ఎడిత్ —"

"ఆమె బ్రతికే ఉన్నది."

"ధన్యుణ్ణి. నాసంతోషం తిరిగివచ్చింది. హర్బ్యా! వెంటనే పరుగెత్తుకొనిపో. ఆమెను తీసుకురా. ఆమె నన్ను తప్పక గుర్తుపట్టుతుంది. కావలిస్తే మన పూర్వసేవకులను కూడా పిలు. వాళ్లుకూడా నన్ను గుర్తిస్తారు."

"అందరూ చనిపోయారు, అయిదుగురుతప్ప. పీటర్, హాల్సు, డేవిడ్, బెర్నార్డ్సు, మార్గరెట్ మాత్రమే మిగిలారు," అని హర్బ్యా హాల్లోంచి లోపలికి పోయాడు.

"విశ్వాసపాత్రులైన ఇరవై ఇద్దరు నౌకర్లు చని పోయి, దుష్టులైన ఈ అయిదుగురే మిగిలారా? ఎంత వింత?" అనుకుంటూ మైల్సు హాల్లో అటూ ఇటూ కాలుగాలిన పిల్లిలాగ పచార్లు చేయనారంభించాడు. బాలరాజు ఉనికిని పూర్తిగా విస్మరించాడు. కొంత సేపటికి బాలరాజే అన్నాడు.

"వీరుడా! నీ దురదృష్టానికి చింతించకు. నీమాదిరిగానే గుర్తుపట్టబడనివాళ్లు, హక్కులు పోగొట్టుకున్నవాళ్లు ప్రపంచంలో మరికొందరుండవచ్చును. అలాంటివాణ్ణే నేను. మనలనిద్దరినీ ఒకే దురదృష్టం వరించింది. కనుక నువ్వు చింతించనక్కర్లేదు."

హెండన్ సిగ్గుపడ్డాడు. "రాజా! నా చిట్టిరాజా! మీరు నన్ను వేళాకోళం చెయ్యకండి. నేను మోసగాణ్ణి కాను. ఆగండి. మీరే చూస్తారు; ఇంగ్లండులోకల్లా మధురాతిమధురాలైన అధరాలద్వారా మీరు వింటారు నేనెవరో. ఆమెను రానివ్వండి... నేను మోసగాణ్ణా! అరె. నాకు ఈహాలులో ప్రతి మూల మూల తెలుసునే! నా పూర్వీకులవైన ఈ చిత్ర పటాలన్నీ నాకు గుర్తే. నేనిక్కడపుట్టాను, పెరిగాను. నేను దైవసాక్షిగా చెబుతున్నాను ఈమాట. అందులో మీతో కూడా అబద్ధమాడతానా? ప్రభూ! ఎవరు నమ్మినా, నమ్మకపోయినా, మీరైనా నన్ను విశ్వసించండి."

"నిన్ను ముమ్మాటికీ విశ్వసిస్తున్నాను సర్ మైల్స్!"

"మీకు సర్వదా కృతజ్ఞుణ్ని," అన్నాడు మైల్స్. బాలరాజు అమాయకత్వం అతని హృదయాన్ని ముల్లులాగ తాకింది. కాని బాలరాజు వెంటనే ప్రశ్నించాడు:

"సర్ మైల్స్! మరినువ్వు నన్ను విశ్వసిస్తావా ?"

దొంగతనం చేసి పట్టుబడినట్టు మైల్స్ కంగారు పడ్డాడు ఈ ప్రశ్నకు. జవాబేమీ తోచలేదు. కాని ఇంతలో హ్యూగ్ వచ్చాడు; మైల్స్ జవాబివ్వకుండా తప్పించుకున్నాడు.

హ్యూగ్, వెనకాలే ఒక సుందరి వచ్చింది. ఆమె వెనుక నౌకర్లువచ్చారు. సుందరి నేలనే చూస్తూ నడిచివచ్చింది. తల ఎత్తకపోయినా ఆముఖంలో ఏదో చెప్పలేని విచారం గూడుకట్టుకున్నట్టు కనిపిస్తోంది. ఆమెను చూడగానే మైల్స్ ముందుకు అడుగు వేసి,

"ఎడిత్! ప్రియా! హృదయేశ్వరీ!" అన్నాడు.

హ్యూగ్ అతన్ని వెనక్కి నెట్టి, "అతన్ని చూడు గుర్తుపట్టగలనేమో ?" అన్నాడు!

మైల్స్ కంఠం విని వినగానే సుందరి ఉలికి పడింది; బుగ్గలు ఎర్రపడ్డాయి; పెదిమలు వణి కాయి. మెల్లిగా తల ఎత్తింది. భయపడిన లేడికూనవలె బిత్తరిచూపులు చూసింది. క్రమంగా ముఖం పాలి పోయింది. నూతిలోంచి మాట్లాడినట్టు, "అతన్ని నే నెరగను," అన్నది. గిరుక్కున మరలి, వచ్చిన దారినే వెళ్లిపోయింది. కాని ఏడుపును దిగమింగు తున్నట్టు ఆమె మూలగడం స్పష్టంగా వినిపించింది.

మైల్స్ పిడుగుపడినవాడివలె ఒక కుర్చీలో కూలబడి ముఖం రెండు చేతులా కప్పుకున్నాడు. హ్యూగ్ నౌకర్లను అడిగాడు :

"అతన్ని చూశారుగా, మీా రెవరైనా ఎరుగు దురా అతన్ని?"

నౌకర్లు ఒక్కొక్కరే తలలు అడ్డంగా ఊపారు.

"నౌకర్లు కూడా నిన్నెరగరు నూతనుడా! బహుశా నువ్వు పొరబడి ఉంటావు. నాభార్యకూడా నిన్నెరగ నన్నది, చూశావుగదా!"

"నీ భార్యా?" ఎవరో తన పీకనులుముతున్నట్టు తన కంఠం రెండుచేతులా పట్టుకున్నాడు మైల్స్. "ఓరి గోముఖవ్యాఘ్రమా! నువ్వు నా ప్రియురాలిని కూడా అపహరించావా? అదీ. ఇప్పుడంతా అర్థమైంది. ఆ దొంగఉత్తరం, నేను చనిపోయినట్టు వ్రాసినది, నువ్వే సృష్టించావు. ఆ తరువాత ఎడిత్‌ను పెళ్లి చేసుకుని ఆమె ఆస్తినికూడా సంగ్రహించావు. ఛీ, కుక్కా! అవతలికి పో. నా కళ్లఎదుట నిలవకు, లేకపోతే నీలాంటి విశ్వాసఘాతకుడి రక్తంతో నా కత్తిని మలినం చేసుకోవలసివస్తుంది."

హ్యూ ముఖం కందగడ్డలా ఎర్రబడింది. అవమానంతో కాళ్లు నిలదొక్కుకోలేకపోయాడు, "ఈ మోసగాణ్ణి బంధించండి," అని సేవకులకు ఆజ్ఞాపించాడు. వాళ్లు సందేహించారు; ఒకడన్నాడు:

"అతనివద్ద ఆయుధం వుంది సర్ హ్యూ! మాదగ్గిర ఏమీా లేదు."

"ఆయుధం ఉన్నదా? ఉంటేనేం? మీరింద రున్నారు, పట్టుకోలేరూ? ఊ, చూస్తారేం? మీద పడండి."

కాని మైల్స్ కత్తిదూసి ఝుళిపించాడు.

"విశ్వాసహీనులారా! నన్ను మీరు బాల్యం నుంచీ ఎరుగుదురు. నా చేతులో కత్తివుంటే ఎదుటి వాడి కెంత ప్రమాదమో మీకు బాగా తెలుసు. చేవ ఉంటే ముందుకు రండి," అని హెచ్చరించాడు. నౌకర్లు తమకు చేవ లేదన్నట్లు వెనక్కి తగ్గారు.

"ఛీ పిరికిపందల్లారా! పొండి. కత్తులు తెచ్చు కోండి. సింహద్వారం, బయటగేటు అన్నీ బందు చెయ్యండి. పోలీసులకోసం ఒకణ్ణిపరిగెత్తించండి," అని హ్యూ ఆజ్ఞాపించాడు. మైల్స్ కేసి తిరిగి, "నూతనుడా! నువ్వు పారిపోదామని వృథాగా ప్రయత్నించకు. అది నీకే మంచిది కాదు," అన్నాడు.

"పారిపోవడమా? అది కల్ల. నువ్వేమీ బెంగపడకు. నీలాంటి అధమాధములకు జడిసి పారి పోయేఘటం కాదిది. ఇక నుంచీ హెండన్ హాలుకు, యావదాస్తికీ అధిపతి మైల్స్ హెండన్. అత డిక్కడనుండి ఒక్క అంగుళమైనా కదలడు. సందేహించ నక్కర్లేదు నువ్వు."

## 28

ఇంతసేపు బాలరాజు తనలోతాను దీర్ఘాలోచన చేస్తున్నాడు. చివరికి తలఎత్తి అన్నాడు

"చాలా వింతగా ఉంది. ఎందుచేతనో అర్థం కావడం లేదు."

"లేదు ప్రభూ! ఇందులో వింత ఏమీ లేదు. నేను హ్యూను చిన్నతనంనుండి ఎరుగుదును, వాడి స్వభావమే అంత."

"అతన్నిగూర్చి కాదు నేననేది".

"మరేమిటి? ఏమి టా వింత? మీారనేది బోధ పడలేదు."

"మహారాజు ఏమయ్యారని ఎవరూ అనుకోవడంలేదేమాఅని."

"ఎందుకు? ఎవరు? ఏమిటి?"

"అది కాదోయ్ సర్ మైల్స్! నేను కనిపించడంలేదని ప్రజలెవ్వరూ ఆందోళనపడడం లేదేమా అని అడుగుతున్నాను. నాఆకారాన్ని వర్ణిస్తూ ప్రకటనలు చెయ్యడంగాని, దేశమంతటా అన్వేషణగాని, ఏమీా జరగడంలేదు. నేను మాయమైపోవడం దేశానికి విచారకారణం కాదా?"

"ఓ అదా? అవునవును ప్రభూ! విచిత్రంగానే వుంది," అని 'పాపం ఇతని మనస్సు ఇంకా ఆదుస్వప్నాలవలలోనే చిక్కుకున్నది.' అని లోపల అనుకున్నాడు హెండన్.

"సర్ మైల్స్! నాకొక ఉపాయం తట్టుతున్నది. దాంతో మనిద్దరి కష్టాలు గట్టెక్కగలవు. నేను లాటిన్, గ్రీకు, ఇంగ్లీషు భాషల్లో శ్రీముఖం ఒకటి

వ్రాస్తాను. నువ్వు రేపు చీకటితో లేచి దాన్ని లండన్ తీసుకుపోవాలి. నా మేన మామ హెర్టుఫర్డు ప్రభువుకు తప్ప మరెవరికీ ఇవ్వకూడదు. దాన్ని ఆయన చూడ గానే నేనే రాశానని గుర్తుపడతాడు. నాకోసం మను షులను వెంటనే పంపుతాడు."

"ప్రభూ! నాదొక చిన్న మనవి. నా వారసత్వపు హక్కులవిషయం ఏదో తేలేదాకా మన మిక్కడే ఉండటం మంచిది. నా హక్కులు తిరిగిపొందినప్పుడు నాకు కాస్త పలుకుబడి కూడా వుంటుంది. అప్పుడు మన మేది చేసినా చెల్లుతుంది."

బాలరాజు రాజోచితంగా కోపం చూపిస్తూ అన్నాడు

"మూర్ఖుడా! ఒక దేశం, ఒక రాజవంశం, ఒక సింహాసనం ప్రమాదపరిస్థితిలో పడినప్పుడు నీ వారసత్వం, నీహక్కులు, నీచిల్లరఆస్తిపాస్తులు ఏమూ లకి?" కాని వెంటనే అంత తీవ్రంగా మాట్లాడినందుకు నొచ్చుకుని గొంతు తగ్గించాడు. "నా ఆజ్ఞ పాలించు. భయపడకు సర్ మైల్స్! నేను నీహక్కులను రక్షి స్తాను; నీకు న్యాయంచేస్తాను. నీ సేవకు, స్వామి భక్తికి నేను ప్రతిఫలం ముట్టజెబుతాను."

బాలరాజు లేచి వ్రాతబల్లవద్దకు వెళ్ళి కాగితం, కలం తీసుకుని వ్రాయసాగాడు. మైల్స్ అతనివంక వాత్సల్యంతో చూస్తూ ఇలా అనుకున్నాడు :

"ఇదే చీకటిసమయమైతే ఈమాటలు స్వయంగా మహారాజే అన్నారని భ్రమించేవాణ్ణి. సందేహం లేదు. ఈ బాలుడు ఈ ట్రిక్కు ఎక్కడ నేర్చుకున్నాడో గాని, కోపంవచ్చినప్పుడు నిజమైన రాజువలె పిడుగులు వర్షిస్తాడు. చూడు, ఆ బల్లవద్ద కూర్చుని ఎలా పిచ్చిగీతలు గిలుకుతున్నాడో? అదంతా లాటిన్ గ్రీక్ అనే అతని భావన. రేపుదయం ఏదో మాయమాటలు చెప్పి నమ్మించకపోతే నన్ను లండన్‌కు తరిమిందాకా ఊరుకోడు."

మైల్స్ ఆలోచనలు అప్పుడే జరిగిన సంఘటనపైకి పోయినై. వాటిలో అతను నిమగ్నుడై ఉండటంచేత బాలరాజు కాగితం మడిచిఇవ్వడం, అది తీసుకుని తన జేబులో పెట్టుకోవడం కూడా హెండన్‌కు జ్ఞాపకం లేదు. "ఎంత చిత్రమైన విషయం జరిగింది! కలలో కూడా ఇలా జరుగుతుందని అనుకోలేను. కనీసం ఆమెయైనా నన్ను గుర్తిస్తుందను కున్నాను. నాముఖం, ఆకారం, కంఠం ఆమె తప్పక గుర్తించిఉంటుంది. అయినాఎరగనని ఎందు కన్నది? అబద్ధ మాడుతుందా, నా ఎడిత్?—ఆ,అది, అసలు విషయం! బహుశా హ్యూ ఆమెను బెదిరించి ఉంటాడు. ఆమెను చూడగానే ఏదో గొప్ప భయంలో ఉన్నట్టు తోచింది. అతడే బెదిరించి, ఎరగనని అనిపించిఉంటాడు. ఆమె నివసించే పిలిచి అడుగుతాను; ఒంటరిగా అడిగితే నిజం చెప్పక

మానదు. చిన్ననాటి విషయాలు, మేము కలసి మెలసి ఆడిన ఆటలు, పాడిన పాటలు జ్ఞాపకం చేస్తాను. ఆమె హృదయం చలించక మానదు; ఆమెస్వభావం నే నెరగనా? నిష్కల్మషమైన స్వభావం ఆమెది. నన్ను ఆ రోజుల్లో ఎంతో ప్రేమించేది. ఇప్పుడు నన్ను మోసగిస్తుందా?—" అనుకుంటూ లోపలి గదిలోకి అడుగు పెట్టబోయాడు. అంతలో తలుపు తెరుచుకుని ఎడిత్ ఒంటరిగా వచ్చింది.

ఆమె ముఖం ఇంకా పాలిపోయే ఉన్నది. ఇందాకటివలెనే విచారమేఘాలు ముఖంనిండా ఆవరించి ఉన్నాయి. అయినా, ఆమె సౌందర్యంగాని, సహజఠీవిగాని అణుమాత్రమైనా మరుగుపడలేదు. మైల్స్ చేతులు సాచి ముందుకు వచ్చాడు. ఆమె దూరంగా తొలిగి ఒక కుర్చీలో కూర్చుని, ఇంకో కుర్చీలో కూర్చోమని సైగచేసింది. పరాయివాణ్ణి చూసినట్టు ఆమె చూడడంతో అతని ఉత్సాహం చచ్చింది. కుర్చీలో కూలబడ్డాడు. ఎడిత్ అన్నది:

"మిమ్మల్ని హెచ్చరించిపోదామని వచ్చాను. ఇక్కడ మీరు ఆలసించడం అపాయకరం. మీరు పొరబాటున ఏదో భ్రాంతిలో పడ్డారు. ఆ భ్రాంతి తొలగించుకోకపోతే మీకే చాల చిక్కు" ఎడిత్ ఒక్కక్షణంసేపు మైల్స్ముఖంలోకి లోతుగా చూసింది. "మా చిన్న బావ పోలికలు మీకు కొన్ని

ఉన్నాయి. అందుచేత మీా రిక్కడ ఉండటం ఇంకా ఎక్కువ అపాయం."

"ఎడిత్ ! నేనే నీ చిన్న బావని."

"అది మీా విశ్వాసం. మీా విశ్వాసాన్ని నేను కాదనలేను. కాని నేను హెచ్చరిస్తున్నాను; నా భర్త ఈ పరగణాకు ఏకచ్ఛత్రాధిపతి. ఇక్కడి ప్రజల ప్రాణాలు ఆయన పిడికిలిలో ఉన్నాయి. మీాలో మా చిన్న బావపోలికలు లేకపోతే ఆయన మీాదారిని మిమ్మి పోనిచ్చేవారు. కాని ఇప్పుడాయన ఏంచేస్తారో నాకు బాగా తెలుసు. మీా రెవరో మోసగాళ్లని ప్రకటిస్తారు; అందరూ ఆ మాటనే ప్రతిధ్వనిస్తారు. మీారు నిజంగా మైల్స్ హెండన్ అయినప్పటికీ, ఆ సంగతి ఆయనకీ, ప్రజలకి కూడా తెలిసినప్పటికీ, మీాకు అపాయం తప్పదు; మీా తరఫున వాదించే మనిషి ఉండడు. బాగా ఆలోచించుకోండి నే చెప్పేది."

"ఆలోచించుకున్నాను" అన్నాడు మైల్స్ తీవ్రస్వరంతో. "ప్రేమించిన యువతి చేతనే ఎరగనని అనిపించినవాడు ఇంకెంతయినా చేయించగలడు."

ఎడిత్ ముఖం ఎఱ్రపడింది; కళ్లు నేలకు వాలినవి; కంఠం వొణికింది.

"మీారు వెంటనే వెళ్లిపొండి. నాభర్త మిమ్మల్ని నాశనం చేసినదాకా నిద్రపోరు. ఆయన నిర్దయుడు. నేను ఆయనకు బానిసను కనుక, ఆయన స్వభావం ఎరుగుదును. మైల్స్, ఆర్థర్, మామ సర్ రిచర్డ్

అందరూ ఈయన బాధలనుండి విముక్తి పొందారు. నేను మాత్రం దుఃఖం అనుభవించడానికి మిగిలాను. మీరు తక్షణం దూరంగా పారిపొండి. సందేహించవద్దు, వెళ్లండి. మీదగ్గిర డబ్బు లేకపోతే ఈ పర్సు తీసుకోండి."

మైల్స్ పర్సు వద్దన్నాడు; లేచి ఆమె ఎదుట నుంచున్నాడు.



మైల్స్ హెండన్, బాలరాజులను రక్షకభటులు చుట్టుముట్టిన దృశ్యం

"ఒక్కమాట. ఒక్కసారి నాకేసి చూడు. నేను మైల్స్ హెండన్‌ని అవునా, కాదా? నిజం చెప్పు."

"ఊహూ. మిమ్మి నే నెరగను."

"ప్రమాణంచేసి చెప్పు."

"ప్రమాణపూర్తిగా. ఊఁ. ఇక ఆలసించకండి. ఆట్టే వ్యవధి లేదు."

మైల్స్ హెండన్ మారుమాట లేకుండా వెనక్కి తిరిగి తన టోపీ తీసుకున్నాడు; బాలరాజును వెంటపెట్టుకుని ద్వారాలన్నీ దాటి వీధిలోకి వచ్చాడు. వెంటనే అతన్ని ఆయుధాలు ధరించిన రక్షకభటులు చుట్టుముట్టారు. అతను కత్తి తీయడానికైనా వ్యవధి లేకపోయింది. మైల్స్‌ను, బాలరాజును బంధించి రక్షక భటులు జైలుకు తీసుకుపోయారు.

## 29

జైల్లో గదులన్నీ కిక్కిరిసి ఉన్నాయి. అందు చేత మనమిత్రులిరువురినీ ఒక పెద్దగదిలో సంకెళ్లు వేసి బంధించారు. అక్కడ వీరుగాక ఇంకొక ఇరవై మందిదాకా నేరస్థులు జోడాలు జోడాలుగా సంకెళ్లు వేయబడిఉన్నారు. వారిలో ఆడ మగ, చిన్నాపెద్దా అన్నిరకాలవారూ ఉన్నారు. అలగాజనం మధ్య తన్నిలా పడేసి, తన రాజరికాన్ని అవమానించి నందుకు బాలరాజు ఎంతైనా చిరచిరలాడాడు; కాని హెండన్ ఏదో ఆలోచనలోపడి, అదోమాదిరిగా

ఉన్నాడు. పాపం ఎన్ని ఆశలు పెట్టుకుని ఇంటికి వచ్చాడు? ఇన్నేళ్ల ప్రవాసజీవితం తర్వాత, తానింటికి వస్తే తనవాళ్లు ఎంతో ఆనందిస్తారని ఆశించాడు. కాని అందుకు విరుద్ధంగా ఇంట్లోనుంచి గెంటివేయ బడ్డాడు; జైల్లో నీచ నేరస్థులతోపాటు కూలదోయ బడ్డాడు. తా నొకటి తలిస్తే, దైవంమరొకటి తలిచాడు. మేఘధ్వని విని, సంతోషపరవశురాలై నృత్యం చేయబోయిన నెమలికి నెత్తిమీదపిడుగుపడినట్లుంది, తన పరిస్థితి!

క్రమంగా అతని ఆలోచనలు సద్దుకుని ఒక దారికి వచ్చాయి. ఎడిత్ ప్రవర్తననుగూర్చి తలపోశాడు. అన్ని వేపులనుండి ఆమెవింతధోరణిని పరిశీలించాడు. కాని అతని కేమీ అర్థం కాలేదు. ఆమె తన్ను గుర్తించిందా, లేదా? ఇదీసమస్య. చివరికి ఎడిత్ తన్ను గుర్తించేఉండాలనీ, వేరే కారణాలవల్ల ఎరగనని అన్నదనీ నిర్ధారణ చేసుకున్నాడు. ఆమెను కసితీరా తిట్టేద్దామనుకున్నాడు; కాని పది పదిహేనేళ్లనుండి ఏవ్యక్తిని తన హృదయంలో పూజాపీఠంమీద నిలిపి పూజిస్తూ వచ్చాడో, ఆ వ్యక్తిపై ఒక్కసారిగా బురద పులమడానికి సాహసించ లేకపోయాడు.

జైలు అధికారులు సప్లయిచేసిన పాతకంబళ్లు కప్పుకుని బాలరాజు, హెండన్ ఎలాగో ఆ రాత్రి గడిపారు. తోటి ఖైదీలు కొందరు పహారావాళ్లకు

లంచాలిచ్చి సారా తెప్పించుకున్నారు. సార్వత్రికంగా బూతుపాటలు, తిట్లు, దొమ్మీ, గలాటా చెలరేగి జైలు మార్మోగిపోయింది. చివరికి సురాపాన మత్త చిత్తుడైన ఒక ఖైదీ మరొక ఆడఖైదీని చిత్తుగా చావగొట్టడంతో, ఆ రోజు గందరగోళం శిఖరాలందుకుంది. జైలుఅధికారి స్వయంగా అడ్డంవచ్చి మగఖైదీని ఉతికేదాకా కల్లోలం సర్దుకోలేదు. వాడికి మత్తుజారిపోవడంతో మిగతా ఖైదీలు కూడామత్తు దిగి మామూలులోకంలోపడ్డారు. ఆతరవాత జైల్లో శాంతిభద్రతలు నెలకొని, అంతా మొద్దునిద్ర పోయారు.

దాదాపు వారంరోజులు ఇలాగేగడిచాయి. చెప్పుకో దగినంతమంచి సంఘటనలేమీ జరగలేదు. పగటిపూట ఊళ్లోవాళ్లు కొందరు హెండన్‌ను చూసి పోదామనివచ్చేవారు. వీళ్లందర్ని మైల్స్ గుర్తుపట్టగలిగాడు. కాని, వాళ్లు హ్యూ హెండన్‌పైన తమకు గల భక్తిని ప్రకటించడంలో పోటీలుపడ్డారు. మైల్స్‌ను గజదొంగఅనీ, మోసగాడనీ, రౌడీవెధవ అనీ, ఇష్టమొచ్చిన కూతలు కూశారు. వీరంతా మైల్స్‌ను చూసిన క్షణంలోనే గుర్తుపట్టికూడా, ఈ నాటకం ఆడారు. పగలు ఈనాటకం, రాత్రిళ్లు ఖైదీల దొమ్మిలాట నాటకం; వీటితో బాలరాజు కొద్దిరోజుల్లో నిజంగా పిచ్చెక్కే స్థితికివచ్చాడు.

ఒకరోజున జైలుఅధికారి ఒకముసలివాణ్ణి తీసు

కువచ్చి, "తాతా! ఆ మోసగా డిక్కడే ఉన్నాడు. గుర్తుపట్టగలవేమో చూడు," అన్నాడు.

హెండన్ తలెత్తి చూసివృద్ధుణ్ణి గుర్తుపట్టాడు. "బ్లేక్ ఆండ్రూస్ ఇంకా బతికే ఉన్నాడే. మాఇంట్లో ఇతడు నేను పుట్టక ముందునుంచీ పనిచేశాడు. చాలా విశ్వాసపాత్రుడే ఆరోజుల్లో. ఇప్పుడెవర్నీ నమ్మ శక్యం కాకుండాఉంది. ఈ తాతకూడా నన్ను గుర్తి స్తాడు. అందరిలాగానే ఎరగనని తిట్టి చక్కా పోతాడు," అని హెండన్ అనుకున్నాడు.

తాత అందరికేసీ పరకాయించి చూశాడు.

"ఇక్కడ దొంగచచ్చినాళ్లుతప్ప ఇం కెవరూ లేరే. మీరు చెప్పిన ఆపుంథాకోరు వెధవ ఏడీ?" అని అడిగాడు.

అధికారి భొళ్లునవ్వి డోక్కున్నంతపనిచేశాడు.

"అదుగో కనిపించటంలా; ఆజంతువు; దున్న పోతులా మదమెక్కి పొగరు మొత్తనంగా చూస్తు న్నాడే, వాడు."

తాత దగ్గిరికొచ్చి హెండన్‌ను కళ్లుచిట్లించు కుని పరీక్షగాచూశాడు.

"ఈరాడీ యేనా? మైల్స్ హెండన్‌ను నేను నా చేతుల్తో ఎత్తుకు పెంచాను. అయున్ని నేను గుర్తు పట్టలేనా? వీడెవడో మోసగాడేనండయ్యా!"

"రైట్. బాగా అన్నావు. నీ చూపు ఇంకావాడి

తగ్గలా. వీడునిజంగా దొంగే. నేనేగనక సర్ హ్యూ నైతే వీణ్ణి ఈపాటికి డొక్క చించి డోలుకట్టించేవాణ్ణి"

"మంచిమాటన్నారు బాబూ! నే నైతే ముక్క ముక్కలుకిందకోసి ఉప్పులో అద్దుకుని తినేసేవాణ్ణి," అన్నాడు తాత. అధికారిమళ్లీ భొళ్లు మన్నాడు; కాని ఆ నవ్వు దగ్గులోకి దిగడంచేత పొట్టచేత్తో పట్టుకుని అవతలకు వెళ్లిపోయాడు.

అధికారి వెళ్లగానే తాత మోకరించి మెల్లిగా అన్నాడు:

"మైల్స్‌బాబూ! మీరు వచ్చారని వినగానే నాకు ప్రాణం లేచి వచ్చింది. మిమ్మల్ని చూస్తే మళ్లీ పెద్దబాబును చూసినట్టే వుంది. మీరు యుద్ధాల్లో చచ్చిపోయారనే ఈ ఏడేళ్లనుంచీ నమ్మాను. బాబూ! నేను ముసలివాణ్ణయి పోయాను. మీ ఇంట్లో పని చాలించుకున్నాను. కాని మీ ఉప్పు తిన్న విశ్వాసం నాలో చావలేదు. మీరు 'ఊ' అనండి. ఈపళంగా వెళ్లి నిజం చాటేస్తాను; హ్యూబాబు నన్ను ఉప్పు పాతర వేయించినా సరే."

"వద్దు తాతా' దానివల్ల ఏం లాభంలేదు. పైగా నువ్వు నాశనమై పోతావు. నువ్వైనా నన్ను గుర్తు పట్టి రెండు మంచిమాటలాడావు. అదే చాలు నాకు. మానవజాతి లోనే నాకు నమ్మకం పోతుందేమో అని పించింది. నువ్వు మళ్లీ ఆ నమ్మకాన్ని ఉద్ధరించావు," అని కృతజ్ఞతతో అన్నాడు మైల్స్.

తాత ఆ పిమ్మట రోజూ కనీసం రెండు సార్లై
యినా వచ్చి మైల్స్‌నుచూసి పోతూవుండేవాడు. మోస
గాణ్ణి తిట్టడానికనే వంకతో వచ్చేవాడు. వచ్చినప్పు
డల్లా చాటుగా కాస్త డబ్బు, మంచి మంచి తిను
బండారాలో తెచ్చి ఇచ్చేవాడు. ఆ తినుబండారా
లను మైల్స్ బాలరాజు కిచ్చేవాడు. జైల్లో ఖైదీలకు
పెట్టే పురుగులకూడు తినవలసివస్తే బాలరాజు
ఎప్పుడో హతమారి పోయేవాడు. ఇప్పటికే తిండి
సరిగా అమరక చిక్కి సగమైపోయాడు.

తాత ఇంకోవిధంగా కూడా సహాయపడ్డాడు.
ఈ పదేళ్లలోనూ జరిగిన చరిత్ర యావత్తూ కాస్త
కాస్తచొప్పున నివేదించాడు. మిగతా వాళ్లకు విన
బడేట్టు గొంతెత్తి తిడుతూనే మధ్యమధ్య సమాచార
మంతా తెలియ జేశాడు.

ఆ చరిత్ర ఇది: మైల్స్ అన్న ఆర్థర్ చనిపోయి
ఆరేళ్లయింది. ఆర్థర్ పోవడం, మైల్స్ తిరిగి రాకపోవ
డంచూసి సర్ రిచర్డు మనోవ్యాధితో మంచ
మెక్కారు. ఎడిత్‌ను హ్యూకిచ్చి పెళ్లిచేసి మరీ చచ్చి
పోవాలని ఆయనకోరిక. మైల్స్ చచ్చిపోయినట్టు
దొంగఉత్తరం రాగానే ఆయనవ్యాధి ముదిరింది.
త్వరగా పెళ్లి చేసుకోవాలని ఒత్తిడిచేశారు. కాని
ఎడిత్ మైల్స్ ఇంకావస్తాడు, ఇంకా వస్తాడు, అని నిరీ
క్షిస్తూ ఇంత కాలమూ వాయిదా వేసింది. మైల్స్
చనిపోయినట్లు తెలియగానే మామ బలవంతానికి

లొంగిపోయి పెళ్లికి వప్పుకుంది. పెళ్లి సర్ రిచర్డు మరణశయ్య వద్దనే జరిగింది. ఆ తరవాత హ్యూదగ్గర కొన్ని కాగితాలు చూసి, మైల్స్ మరణించినట్లు వచ్చిన ఉత్తరం దొంగ ఉత్తరమని ఎడిత్ కనుక్కుంది. ఆసంగతి ఆమె బయటపెడుతుందేమోనని హ్యూ ఆమెను ఎంతో హింసించి లొంగ తీసుకున్నాడు. తండ్రి పోయినతర్వాతహ్యూ మరీ రాక్షసుడై పోయాడు. భార్యను, నౌకర్లను, ప్రజలను అందరినీ హింసించ సాగాడు.

తాత చెప్పిన విశేషాల్లో కొన్నిటిని, బాల రాజుకూడా శ్రద్ధగా ఆలకించాడు.

"కొత్తరాజుకు పిచ్చెక్కిందనిపుకారుగా ఉంది. కాని నేనుచెప్పానని ఎవరితోనూ చెప్పకండి ఆవిషయంగూర్చి నోరెత్తితే ఉరిశిక్ష పడుతుంది."

"రాజుకు పిచ్చిఎక్కలేదు,ఏమీ లేదు. కనుక నీకు అనవసరమైన విషయాల్లో జోక్యంచేసుకోక ఇంకేదైనా మాట్లాడు," అని బాలరాజు కుపితుడై అన్నాడు.

"ఏమి టీ అబ్బాయి అంటాడు?" అని తాత బాలరాజువంక విస్తుపోయి చూస్తూ అడిగాడు. హెండన్ కనుసన్న చేశాడు ; దాంతో తాత మళ్ళీ ప్రశ్నించకుండా సంభాషణ సాగించాడు.

"చనిపోయిన రాజుగార్ని ఒకటిరెండు రోజుల్లో విండ్సర్ లో ఖననం చేస్తారుట. కొత్తరాజుకు

వచ్చే ఇరవయ్యో తారీకున పట్టాభిషేకం చేస్తారుట."

"ముందు కొత్త రాజును వెదికిపట్టుకోవాలిగా. అది వాళ్లు జాగ్రత్తపడాల్సిన విషయం; నేనూ నా జాగ్రత్తలో ఉంటాను," అని గొణిగాడు బాలరాజు.

తాత ఏదో అన బోయాడు; కాని హెండన్ కనుసన్న చూసిమళ్ళీ కబుర్లలో పడ్డాడు:

"సర్ హ్యూ పట్టాభిషేకానికి వెడతారుట. రక్షక ప్రభువు దగ్గరఆయనకు చాలా పలుకుబడి వుందిట. అంచేత 'సర్'గా వెళ్లి "ప్రభువు"గా తిరిగి రాగలననే ధీమాతో ఉన్నారు సర్ హ్యూ."

"రక్షకప్రభు ఎవరు?" బాలరాజు అడిగాడు.

"సోమర్సెట్ సామంతుడే."

"ఎవరాతడు?"

"ఎవరా?" ఒక్కరే ఉన్నారు ఆలాంటివారు; పాతరాణి జేన్ సేమూర్ సోదరుడు, హెర్ట్ ఫర్డు ప్రభువు -"

బాలరాజుకు కోపం హెచ్చుతోంది.

"ఆయన ఎప్పట్నించీ రక్షక ప్రభువయ్యాడు?"

"జనవరి ఆఖరు తేదీనుంచి."

"ఆ పదవి ఎవ రిచ్చారు ఆయనకి?"

"ఆయనంతట ఆయనే. మంత్రివర్గం ఒప్పుకుంది. రాజుగారు 'ఊఁ'అన్నారు."

"ఏ రాజుగారు?" అని గర్జించాడు బాల రాజు. "ఏ రాజుగారో చెప్పు."

"ఏ రాజు గారా? (ఈ అబ్బాయిపిచ్చివాడు కాదు గదా!) మనకున్న రాజుగారొకరే – ఆరవ ఎడ్వర్డు రాజుగారు. అబ్బో! ఆయన చాలా మంచివాడట. పిచ్చెక్కిన మాట నిజమైనా కాక పోయినా, ఆయన నందరూ పొగిడేవారే. అందరూ ఆయన నాశీర్వదించే వారే. ఏచర్చిలో చూసినా ఆయన కలకాలం ఆయు రారోగ్యవంతుడై రాజ్యం సుభిక్షంగా ఏలాలని ప్రార్థనలే. అసలాయన మంచితనం మొదటి రోజునే బయట పడింది. నార్ఫోక్ సామంతుని ప్రాణాలు రక్షించడంతో ప్రారంభించి, ఇప్పుడు క్రూరమైన శాసనాలను ఒక్కొక్కటిగా రద్దుచేస్తున్నారు."

ఈ వార్త బాలరాజును ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. దీర్ఘాలోచనలో మునిగి, తాతవాగుడు వినడం మానేశాడు. కొత్తరాజు, కొత్తరాజు అంటారు, అత డెవరు? తనిక్కడే ఉన్నాడు గదా! కొంపతీసి ఆరోజున రాచనగరులో తనదుస్తులుతొడిగి వదిలి వచ్చిన బిచ్చగాళ్లకుర్రాడు కాదు గదా! అబ్బే. అదెల్లా? ఆ టామ్‌గాడు వేల్సు యువరాజునని చెప్పుకుంటే ఎవరు నమ్ముతారు? వాడిమాట, వాడి వాలకం, ప్రవర్తన అన్నీ పేదగానే ఉంటాయి. వాణ్ణి ఎప్పుడో గెంటి వేసివుంటారు కోటలోంచి. లేక పోతే దర్బారులో ఏదో కుట్ర జరిగిప్రభువంశపు బాలుణ్ణి ఎవరినైనా సింహాసన మెక్కించారేమో? ఊహు. తనమేనమామ హెర్ట్‌ఫర్డు ఉండగా అలాంటిది

జరగదు. ఈ సమస్య ఎంతకీ తెగేట్టులేదు. చివరికి తలనొప్పి పుట్టి కునికిపాట్లు పడసాగాడు.

ఎప్పుడు లండన్ పోదామా అని బాలరాజుకు క్షణక్షణం ఆత్రుత ఎక్కువైపోతోంది. కారాగారం దుర్భరంగా ఉంది. హెండన్ అతన్ని ఉపశమింప జేయ డానికి ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. కాని వీరిద్దరి ప్రక్కన బంధింపబడిన ఇద్దరు ఆడఖైదీలు బాలరాజు హృదయానికి ఊరట కలిగించారు. వారి చల్లని మాటలతో అతని ఆవేదన శాంతించింది. అత నికి వారంటే కృతజ్ఞతాభావం, వారి పక్కన ఉండ టంలో ఒక తేలికదనం కలిగింది. 'మీరేం నేరం చేశా' రని అడిగాడు. వారు తాము 'బాప్టిస్టుల' మన్నారు. (క్రైస్తవులలో శిశువు పుట్టగానే పుణ్యస్నానం చేయి స్తారు. ఈస్నానం చేయనివాళ్లు నరకానికి పోతారని వారి నమ్మకం. శిశువు పుట్టగానే ఈ స్నానం చేయించడంలో అర్థంలేదనీ, ఆ శిశువు పెద్దై తనంతట తను క్రైస్తవమతంలో విశ్వాసం ప్రకటించేదాకా పుణ్య స్నానం చేయించరాదనీ 'బాప్టిస్టు' లనబడే శాఖవారు అంటారు. ఇది ఆ రోజుల్లో చర్చి చాలా శాలకు విరుద్ధం; కనుక నేరం.)

"ఇదేనా మీ నేరం? బహుశా మిమ్మల్ని త్వరలో విడుదల చేస్తా రనుకుంటాను. మీరు లేక

పోతే నా కేమీ తోచదు," అన్నాడు బాలరాజు అమాయకంగా.

స్త్రీఖైదీలు మాట్లాడలేదు. వారిముఖాలు చూస్తే బాలరాజుకుగాబరా ఎక్కువైంది.

"మీరు మాట్లాడరేం ? నాకు మనస్సిచ్చి చెప్పండి. మీకు వేరే శిక్ష ఏదన్నా వేస్తారా ? వెయ్యరు కదూ?"

స్త్రీలు విషయం తప్పించాలని చూశారు. కాని బాలరాజు ఊరుకోలేదు.

"మిమ్మల్ని కొరడాతో కొడతారా? ఊహు. అంత క్రూరంగా కొడతారనుకోను. కొట్టరుగదూ ? చెప్పండి."

పాపమా స్త్రీలు దుఃఖం ఆపుకోలేకపోయారు. ఒకామె గద్గద కంఠంతో అన్నది :

"నాయనా! నీలాగ మమ్మల్ని ఇంతవరకూ ఎవరూ ఆదరించలేదు. అందుచేతనే మా కష్టాలు చెప్పి నిన్నింకా బాధపెట్టకూడ దనుకున్నాము. ఆ దేవుడే రక్షించాలిఇంక -"

"అంతేనన్నమాట. మిమ్మల్ని పాపం కొరడా దెబ్బలు కొడతారన్నమాట, ఆ పాషాణ హృదయులు. వద్దు. వద్దు. ఏడవకండి. నా గుండె బద్దలవుతోంది. ధైర్యంగా ఉండండి. నాకు మంచిరోజులు రాగానే మిమ్మల్ని తప్పకుండా పోషిస్తాను; మీ కష్టాలు తీరుస్తాను."

బాలరాజు తెల్లారి లేచాక చూస్తే ఆ స్త్రీలు లేరు. చాలా సంతోషపడ్డాడు.

"పాపం వాళ్లను విడిచిపెట్టారు. ఏశిక్షా లేకుండా వదిలేశారు." కాని వాళ్లిక్కడ ఉన్నంత కాలమూ నా కష్టాలు మరిచిపోయాను. ఎంత మంచి వాళ్లో -"

స్త్రీ ఖైదీలు వెళ్లిపోతూ జ్ఞాపకార్థం చెరొక రిబ్బన్‌ముక్క వదిలి పెట్టిపోయారు. బాలరాజు ఆ ముక్కలు ఎల్లప్పుడూ దాచుకుంటాననీ, త్వరలో వాళ్లని వెదికించి పోషణ భారం వహిస్తాననీ అన్నాడు.

ఇంతలో జైలు అధికారి పోలీసులతో వచ్చి ఖైదీలను జైలు ఆవరణలోకి నడవమన్నాడు. మళ్ళీ నీలాకాశాన్ని చూసేందుకు, మంచిగాలి పీల్చేందుకు అవకాశం కలిగిందిగదా అని బాలరాజు సంతోష పడ్డాడు.

ఆవరణలో ఖైదీలు ఒకరి ప్రక్క ఒకరుగానుంచు న్నారు, వారు ముందుకు తోసుకురాకుండా పొడుగాటి తాడు కట్టబడివున్నది. పోలీసులు విచ్చుకత్తులతో పహారాకాస్తున్నారు. ఇంకా చలిచలిగానే ఉంది. రాత్రి కురిసిన మంచు కరగలేదు. అందుచేత నేలమీద తెల్ల తెల్లగానే ఉంది.

ఆవరణమధ్య, రెండు గుంజలకు కట్టబడి ఉన్నారు ఇద్దరు స్త్రీలు. వారిని చూడగానే తన

స్నేహితులే నని పోల్చుకున్నాడు బాలరాజు. "అరెరె! ఇక్కడే ఉన్నారే వీళ్లు! పాపం ఇంత మంచివాళ్లకి కూడా కొరడాదెబ్బలు తప్పలేదు. హు. ఎక్కడో అ నాగరిక దేశాల్లోఇలాంటిది జరిగిం దంటే అర్థంవుంది. కాని ఇక్కడ ఈ క్రైస్తవ భూమిలో, ఇంగ్లండులో ఇంత అన్యాయమైన శిక్ష విధించ బడు తోందంటే ఎంత సిగ్గుచేటు! నా కెంత అవమానం! ఒక దేశానికి రాజునై ఉండికూడా నా స్నేహితుల్ని కాపాడలేకపోతున్నాను. కానియ్, కానియ్. ఈ దుర్మార్గులను నేనుశిక్షించక మానను. నేను తిరిగి రాజునయ్యాక ఈరోజున వారుకొట్టే ప్రతిఒక్క దెబ్బకీ వందదెబ్బలు చొప్పున కొట్టిస్తాను."

ఒక పెద్ద గేటు తెరవబడింది. జనం మందలు గావచ్చి స్త్రీ ఖైదీల చుట్టూమూగి బాలరాజు కడ్డంగా నుంచున్నారు. వారి వెనుక ఒక ఫాదిరీవచ్చాడు. అతడు కూడా కనిపించకుండా మనుషులడ్డం వచ్చారు. తరవాత ఏవో మాటలు వినిపించాయి. అధికారులు, పోలీసులు అటూ ఇటూ తొందర తొందరగా తిరు గుతూ ఏమిటో సన్నాహాలు చేస్తున్నారు. క్రమంగా సందడితగ్గినిశ్శబ్దం నెలకొన్నది.

అధికారులు ఆజ్ఞ ఇవ్వగానేచుట్టూమూగినజనం రెండు వరసలుగాచీలి పక్కగా నుంచున్నారు. బాల రాజుకు ఎదురుగా హృదయ విదారకమైన భయానక దృశ్యం గోచరించింది, స్త్రీలిద్దరి చుట్టూ చితి పేర్చ

బడింది. ఒకడు దానికి నిప్పు అంటిస్తున్నాడు. స్త్రీలు తలలువంచి చేతులతో ముఖాలు కప్పుకున్నారు. అగ్ని జాజ్వల్యంగా మండుతోంది. టపటప లాడుతూ కట్టెలు తగలడు తున్నాయి. ఆప్రదేశమంతా ధూమావృత మైంది. పాదిరీ అరచేతులు పైకెత్తి ప్రార్థించ సాగాడు. ఇంతలో ఇద్దరు బాలికలు గేటులోంచి దూసుకుని వచ్చారు. వారిఆక్రందనం వినశక్యంకాకుండా వుంది. సరాసరి వెళ్ళి వాళ్ళు చితిమధ్యఉన్న స్త్రీలను కౌగలించుకున్నారు. పోలీసులు వాళ్లను ఇవతలకులాగేసి గట్టిగా పట్టుకున్నారు. కాని ఒక బాలిక విడిపించుకుని రివ్వునపోయి తన తల్లిని కౌగలించుకున్నది. తను కూడా తల్లితోపాటు తగలబడిపోతానన్నది. మళ్లీ ఆ పిల్ల నివతలకు లాగారు. లాగటంలో ఆమె గౌను కొంచెం అంటుకుంది. ఆభాగం గబుక్కున లాగేసి విసిరేశారు. ఇంతలో బాలికల రోదన ధ్వనిని మించిన కేకలు వినబడ్డాయి. అవి తగలబడుతున్న ఇద్దరు స్త్రీల హాహాకారాలు. వారి దుస్తులు గప్పున అంటుకున్నాయి. వర్ణించడానికిశక్యంగాని ఆదుర్మరణదృశ్యం చూడలేక బాలరాజు కళ్లు మూసుకుని చతికిలబడ్డాడు.

ఆరోజున జైల్లోకి కొత్తఖైదీలు వచ్చారు. వీరిని దేశంలోని వివిధ కేంద్రాలకు పంపించడానికి ముందు తాత్కాలికంగా ఇక్కడకు తీసుకువచ్చారు. బాలరాజు అందరి పరిచయమూ చేసుకున్నాడు.

ముందు ముందు తను రాజ్యపాలన చేయబోతున్నాడు గనక సామాన్య ప్రజల కష్టసుఖాలన్నీ తెలుసుకుని ఉండటం మంచిదని అతని ఆలోచన. ఒక్కొక్కరి కథా వింటుంటే అతడు నిలువునా కోపంతో, నిస్సహాయతతో దహించుకుపోయే వాడు. ఖైదీలలో ఒకామె గజమో, రెండు గజాలో గుడ్డ దొంగిలించింది. దానికై ఆమెకు ఉరిశిక్ష వేశారు. మరొకడు ఎవరిదో గుర్రాన్ని దొంగిలించాడని అన్యాయంగా నేరం మోపారు; అది ఋజువు కాలేదు; విడిచి పెట్టారు. కోర్టుదాటగానే, అతడు రాజుగారి అరణ్యంలో లేడిని చంపాడని నేరం మోపారు; ఇది ఋజువైంది; ఫలితం ఉరిశిక్ష! ఇంకొకడున్నాడు; అతడికొక రోజున ఎక్కడో కోడిపెట్ట దొరికింది. అది ఎవరిదో తెలియకపోయినా, దొంగతనం మోపి మరణశిక్ష వేశారు.

బాలరాజు ఈ అన్యాయాలన్నీ విని నిస్సహాయంగా చేతులు పిసుక్కోవడం, జైలు కటకటాలు విరిచెయ్యాలని వ్యర్థప్రయత్నాలు చెయ్యడంతప్ప ఇంకేమీ చెయ్యలేకపోయాడు. ఎలాగైనా పారిపోవాలనీ, వెస్టుమిన్‌స్టర్ చేరుకుని రాజదండం ధరించి ఈ అభాగ్యుల ప్రాణాలను రక్షించాలనీ అనుకున్నాడు. ఈమాటే హెండన్‌తో కూడా అన్నాడు. అతడు నిట్టూర్పులు విడిచి, "అయ్యో! నా మిత్రుడికి

పిచ్చి అంతకంతకు ముదురుతోంది గాని తగ్గడం లేదు," అనుకున్నాడు.

ఖైదీలలో ఒక వృద్ధుడున్నాడు. అతడు లాయరు. మూడేళ్ల కిందట ఉన్నతన్యాయాధికారి (లార్డుచాన్సెలర్) చేసే అన్యాయాలను బయట పెడుతూ ఒక పత్రం ప్రకటించాడు ఈ లాయరు. అందుచేత అతని చెవులు కొద్దిగా కోసేశారు; వృత్తి నుండి తొలగించారు; మూడు వేల పౌనులు జరిమానా వేశారు; యావజ్జీవశిక్ష వేశారు. జైలులో ఉంటూనే అతడు మళ్ళీ ఇంకో పత్రం రాశాడు. ఈసారి అతని చెవులు మొదలంట నరికేస్తారు; చెంపలు కాలుస్తారు; అయిదు వేల పౌనులు జరిమానా వసూలు చేస్తారు.

బాలరాజుకు తన కథంతా చెప్పి లాయరు తన జుట్టు తొలిగించి తొడిమల్లాగా వేళ్లాడుతున్న చెవులు చూపించాడు.

బాలరాజు ఆగ్రహావేశుడై అన్నాడు:

"నన్నెవరూ నమ్మరు; నువ్వుకూడా నమ్మవు. కాని నేను శపథం చేస్తున్నాను. నెల రోజుల్లోగా నిన్ను విడుదల చేస్తాను. అంతేకాదు; నిన్ను అవమానించిన శాసనాలను, ఇంగ్లండుకు మాయని మచ్చను తెచ్చిపెట్టిన ఈ క్రూరచట్టాలను సమూలంగా నాశనం చేస్తాను"

# 30

ఖైదులో పనీపాటా లేకుండా, సోమరిగా కూర్చోవడం మైల్స్ హెండన్‌కు దుర్భరంగా ఉంది. చివరి కతన్ని విచారణచేసే దినంవచ్చింది. మళ్ళీ ఖైదులో కూలదోయ్యకుండాఉంటే, ఏ ఇతర కఠిన శిక్షనైనా అనుభవించడానికి అతడు సిద్ధంగా ఉన్నాడు. కాని జడ్జి ఇచ్చిన తీర్పుతో అతనికి ఒళ్లు మండింది; అతనిని దేశద్రిమ్మరిగా నిర్ణయించారు; దేశద్రిమ్మరి అయినందుకు, హెండన్ హాలుఅధిపతిని అవమానించి నందుకు అతనికి రెండుగంటలసేపు గుదిబండ వేశారు. హెండన్ హాలుకు, జమీందారీకి అతడు వారసు డనే వాదనను జడ్జిగారు ఖండించలేదు సరిగదా, తన తీర్పులో ఎక్కడా ఉటంకించనైనా లేదు. ఇంతకంటే పరాభవమేం కావాలి, మైల్స్ హెండన్‌కు?

గుదిబండవద్దకు మైల్స్‌ను తీసుకుపోయారు. దోవలో అతడు పోలీసులను ఎంతైనా ఎదిరించాడు; కాని లాభం లేకపోయింది; అడపాతడపా గుద్దులు మాత్రం తిన్నాడు.

బాలరాజు "దేశద్రిమ్మరి"తో సావాసం చేసినందుకు, అతనికి కూడా బండకొయ్య వేసేవారే గాని, అతని పసితనం చూసి దయతలచి వదిలిపెట్టారు. గుదిబండచుట్టూ గుంపులు మూగి ఉండటంవలన

మైల్స్‌ను చూడటానికి బాలరాజుకు సందు చిక్క లేదు. చివరి కెలాగో మనుషుల కాళ్ల సందుల్నించి దోవ చేసుకుని దగ్గిరికి వెళ్లాడు. సమీపంనుండి చూసిం దాకా అతనికి గుదిబండ అంటే ఏమిటో అర్థంకాలేదు. పాపం, మైల్స్ హెండన్‌మీద సర్‌హ్యూ సేవకులు, ఇతర భక్తులు ఉమ్మలెయ్యడం, నోటికొచ్చినట్లు తిట్టడం సాగిస్తున్నారు. తన అంగరక్షకుడికి జరుగుతున్న అవమానం చూసి సహించలేకపోయాడు బాలరాజు. క్రమంగా అతనిలో క్రోధం గట్టు తెంచుకొని ప్రవహించసాగింది. ఇంతలో వెనకనుంచి కుళ్లిపోయిన కోడిగుడ్డొకటి రివ్వున వచ్చి మైల్స్ హెండన్ ముఖానికి కొట్టుకుంది. గుడ్డు పగిలి ముఖమంతా సొన కారుతున్నది. తుడుచుకుందామని మైల్స్ ఎంత గింజుకున్నా చేతులు ఊడిరాలేదు. అందరూ ఈ వినోదదృశ్యం చూసి చప్పట్లు కొట్టారు. బాలరాజు కోపంతో ఊగిపోతూ గర్జించాడు :

"అతడు నా సేవకుడు; విడిచిపెట్టండి. లేకపోతే మిమ్మల్ని నాశనం చేస్తాను పందుల్లారా! నేను ఇంగ్లండు——"

"ఉష్షో! ఊరుకోండి మీరు. ఈరోజులు మనవి కావన్న మాట గుర్తుంచుకోండి," అని మైల్స్ హెండన్ బాలరాజు మాట కత్తిరించాడు. అధికారికేసి తిరిగి, "ఆ అబ్బాయి పిచ్చివాడు. అతన్ని లక్ష్యపెట్టకండి," అన్నాడు.

"నువ్వు నాకేం సలహా లివ్వనక్కర్లేదులే. ఆ కుర్రగాడిదసంగతి నేను చూసుకోగలను. వాడికి మెదడు కాస్త మరమ్మతు చెయ్యాలి," అంటూ అధికారి ఒక పోలీసు నాజ్ఞాపించాడు: "ఆ పిచ్చాడికి రెండో మూడో కొరడా దెబ్బలు తగిలించు. దెబ్బకి దెయ్యం వదలాలి."

మైల్స్‌కు వెయ్యబడిన శిక్ష కళ్లారా చూసి ధన్యుడు కావాలనే పవిత్రాశయంతో సర్ హ్యూ అప్పుడే గుర్రంమీద వచ్చి ఒకఎత్తైన ప్రదేశంలో నుంచున్నాడు. బాలరాజుమీద అతనికి అకస్మాత్తుగా "ప్రేమ" పుట్టుకొచ్చి ఇలా సిఫార్సు చేశాడు :

"అహాహా. దయ్యం పూర్తిగా వదలాలంటే కనీసం అరడజను దెబ్బలైనా తగలాలి."

బాలరాజును రెక్కలు విరిచిపట్టుకున్నారు. ఇంగ్లండు సార్వభౌముడైన తనకు జరగబోయే అవమానానికి అతడుకొయ్యబారిపోయాడు; గింజుకోనైనా లేదు; అలాగే వెర్రిచూపులు చూస్తున్నాడు. ఇంగ్లీషు చరిత్రకే కళంకం ఆపాదించే సంఘటన జరగబోతున్నది. ఏమిటి చెయ్యడం ఈ నిమిషంలో? క్షణాలు దొర్లిపోతున్నవి. ఎంత ఆలోచించినా మార్గాంతరం కనిపించడం లేదు. దెబ్బలు తినడమా ? లేక క్షమించమని ప్రాథేయపడటమా? అదీ సమస్య! ఊహు. తాను రాచబిడ్డ. ఆత్మాభిమానం, పౌరుషం చంపుకొని ఏ

రాచబిడ్డ క్షమించమని ప్రార్థించగలడు ? తన తండ్రికి, తన వంశానికి అది కళంకం కాదూ ? తను దెబ్బలైనా తింటాడుగాని, క్షమాపణ కోరడు.

ఈ లోగా మైల్స్ హెండన్ ఈ సమస్యను మరొక విధంగా పరిష్కరిస్తున్నాడు. "అతన్ని వదిలెయ్యండి," అని అరిచాడు. "మీకు హృదయం లేదూ? జాలి లేదూ? ఆ పసివాణ్ణి, అర్భకుణ్ణి కొట్టడానికి మీకు చేతు లెలావస్తాయి ? వదిలెయ్యండి. నేను తింటాను అతని దెబ్బలు."

"బలే. చక్కని ఆలోచన. నా కింతవరకూ తట్టనే లేదు సుమా," అన్నాడు సర్ హ్యూ, విషపు నవ్వు నవ్వుతూ. "ఆ పిల్లణ్ణి వదిలెయ్యండి. వాడిబదులు ఈ వెధవని కొట్టండి. వీడికి అరడజను చాలవు. ఒక డజను అంటించండి. మామూలుగా కాదు సుమా. ఒక్కొక్క దెబ్బకి ఒక్కొక్క కొరడా విరిగిపోవాలి; టపాకాయల్లా పేలాలి దెబ్బలు."

బాలరాజును వదిలిపెట్టారు పోలీసులు. అతను గొంతెత్తి ఏదో అనబోయాడు, కాని సర్ హ్యూ అడ్డంవచ్చి, "ఏమిట్రా అనబోతున్నావు ? నువ్వు మాట్లాడే ప్రతిమాటకీ ఆరేసి దెబ్బల చొప్పున అతగాడికి ముట్టచెబుతాం. తెలిసిందా ?" అని బెదిరించాడు.

మైల్స్ ను గుదిబండనుండి తొలగించారు;

చొక్కా ఊడదీశారు. వివస్త్రమైన వీపుమీద చెర్నా కోలు ఛెళ్లుమని మోగింది. ఆ దృశ్యం చూడలేక బాల రాజు ముఖం తిప్పుకున్నాడు; కన్నీళ్లు కపోలాలమీద కాలువలు కట్టాయి.

"ఓ స్నేహితుడా! అవ్యాజబంధూ! సాహసుడా! నీ మేలు మరువలేను. నా కోసం ఈ రోజున నువ్వు చేసిన ఈ అసమాన త్యాగం నా ఆఖరి గడియ వరకూ జ్ఞాపక ముంచుకుంటాను. నీ రాజును నువ్వు గాయాలనుండి, బహుశా అకాలమృత్యువునుండి కూడా నేమో—రక్షించావు. అన్నిటికంటే ఎక్కువ నన్ను ఘోర పరాభవమునుండి రక్షించావు. కృతజ్ఞుణ్ణి మిత్రమా! కృతజ్ఞుణ్ణి" ఈ విధంగా తలపోస్తూ బాల రాజు కన్నీరు కారుస్తున్నాడు.

పన్నెండు దెబ్బలూ పూర్తయ్యేసరికి, పన్నెండు యుగాలయినట్లనిపించింది మైల్స్ హెండన్‌కు. ఉలక లేదు, పలకలేదు; అమ్మా అని నిట్టూర్చైనా విడవ లేదు; నిజమైన యోధునివలె, సైనికునివలె సహించాడు తీవ్ర కశాఘాతాలను. అతడంత ధైర్యంగా బాధను ఓర్చుకోగలగడం, ఒక బాలకుని కోసం అంత గొప్ప త్యాగం చేయడం చూసి ప్రేక్షకుల మనస్సులు విస్మయంతో, గౌరవభావంతో నిండిపోయాయి. మైల్స్‌ను తిరిగి గుదిబండలో బంధించినప్పుడు వారి ప్రవర్తనలో గొప్ప మార్పు కలిగింది. అదివరకుదాకా అతనిపై ఉమ్మేసి, హేళనచేసి, తిట్టి, అవమానించిన

వ్యక్తులందరూ ఒక్క సారిగా మౌనం వహించారు; మైల్స్‌ను ఒక మహాపురుషుడుగా, త్యాగిగా మనస్సు ల్లోనే గౌరవించారు.

బాలరాజు మైల్స్‌ను సమీపించి హీనస్వరంతో అన్నాడు:

"మిత్రుడా! నిన్ను గౌరవించడానికి చక్రవర్తులకు కూడా శక్తిలేదు. నువ్వు కాలుమోపిన శిఖరాలను ఏ మానవుడూ చేరలేదు. నువ్వు త్యాగివి; నిన్నెల్లా బహుమానించను? నేను కేవలం ఒక రాజును మాత్రమే. నాకు చేతనైన బహుమాన మొక్కటే ఉన్నది——" అంటూ పక్కన పడివున్న కొరడా కర్రతీసి నెత్తురు ధారలుగా కారుతున్న మైల్స్ బుజాల మీద ఆన్చి, "ఇంగ్లండురాజు ఎడ్వర్డు నిన్ను ప్రభువును చేస్తున్నాడు" అన్నాడు.

మైల్స్ హెండన్ హృదయంకరిగి కన్నీళ్లై ప్రవహించింది. కాని బాలరాజు అన్నమాటలకు, తాను ఉన్న పరిస్థితికి ఎంత వ్యత్యాసం ఉన్నది? హేయాతి హేయమైన శిక్షకు, పరాభవానికి పాల్పడ్డాడు; అటువంటి తాను ఇకనుండి ప్రభువా? ఎంత విడ్డూరమైన పరిస్థితిలో పడ్డాడు?

సర్ హ్యూ చూడవలసింది చూశాడు గనుక, గుర్రాన్ని మళ్లించి టకటక ఆర్భాటం చేస్తూ వెళ్లి పోయాడు. జనులు నిశ్శబ్దంగా తొలగి అతనికి దారి ఇచ్చారు; అతడు వెళ్లగానే మళ్లీ నిశ్శబ్దంగా

గుమిగూడారు. ఖైదీకి అనుకూలంగా కాని, ప్రతికూలంగా కాని ఎవ్వరూ నోరెత్త సాహసించలేదు. ఆలస్యంగా, అప్పుడే వచ్చిన ఒకడు అలవాటు ప్రకారం మోసగాణ్ణి తిట్టడం లంకించుకున్నాడు; ఖైదీమీద విసిరేందుకై ఒక చచ్చిన పిల్లిని కూడా వెంటతెచ్చుకున్నాడు. కాని అతడు నోరెత్తగానే పదిమంది మీద కురికి నోరునొక్కి, నాలుగు తన్ని, నిశ్శబ్దంగా బయటికి పంపించారు. మళ్లీ ఖైదీచుట్టూ, అదే నిశ్శబ్దంతో, అదే పూజ్యభావంతో గుమిగూడారు.

# 31

శిక్షాకాలం అయిపోయిన తర్వాత మైల్స్ హెండన్‌ను గుదిబండనుండి తొలగించారు; మళ్ళీ ఈ ప్రాంతంలో కనిపిస్తే తల తీసేస్తామని హెచ్చరించి పొమ్మన్నారు. అతని కత్తిని, గాడిదని, గుర్రాన్ని అతని కిచ్చేశారు.

హెండన్, బాలరాజు వాహనారూఢులై బయల్దేరారు. ఇద్దరూ ఆలోచనల్లోపడి మునిగి తేలుతున్నారు. హెండన్‌ను ఒక్కుమ్మడిగా అనేక ప్రశ్నలు ముట్టడించాయి. ఏంచెయ్యాలి ఇప్పుడు? ఎక్కడికి పోవాలి? మళ్ళీ హక్కులకోసం ప్రయత్నించడమా? లేక మాట్లాడకుండా ఊరుకోవడమా? బాగా అధికారం, పలుకుబడిగల వ్యక్తి నెవరినైనా పట్టుకోవాలి. ఎవరున్నారు అలాంటి వ్యక్తి? ఆలోచించగా, ఆలో

చించగా అతని కొక ఉపాయం తోచింది. దానివల్ల లాభముంటుందని అతనికి నమ్మకం కలగలేదు. కాని ఏదో ఒక ప్రయత్నం చెయ్యాలిగా? అతనికి వృద్ధ సేవకుడు ఆండ్రూస్ చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. కొత్తరాజు చాలా మంచివాడట. దీనుల యెడ, నిస్సహాయులయెడ ఆయన కరుణ అపారమట. అటువంటప్పుడు సరాసరి లండన్ వెళ్ళి, మహారాజును దర్శించి తనకు జరిగిన అన్యాయం మనవి చేసుకో వడం మంచిది కాదూ? మంచిదే; కాని తన వేషం, వాలకం చూసి కోటలోకి అడుగుపెట్టనిస్తారా? ఆ, అదో పెద్దసమస్య కాదులే; అందాకా వచ్చినప్పుడు ఏదో ఆలోచించవచ్చు; దాని విషయం తరవాత చూసుకోవచ్చు; అంతే; ముందు లండన్ చేరు కోవాలి. బహుశా తన తండ్రికి బాల్యమిత్రుడైన సర్ హంఫ్రీ మార్లో తనకు సహాయం చెయ్యవచ్చు. సర్ హంఫ్రీ రాజుగారి భోజనశాలకో, అశ్వశాలకో దేనికో ప్రధానాధికారి; ఆయనకు కోటలో పలుకుబడి కావలసినంతవుంది. ముందాయన్ని కలుసుకోవాలి.

ఈ ఆలోచనతో, తన కొక నిర్దిష్ట కార్యక్రమం దొరకడంతో మైల్స్ హెండన్‌కు ఇందాకటి నిరుత్సాహం, అవమానభారం చేత్తోతీసేసినట్టు మాయ మయ్యాయి. ఆలోచనాతరంగాల్లోంచి తెప్పరిల్లి చుట్టూ చూశాడు. స్వగ్రామంవిడిచి చాలదూరం వచ్చారు. బాలరాజు తల వంచుకుని ఏదో ఆలోచ

నల్లో ఉన్నట్టు పరధ్యానంగా ఉన్నాడు. హెండన్‌కు మళ్ళీ ఇల్లా అనిపించింది. ఈ బాలుడిది లండన్ నగరమే; అక్కడ పుట్టినప్పటినుంచీ, కష్టాలు తప్ప మరేమీ ఎరగడు; అక్కడ ఇతన్ని ఆదరించే వారెవ్వరూ లేరు; అటువంటి శత్రు ప్రదేశానికి రావడానికి ఇతడు ఉత్సహిస్తాడా? "నేను రా"నంటే ఏం చెయ్యాలి? అయినా అడిగిచూద్దామని హెండన్ బాలరాజును సమీపించి అన్నాడు:

"మన మెక్కడికి వెడుతున్నామో అడగడం మర్చిపోయాను. తమ సెలవు ఏమిటి ప్రభూ!"

"లండన్! లండన్!" అని మళ్లీ ఆలోచనల్లో పడ్డాడు బాలరాజు.

హెండన్ మరుమాట లేకుండా తిరిగి గమనం సాగించాడు. బాలరాజు సమాధానం విని చాలా ఆశ్చర్యపడ్డాడు; అతడు తనంతట తనే లండన్ వెడదామంటాడని అనుకోలేదు.

ప్రయాణం మొత్తానికి ఏ అడ్డంకి, అపాయం లేకుండా సజావుగానే సాగిపోయింది. కాని ఆఖరులో ఒకటి జరిగింది. అది ఫిబ్రవరి 19 వ తేదీ రాత్రి. దాదాపు పదిగంటల సమయం. మిత్రులు లండన్ వంతెనమీద అడుగుపెట్టారు. అక్కడి కోలాహలం చెప్పడానికి శక్యంకాకుండా వుంది. కొన్ని వందలమంది జనం తాగి తందనాలాడుతున్నారు. ప్రతివాడి చేతిలోనూ సారా పాత్ర ఉన్నది; చిందులు తొక్కుతూ,

పాటలుపాడుతూ, హుర్రా హుర్రా అని అరుస్తూ ఎంతైనా గందరగోళం చేస్తున్నారు.

వంతెన పార్శ్వాల్లో అక్కడక్కడ కొన్ని విగ్రహా లున్నాయి; ఎనిమిదో హెన్రీ ఎక్కడెక్కడినుంచో మంచి మంచి విగ్రహాలు సంపాదించి నగరంలో ముఖ్య స్థలాల్లో ప్రతిష్ఠించేవాడు; నగరాన్ని సర్వాంగసుంద రంగా ఉంచడానికి ఆయన చాలాశ్రమ తీసుకున్నాడు; లండన్ వంతెనమీాద కూడా చక్కని శిల్ప నైపుణ్యం గల విగ్రహాలు కొన్ని ప్రతిష్ఠించాడు. ఈ విగ్రహాల్లో ఒకదాని తలను ఒంటిమీాద స్పృహలేని ఒక తాగు బోతు చేతికర్రతో ఎగరగొట్టాడు. హెన్రీ చనిపోయి మూడువారాలే అయింది; అప్పుడే ఆయనను, ఆయన చేసిన పనులను ప్రజలు నిర్లక్ష్యం చేస్తున్నారు.

ఆ తల ఎగిరివచ్చి హెండన్ మోచేతికి కొట్టు కుంది. తరవాత బడబడదొర్లుతూపోయి ఆగింది. దాని మీాద ఒకడు చూడకుండా కాలువేసి జారి, మరొకణ్ణి ఢీ కొట్టాడు. వాడు పోయి ఇంకొకణ్ణి ఢీ ఢీక్కాలు కొట్టాడు. ఇదంతా చివరికి గలాటాగా పరిణమించింది. ఆ మర్నాడే పట్టాభిషేకం. ప్రతివాడు సారాతోను, రాజభక్తితోనూ మత్తెక్కి ఉన్నాడు. కనుక గలాటా నిమిషాలమీాద లండన్ వంతెన అంతటా వ్యాపించి, ఆ ప్రదేశం యుద్ధరంగంగా తయారైంది. ఈ రంగంలో హెండన్ ఒక మూలకు, బాలరాజు ఇంకొకమూలకు నెట్టివేయబడ్డారు. ఒకరి సంగతి మరొకరికి తెలియ

కుండా విడిపోయారు. ప్రస్తుతానికి వాళ్ల నా స్థితిలో వదిలేద్దాం.

## 32

అసలురాజు నిద్రాహారాలు లేకుండా, ఒకసారి దొంగలతో, ఇంకోసారి బిచ్చగాళ్ళతో, మరోసారి జైళ్లలో నేరస్థులతో, ఇంగ్లండు దేశంలో వివిధ ప్రాంతాల్లో పరిభ్రమిస్తూ ఉండగా, నకిలీరాజు టామ్ కాంటీ వెస్టుమినిస్టర్ కోటలో రాజభోగాలనుభవిస్తున్నాడు.

మనం కిందటిసారి అతన్ని చూసినప్పుడు రాజత్వం మీద టామ్‌కు అప్పుడే ఆసక్తి ప్రారంభమవుతోంది. రోజులు గడుస్తున్నకొద్దీ రాజత్వంలోని సుఖం, ఘనత తెలిసిరాసాగాయి. క్రమంగా అంతా సంతోషమయంగా కనబడసాగింది. అతనిభయాలు, సందేహాలు అన్నీ పటాపంచలై పోయాయి. "దెబ్బలబ్బాయి"తో పరిచయం అధికం చేసుకుని అతనిద్వారా ఎప్పుడెప్పుడు ఎలా మెలగాలో బాగా నేర్చుకుంటున్నాడు.

ఆడుకోవా లనిపించినప్పుడు, కబుర్లు చెప్పాలనిపించినప్పుడు, ఎలిజబెత్ యువరాణినో, జేన్ గ్రేనో పిలిపించుకునేవాడు. విసుగ్గా వున్నప్పుడు వాళ్ళని పొమ్మని ఆజ్ఞాపించేవాడు.

పరిచారక పరివేష్టితుడై రాత్రి శయ్యాగారానికి

వెళ్ళేవాడు; ఉదయం సేవక ప్రభువులచేత దుస్తులు తొడిగించుకునేవాడు. భోజనానికి కూడా ప్రభువులు, అధికారులు వెంటవస్తేనే గాని కదిలేవాడు కాదు. ఈ హోదా, ఈ దర్జామీద టామ్ కెంత ఇష్టం పుట్టిందంటే, తన అంగరక్షకదళాన్ని రెట్టింపు, అంటే నూరుదాకా పెంచాడు. నడవాల్లోంచి తను దర్బారుకు అక్కడికీ వెళ్ళేటప్పుడు "మహారాజు వస్తున్నారు." అనే హెచ్చరికలు వింటం అతనికి ప్రత్యేకంగా సంతోషం, గర్వం కలిగించేది.

దర్బారులో ఉన్నత సింహాసనంమీద కూర్చుని తీర్పులు చెప్పడం, విదేశ రాయబారుల వినతి పత్రాలు వినటం, అతనికెంతో సరదాగా ఉండేవి. రక్షక ప్రభువైన హెర్ట్‌ఫర్డు తనకు "అలా చెయ్యండి, ఇలా చెయ్యండి," అని సలహా లివ్వడం అతనికి చిరాగ్గానే ఉండేది. హెర్ట్‌ఫర్డు తయారుచేసిన ప్రతి శ్రీముఖాన్ని, అధికారపత్రాన్ని జాగ్రత్తగా చదివి మరీ సంతకం పెట్టేవాడు.

అద్భుతమైన తనదుస్తులు చూసుకుని చాటు చాటున తెగ మురిసిపోయేవాడు. ఈ మూడు వారాల్లోను ఇంకా అనేకం కొత్తవి కుట్టించాడు. తనకుగల నాలుగు వందలమంది స్వంత సేవకులు చాలరనిపించి, మూడు రెట్లు చేశాడు వాళ్ళని. అయితే అతని స్వభావం మాత్రమేం మారలేదు. పూర్వం వలెనే ఎక్కడ అన్యాయం జరిగినా, పరపీడన జరిగినా ప్రతి

ఘటించేవాడు. క్రూర శాసనాలను చాలవరకు రద్దు చేశాడు.

తన మాటకు ఎవరైనా ఎదురు చెబితే అదో రకంగా చూచేవాడు; ఆ చూపుకు ప్రభువైనా, మంత్రియైనా, సామంతుడైనా గజగజ లాడవలసిందే. ఒకసారి యువరాణి మేరీ టామ్‌వద్దకు వచ్చింది. వచ్చి, అనేకమందిని జైళ్లలోపడవలసినవాళ్లని, ఉరితియ్య బడవలసిన వాళ్లని, కాల్చబడవలసిన వాళ్లని మహా రాజు అనవసరంగా వదిలిపెట్టేస్తున్నారని విమర్శించింది. తండ్రిగారి హయాంలో ఒక్కొక్కసారి అరవై వేలమంది దాకా ఖైదీ లుండేవారనీ, ఆయన తన పరిపాలనా కాలంలో డబ్బయిరెండువేల మంది నేరస్థులికి మరణదండన విధించారనీ ఉదహరించింది. ఆవిడ గారి వాగుడు విని టామ్‌కు పట్టరాని కోపంవచ్చి, అవతలకు నడవమని ఆజ్ఞాపించాడు.

కాని మొదటిరోజుల్లో టామ్ కాంటీకి అసలు రాజైన ఎడ్వర్డు అస్తమానమూ జ్ఞాపకంవచ్చి బాధ పడేవాడు. తననంత దయతో ఆదరించిన బాలరాజుకు అన్యాయం చేస్తున్నానని, అతడు తిరిగి వస్తే అతని రాజ్యం అతని కిచ్చేసి తనదోవన తాను పోదామని అనిపించేది. కాని ఎన్నాళ్లకూ ఎడ్వర్డు తిరిగి రాక పోయేసరికి, క్రమంగా అతన్ని మరిచిపోయాడు. ఒక వేళ ఎప్పుడన్నా జ్ఞాపకం వచ్చినా, సాధ్యమైనంత వరకూ అతన్ని స్మృతిపథినుండి గెంటివేయడానికే

టామ్ ప్రయత్నించేవాడు; ఎందుకంటే అసలు రాజు ఎక్కడో దిక్కు లేక కష్టాలుపడుతుంటే, తను దర్జాగా రాజభవనంలో సుఖాలు అనుభవిస్తున్నాననే ఒక భావం బాధ కలిగించేది.

తన తల్లినీ, అక్కలనూ కూడా ఇలాగే మరిచి పోవడానికి టామ్ ప్రయత్నించాడు. మొదట్లో వాళ్ల కోసం ఎంతో బెంగపడ్డాడు; చూడాలని దిగులు పెట్టుకున్నాడు. కాని తరవాత తరవాత వాళ్లను తలుచుకోడానికే భయం వేసింది. ఎప్పుడైనా వాళ్లు చిరుగు గుడ్డలతో, మసిమొహాలతో వచ్చి తన్ను కావిలించుకుని ముద్దుపెట్టుకుని "వీడు మా అబ్బాయే" అని బైట పెట్టేస్తే ?—అమ్మో! ఇంకేమన్నా ఉందీ? అందుచేత వాళ్ల నెప్పుడు తన ఆలోచనల్లోకి జొరబడనిచ్చేవాడు కాడు. క్రమంగా తన విలాసాలలో, వినోదాలలో పడి వారిని మరిచిపోయాడు. ఎప్పుడైనా వాళ్లు జ్ఞాపకంవస్తే తను బురదలో పొర్లాడే కీటకమంత అధమాధముడైనట్టు బాధపడేవాడు.

ఫిబ్రవరి 19 వ తేదీ రాత్రి టామ్‌కాంటీ మఖమల్ పరుపులమీద వెచ్చని దుప్పట్లలో సుఖనిద్ర పోతున్నాడు. వందలకొలది భటులు అతని శయ్యాగారాన్ని, భవనాన్ని, కోటనూ పరిరక్షిస్తున్నారు. ఆ మర్నాడే అతని పట్టాభిషేకం.

అదే సమయంలో అసలు రాజు ఎడ్వర్డు ట్యూడర్ ఆకలితో, దాహంతో, మార్గాయాస

ప్రయాసంతో, వళ్లంతా దుమ్ము, బట్టలన్నీ పీలికలై వెస్టుమినిస్టర్ కోట చేరుకున్నాడు. అక్కడ మర్నాటి పట్టాభిషేక మహోత్సవానికి ఆఖరి ప్రయత్నాలు జరుగుతున్నాయి; వందలకొలది కార్మికులు సంరంభంతో పరికరాలు ధరించి అలంకారాలు, ఇతర ఏర్పాట్లు చేస్తున్నారు. వాళ్లలో కలిసిపోయాడు బాలరాజు.

## 33

టామ్‌కాంటీ మర్నాడు ఉదయం లేచేసరికి, వాతావరణమంతా ఒకేరొదతో నిండిఉంది; ఎక్కడో దూరంగా, విరతిలేకుండా మేఘాలు ఉరుముతున్నట్లు ధ్వని వినవస్తోంది. అది లండన్ నగరవాసుల ఉత్సాహోత్సాహ కోలాహలం తప్ప మరేం కాదు. ఆ రొద మన టామ్‌కాంటీకి మధుర వీణాసంగీతంలాగ వినబడుతోంది.

టామ్ మళ్ళీ థేమ్సు నదిలో నౌకాప్రయాణం చేశాడు. ఎందుకంటే పట్టాభిషేకం తాలూకు ఊరేగింపు లండన్‌గోపురంనుండి బయలుదేరడం ఆనవాయితీగా వస్తోంది.

టామ్ గోపురం చేరుకోగానే వెయ్యి పిడుగులు ఒక్కసారి ఒక్కచోట పడినట్లు శబ్దమైంది; గోపురం బురుజులమీదగల ఫిరంగులన్నీ మోగాయి. వెంటనే దట్టమైన పొగ అంతటా ఆవరించుకుంది. తరవాత వర

వగా నాలుగైదుసార్లు ఫిరంగులు మోగాయి. గోపురపు కట్టడం ధూమసముద్రంలో మునిగిపోయింది. కాని గోపురాగ్రాన ఎగిరే జెండాలుమాత్రం కనిపిస్తూనే ఉన్నాయి.

టామ్‌కాంటీ యుద్ధాశ్వంమీద ఆరూఢు డయ్యాడు. అతని వెనక రక్షకప్రభువైన హెర్ట్‌ఫర్డ్ మరొక అశ్వంమీద ఆరూఢుడయ్యాడు. తరవాత అంగరక్షకులు విచ్చుకత్తులతో నిలిచారు. ఆ వెనక దేశంలోని సామంతులు, ప్రభువులు, జమీందార్లు, ఇంకా వెనక లండన్ మేయరు, మునిసిపాలిటీసభ్యులు నుంచున్నారు.

ఊరేగింపు సాగింది. దారిపొడుగునా ప్రజలు బారులుతీర్చారు. అడుగడుగునా "మహారాజుకూ జై" అనే నినాదాలు హోరెత్తిపోయాయి. టామ్ మంద హాసం చేస్తూ కృతజ్ఞతా సూచకంగా తలవంచేవాడు. దాంతో ప్రజల ఉత్సాహం ఇంకా అధికమయ్యేది. ఫెన్‌చర్చివీధిలో ఎత్తైన వేదికమీద నిలబెట్టబడిన ఒక బాలుడు మహారాజుకు స్వాగతమిస్తూ గీతం ఆలా పించాడు.

"స్వాగతము స్వాగతము రాజాధిరాజ!
స్వాగతము స్వాగతము రవికోటి తేజ!
స్వాగత మ్మిదిగో దీనావనాసక్త!
స్వాగతము జనతానురాగాభిషిక్త!

ప్రజలంతా ఈ గీత చరణాలు అందుకుని ప్రతి
ధ్వనించారు.

ఇంతలో టామ్ కాంటీకి ఒకచోట తన ఆఫల్
కోర్టు స్నేహితులిద్దరు కనిపించారు. అతని హృదయం
సంతోషంతో ఎగిరి గంతువేసింది. వాళ్లలో ఒకడు
టామ్ ఇదివరకు ఆడిన దర్బారు ఆటల్లో ఉత్తుత్తి సేనా
పతి; ఇంకొకడు ఉత్తుత్తి ప్రధానమంత్రి. వాళ్లు తనను
గుర్తిస్తే ఎంత బావుంటుంది? తమ మిత్రుడు ఇదివరకు
ఆడిన ఆటలన్నీ నిజమైనందుకు ఎంత ఆశ్చర్యపోతారు?
ఆఫల్ కోర్టురొచ్చులో పుట్టి పెరిగిన టామ్ కాంటీకి
ఇంగ్లీషు ప్రపంచం యావత్తూ పాదాక్రాంతమైనందుకు
ఎంత విభ్రాంతులౌతారు? మళ్ళీ వెంటనే అనిపించింది.
వాళ్లు నిజంగా గుర్తిస్తే తన కపాయం కాదూ? అందు
చేత ముఖం ఇంకో వైపుకు తిప్పుకొన్నాడు.

అడుగడుక్కీ "విరాళం! విరాళం!" అని కేకలు
వినిపిస్తున్నాయి. వినిపించినప్పుడల్లా టామ్ తన ప్రక్కన
సేవకుని చేతిలో ఉన్న సంచిలోనుండి కొత్త నాణాలు
గుప్పిళ్ళతో తీసుకుని విరజిమ్ముతున్నాడు. ప్రజలు మహో
వేశంతో జయజయధ్వానాలు చేస్తున్నారు.

ఊరేగింపు చాలదూరం సాగింది. ఒకచోట
టామ్ కాంటీ సంచిలో చెయ్యిపెట్టి గుప్పిలితో నాణాలు
తీయబోతున్నాడు. హఠాత్తుగా కొంతదూరంలో ఒక
పరిచితముఖం కనిపించింది. ఆ ముఖం పాలిపోయివుంది;
కళ్లు టామ్ కాంటీ వంకనే రెప్పవాల్చకుండా క్షణంగా తీ

చూస్తున్నాయి. టామ్ ఆ వ్యక్తి తనతల్లి అని వెంటనే గుర్తుపట్టాడు. ఒక గొప్ప విద్యుత్తరంగం అతని నఖశిఖపర్యంతం ప్రవహించింది. ఝల్లున వణికిపోయాడు. భయంతో ముఖం పాలిపోయింది. అరచెయ్యి వెలుపలికి తిప్పి కళ్ల కడ్డం పెట్టుకున్నాడు.

ఇది చూసింది అతని తల్లి. వెంటనే రివ్వున జనాన్ని తోసేసుకుంటూ టామ్‌ను సమీపించింది. అతని కాలిని కావిలించుకుని ముద్దులు కురిపించింది. "నాయనా! చిట్టితండ్రీ!" అంటూ సంతోషం, ప్రేమ పెనగొన్న కళ్ళతో అతనివంక చూసింది. అదే క్షణంలో అంగరక్షకుల్లో ఒకడు ఆమెను సమీపించి బలవంతాన ఇవతలకు లాగి విసిరి గిరాటేశాడు. ఆమె దొర్లుకుంటూపోయి జనులమీద పడింది. "నువ్వెవరో నేనెరగను," అనబోతున్నాడు టామ్; ఇంతలో ఆమె వేరుచేయబడింది. ఆమె నావిధంగా గిరవాటెయ్యడం అతనికి శూలాలతో పొడిచినంత బాధకలిగించింది.

ఆమె ఆఖరుసారి వెనక్కి తిరిగి చూసింది తన కొడుకువంక. ఈ పరాభవంతో ఆమె హృదయం ఎంత తీవ్రంగా గాయపడిందో టామ్‌కు తెలిసింది. సిగ్గుతో నిలువెల్లా దహించుకుపోయాడు. ప్రపంచంలో తనంత నీచాతినీచుడు మరొకడు లేడని కుమిలిపోయాడు.

ఊరేగింపు ముందుకు సాగింది. ఎక్కడకు పోయినా, ఎంతదూరం పోయినా ప్రజల ఉత్సాహ

శబ్దాలు తగ్గలేదు. కాని టామ్ కాంటీకి వాటిమీద ఆసక్తి పూర్తిగా నశించింది. కళ్లు తెరుచుకునే ఉన్నాడు కాని ఏమీ చూడడం లేదు. తన పదవి, దుస్తులు, తనకు జరిగే గౌరవం అన్నీ వెక్కిరింపుగా, అసత్యమైనవిగా తోచాయి. మొదటిరోజుల్లోమాదిరిగా "భగవాన్! ఈ బంగారుచెర ఎప్పటికి వదులుతుంది నాకు?" అనుకున్నాడు.

"విరాళం! విరాళం!" అని మళ్ళీ కేకలు వినవచ్చాయి. కాని టామ్ తల వంచుకునే ఉన్నాడు. మాటలు చెవిని పడుతూనే ఉన్నాయిగాని అతడు వినిపించుకోడం లేదు. "ఎడ్వర్డు మహారాజుకూ జై" అని మళ్లీ జయజయ నినాదాలు. అయినా అతడు తల ఎత్తి ప్రజల గౌరవం స్వీకరించలేదు. అతని చెవుల్లో ఒకటే మాట ప్రతిధ్వనిస్తోంది; తన స్వంతతల్లిని, ప్రేమతో పెంచి పెద్దచేసిన తల్లిని "నువ్వెవరో ఎరగను" అని తిరస్కరించబోయాడు. ఈ మాటలే అతని చెవుల్లో పదేపదే రింగుమంటున్నాయి.

రాజుగారి ముఖంలో ప్రజలు విచారం కనిపెట్టారు. వారి ఉత్సాహం నెమ్మదిగా తగ్గ నారంభించింది. "ఎడ్వర్డు రాజుకూ జై," అని ఇదివరకంత గట్టిగా అరవడం లేదు. బిక్క మొహాలతో టామ్ కేసి చూడ నారంభించారు.

ఈ మాళ్ళను హెర్ట్ ఫర్డు ప్రభువు వెంటనే పసి గట్టి టామ్ పక్కకు వచ్చి నిలబడ్డాడు. చెవిదగ్గరగా వంగి రహస్యంగా చెప్పాడు:

"ప్రభూ! కలలు కనడాని కిది సమయం కాదు. ప్రపంచమంతా మీకేసి తల ఎత్తుకుని చూస్తోంది; మీ ముఖంలో విచారమేఘాలను ప్రజలు గమనిస్తున్నారు. వారి ఉత్సాహాన్ని నశించనివ్వకూడదు. వారికేసి చూసి మందహాసం చెయ్యండి," అంటూ హెర్ట్ ఫర్డు ప్రభువు సంచీలోంచి రెండు గుప్పిళ్ళతో నాణాలు తీసి విరజిమ్మాడు. తరవాత టామ్ అప్రయత్నంగా తల ఎత్తి మందహాసం చేశాడు. ఆ మందహాసంలో సంతోషం లేదు. అయినప్పటికీ ప్రజల ఆనందం పూర్వంవలెనే వెల్లివిరిసింది.

మళ్ళీ టామ్ తలవంచి దిగులుగా ఉన్నాడు. హెర్ట్ ఫర్డు దగ్గరకు వచ్చి "మహారాజా! తమరు ఏదో బాధ పడుతున్నట్టున్నారు. అదేదో చెప్పండి. ఈ క్షణంలో దాని కారణాన్ని నాశనంచేసేస్తాను. బహుశా ఆ బిచ్చగత్తె చేసిన పని మిమ్మల్నింకా బాధిస్తోందనుకుంటాను," అన్నాడు.

టామ్ నూతిలోంచి మాట్లాడినట్టు హీనస్వరంతో, "ఆమె నా తల్లి," అన్నాడు.

"హరి దేవుడా!" అని నిర్ఘాంత పోయాడు హెర్ట్ ఫర్డ్ ప్రభువు. "మళ్ళీ మహారాజును ఉన్మాదం ఆవహించింది. ఏమిటి చెయ్యడం ఈ సమయంలో?"

# 34

ఊరేగింపుకు కొన్ని గంటలు వెనక్కి పోయి, వెస్ట్ మిన్‌స్టర్ చర్చిలో కూర్చుందాం. అప్పటికి తెల్లవారుఝామున నాలుగుగంటలే అయినా మన మక్కడ ఒంటరిగా ఉంటామనే భయం లేదు. దివిటీ కాంతులతో చర్చి యావత్తూ పట్టపగలులాగ ప్రకాశిస్తోంది. గ్యాలరీలలో ప్రేక్షకులు క్రమంగా నిండి పోతున్నారు. ఈ అవకాశం వదులుకుంటే మళ్లీ తమ జీవితంలో మరో రాజుగారి పట్టాభిషేకం చూసే భాగ్యం కలుగుతుందో లేదో నని, పట్టాభిషేకానికి ఇంకా ఏడెనిమిదిగంటలు వ్యవధి ఉన్నా జనులు ఇప్పటి నుంచే రాసాగారు. అయితే వీరందరూ భాగ్యవంతులైన మామూలుప్రజలే కాని ప్రభువులవర్గంవారు కారు.

గంటలు తాపీగా, కదల్లేక కదల్లేక కదులుతున్నాయి. గ్యాలరీల్లో ఇసకవేస్తే రాలనట్లు ప్రేక్షకులు కిటకిట లాడుతున్నారు. వాతావరణమంతా కుత కుత మని ఉడికిపోతోంది; ఉక్కపోస్తోంది; విసుగు పుడుతోంది; ఇంత ముందుగా వచ్చినందుకు లోపల పశ్చాత్తాపపడుతూ ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూసుకుంటూ, నిమిషాలు లెక్కపెడుతూ కూర్చున్నారు.

హాలుకు ఉత్తరపువేపున స్థానాలన్నీ ఖాళీగా

ఉన్నాయి; అవి ఇంగ్లండులోని ప్రభువర్గంవారికి ప్రత్యే
కించబడినవి. వాటికి ఎదురుగా సమీపంలోనే విశాల
మైన వేదిక ఉన్నది. దానిమీద రత్నకంబళీలు పరిచి
ఉన్నాయి. వేదికమధ్యగా సింహాసనం ఉన్నది. సింహా
సనం ఎక్కడానికి నాలుగుమెట్లున్నాయి. సింహాసనం
మీద "స్కోన్" రాతిపలక ఉన్నది. మొదట్లో
స్కాట్లండురాజులు ఆ రాతిమీద కూర్చుని పట్టాభి
షేకం చేయించుకునేవారు. తరవాత అది ఇంగ్లీషు
రాజులకుకూడా ఉపయోగింపబడుతూవచ్చింది. (ఇప్ప
టికీ ఇంగ్లండు రాజులు ఈ "స్కోన్" రాతిని ఉప
యోగిస్తున్నారు.)

ఎలాగైతే నేం కష్టంమీద తెల్లవారింది. దీవి
టీలు ఆర్పివేయబడ్డాయి. సూర్యకాంతి సిగ్గుపడు
తున్నట్లు మెల్లిగావచ్చి ఆ విశాలమందిరంలోకి తొంగి
చూసింది. ఏడుగంటలు కొట్టారు. అప్పటికి ఆ నిశ్శబ్ద
మందిరంలో కాస్త సంచలనం ప్రారంభ మైంది. ఎందు
కంటే ఉత్తరపువేపున ప్రత్యేకించబడిన స్థానాల్లోకి
ఒక ప్రభ్వి ప్రవేశించి ఆసీనురాలైంది. ఆమెకు ఒక
అధికారి దారి చూపించాడు. మరొక అధికారి జీరాడే
ఆమె చేలాంచలాలను పట్టుకుని వచ్చాడు. ఆమె
కూర్చోగానే అతడు చేలాంచలాలు బహుజాగ్రత్తగా
మడిచి సర్దాడు; ఆమె తాలూకు కిరీటం కూడా అవ
సరం వచ్చినప్పుడు తేలిగ్గా అందుకోడానికి వీలుగా
దగ్గరలో ఉంచాడు. (రాజుగారి పట్టాభిషేకం జరిగే

టప్పుడు రాజుగారితోపాటు సామంత ప్రభువులుకూడా కిరీటాలు ధరిస్తారు. అయితే ఇవి రాజకిరీటంకంటె బాగా చిన్నవి.)

ఈపాటి కప్పుడే ప్రభ్వీమణులు ఒకరివెనుక ఒకరు వచ్చి ఉచితస్థానాలను అలంకరించడం జరుగుతోంది. మందకొడిగా, బెంగగా ఉన్న వాతావరణం క్షణంలో ఉత్సాహభరితమైంది. ప్రభ్వీమణుల చేలాంచలాల రొదలు, వారి వారికి ప్రత్యేకంగా నియమితులైన అధికారుల సంరంభం ఎక్కువైనాయి. కొంతసేపటికి రావలసినవారందరూ రాగా మళ్లీ నిశ్శబ్దం ఆవరించింది. గ్యాలరీల్లోంచి చూసే ప్రేక్షకులకు ఉత్తరపువేపుయావత్తూ రంగు రంగుల సముద్రంలా గుంది; రమారమి ఒక ఎకరంమేరస్థలంలో మానవ పుష్పాలు వికసించినట్లుంది. ఒకళ్లు ధరించినమాదిరి దుస్తులు మరొకళ్లు ధరించలేదు. భూలోకంలో ఎన్నిరకాల రంగులు ఉండడానికి వీలుందో అన్నీ అక్కడే అవతరించాయూ అనిపించింది. వారిలో అన్ని వయస్సుల వారూ ఉన్నారు. వృద్ధస్త్రీలలో మూడవరిచర్డురాజు (1483 సం॥)గారి పట్టాభిషేకం చూసినవారుకూడా కొందరున్నారు. అప్పుడే వన్నెతరగడం ప్రారంభించిన మధ్యవయస్కులు, అతిశయయౌవనంలో ఉన్న సౌందర్యవతులు, కొత్తగా వికసించిన గులాబిపూలలాంటి ముగ్ధలు ఉన్నారు. కొంచెం పరీక్షగా చూస్తే ప్రతివారూ రత్నహారాలు, ఇతర భూషణాలు

అలంకరించుకున్నట్టు కనిపిస్తోంది. ఆ దృశ్యం మనో హరమైన దనడంలో సందేహంలేదు. కాని మనం ఇంకా దిగ్భ్రాంతులం కావలసిన సమయం వచ్చింది. అప్పటికి తొమ్మిది గంటలవుతోంది. ఆకాశంలో ఇంత వరకూ సూర్యుణ్ణి ఆవరించిన మబ్బులు హఠాత్తుగా విడిపోయాయి. సూర్యకిరణాలు సూటిగా ఉత్తరపు వేపు ప్రసరిస్తున్నాయి. కిరణాలు ఒక్కొక్క పంక్తిలోకి ఒక్కొక్కసారిగా ప్రసరిస్తోంటే ఒక్కొక్క రత్నాల గని తళుక్కున ప్రత్యక్షమౌతోంది. ఆ అద్భుతదృశ్య సౌందర్యం చూస్తుంటే చూపరుల్లో అదే పనిగా విద్యు త్తరంగాలు ప్రవహిస్తున్నాయి.

ఎట్టకేలకు పదకొండున్నర అయింది. ఫిరంగులు మోగడంతో రాజుగారి ఊరేగింపు నగరమంతా తిరిగి వెస్టు మినిస్టర్ చర్చికి వచ్చినట్లు ప్రేక్షకులు గ్రహిం చారు. అయితే రాజుగారి కింకా అభ్యంగనస్నానాలు వగైరాతంతు జరగవలసివున్నందున ఆయన ఇంకా కాస్సేపటికిగాని లోనికి రారు; ప్రేక్షకులకు ఆశాభంగం కలిగినా వారి నేత్రాలకు మరోవ్యాపకం తగిలింది. రాజ్యంలోని ప్రభువులు, జమీందార్లు, సామంతులు, మంత్రులు యథోచిత వేషాల్లో ప్రవేశించారు. ఎవరి స్థానాల్లో వాళ్లు ఆసీనులయ్యారు. చేతి కందుబాటుగా తమ తురాయి కిరీటాలను దగ్గర పెట్టుకున్నారు. ఇక గ్యాలరీల్లో కూర్చున్న సామాన్యుల హడావుడి చెప్ప నక్కర్లేదు. ఎందుకంటే అయిదువందల ఏళ్లనుండి

ఎవరి పేర్లు చరిత్రలో సుప్రసిద్ధాలయినవో ఆ ప్రభు వంశీయులను వారు తమ జన్మలో మొదటిసారిగా చూస్తున్నారు. ఆమధ్యయుగపుదినాలలో అంతకంటె గొప్పఅదృష్ట మేముంటుంది?

కొంత సేపటికి చర్చిఅధికారులు, వారి పరివారంతోసహా విచ్చేసి వేదికపైన ఆసీనులయ్యారు. వారి తరువాత రక్షకప్రభువైన హెర్ట్‌ఫర్డు, ఇతర ఉన్నతాధికారులు వచ్చి వేదికమీాద కూర్చున్నారు; ఆ వెనుక కవచాలు, శిరస్త్రాణాలు ధరించిన అంగరక్షకులు వచ్చారు.

తరవాత కాస్సేపు గాఢ నిశ్శబ్దం. అంతా ఊపిరి బిగపట్టి నిరీక్షిస్తున్నారు. హఠాత్తుగా మంగళవాద్యాల ఉద్రేకపూరితమైన సంగీతం చెలరేగింది. టామ్ కాంటీ బంగరు జరీవస్త్రాలు ధరించి ద్వారం వద్దకు వచ్చి ఒక్కక్షణం ఆగాడు. తరవాత హుందాగా నడుస్తూ వేదిక ఎక్కాడు. మందిరంలోని యావన్మంది ప్రేక్షకులు లేచి తలలువంచి గౌరవం ప్రకటించారు.

తరవాత చాలసేపటివరకూ పట్టాభిషేకానికి సంబంధించిన తతంగం శాస్త్రోక్త ప్రకారంగా జరిగింది. అది జరుగుతున్నంతసేపూ టామ్ అదోమాదిరిగా ఉన్నాడు. ముఖం క్రమంగా పాలిపోయింది. తనది కాని సింహాసనాన్ని తాను అన్యాయంగా ఆక్రమిస్తున్నానని, అసలు రాజుకు ద్రోహం చేస్తున్నానని అతనికి మానసికవ్యథ ఎక్కువైంది.

అసలు ముహూర్తం సమీపించింది. కాంటర్బరీ మఠంతాలూకు ఆర్చిబిషప్ ఇంగ్లండు రాజుల పురాతన కిరీటంతీసి టామ్ తలకు ఎగువగా రెండు చేతులతో పట్టుకున్నాడు. ఆక్షణంలోనే యావన్మంది ప్రభువులు, ప్రభ్వీమణులు తమతమ తురాయి కిరీటాలు తలల కెగువగా పట్టుకున్నారు. ముహూర్తాని కింక కొన్ని క్షణాల వ్యవధి మాత్రమే ఉంది. మంగళ తూర్యారావాలు ఆగిపోవడంచేత మందిరంలో నిశ్శబ్దం పేరుకుంది.

ఆసమయంలో ఒక వింత వ్యక్తి రంగంమీదికి వచ్చాడు. అతడు గేటు దాటి, ఆవరణ దాటి, ద్వారపాలకులను దాటి ఎప్పుడు, ఎల్లా లోపలికి వచ్చాడో ఎవరూ చూడలేదు. అందరూ పట్టాభిషేకం గొడవలో నిమగ్నులై ఆ వ్యక్తిని గమనించనేలేదు. అత డొక బాలుడు; తలకు టోపీగాని, కాళ్లకు జోళ్లుగాని, వంటిమీద సరియైన బట్టలుగాని లేవు. అతడు వేదికను సమీపించి తీవిగా చెయ్యెత్తి ఇలాగన్నాడు:

"ఇంగ్లండుకిరీటాన్ని ఆ మోసగాని తలపై పెట్టవద్దు. ఇది రాజాజ్ఞ! నేను మహారాజును!"

సభ్యులు ఎలా ఉన్నారో అలాగే స్తంభించిపోయారు. వెంటనే తెలివితెచ్చుకోగలిగిన కొందరు బాలరాజుమీద మొరటుగా చేతులువేశారు, అవతలకు లాక్కుపోవడానికి. కాని టామ్ కాంటీ సింహాసనంమీంచి ఒక్క ఉదుటున లేచి ముందుకు

వచ్చాడు. హాలంతా మారుమ్రోగేట్లు సంతోషంతో అరిచాడు:

"ఆయన్ని వదిలిపెట్టండి; ఆయనే మహారాజు."

సభ్యులు కొయ్యబారిపోయారు. కొందరు తెప్పరిల్లి ఒకళ్ల మొహాలు ఒకళ్లు చూసుకున్నారు. తరవాత రంగమధ్యంలో ఉన్న బాలరాజు, టామ్ కాంటీలవంక పులుకు పులుకున చూశారు. ఎవరికీ పరిస్థితి బోధపడ లేదు. కొందరికి తాము జాగ్రదవస్థలో ఉన్నదీ, స్వప్నావస్థలో ఉన్నదీ అంతుపట్టలేదు. రక్షకప్రభువు కాస్సేపటికి ఆశ్చర్యావస్థనుండి తేరుకుని అధికార స్వరంతో ఆజ్ఞాపించాడు:

"మహారాజును లక్ష్యం చెయ్యకండి. ఆయనకు మళ్లీ ఉన్మాదం ఆనహించింది. ఆ వెధవని పట్టుకుని సంకెళ్లు వెయ్యండి."

రాజభటులు బాలరాజును మళ్లీ చుట్టుముట్టారు. కాని టామ్ హాలు దద్దరిల్లేట్లు అరిచాడు.

"ఆయనే మహారాజు. ఆయన వంటిమీద చెయ్యి వేసినవాడితల ఎగిరిపోతుంది!"

భటులు వెనక్కి తగ్గారు. సభ్యులు పక్షవాతం వచ్చినవాళ్లలే నిస్తబ్ధులై, నోట మాటరాకనుంచుండి పోయారు. ఈ అసాధారణ, పరిస్థితిలో ఏం చేయాలో ఎవరికీ తోచలేదు. బాలరాజుమాత్రం ధైర్యంగా, ముందు కడుగులు వేస్తున్నాడు. అతడు వేదిక నెక్కగానే టామ్ కాంటీ పరుగున వెళ్లి

స్వీకరించాడు. సంతోషం చిందులాడే ముఖమెత్తి బాలరాజును చూస్తూ,

"ఓ రాజా! ప్రభూ! క్షమించండి టామ్ కాంటీని. మీ రాజ్యం మీరే తీసుకోండి. మీ కిరీటం మీరే ధరించండి," అన్నాడు.

రక్షకప్రభువు బాలరాజును తీక్షణంగా చూశాడు. చీల్చి చెండాడాలన్నంత కోపంతో చూశాడు. కాని ఉన్నట్టుండి కోపమంతా మాయమైంది; ఆయన కళ్లలో ఇప్పుడు ఆశ్చర్యం కనిపిస్తోంది. ఆశ్చర్యం ఎక్కువౌతున్నకొద్దీ కళ్లు పెద్దవవుతున్నాయి. దగ్గర్లో ఉన్న మిగతా ఉన్నతాధికారులుకూడా ఇదే పరిస్థితిలో తలమునకలౌతున్నారు. వారు ఆశ్చర్యపడటానికి, వెర్రిమొహా లెయ్యడానికి పాఠకు లీపాటికే కారణం గ్రహించివుంటారు. ప్రతివారినీ ఒకటే ప్రశ్న పెద్ద పర్వతమంత ప్రశ్న ఎదుర్కొన్నది: "అరె! ఇందులో ఎవరు అసలురాజు? ఇద్దరూ ఒకే మాదిరిగా ఉన్నారే?"

రక్షకప్రభువు రెండు నిమిషాలు తీవ్రాలోచన చేశాడు. చివరికి ఆముదం తాగిన మొహం పెట్టి అన్నాడు:

"ఇదుగో బాలుడా! నేను కొన్ని ప్రశ్న లడుగ దలుచుకున్నాను. జవాబు లిస్తావా?"

"తప్పకుండా. మీ ఇష్టంవచ్చిన ప్రశ్న లడుగ వచ్చు."

హెర్ట్ఫర్డు బాలరాజును చాలా ప్రశ్నలడిగాడు. దర్బారునుగూర్చి కీర్తిశేషుడైన ఎనిమిదో హెన్రీనిగూర్చి, వేల్సుయువరాజు, ఎలిజబెత్, మేరీలను గూర్చి ప్రశ్నలు వర్షించాడు. బాలరాజును బోల్తా కొట్టించాలని చిక్కుప్రశ్నలనేకం వేశాడు. అన్నిటికీ బాలరాజు నిర్భయంగా, జంకూ గొంకూ లేకుండా సరియైన సమాధానా లిచ్చాడు. రాచనగరులో ఏ గది ఎక్కడున్నదీ, ఏ గదిలో ఎవ రుండేది అన్నీ నిర్దుష్టంగా చెప్పాడు.

'చాలా తమాషాగా వుంది! వింతగా ఉంది! నమ్మడానికి శక్యం కానంత విచిత్రంగా ఉంది!' అంతా ఈమాటే అన్నారు; విన్నవాళ్లంతా దీన్ని అంగీకరించారు. ఆఖరికి హెర్ట్ఫర్డుకూడా "నిజమే గమ్మత్తుగానే ఉంది; ఈ బాలుడికి, అందులో పేలికలు ధరించిన ఈ పేదవాడికి రాచనగరులోని విషయాలన్నీ ఎలా తెలిశాయి చెప్మా," అని గొణిగాడు. కాని వెంటనే బిగ్గరిగా అన్నాడు:

"నువ్విచ్చిన జవాబులు సరిగ్గానే ఉన్నాయి. కాని మా మహారాజుక్కూడా ఆ విషయాలు తెలుసు. అందుచేత ఇవి ఋజువులు కావు."

ఇంకా తన్ను మహారాజని అంటున్నందుకు టామ్ కాంటీ విచారించాడు. ఇక ఎన్నటికీ సత్యం బయట పడదేమోనని నిరాశ చెందాడు. సభికులు

కూడా హెర్ట్‌ఫర్డు మాటలతో ధైర్యం తెచ్చుకుని టామ్ కాంటీ యే తమ రాజనే అభిప్రాయంలో స్థిరపడ్డారు.

"ఈసమస్య ఇలా అపరిష్కృతంగా ఉండడం రాజ్యానికి క్షేమంకాదు. దేశంలో విభేదాలు, కలహాలు రేగవచ్చు. కనుక దీన్ని మొగ్గలోనే తుంచెయ్యాలి," అని ఆలోచించాడు హెర్ట్‌ఫర్డు ప్రభువు. పక్కకు తిరిగి,

"సర్ థామస్! ఈ ద్రోహిని అరెస్టు చెయ్యండి-ఊహు. ఆగండి," అని బుర్ర గోక్కున్నాడు. ఏదో మహత్తరమైన, అప్రతిహతమైన ఆలోచనతట్టినట్లు మొహంపెట్టాడు. ప్రత్యర్థికేసి తిరిగి ప్రశ్నించాడు. ఈ ప్రశ్న ఫిరంగిగుండులా పని చేస్తుందని, సమస్య కాస్తా సవ్యంగా విరగడై పోతుందని భావించాడు.

"రాజముద్ర ఎక్కడుంది? దీనికి జవాబు చెప్పు. ఎవరు నిజంగా వేల్సు యువరాజయితే వారే దీనికి సమాధాన మివ్వగలరు. ఈచిన్న ప్రశ్నమీద ఒక సింహాసనంయొక్క, రాజవంశం యొక్క భవిష్యత్తు ఆధారపడి ఉంది."

ఇది ముమ్మాటికీ అద్భుతమైన ఆలోచన. అలాగని సభికులు యావన్మందీ అంగీకరించారు. హెర్ట్‌ఫర్డు ప్రభువు తెలివితేటల్ని మెచ్చుకుంటూ "ఓహో" అంటే "ఓహో" అన్నారు. నిజమే; రాజముద్ర ఎక్కడుందో అసలు యువరాజుకు తప్ప మరెవ్వరికీ తెలీదు.

ఈ మోసగాడెవడోగాని ఎవరిదగ్గరో పాఠం బాగా నేర్చుకున్నాడు. రాచనగరులోని రహస్యాలన్నీ పట్టే పట్టాడు. కాని ఈ ప్రశ్నకు సమాధానం చెప్పమను; దీనికి వీడు కాదు గదా, వీడికి పాఠం నేర్పిపంపిన గురువుకూడా సమాధానం చెప్పలేడు. ఈ విధంగా పెద్దమనుషులంతా తలపోస్తున్నారు. అసలు ఈ ప్రశ్న వినగానే "మోసగాడు" తారెత్తి పారిపోవడానికి ప్రయత్నిస్తాడని, లేక కాళ్లు పట్టుకుని క్షమాపణ కోరుతాడని ఆశించారు. కాని అలాంటిదేమీ జరగలేదు. బాలరాజు నిబ్బరంగా నుంచుని, ధైర్యంగా సమాధానమివ్వడం చూసి నిర్ఘాంతపోయారు.

"ఈ ప్రశ్నలో మీరనుకున్న కష్టమేమీ లేదు," అన్నాడు బాలరాజు. తరవాత సెంట్ జాన్ ప్రభువుకేసి తిరిగి ఆజ్ఞాపించాడు:

"సెంట్ జాన్! కోటలో నా శయ్యాగారానికి వెళ్లు. ఆగది నీకు తెలిసినంత బాగా మరెవరికీ తెలియదు. తలుపు తెరవగానే ఎదురుగా ఎడమచేతివేపు మూల నేలకు దగ్గరగా ఒక మీట ఉంటుంది. దాన్ని నొక్కు. వెంటనే ఒక అరబయటికి వస్తుంది. ఆ అర అక్కడున్నట్టు, నాకూ, అది తయారుచేసిన శిల్పికీతప్ప మరో మానవమాత్రుడి కెవడికీ తెలియదు. అర తెరుచుకోగానే నీకు కనిపించేది రాజముద్రే. అది పట్టుకు చక్కా రా."

ఈ ఉపన్యాసం సభికుల్ని మరింత చకితపరి చింది. కాస్త యినాతడబడకుండా వేల్సు యువరాజు గదిలోని రహస్యపు అరను పేర్కోవడమే గాకుండా, అంత మందిలో కలిసిపోయి నుంచున్న సెంట్ జాన్ ప్రభువును గుర్తించడం, పేరు పెట్టిపిలిచి ఆజ్ఞాపించడం కూడా వారికి ఆశ్చర్యం కలిగించింది. సెంట్ జాన్ ప్రభువు బాలరాజు ఆజ్ఞ విని వినగానే అలవాటు ప్రకారం తలవంచి నమస్కరించి బయల్దేరబోయాడు. కాని ఆ బాలుడు "మోసగాడు" అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది గావును, అతని ఆజ్ఞ పాటించినందుకుసిగ్గుపడి ఆగిపోయాడు. టామ్ కాంటీ ఆయన వంక తీక్షణంగా చూసి గద్దించాడు :

"ఏమిటి సందేహిస్తారేం? మహారాజుఆజ్ఞ విన బడలేదా? తక్షణం వెళ్లండి."

సెంట్ జాన్ ప్రభువుమళ్ళీవంగి నమస్కరిం చాడు——ఆ నమస్కరించడం చూసి కొందరు తమలో తాము నవ్వుకున్నారు. కొందరు యుక్తియుక్తంగా వున్నదని అభినందించారు. ఎందుకంటే బాలరాజు టామ్కాంటీలలో ప్రత్యేకంగా ఎవర్ని ఉద్దేశించి ఆయన నమస్కరించలేదు. అవును మరి ఎవరు అసలు రాజో తేలలేదాయెను, అందుచేత వారిద్దరికీ మధ్య ఉన్నతటస్థ ప్రాంతానికి దణ్ణంపెట్టి వెళ్లాడు.

ఈపాటికి సభ్యుల్లో పలువురికి పేలికలు ధరిం చిన బాలుడే అసలు రాజని దృఢాభిప్రాయం కలి

గింది. టామ్ కాంటీ చుట్టూఉన్న అధికారులు తమకు తెలియకుండానే కదిలి బాలరాజుదగ్గరకు పోయి నుంచున్నారు. టామ్ కాంటీని అందరూ వదిలేశారు. అతడు ఒక్కడే నుంచున్నాడు.

కొంతసేపు ఇలా నిరీక్షణలో గడిచింది. సెంట్ జాన్ ప్రభువు పరుగెత్తుకుని వచ్చాడు. ఆయన వేదిక వద్దకువచ్చి ఆగి, ఒక్కనిమిషం ఆయాసం తీర్చుకుని, ఈసారి నిస్సందేహంగా టామ్ కాంటీకే నమస్కారం చేశాడు.

"ప్రభూ! రాజముద్ర అక్కడ లేదు!"

వెంటనే బాలరాజు చుట్టూ నిలుచున్న సభికులు మశూచికపురోగినో, కుష్ఠురోగినో చూసి భయపడి వెనక్కి తగ్గినట్టు వెనుకంజ వేశారు. మరునిమిషంలో బాలరాజు ఒంటరివాడై పోయాడు. అతన్ని ఆపళంగా మింగెయ్యాలన్నంత ఆగ్రహంతో కదలాడిపోయారు సభ్యులు. రక్షక ప్రభువు భయంకరంగా గర్జించాడు.

"ఆ వెధవని వీధుల్లోకి విసిరెయ్యండి. చావగొట్టి ఊళ్లోంచి తరిమెయ్యండి."

అంగరక్షకులు బాలరాజుకేసి అడుగువేశారు. కాని టామ్ కాంటీ వారిని తిరిగి వారించాడు:

"ఆగండి. ప్రాణాలపైతీపి ఉంటేఆయన్ని సమీపించకండి."

హెర్ట్‌ఫర్డు తెల్లబోయాడు. సెంట్‌ జాన్ ప్రభువు నడిగాడు:

మీరు బాగా వెదికారా? చెయ్యిపెట్టి కెలికి
చూశారా? ఆశ్చర్యంగా ఉన్నదే! రాజముద్ర అంటే
వలుసు లాంటిది కాదే! శుభ్రంగా ఇంతలావున, ఇంత
పొడుగున బంగారపు బిళ్లతో ఉంటుంది గదా? అది
ఆ అరలోనే ఉంటే ఎందుకు కనిపించకుండా
పోతుంది?—"

టామ్ కళ్లు పెద్దవిచేసి ముందుకురికాడు. "ఓర్!
అదేనా, రాజముద్రఅంటే? ఆబంగారపు బిళ్లపై
అక్షరాలు, నగిషీ చెక్కుడుఉంటాయికదూ? అదేనా?
అదెక్కడుందో నాకు తెలుసు. అదిఫలానామాదిరిగా
ఉంటుందని మీరిదివరకే వర్ణించిఉంటే నేనప్పుడే
చెప్పేవాణ్ణి. సరే, ఇదీ ఒకందుకు మంచిదే. అదెక్కడు
న్నదో నాకు తెలుసు. కాని మొదటగా దాన్నక్కడ
పెట్టింది నేనుకాదు—"

"మరెవరు మహారాజా" అన్నాడు హెర్ట్‌ఫర్డు.

"అరుగో, మీ ఎదురుగానుంచున్నారే, ఇంగ్లం
డుకు అసలురాజు—ఆయన. ఆయన తనంతట తానే
చెబుతారు మీకు రాజముద్ర ఎక్కడుందో మహా
రాజా! ఆలోచించండి జ్ఞాపకం తెచ్చుకోండి ఆరోజున
జరిగినదంతా. మీరు నా పేలికలు ధరించి గేటు కాప
లావాణ్ణి శిక్షించడానికి బయటికి వెళ్లారు. వెళ్లేముందు
రాజముద్రతీసి ఒకచోట భద్రంగాదాచి మరీ వెళ్లారు."

హాల్లో చైతన్యం నూవత్తూ స్తంభించింది. సభి
కులు వళ్లంతా చెవులు చేసుకుని వింటున్నారు. బాల

రాజు పాపం తలవంచుకుని ఆలోచిస్తున్నాడు. ఆరోజున జరిగిన సంఘటనలన్నీ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. కాని అసలు సంఘటనమాత్రం ఎంత ప్రయత్నించినా గుర్తుకు రావడంలేదు. అది గుర్తువస్తే అతడు సింహాసన మాక్రమిస్తాడు; లేకపోతే వీధుల్లో బిచ్చమెత్తుకుంటాడు. క్షణాలు గడిచిపోతున్నాయి. అందరూ ప్రాణాలు ఉగ్గబట్టుకుని బాలరాజు వంకే చూస్తున్నారు. చివరి కతడొక దీర్ఘ నిశ్వాసం విడిచాడు లాభం లేదన్నట్టు. వణుకుతున్న పెదవులతో, నిస్పృహతో ఇలా గన్నాడు.

"ఉహూ. రాజముద్ర ఎక్కడపెట్టానో జ్ఞాపకం రావడంలేదు. కాని సభికులారా! ఒకటి మాత్రం చెప్పగలను. మీ అసలురాజు ఇంతచిన్న పరీక్షకు నిలవలేక పోయాడనిమీరు నన్ను సింహాసనచ్యుతుణ్ణి చేయవచ్చు - నేను నిస్సహాయుణ్ణిగనక దాన్ని వారించలేను కాని—"

అయ్యయ్యో, ఏమిటిది రాజా! తొందరపడకండి; సావధానంగా ఆలోచించండి," అని టామ్ అరిచాడు భయకంపితుడై. "ఇంకా మించిపోలేదు. నాకంఠంలో ప్రాణం ఉండగా మించి పోనివ్వను కూడా! నేచెప్పేది జాగ్రత్తగా వినండి. ఆరోజు ఉదయం మళ్లీ మీకళ్లకు కట్టేట్టు చెబుతాను. మనం చాల సేపుకబుర్లు చెప్పుకున్నాం—నేను నా అక్కలైన నాన్, బెట్‌లను గూర్చి చెప్పాను-మాబామ్మ మానాన్న నన్నెల్లా

హింసించే వారో చెప్పాను—ఆఫల్ కోర్టులో నామిత్రు
లతో కలిసి నేనాడే ఆటలను వర్ణించాను—గుర్తు
వచ్చిందికదూ. ఆ, సరే—జాగ్రత్తగా వినండి. నాకు
భోజనం, ద్రాక్షరసం అవీ తెప్పించారు. సేవకులు దగ్గ
రుంటే తినడానికి సిగ్గు పడతానేమోనని వారిని పంపించి
వేశారు—"

టామ్ ఈ రీతిగా వర్ణించుకుపోతున్నాడు; బాల
రాజు అవుననవుననంటూ తల ఊపుతున్నాడు; వీరిద్దరి
వ్యవహారం చూసి సభ్యులు వెర్రి మొహాలేసుకుని
గుడ్లు మిటకరిస్తున్నారు. టామ్ చెప్పేకథ నిజంగా
జరిగినట్టే అనిపిస్తోంది వారికి. కాని పేదబాలుడు,
వేల్సు యువరాజుకలుసుకోవడం ఎలా సంభవమైందా
అనేదే తేలడంలేదు.

"సరదాగా మనిద్దరం ఒకరిబట్టలుఒకరం తొడు
క్కున్నాం—ఇద్దరం అద్దంముందు నుంచున్నాం—
అప్పుడు తెలిసింది మన మిద్దరం ఒక్కటే పోలిక అని.
మీరన్నారు, 'మన్నెవరన్నా చూస్తే బట్టలమార్పు
జరిగినట్టేఅనుకో' రని. తరవాత నాచేతిమీద గాయం
చూశారు—చూడండి ఆగాయం ఇంకా నయం
కాలేదు. దాన్ని చూడగానే మీరు క్రుద్ధులైలేచి
ద్వారపాలకుణ్ణి శిక్షించడానికై బయటికి పరిగెత్తారు.
బల్లమీదమీకు-అదేమిటి, ఆరాజ ముద్రోఏదో—
అది కనిపించింది—దాన్నెక్కడ దాచాలా అని
అటూ ఇటూ చూశారు-చివరికి దాన్ని—"

"ఆ ఆగు. నేను చెబుతాను-" అని అరిచాడు బాలరాజు. "సెంట్ జాన్! వెళ్లు. ఈసారి వట్టి చేతుల్తో వచ్చావంటే ఊరుకోను. గోడకుతగిలించిన కవచం ఉందే-దాంట్లో వెదుకు. రాజముద్ర తప్పకుండా కని పిస్తుంది."

"రైట్! రైట్! అంతే, అక్కడే! బలే-" టామ్ కాంటీ పవిత్రమైన చర్చిలో, పట్టాభిషేక సభలో ఉన్నానన్న మాటకూడా మర్చిపోయి సంతోషంతో గంతులు వేశాడు. "ఇంగ్లండు సింహాసనంమీదే. ఈ విషయం కాదనివాదించేవాణ్ణి నాలుక తెగ్గోసినా పాపం ఉండదు. సెంట్ జాన్ ప్రభూ త్వరగా పరిగెత్తండి ఊ—"

సెంట్ జాన్ మళ్ళీ తటస్థ ప్రాంతానికి మోక రించి పరిగెత్తాడు. హాల్లో రొద ఎక్కువైంది. కొన్ని లక్షల తేనెటీగలు జుమ్మని మోతచేస్తుంటే ఎలా ఉంటుందో అలావుంది. ఎందుకంటె ఒకడు మాట్లాడేది మరొకడికి వినబడడం లేదు. అబ్బబ్బ, ఒకటే గోల!

తిరిగి సెంట్ జాన్ ప్రభువు చర్చిమందిరంలోకి అడుగుపెట్టేవరకూ ఈగోల తగ్గలేదు. సెంట్ జాన్ చేతిలో రాజముద్ర ఎత్తిపట్టుకుని పరుగు పరుగున వచ్చాడు. వెంటనే భూకంపం వచ్చినంత ఉపద్రవంగా,

"అసలు రాజుకూ జై! ఎడ్వర్డు ట్యూడర్ కూజై!" అని జయధ్వానాలు మిన్ను ముట్టాయి. అయిదు నిమిషాల సేపు ఈజయ ధ్వనులతోనూ

మంగళ తూర్య ఘోషలతో నూ చర్చి భవనం ఊగు లాడింది. ఎడ్వర్డుముఖం వికసించింది. తన వాక్కులు గుర్తింపబడినందుకు సంతోషంతో, గర్వంతో వేదిక మీదికెక్కి నిలబడ్డాడు. ప్రభువులందరూ అతనికి మోక రించారు.

టామ్ కాంటీ అన్నాడు: "రాజా! నా పేలికలు నాకిచ్చి వెయ్యండి. మీ దాసుడు తెలియక తప్పు చేస్తే మన్నించండి."

అప్పటికి హెర్ట్ ఫర్డు ప్రభువుకు తన కర్తవ్యం జ్ఞాపకం వచ్చింది గావును, ఆజ్ఞాపించాడు :

"రాజవేషంలో ఉన్న ఈ మోసగాణ్ణి తీసుకు పోయి లండన్ గోపురంలో ఖైదు చెయ్యండి.

కాని అసలు రాజు వారించాడు.

"తప్పు తప్పు. అలాగనకండి. టామ్ కాంటీ సహాయం చెయ్యకపోతే నా కిరీటాన్ని శాశ్వతంగా కోల్పోయిఉండే వాణ్ణి. అంతేకాదు మామా! నువ్వు ఈ పేదబాలుడిపట్ల కృతఘ్నుడి వౌతున్నావు. నిన్ను సోమర్సెట్ సామంతుడుగా చేశాడనివిన్నాను. అతని రాజత్వం పోయింది గనుక, దానితో పాటు, నీసామం తత్వం కూడా రద్దవుతుంది. నువ్వు వట్టి ప్రభువు గానే ఉండిపోతావు. ఏం నిజమేనా?"

ఈ మందలింపుతో రక్షక ప్రభువు సిగ్గుపడి, తల దించుకుని వేదిక వెనక్కి పోయాడు.

"టామ్! రాజముద్ర ఎక్కడదాచిందీ నేనే మర్చి పోయినప్పుడు నీకెల్లా జ్ఞాపకంఉంది?" అని కొత్త రాజు అడిగాడు.

"నేను దాన్ని చాలసార్లు ఉపయోగించాను మహారాజా!"

"ఉ ప యో గించావా? మరి ఎక్కడుందో చెప్పలేక పోయావటగదా?"

"అవును. రాజముద్ర రాజముద్ర అన్నారుగాని అదెలా వుంటుందో వారు చెప్పలేదు; దాని ఉపయోగ మేమిటో నాకసలు తెలీదు. అదే రాజముద్ర అని నాకెలా తెలుస్తుంది?"

"తెలియకుండా మరి ఎలా ఉపయోగించావు ?

టామ్ బుగ్గలు ఎర్ర పడ్డాయి. బుంగ మొహం పెట్టుకుని బిత్తర చూపులుచూశాడు.

"ఫరవా లేదు, భయపడ కుండా చెప్పు. ఏంచేసే వాడివి ఇంగ్లండు రాజ ముద్రతో?"

టామ్ కొంత సేపటివరకూ సందేహించాడు. చివరికి నత్తుతూ జవాబిచ్చాడు.

"సీంబాదం కాయలు కొట్టుకునేవాణ్ణండి—"

పాపం తన సమాధానం ఇంత ఉపద్రవమైన నవ్వు పుట్టిస్తుందనిటామ్ అనుకోలేదు. బ్రహ్మాండ మైన వరదవలె హాలు హాలంతా సభికుల నవ్వుతో నిండి పోయింది. టామ్ కాంటీయే అసలు రాజని

ఎవరి మనస్సులో నైనా సందేహలేశం ఉంటే ఈ
సమాధానంతో అది తుడుచుకుపోయి ఉంటుంది.

ఈలోగా టామ్ బుజాలమీద నుంచి పట్టాభి
షేక వసనాలు తొలగించబడి ఎడ్వర్డు బుజాలమీదకి
బట్వాడా చేయబడ్డాయి — పేలికలు కనిపించకుండా
జాగ్రత్తగా కప్పారు. పట్టాభిషేకపు తతంగం మళ్లీ
మొదటినుండీ ప్రారంభించ బడింది. మంగళ వాద్యాలు
దిక్కులు పిక్కటిల్లేట్లు మ్రోగుతుండగా అసలు రాజు
ఎడ్వర్డు ట్యూడర్‌కు కిరీటం అలంకరించారు. కోట
మీది ఫిరంగులు ఈ శుభవార్తను లండన్ నగర
మంతటా ప్రకటించాయి.

## 35

లండన్ వంతెనమీద జరిగిన కొట్లాటలో చిక్కు
కుని మైల్స్ హెండన్ బాలరాజునుండి వేరై
పోయినట్లు చూశాం. అప్పటికే అతనికి బట్టలు దుమ్ము
కొట్టుకుని, జుట్టు రేగిపోయి ఎవరో ఆటవిక వ్యక్తిలాగా
ఉన్నాడు గాని నాగరికునివలె లేడు. కొట్లాటలో
నుంచి ఇవతల పడేసరికి బట్టలు శుభ్రంగా చిరిగి
పోయాయి; టోపీ ఎవడో కొట్టేశాడు. జేబులో
వున్న కాసిని డబ్బులుకూడా దొంగలు కత్తిరించే
శారు.

హెండన్ ఇందు కేమీ చింతపడలేదు; బాల
రాజు కనిపిస్తే అదేపదివే లనుకున్నాడు. అతడు సైని

కుడు; ప్రతిదీ క్రమపద్ధతిలో చేసే అలవాటు ఉన్నవాడు. అందుచేతకంగారుపడి కాళ్లు తొక్కుకోకుండా తాపీగా ఆలోచించాడు.

బాలుడు ఎక్కడికి పోయివుంటాడు? బహుశా తను పుట్టి పెరిగిన పూర్వస్థలానికి పోయిఉంటాడు. మతి స్థిరంలేని మనిషాయెను. అందులో నిరాశ్రయుడాయెను. కనుక అప్రయత్నంగానైనా తన పూర్వగృహానికి వెళ్లి ఉంటాడు. అయితేఅతని పూర్వ నివాసమెక్కడ ఉండి ఉంటుంది? అతని పోలికలనుబట్టి, అతని తండ్రినని చెప్పుకున్న ఆ తాగుబోతుగాడి లక్షణాలను బట్టి, చూస్తే అలగాజనం ఉండే పేటల్లోనని ఊహించవచ్చును. సరే అటువంటి ప్రాంతాల్లోనే వెదుకుదామనుకో. వెంటనే కనిపిస్తాడని నమ్మక మేమిటి? అల్లాకాదు. బాలునికోసం వెదకడం కాలయాపన. గుంపుకోసం వెదకాలి. ఎక్కడ పది మంది పోగడితే అక్కడల్లా అన్వేషించాలి. ఏగుంపులోనో ఒక గుంపులో బాలుడు తప్పకుండా కన్పిస్తాడు. ఎందుకంటే అతడు మామూలు ప్రకారం తనే రాజునని ఉపన్యాసాలు దంచుతూఉంటాడు. పనీ పాటాలేని జనం అతనిచుట్టూ జేరిరాళ్లురువ్వి, తిట్టి, కొట్టి, పురెక్కిస్తూఉంటారు. కనుక గుంపుల్లో అన్వేషించాలి. బాలుడు కనిపించగానే, అవసరమైతే కొందర్ని నేలమట్టంచేసి, అతన్నెత్తుకుని నిరపాయ స్థలానికి ఉడాయించాలి. ఆ తరవాత ఇద్దరూ ఇక వేరుపడి

పోకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. అదీ పథకం; చాలా బావుంది; వేలెత్తిచూపుదామన్నా ఇందులో లోటు కనిపించదు; మైల్స్ హెండన్ ఒక పథకం వేశాడూ అంటే దానికి తిరుగు ఉంటుందా? హ్హా!

మన వీరయువకుడు అన్వేషణ ప్రారంభించాడు. ఆ రాత్రి గంటల తరబడి, సందుల్లో గొందుల్లో వీధుల్లో బజార్లలో ఎన్ని మైళ్లు కాళ్లరిగిపోయేలా తిరిగాడో చెప్పలేం. కనిపించిన ప్రతిజనసమూహాన్ని, సమావేశాన్ని పరీక్షించాడు. ఎందరినో అడిగాడు. కాని అంతా వృథా, వృథా. బాలరాజు ఎక్కడా దొరక లేదు. చాలా ఆశ్చర్యమైంది మైల్స్ హెండన్‌కు. ఎందుకంటే అతడు తయారు చేసిన పథకం సామాన్యమైనది కాదు; అమోఘమైనది. అయినప్పటికి బాల రాజు కనిపించలేదంటే ఎంత ఆశ్చర్యం?

తెల్లవారింది. హెండన్ నీరసించాడు. నిద్ర లేక కళ్లెర్రబడ్డాయి; తిండిలేక దవడలు పీక్కు-పోయాయి. ఈ అన్వేషణ చాలా కాలం పట్టేట్టున్న దనీ, ముందు భోజనం ఆరగించి, కాస్త నడుంవాల్చి తరవాత వెదకడం మంచిదనీ భావించాడు. కాని భోజనం ఎక్కడనుంచి వస్తుంది? జేబులో పెన్నీ లేదు. కులీనుడుగనుక అడుక్కుందామనే ఆలోచన తట్టనే లేదు. తన ఖడ్గం తాకట్టు పెడదామా అనుకున్నాడు గాని, ఆత్మగౌరవం అడ్డంవచ్చింది. పోనీ పై అంగరఖా తాకట్టపెడదా మనుకున్నాడు; కాని ఊరికే ఇస్తా

నన్నా ఆపదార్థాన్ని ముట్టుకునే దౌర్భాగ్యుడు దొరుకుతాడని తోచలేదు.

మధ్యాహ్నమైనా మైల్స్ హెండన్ వీధుల్లో గ్రుమ్మరుతూనే వున్నాడు. రాజుగారి ఊరేగింపును చాలదూరం వెంబడించాడు. తన బాలమిత్రుణ్ణి ఈ ఊరేగింపు ఆకర్షించి తీరుతుందనీ, ఎక్కడో దొరికి తీరుతాడనీ అతని ఆశ. ఊరేగింపు వెస్టుమిన్‌స్టర్ చర్చితో ఆగిపోయింది. కాసేపు ఆ ప్రాంతంలో నేలటూ ఇటూ తచ్చాడాడు. తన మొదటి పథకం విఫలమైనందున మరో చక్కటి పథకం ఆలోచించాలని అనుకున్నాడు. అలా ఆలోచనల్లో పడి, చర్చి దాటి చాల దూరం నడిచాడు. థేమ్సునదీ తీరానికి వచ్చాక గాని అతనికి తానెక్కడున్నదీ తెలియలేదు. అక్కడ అట్టే ఇళ్లు లేవు; పొద్దు వాటారుతున్నది. నీరసంతోను, నిరుత్సాహంతోను మనిషి క్రుంగిపోయాడు. చెట్లనీడల కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నాడు. దూరాన్నుండి ఫిరంగుల మోత అస్పష్టంగా వినవస్తోంది. "కొత్తరాజుకు పట్టాభిషేకం జరుగుతోంది" అనుకున్నాడు. అనుకుంటూనే నేల కొరిగి నిద్రపోయాడు. క్షణంలో వళ్లుస్వాధీనతప్పిపోయి సుఖమయ నిద్రాలోకాల్లో విహరింపసాగాడు.

ఆ నిద్రపోవడం, పోవడంమర్నాడు పొద్దున్న తొమ్మిది, పది గంటలవేళకుగాని మెలకువరాలేదు. మెలకువవచ్చిందిగాని ఓపట్టాన లేవలేకపోయాడు. వళ్లు

పచ్చిపుండై వుంది. బలవంతాన లేచి తూలుతూ, తూలుతూపోయి నదిలోదిగి కాళ్లు చేతులు, ముఖం ప్రక్షాళించుకున్నాడు. కడుపునిండా నీళ్లు తాగి క్షుద్బాధను ఉపశమింపజేశాడు. కాస్త సత్తువవచ్చింది ఇప్పటికి. మళ్లీ వచ్చినదారినే పట్టాడు. వెస్టు మిన్‌స్టర్ చేరుకోగానే అతనికి మహాక్లిష్టతరమైన ఆలోచన కలిగింది. ప్రథమ సమస్య ఆకలిగదా! అందుచేత తన తండ్రి మిత్రుడైన సర్ హాంఫ్రీమార్లో నడిగి రెండు మూడు పిల్లింగులు బదులుతీసుకుని ఎంగిలిపడే ప్రయత్నం చెయ్యాలి. ఇక తరవాత సంటావా- ప్రస్తుతానికి ఇంత మటుకూ విజయవంతంగా కార్యంసాధిస్తే తరవాత సంగతి తరవాత చూసుకోవచ్చు. అవాంతర సమయాల్లో వర్తమానమే ముఖ్యంగాని భవిష్యత్తు ఏమైతే ఎవడిక్కావాలి ?

వెస్టు మిన్‌స్టర్ కోట ప్రాకార ద్వారాలను చేరేసరికి పదకొండు గంటలయింది. సీతాకోకచిలకల వలె ఆకర్షణీయమైన అలంకారాలు చేసుకున్న ప్రభువులు, ఇతర అధికారులు కోటలోకి వస్తున్నారు, పోతున్నారు. వారిమధ్య మైల్స్ హెండన్ అవతారం కూడా ఆకర్షణీయంగానే ఉంది. అతని వేలికలవాలంకం చూసి అధికారులు "వీడి కిక్కడేంపని" అన్నట్టు కొర కొర చూస్తున్నారు. తమ కక్కడికి ఏదో పని ఉన్నట్లు, తాము లేకపోతే రాజకీయ వ్యవ

హారాలన్నీ స్తంభించి పోతాయన్నట్లు హడావుడిగా తిరుగుతున్నారు.

మైల్స్ హెండన్ ఇన్ని ముఖాలలోనూ ఒక్క ముఖమేనా పరిచితమైనదిగాని, పరిచయాభిలాషతో ఉన్నదిగాని దొరుకుతుందేమో నని ఆశతో పరికిస్తున్నాడు. తనంతట తను కోటలోనికి వెళ్ల గలగడం అసంభవం; కనుక ఎవరేనా తనకబురు సర్ హంఫ్రీ మార్లోకు అందజేస్తారేమోనని అతని ఆశ.

ఇంతలో రాజుగారి "దెబ్బలబ్బాయి" హంఫ్రీ మార్లో కోటలో నుండి ఈవలకు వచ్చి మైల్స్ హెండన్‌నుచూసి చటుక్కున ఆగాడు. వెనకనుంచి హెండన్‌ను పరీక్షగా ఎగాదిగా చూశాడు. "మహా రాజు నగరమంతా వెదికిస్తున్న దేశద్రిమ్మరి ఇతడే అయ్యుండాలి. మహా రాజువర్ణన ఇతనికి కచ్చితంగా సరిపోతోంది. ఆ బట్టలు, కత్తి, అతడు నుంచున్న భంగిమం అంతా అదే. అతడూ ఇతడూ వేరువేరు వ్యక్తులైతే సృష్టికర్త తెలివి చట్టుబండలైనట్లే. మహా రాజులాంటి మనిషి ఇంకోడున్నందుకే మేమంతా తబ్బిబ్బవుతూంటే, ఆయనగారు వెదికిస్తున్న మనిషిలాంటివాళ్లిద్దరుండటం ఇక నిజంగా మతిభ్రమ కలిగిస్తుంది; సృష్టికర్తకు రకరకాల మనుషుల్ని తయారు చెయ్యడం చేతకాదనిపిస్తుంది. ఏమైనా ఏదో నెపం మీద ఇతన్ని పలకరించిఎవరో తేల్చుకోవడం మంచిది."

ఈలోగా మైల్స్ హ్యాండెన్ వెనక్కి తిరిగాడు. "దెబ్బలబ్బాయి" తనవంకే పరీక్షగా, కుతూహలంతో చూడ్డం గమనించాడు. ఈ అవకాశం పోనివ్వగూడ దని ఒక్క అంగలో బాలకుని సమీపించి అడిగాడు.

"తమ్ముడూ! నువ్వు కోటలోనుంచి వచ్చినట్టు న్నావ్? నువ్వు కోటలో వాడివేనా? "

"అవునండి సార్!" ('సార్'అని కొంచెం ఎగ తాళిగానే అన్నాడు.)

"అయితే సర్ హంఫ్రీమార్లోగార్ని ఎరు గుదువా?"

"దెబ్బలబ్బాయి" ఉలిక్కిపడ్డాడు. "అరె! చచ్చి పోయిన మా నాన్నగారితో ఇతని కేంపని!" అని లోపల అనుకున్నాడు.

"ఎరుగుదునండి సార్!"

"ఎరుగుదువా? ఆయన లోపలున్నారా?"

"ఆ. ఉన్నారు," అని పైకి సమాధాన మిచ్చి "భూగర్భంలో ఉన్నారు," అని లోపల అనుకున్నాడు హంఫ్రీ.

"చూడు, తమ్ముడూ! నిన్ను చూస్తే నాకు చాల ఇష్టం పుడుతోంది. మంచివాడివిగాని, ఒక్క చిన్నపని చేసిపెట్టాలి. సర్ హంఫ్రీ దగ్గిరికి వెళ్లి నాపేరు చెప్పి, కొద్దిగా మాట్లాడా అనుకుంటున్నానట రమ్మని చెప్పాలి. ఏం?"

"అల్లాగేనండి."

"అయితే, సర్ రిచర్డ్ కుమారుడు మైల్స్ హెండన్ కోటబయట వేచిఉన్నాడని చెప్పు. త్వరగా రావాలి తమ్ముడూ!"

హాంఫ్రీ ఈపేరు విని నిరుత్సాహ పడ్డాడు. "రాజుగారు ఈ పేరు చెప్పలేదే. కాని ఫరవాలేదు. ఇతడు, అతనికి కవలతమ్ముడై ఉంటాడు. రాజుగారు చెప్పిన 'సర్ గోచీ పాతరాయుణ్ణి' గూర్చి ఇతని కేమైనా తెలిసి ఉండచ్చు" అని భావించాడు.

"అలాగేనండి. మీరు ఆగోడ పక్కననుంచోండి. ఇప్పుడే వస్తా," అని మైల్స్‌తో చెప్పి తను లోపలికి వెళ్లాడు.

హెండన్ గేటుపక్కన ప్రాకారకుడ్యానికి ఒక అరుగుఉంటే దానిమీద కూర్చున్నాడు. ద్వారపాలకులు కాళ్లు నెప్పి పెడితే కూర్చునేస్థలమది. అతడుకూర్చున్నాడో లేదో, ఇంతలో ఒక అధికారి కొందరు సైనికులతో అటుపోతూ ఇతన్ని చూసి ఆగాడు. సైనికులను 'హాల్ట్'అని ఆజ్ఞాపించాడు. హెండన్‌ను దగ్గరకి రమ్మని గద్దించాడు. అతడు దగ్గిరికి రాగానే, "కోటవద్ద అనుమానాస్పదంగా సంచరిస్తున్నావు గనుక బంధిస్తున్నా"నని చేతికి బేడీలు తగిలించాడు. హెండన్ దురదృష్టమేమోగాని మొదటినుండీ అతని వ్యవహారం బెడిసికొడుతూనేవుంది. హెండన్ తను ఫలానా పనిమీద వచ్చానని సంజాయిషీ ఇవ్వబోయాడు, కాని అధికారి "నోర్మూయ్, బద్మాష్!" అని గదమాయించాడు.

అతన్ని నిరాయుధుణ్ణి చేసి సోదా చెయ్యమని సైనికుల కాజ్ఞాపించాడు.

సైనికులు సోదా చేస్తుంటే హెండన్ నవ్వుకున్నాడు. "జేబుల్లో ఏమున్నా ఉంటే రెండు రోజుల్నించి పస్తు ఉండాల్సిన గతేం పట్టిందినాకు? వెతుక్కోనీ, ఏమున్నా దొరికితేగా" అని తనలో తను అనుకున్నాడు.

జేబుల్లో ఒక పత్రం తప్ప మరేం కనబడలేదు. అధికారి దాన్ని చించి తెరిచాడు. అది ఆరోజున హెండన్ హాలులో బాలరాజు హెర్ట్‌ఫర్డు నుద్దేశించి రాసిన ఉత్తరం. మైల్స్ హెండన్ దాని సంగతే మరిచిపోయాడిన్నాళ్లూ. ఒకవేళ జ్ఞాపకం ఉన్నా, "ఆ పిచ్చివాడి పిచ్చిగీతల్ని లెక్కపెట్టేదేముంది లే," అని భావించాడు.

అధికారి ఉత్తరంలో ఇంగ్లీషు భాషలో రాయబడిన వాక్యాలు బిగ్గరిగా చదివాడు. మైల్స్ హెండన్ వింటూనే తెల్లమొగం వేశాడు. అధికారి ఇలాగన్నాడు:

"ఓరి వీడి తస్సాదియ్యా. రాజపదవికి ఇంకో హక్కుదారు బయల్దేరాడోయ్! డజన్లకొద్దీ పుట్టుకొస్తున్నారు హక్కుదార్లు. వీడెవడోగాని ఇంగ్లీషు చాలక లాటిన్, గ్రీకుల్లో కూడా దంచాడు ఉత్తరం. ఒరేయ్, ఈ ద్రోహిని కదలనివ్వకండి. నేను పోయి ఈ ఉత్తరం మహారాజుకు పంపిస్తాను."

అధికారి కోటలోకి వెళ్లాడు. "నా దురదృష్టం ఇప్పటికి పరిపక్వమైంది. ఆ ఉత్తరం నా ప్రాణాలకే ముప్పు తెస్తుందనుకోలేదు. నాకు ఉరికంబం తప్పదు. పాపం నా చిన్నమిత్రు డేమవుతాడో? భగవంతుడే రక్షించా లతన్ని," అని విచారవదనుడై తలపోస్తు న్నాడు హెండన్.

అధికారి తిరిగివచ్చాడు. ఎలాగూ ఉరిశిక్ష తప్ప నప్పుడు అధైర్యపడి లాభమేమిటని హెండన్ తన్ను తనే సమాధానపర్చుకున్నాడు. ధీరునివలె తన దుర్గతి నెదుర్కోవాలని గుండె రాయిచేసుకున్నాడు. అధి కారిబంధితుని వదలిపెట్టమని, అతని కత్తి నతని కిచ్చి వేయమని భటుల కాజ్ఞాపించాడు. తర్వాత హెండన్‌కు వినయపురస్సరంగా నమస్కరించి, "సార్! నా వెంట రండి," అన్నాడు.

అధికారి ప్రవర్తనలో ఈ మార్పుకు కారణ మేమిటో హెండన్ కర్థంకాలేదు. ఏడిపించాలని ఈ వినయం అభినయిస్తున్నాడా అని అనుమానించాడు.

అధికారి ననుసరించి హెండన్ కోట అంతర్భా గానికి నడిచాడు. రాజభవనంవద్ద ఆగి తనపై అధికారికి హెండన్‌ను అప్పగించి మొదటి అధికారి వెనక్కి వెళ్లి పోయాడు.

రెండో అధికారి హెండన్‌కు మళ్లీ ప్రణమిల్లి లోనికి తోడ్కొనిపోయాడు. ఒక విశాలమైన హాల్లో ప్రవేశించారు; అక్కడ గొప్పగొప్ప "బంట్రోతులు"

బార్లుతీర్చి నిలబడి మాట్లాడుకుంటున్నారు. హెండన్‌ను చూసి అందరు సంభాషణ ఆపివేసి తలలువంచి గౌరవం ప్రకటించారు. అతడు ముందుకు వెళ్ళగానే రుమాళ్లు నోటికడ్డం పెట్టుకుని గుబులు గుబులుగా నవ్వుకున్నారు. ఈ "సర్ గోచీపాత రాయుడు" తో మహారాజు కేంపనో ఎవరికీ తెలియలేదు. హెండన్ వాళ్ల హేళనను లెక్క చెయ్యకుండా ఇంకా ముందుకు పోయాడు.

అది రాజుగారి దర్బారు మందిరం. ప్రభువులు, ఉన్నతాధికార్లు వరసగా నుంచున్నారు. హెండన్‌ను వెంటబెట్టుకువచ్చిన అధికారిఅతన్ని మందిరమధ్యంలో వరకూ తీసుకువచ్చి, మరొకసారి ప్రణమిల్లి వెనక్కి వెనక్కినడిచి ఒకపక్కగా నుంచున్నాడు.

మైల్స్ హెండన్ కంగారుపడుతూ సభ్యులవంక బిత్తరిచూపులు చూస్తున్నాడు. అతని కెదురుగా కొంత దూరంలో బాలరాజు ముఖమల్ చాందినీలో సింహాసనాసీనుడై ఉన్నాడు; తల ఒకపక్కకు తిప్పి ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

తన జేబులో రాజద్రోహకరమైన ఆ ఉత్తరం దొరికి నందుకు తనకు ఉరిశిక్ష తప్పక విధింపబడుతుందని హెండన్ నిశ్చయించుకున్నాడు. బహుశా మహారాజే స్వయంగా తన్ను విచారణచేసి శిక్షవేస్తారని అనుకున్నాడు. నడియావనంలో ఉన్న తనకు ఇంత ఆకస్మికంగా, అవమానకరంగా మరణశిక్షపడటం

ఎంతదురదృష్టం! ఏ శిక్షపడినా త్వరగా తెమిలిస్తే బాగుండును - సీతాకోకచిలకల్లా కులుకుతున్న సభ్యుల్ని చూస్తుంటే అతనికి అరికాలి మంట నెత్తికెక్కుతోంది. ఒక్కొక్కణ్ణీ పట్టుకుని నమిలి పారెయ్యాలన్నంత కోపం కలుగుతున్నది.

ఇంతలో బాలరాజు తలఎత్తి ఇంకోవైపుకు తిరిగి ఇంకో అధికారితో ఏదో గుసగుసలాడుతున్నాడు. హెండన్‌కు బాలరాజు ముఖం స్పష్టంగా కనిపించింది. గుండె ఆగి స్పృహ తప్పిపోయేంత పనైంది. బాలరాజును తదేకంగా చూస్తూ, "అరె! నా మిత్రుడు! ఇక్కడి కెలావచ్చాడు? ఆ సింహాసనమెల్లా ఎక్కాడు? ఇది కలా? నిజమా?" అని విస్మయంతో కొయ్యబారి పోయాడు. తరవాత చుట్టూ చూశాడు; కలకాదని తేల్చుకునేందుకు చేతిమీద గిల్లుకుని చూశాడు; నెప్పి పెడుతూనే వుంది; "ఇదికలకాదు. నిజమే. ఈ ప్రభువులు, దర్బారు, నేను-నిజమే, నిజమే."

మళ్ళీ బాలరాజు వంక చూశాడు. "సందేహం లేదు. ఇతడు నాతో ఇన్నాళ్లూ తిరిగిన పిచ్చివాడే; నా స్నేహితుడే. అయితే ఇతడు బిచ్చగాడు, పిచ్చివాడు కాడా? నిజంగా ఇంగ్లండు సార్వభౌముడేనా? ఈ సమస్య ఎలా తేల్తుంది? నా సందేహం ఎవరు తీరుస్తారు?"

మైల్స్ హెండన్ మనస్సులో చక్కటి ఉపాయం మెరుపులా మెరిసింది. గోడవద్ద ఖాళీగా ఒక కుర్చీ

ఉంది. అది తెచ్చి సింహాసనం ఎదురుగా వేసి ఠీవిగా
కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నాడు.

ఇది చూసి సభికులు క్రుద్ధులయ్యారు. ఒకడు
అతన్ని సమీపించి, "నీకు బుద్ధిలేదుటోయ్! మహా
రాజుసన్నిధిలో కూర్చుంటావా?" అన్నాడు.

ఈ గందరగోళం బాలరాజు దృష్టి నాకర్షిం
చింది. ఇంతవరకూ ఆయనకు హెండన్ వచ్చిన సంగతే
తెలియదు. ఇప్పుడు మొదటిసారిగా అతన్ని చూశాడు.
చెయ్యెత్తి ఆజ్ఞాపించాడు.

"అతన్నేం చెయ్యకండి. మహారాజుసన్నిధిలో
కూర్చునే హక్కు అతని కున్నది."

సభికులు అప్రతిభులైపోయారు ఈ మాటకు.
బాలరాజు వారి సందేహాలను తీర్చాడు:

"సావధానంగా వినండి, సభికులారా! ఇతడు
మైల్స్ హెండన్. నాకుఇష్టుడైన, నమ్మినబంటు. నన్ను
శరీరహానినుండి, బహుశా అకాలమరణంనుండి కూడా
రక్షించాడు; అందుచేత ఇతడు 'సర్ బిరుదు'
పొందాడు. ఆ పిమ్మట నన్ను కొరడాదెబ్బలనుండి, అవ
మానంనుండి రక్షించి గొప్ప త్యాగం చేశాడు;
అందుకై ఇతన్ని కెంట్ పరగణాకు ప్రభువుగా చేస్తు
న్నాను; అతని హోదాకు తగిన ధనం, భూములు
అతని కివ్వబడతాయి. అంతేకాదు, ఇంకా వినండి.
మహారాజసన్నిధిలో కూర్చునే హక్కును అతనికి నేనే
ఇచ్చాను—అతడు, అతని తరవాత అతని వారసులు

ఈ హక్కును వంశ పారంపర్యంగా అనుభవిస్తారు. ఇంగ్లండు సింహాసనమున్నంత వరకూ ఈహక్కు వారికి ఉంటుంది."

బాలరాజు ప్రసంగిస్తుండగా ఇద్దరు కొత్తవ్యక్తులు దర్బారు హాల్లోకి ప్రవేశించి ఒక ప్రక్కన నుంచుని వింటున్నారు. వారి ఆశ్చర్యం వర్ణనాతీతం. బాలరాజు వంక, మైల్సు హెండన్ వంక అదేపనిగా చూస్తున్నారు. వారెవరో కాదు-మన కిదివరకే పరిచితులైన సర్ హ్యూ హెండన్, ఎడిత్ సతి. వారు పట్టాభిషేకానికి హాజరు కావాలని బయలుదేరినా కారణాంతరాలవల్ల ఆలస్యంగా వచ్చారు. మైల్సు గాని, బాలరాజుగాని వారినింకా చూడలేదు. మైల్సు కిప్పటికి నమ్మకం కలిగింది తనతో తిరిగిన బాలుడు మహారాజేనని. కాని ఆశ్చర్యం ఇంకా తగ్గలేదు.

"ఎంత వింత! ఎంత అద్భుతం! నాతో అన్ని రోజులు తిరిగినా ఇతన్ని పిచ్చివాడుగా, బిచ్చగాడుగా కట్టి ఎంత మోసపోయాను. నాకంటె బుద్ధిహీను డెవ డన్నా ఉంటాడా? ఒక దేశపు మహారాజుకు వైభవ మంటే ఏమిటో చూపించబోయాను. మా ఇంట్లో డబ్భయ్ గదులున్నాయనీ, ఇరవై ఏడుగురు నౌకర్లున్నారనీ గొప్పలు చెప్పుకున్నాను. ఇతన్ని పెంచుకుని, విద్యాబుద్ధులు నేర్పిద్దా మనుకున్నాను," అని తనలో తను కుపిల్లిపోయాడు మైల్సు.

వెంటనే కర్తవ్యం జ్ఞాపకం వచ్చింది మైల్సుకు.

కుర్చీమీదనుండి లేచి బాలరాజుకు మోకరించి, తనకు భూములు, బిరుదులు బహుమానించి నందుకు కృతజ్ఞతను, యావజ్జీవ విధేయతను ప్రకటించాడు. లేచి ఒక ప్రక్కన వినయ వినమితుడై నిలబడ్డాడు. అతని వేలికలు చూసి ఇందాక హేళనగా నవ్వినవారు ఇప్పుడతని ఆకస్మిక భాగ్యానికి ఈర్ష్య చెందుతున్నారు.

బాలరాజు అప్పటికిగాని సర్ హ్యూను చూడలేదు. క్రోధాగ్నులు ప్రజ్వలించే కళ్లతో, అతనివంక వేలెత్తి చూపిస్తూ అన్నాడు :

"అతడు దొంగ. తనవికాని భూములను, హక్కులను అన్యాయంగా అనుభవిస్తున్నాడు. అవసిన్లాక్కుని అతన్ని బంధించి కారాగారంలో తోయ్యండి. అతని సంగతి తరవాత చూస్తాను."

మాజీ సర్ హ్యూను రాజభటులు బంధించి తీసుకుపోయారు.

దర్బారు హాల్లో అవతలచివర సందడి చెలరేగింది. సభ్యులు ప్రక్కకు తొలిగి టామ్ కాంటీకి దారి ఇచ్చారు. ఒక సేవకుడు అతనికి దారి చూపుతూ ముందు నడుస్తుండగా, విలువైన వింత బట్టలు ధరించి టామ్ ముందుకు వచ్చాడు; మోకరించి నిలబడ్డాడు. బాలరాజు ప్రసన్న ముఖుడై అన్నాడు :

"టామ్ ! నేను లేని కొద్ది వారాల్లోనూ నువ్వు రాజ్యం పాలించిన విధానమంతా విన్నాను. చాలా సంతోషమైంది. నీ సౌజన్యం, దాక్షిణ్యభావం ప్రశంస

నీయాలు. నీతల్లి, అక్కలు మళ్ళీ కనిపించారా ? మంచిది - వాళ్ల పోషణకు తగిన ఏర్పాట్లు చేస్తాను. హంతకుడైన నీ తండ్రిని, నువ్వు కోరిన పక్షంలో న్యాయచట్టం అంగీకరించి నట్టయితే ఉరితీయిస్తాను. సభికులారా! వినండి—ఈరోజునుండి క్రైస్టు చర్చిలోని అనాథ శిశువులకు భోజన నివాస సదుపాయాలే కాకుండా, విద్యాసంస్కారం కూడా కలిగేట్లు యేర్పాటు చేయవలసిఉంటుంది. ఈ బాలుని దానికి ముఖ్యాధికారిగా నియమిస్తున్నాను. ఇతడు కొంత కాలం రాజపదవిని నిర్వహించాడు. కనుక ఇతడు సామాన్యులకంటె భిన్నంగా ఉండాలి. అందుకుగాను- ఇదుగో, ఇప్పుడితడు ధరించిన మాదిరి దుస్తులే ఇతడెప్పుడూ ధరిస్తాడు; ఆమాదిరి దుస్తులను ఈరాజ్యంలో ఇంకెవ్వరూ ధరించరాదు. అతన్ని రాజ్యంలో యావన్మందీ వందనపురస్సరంగా గౌరవించాలి. అతనికి నేను రక్షించాస్తున్నాను; "రాజమిత్రుడు" అనే గౌరవ బిరుదం అతని కనుగ్రహిస్తున్నాను."

టామ్ ఉప్పొంగిపోతూ లేచి బాలరాజుహస్తాన్ని ముద్దుపెట్టుకున్నాడు. సేవక పరివేష్టితుడై అవతలికి వెళ్లి పోయాడు. ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా తల్లికి, అక్కలకు తన అదృష్టవార్తను వినిపించడానికి పరిగెత్తాడు.

# 36

చెరసాలలో బంధింపబడిన హ్యూ హెండన్‌ను ప్రశ్నించగా అతనంతట అతనే మైల్స్ అనుమానాలు నివృత్తి చేశాడు. ఆరోజున ఎడిత్ హెండన్ హాలులో మైల్స్‌ను ఎరగననడానికి కారణమిది: మైల్స్‌ను మైల్స్ కాదనక పోయినట్లయితే చంపేస్తానని హ్యూ బెదిరించాడు. ఆమె తన ప్రాణమంటే తన కేమాత్రం తీపి లేదని నిరభ్యంతరంగా చంపి వెయ్యొచ్చునని, కంఠంలో ప్రాణముండగా, మైల్స్‌ను నిరాకరించబోననీ ఖండితంగా చెప్పింది; అప్పుడు ఎడిత్ తను చెప్పినట్లు నడవకపోతే మైల్స్‌నే చంపేస్తానని వాగ్దానం చేశాడు హ్యూ; దీంతో పాప మామె నిస్సహాయుడైన మైల్స్‌ను రక్షించడానికై అతన్ని ఎరుగనని బొంకవలసి వచ్చింది.

హ్యూను మహారాజు శిక్షించ లేదు; అతని భార్య, అన్న అతని పై నేరారోపణ చెయ్యడానికి నిరాకరించారు. వారిద్దరి ఉదారబుద్ధివల్ల హ్యూ విడుదల అయ్యాడు. తిరిగి అన్న ముఖంగాని, భార్య ముఖంగాని చూడలేక దేశం విడిచియూరప్‌లో ఏదో దేశానికి ప్రవాసిమై వెళ్లిపోయాడు. అక్కడ పశ్చాత్తాపంతో బాధపడి, బాధపడి కొద్ది కాలంలోనే మరణించాడు. తరవాత మరికొన్నాళ్లకు కెంట్ ప్రభువైన మైల్స్ హెండన్ వితంతువైన ఎడిత్‌ను పెళ్లి చేసు

కున్నాడు. ఇద్దరు మొదటిసారిగా తమ పురాతన గృహమైన హెండన్ హాలుకు విచ్చేసినప్పుడు పర గణా ప్రజలందరూ క్రూరుడైన హ్యూ పరిపాలన నుండి విముక్తి పొందినందుకు, సజ్జనుడైన మైల్స్ ప్రభువు పరిపాలకుడైనందుకు ఉత్సవాలు, వేడుకలు జరుపుకున్నారు.

టామ్ తండ్రియైన జాన్ కాంటీ ఐపు, ఆన మాలు లేకుండా మాయమైపోయాడు. మళ్ళీ అతని ఆచూకీ తెలియలేదు.

బానిసగా అమ్మబడి, దొంగలముఠాలో సభ్యుడుగా చేరిన రైతును ఆరోజున హ్యూగోనుండి తన్ను రక్షించినందుకు కృతజ్ఞతగా బాలరాజు వెదికిపట్టు కుని శుభ్రమైన ఉద్యోగమిచ్చి సన్మార్గుణ్ణి చేశాడు.

వృద్ధుడైన లాయర్‌ను కూడా జైలునుండి విడిపించి, అతని జరిమానాలను రద్దుచేశాడు. ప్రాణాలతో మంటల్లో కాల్చబడిన ఇద్దరు 'బాప్టిస్టు' స్త్రీల కుమార్తెలను పిలిపించి వారికి పోషణసౌకర్యాలు కలిగించాడు. మైల్స్ హెండన్‌ను గుదిబండలో పెట్టి, కొరడా దెబ్బలు కొట్టించిన అధికారిని కఠినంగా శిక్షించాడు.

ఎవరిదో తెలియని కోడిపెట్టను తీసుకున్నందుకు ఉరిశిక్షకు పాల్పడిన బాలుణ్ణి, సాలివానినుండి చిన్నగుడ్డ ముక్కను దొంగిలించిన స్త్రీని బాలరాజు విడిపింప జేశాడు. రాజుగారి అడవిలో లేడికూనను చంపాడనే

అసత్య నేరానికి శిక్ష విధింపబడినవ్యక్తిని మాత్రం సమయానికి రక్షించలేక పోయాడు.

తనమీద పందిపిల్లను దొంగిలించాడనే నేరం మోపబడినప్పుడు కనికరం చూపించిన జడ్జిని బాలరాజు సమ్మానించాడు.

ఎడ్వర్డు తాను బ్రతికి ఉన్నంతకాలమూ తన అనుభవాలను మరిచిపోలేదు. ఆస్థాన సభ్యులతో ఇష్టాగోష్ఠి జరుపుతున్నప్పుడు, ఆ రాత్రి తాను ద్వారపాలకుల చేతుల్లో దెబ్బలు తిన్నప్పటినుండి, జరిగిన వృత్తాంతాన్నంతటిని అతి కుతూహలంతో వర్ణించేవాడు. పట్టాభిషేకానికి ముందు రాత్రి తాను మైల్స్ హెండన్‌తో లండన్ చేరుకోవడం, వేరుపడి పోగానే తాను సరాసరి వెస్టు మినిస్టర్‌కు పోయి అలంకారాలు చేస్తున్న కార్మికులతో కలిసి చర్చిలో ప్రవేశించడం, ఒకరహస్య స్థలంలో దాక్కొని నిద్రపోవడం, అదృష్ట వశాత్తు కిరీటధారణసమయానికి మెలకువవచ్చి పట్టాభిషేకసభలోకి మెల్లగా జొరబడడం-అంతా చమత్కారంగా వివరించేవాడు. తన విచిత్రానుభవాలను, పడిన కష్టాలను నిరంతరం జ్ఞాపకముంచుకోవడంవలన, తన హృదయం మార్దవాన్ని కోల్పోదనీ, ప్రజల కష్టసుఖాలను సానుభూతితో అర్థం చేసుకోగల శక్తి వస్తుందని అనేవాడు.

చివరివరకూ బాలరాజు మైల్స్ హెండన్, టామ్ కాంటీలను తన ఆస్థానంలో ముఖ్యులనుగా ప్రేమిం

చాడు. ఎడ్వర్డు చనిపోయినప్పుడు వారిద్దరి దుఃఖం చెప్పడానికి వీల్లేదు. కెంట్ ప్రభువు తనకు ఎడ్వర్డు ప్రసాదించిన హక్కును ఎప్పుడూ దుర్వినియోగం చెయ్యలేదు. ఎడ్వర్డు అనంతరం రెండుసార్లు మాత్రమే దాన్నతడు ఉపయోగించాడు; మేరీరాణి పట్టాభిషేకంలోను ఎలిజబెత్ పట్టాభిషేకంలోను మాత్రమే అతడు సింహాసనం ఎదుట కుర్చీ వేసుకుని కాస్సేపు కూర్చున్నాడు. అతని తరవాత అతనికుమారుడు మొదటి జేమ్సు రాజ్యానికి వచ్చినప్పుడు మళ్ళీ అలాగే కూర్చున్నాడు. ఆ కుమారుని కుమారుడు మొదటి ఛార్లెసు పట్టాభిషేక సమయంలో తన హక్కును ఉపయోగించుకొన వచ్చేసరికి కెంట్ ప్రభువుల కలాంటి హక్కున్నదని పలువురికి జ్ఞాపకమే లేదు. అందుచేత అతగాడు రాజుగారిఎదుట కూర్చొనబోగా మొదటి సారి మైల్సు హెండన్ కూర్చున్నప్పుడు జరిగినంత రభస జరిగింది. అయితే వృద్ధులు కొందరు అసలు విషయం వివరించి సభికులను శాంతపరిచారు. మైల్సు హెండన్ వంశంలో ఆఖరివాడు కామన్వెల్తుయుద్ధాల్లో మహారాజు పక్షాన పోరాడుతూ చనిపోయాడు. దాంతో ఆ హక్కుకూడా అంతరించింది.

టామ్ కాంటీ ఎడ్వర్డు తర్వాతచాలా కాలం వృద్ధాప్యం వచ్చేవరకూ బ్రతికివున్నాడు. ఆ వృద్ధుడు నెరిసిన తలతో, ఒకానొకప్పటిగంభీర రాజజీవితో,

వార్ధక్యంలో కూడా చెక్కు చెదరని అందంతో కనబడితే ప్రజలు ఎడ్వర్డు రాజు బ్రతికివుంటే ఇలాగే ఉండేవాడు గదా అని అనుకునేవారు. అతన్ని ప్రజలు విశేషంగా గౌరవించేవారు. అతడు ధరించే ప్రత్యేక వస్త్రాలు చూసి, "ఆయన కాలంలో ఆయనా ఒక రాజే" అనుకునేవారు. అతడు వచ్చేదారిలో ప్రజలు గౌరవ పూర్వకంగా తొలగి "టోపీలు తీసెయ్యండి. రాజమిత్రులు వస్తున్నారు." అని హెచ్చరించుకుంటూ సెల్యూట్ చేసేవారు. అతడామాటలు విని కారుణ్యంతో నిండిన మందహాసం చేసేవాడు. ఆయన హృదయంలోని మంచితనమంతా ఆ ఒక్క చిరునవ్వులో ప్రతిఫలిస్తోందని ప్రజలు అనుకునేవారు.

అవును. ఆరవ ఎడ్వర్డు పట్టాభిషేకం తరవాత ఆరేళ్ళ కాలమే రాజ్యంచేశాడు; కాని స్వల్పకాలమైతే నేం——అందరి చేతా మంచివాడనిపించుకుని పోయాడు. న్యాయవిచారణ చేసేటప్పుడు ఏ అధికారైనా "మహారాజా! మీరు మితిమీరిన దయచూపిస్తున్నారు. ఇలాగైతే ప్రజలకు అలుసు కాదా! నేరాలు ఎక్కువ కావా?" అని సలహా ఇవ్వబోతే——

"నువ్వు ధన రాసుల్లో పొర్లాడే వాడివి. దుఃఖం, అన్యాయం, కన్నీళ్లు ఎంత తీవ్రమైనవో నీకేం తెలుసు? నాకూ నా ప్రజలకూ తెలుసు. నీకా? ఎంత ప్రయత్నించినా నీ కవి అర్థంకావు," అని గద్గదవాక్కులతో, చెమ్మగిలిన కళ్లతో మందలించేవాడు.

ఆనాటికీ ఈనాటికీ చాలా తేడావుంది. ఈరోజుల్లో మనం ఏవి అక్రమాలనీ, అన్యాయాలని అనుకుంటున్నామో అవి ఆ రోజుల్లో శాస్త్రసమ్మతాలైన మామూలు విషయాలు. కనుక ఆ కాలాన్నిబట్టి చూస్తే ఆరవ ఎడ్వర్డు పరిపాలన చాలా దయావంతమైనదనే చెప్పాలి. బాలరాజుకు వీడ్కోలివ్వబోతున్న ఈ సమయంలో ఈ విషయంజ్ఞాపకం పెట్టుకుందాం.

# మార్క్ ట్వేన్ (1835-1910)

అమెరికాలోని మిస్సోరీ రాష్ట్రంలో జన్మించాడు. నావికుడుగా, పత్రికా రచయితగా జీవితం ప్రారంభించాడు. అసలు పేరు శామ్యూల్ లాంగ్ హార్న్ క్లిమెన్స్. "మార్క్ ట్వేన్" అనే మారు పేరుతో హాస్యరచయితగా సుప్రసిద్ధుడయ్యాడు. రెండు మూడుసార్లు ప్రపంచమంతటా, ఉపన్యాసాలిస్తూ పర్యటించాడు. 1900 ప్రాంతంలో ఇండియా కూడా వచ్చాడు. ఏ కాలేజీల్లోను, స్కూళ్ళలోను చదువుకోకపోయినా ఇతడు 1907 లో ఇంగ్లండు వెళ్ళినప్పుడు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంవారు "డాక్టర్ ఆఫ్ లిటరేచర్" బిరుదమిచ్చి గౌరవించారు.



తీవ్రమైన ప్రజాస్వామికవాది. మొదట్లో హాస్యంకోసమే హాస్యరచన చేశాడు. పరిణతి పొందినకొద్దీ ఇతని హాస్యంలో నిశితమైన వ్యంగ్యం అంతర్వాహినిగా నడిచింది. "నిజమైన హాస్యం కరుణరసానికి దారి తీస్తుంద"ని మార్క్ ట్వేన్ ఒకసారి అన్నాడు. "అమెరికన్ సారస్వతపు అబ్రహాం లింకన్" అని విమర్శకులు మార్క్ ట్వేన్‌కు పేరు పెట్టారు. ఉత్తమశ్రేణికి చెందివుండి విస్తృత జనాదరణ పొందిన కొద్దిమంది రచయితల్లో ఇతడొకడు.

"రాజా—పేదా" కథ పదహారో శతాబ్దపు ఇంగ్లండులో జరిగినట్లు వ్రాయబడింది. ఆ కాలపు ఇంగ్లండు ప్రజల జీవనవిధానమెటువంటిదో వ్యంగ్యంగాను, వాస్తవికంగాను కూడా మార్క్ ట్వేన్ ఈ నవలలో చిత్రించాడు.

పడుతుంది." గొంతుక ఇంకా హెచ్చించాడు; మాటలుతీవ్రంగా, బలంగా వస్తున్నాయి : "అతడు పిచ్చివా డయ్యాడు. అయినా అతడు నా కుమారుడు; ఇంగ్లండుసింహాసనానికి వారసుడు; పిచ్చెక్కినా, లేక పోయినా, అతడే రాజ్యంచేస్తాడు; చేసి తీర్తాడు. వినండి జాగ్రత్తగా; ఈ విషయాన్నందరికీ తెలియ జెయ్యండి—యువరాజు అనారోగ్యాన్నిగూర్చి ఎవడు నోరెత్తినా రాజద్రోహ నేరం చేసిన వాడవుతాడు; మరణశిక్షకు గురవుతాడు......కాసిని మంచి నీళ్లు... అబ్బా! కాలిపోతున్నా... ఈకొత్త విచారంతో నాబలం ఉడిగిపోతోంద... చాలు, ఈకప్పతీసెయ్. కాస్త చెయ్యి ఆనరా ఇయ్యి... పిచ్చెక్కిందా ? ఇంతకి వెయ్యి రెట్లు పిచ్చెక్కినా సరే అతడే వేల్స్ యువరాజు. సార్వభౌముడి నైన నేను ఆజ్ఞాపిస్తున్నాను. ఈ రోజునే అతన్ని శాస్త్రప్రకారంగా యువరాజుని చెయ్యండి. తక్షణమే ఈ ఆజ్ఞ జరగాలి. విన్నావా, హెర్ట్ఫర్డ్ ప్రభూ!"

ప్రభువుల్లో ఒకడు రాజశయ్య పక్కన మోకరించి,

"వంశపారంపర్యా ఇంగ్లండుకు మహాసేనాధిపతి యైనమనిషి లండన్ గోపురంలో ఖైదీగా ఉన్నాడని మహారాజుకు తెలుసు. రాజద్రోహియైన వానిచేత..."